పురాణవైర గ్రంథమాల

I

# భగవంతునిమీదిపగ



గ్రంథకర్త
కవిసమ్రాట్
విశ్వనాథ సత్యనారాయణ




పబ్లిషర్సు
ఉమా పబ్లిషర్సు
విజయవాడ-1.

# ఉపోద్ఘాతము

ఇవి పురాణవైరమను శీర్షికతో వ్రాయబడుచున్న పదునాలు నవలలు. ఏనవల కానవలే. పదునాలింటను కలిపి ఒకటే కథయుండదు. ఒకదానితో నొకదానికి సంబంధ ముండదు. కొన్నింటియందు సంబంధమున్నను, అది ప్రధానము కాదు. కాని ఈనవల లన్నింటికి కలిపి పురాణవైరమన్న శీర్షిక ఎందులకు? పురాణ వైరమన్న పే, రెందులకు?

ఈవిషయము ఈనవలలో నచ్చటచ్చట పరామర్శింప బడును. మనకు వేదశాస్త్ర పురాణేతి హాసములు గలవు. వానిలో పురాణమున్నది. పురాణ మనగా నేమి? "పురాణం పంచలక్షణం" అని మనవా రన్నారు. పురాణ మైదు లక్షణములు కలది. సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, రాజవంశములు, అనువంశములు, అని ఈ అయిదు లక్షణములు పురాణములయందుండును సర్గమనగా మొదటజరిగిన సృష్టి లక్షణము, మహాప్రళయము జరిగిన తరువాత తొలిసారి సృష్టియొక్క స్వరూప మెట్లుండునో అది సర్గము. తరువాత కొన్ని కొన్ని ప్రళయములు జరుగును. అప్పుడు మరల సృష్టి జరుగును. దానిపేరు ప్రతిసర్గము. మన పురాణములలో ఒక మనువు చెరువునకు స్నానమునకు పోయినట్లు, ఒక చేప తన్ను రక్షించుమని అడుగగా, దానిని తన చెంబులో తీసుకొనివచ్చెను. అది చెంబునకు పెద్దదై నాకు ఈచెంబు చాలుట లేదనగా పెద్దపాత్రలో వేసెను. అట్లు పెరిగి పెరిగి సముద్రములో బడవేయదగినంత దయ్యెను. ఆచేప ఆమనువుతో కొలది దినములలో సముద్రములు పొంగి భూమి మునిగి పోవును. లోకములో నున్న జీవరాసులలో ఒకొక్కక్క జీవ

రాశి కొంకొక్క వ్యక్తిగా తీసికొనివచ్చి నాపైన నెక్కుము. ప్రళయాంతమున మరల సృష్టిని నిలుపుదువుగాని అని చెప్పగా నతడట్లు చేసెను. ఇది ప్రతిసర్గము. అనగా మహత్తు అహంకారము మొదలగు వాటినుండి మరల సృష్టి జరుగ లేదు. మహదహంకారాదులనుండి జరిగెడు సృష్టి సర్గము. తత్పూర్వమందున్న జీవరాసులయొక్క ప్రతులు మిగిల్చి వానినుండి మరల సృష్టి సాగుట ప్రతిసర్గము. బైబిలులో 'నోవాస్ ఆర్క్' అని యున్నది. నోవా అనువాడు ఒకయోడలో జీవరాసులయొక్క ప్రతులను తీసికొని వచ్చినట్లు దాని వలన మరల సృష్టి ప్రారంభమైనట్లు చెప్పబడినది. అది ప్రతిసర్గము. సర్వ విద్యలు సర్వజ్ఞానము యితర దేశములకు భారత దేశమునుండియే వెళ్లినవి. అట్లు వెళ్లిన జ్ఞానములో బైబిలు లోని కథ యొకభాగము. మూడవది మన్వంతరములు. కృత త్రేతాద్వాపార కలి యుగములు నాల్గు కలిసినచో నొక మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 జరిగినచో నొక మన్వంతరము. అట్టి పదునాల్గు మన్వంతరములు జరిగినచో నప్పుడు మహా ప్రళయము వచ్చును. ఈ లెక్క ఎక్కడ? పాశ్చాత్యులు మనకు నేర్పెడి చరిత్రలోని లెక్క ఎక్కడ? అల్పమైన యూహగల వారి మార్గమును మన మనుసరించు చున్నాము. నాల్గవది రాజవంశము. సృష్ట్యాదియందు గల సూర్య చంద్రవంశ రాజుల చరిత్రములు మన పురాణము లలో నున్నవి. అనువంశములనగా వారినుండి కలియుగములో వచ్చిన బహు రాజవంశముల చరిత్రము. ఇది నేడు చరిత్ర యను పేరున కళాశాలలలో పాఠశాలలలో చదివింపబడు విషయము. దానిని పాశ్చాత్య చరిత్రకారులు పలువిధము

లుగా మార్చి పాడుచేసి వారి యిష్టమువచ్చినవి చదివించుచున్నారు. మన పెద్దలు వాని ననుసరించుచున్నారు. మనకు చరిత్ర జ్ఞానములేదని పాశ్చాత్య పండితులు నేర్పిరి. వారి చదువు చదివిన మన ఇంగ్లీషు పండితులు దానిని ప్రతిదినము చెప్పుచుందురు. కొందఱు నిజమే యనుకొనుచుండిరి. ఏ గూటిచిలుక ఆగూటిపలుకే పలుకునని యీఇంగ్లీషు చదువే చదివి పాశ్చాత్య సంప్రదాయమునందే దగుల్కొన్న బుద్ధులు వారి మాటలే విశ్వసించుటలో దప్పేమియులేదు.

ఇంతకు చెప్పవచ్చిన దేమనగా మన పురాణములు చరిత్రయే. మన ఋషులకు చరిత్ర జ్ఞానములేదనుట, మన పూర్వ నాగరికతను ఎంత తక్కువ పరచినచో వారి ఏలుబడి అంత గొప్పగా సాగునని పాశ్చాత్యులు పన్నిన పన్నుగడ.

ఇంగ్లీషువారు క్రైస్తవులు. బైబిలునందు విశ్వాసము కలవారు. పాశ్చాత్య దేశములన్నియు నింతే. వారి బైబిలులో సృష్టిక్రీస్తుపూర్వము రెండు వేలఏండ్ల క్రిందజరిగినది. నూటతొంబదియైదుకోట్ల సంవత్సరముల పూర్వము మనసృష్టి జరిగినదని మనవారు చెప్పుచున్నారు. ప్రతి సంవత్సరములో పంచాంగమును తీసి చూడుడు. సృష్ట్యాది గతాబ్దాః సృష్టి మొదలు పెట్టిన తరువాత గడచిన సంవత్సరములు. అవి ఎన్ని? నూటతొంబదియైదుకోట్ల పై చిల్లర. కలిగతాబ్దాః కలిలో గడచిన సంవత్సరములు. అవి ఎన్ని? అయిదు వేల అరువది. ఇట్లు మన జ్యోతిష్కులు సంవత్సరము సంవత్సరము లెక్కపెట్టుకొని వచ్చుచున్నారు. దానిని కాదనుట ఎట్లు? పాశ్చాత్యుల బుద్ధి ప్రమాణమెట్లు? క్రీస్తుశకము 1960. మరి పదిలక్షల సంవత్సరములు జరిగిన తరువాత క్రీస్తుశకము నెట్లులెక్కపెట్టు

దుకు? వేలమీాదనున్నప్పుడు లెక్కపెట్టవచ్చును. లక్షలు కోట్లైనప్పుడేట్లు? క్రీస్తు పూర్వమున లెక్కవేసినను, కోట్ల మీాదనున్న సంఖ్య వారినెమనుకురాదు.

మన కలియుగము ప్రవేశించినప్పటికే వారికి లెక్క కుదరలేదాయె. వారి సృష్టి అప్పుడు జరిగిన ట్లాయెను. ఇది ఏమి లెక్క! అయిదువేల అరువది సంవత్సరముల క్రింద కలి ప్రవేశించెనని పంచాగములు చెప్పుచున్నవి. భారతయుద్ధ మప్పుడు జరిగినదని భారతములో దాఖలాలున్నవి. ఆర్య భట్టు మొదలైన మనపూర్వ ఖగోళ శాస్త్రజ్ఞులు వ్రాసి పెట్టినారు. వాని నన్నింటిని పాశ్చాత్యులు కాదన్నారు. ఇంగ్లీషు నేర్చిన మన పెద్దలు వారినే విశ్వసించుచున్నారు. మనవాండ్రకు పురాణములయందు చెప్పబడిన సర్గ ప్రతిసర్గ ములయందు విశ్వాసములేదు. డార్విను సిద్ధాంతమునందు విశ్వాసము.

మన దేశములో కొందఱు పెద్ద లీవిషయమును చాల పరిశ్రమచేసి పాశ్చాత్యుల సిద్ధాంతములు తప్పులని రుజువు పరచినారు టి. యస్. నారాయణశాస్త్రిగారు శంకరుని కాలము నిర్ణయించుచు ఈ విషయములను సమగ్రముముగా చర్చించి మహాభారతయుద్ధము సుమారు అయిదువేలఏండ్ల క్రింద జరిగినట్లు నిరూపించిరి. తరువాత నడింపల్లి జగన్నాథ రావుగారు నిరూపించిరి. తరువాత కోట వెంకటాచలము గారు మన సర్వచరిత్రము విస్పష్టముగా విలిఖించినారు.

గ్రీకుల రచనలలో సాంద్రకోటస్ అన్న మాట యు న్నది. దానిని పాశ్చాత్యులు మౌర్యచంద్రగుప్తుడని యర్థము

చెప్పినారు. దానిలో పురాణములలోని కలిరాజవంశ మంతయు తారుమారైనది. ఈయన గుప్తచంద్రగుప్తుడు గాని మౌర్యచంద్రగుప్తుడు గాడు. మనకు మగధరాజవంశ చరిత్ర యున్నది. కల్హణపండితుడు తన రాజతరంగిణిలో కాశ్మీర రాజ చరిత్రము పూర్తిగా వ్రాసినాడు. నేపాళరాజవంశ చరిత్రము సమగ్రముగ గలదు. గుప్తచంద్రగుప్తుని వదలి పెట్టి మౌర్యచంద్రగుప్తు డనుటతో సర్వము నాశనమై పోయినది. పాశ్చాత్యచరిత్ర కారులు. ఈ సిద్ధాంతము అకాండ తాండవము చేసినారు. మనచరిత్రను వారియిష్టము వచ్చినట్లు మలచిరి. మన పండితులదియే చదువుచున్నారు. విద్యార్థులచేత అదియే చదివించుచున్నారు.

ఈ విషయము సమగ్రముగ నెఱుగగోరువారు భారతచరిత్రభాస్కర బిరుదాంకితులైన పండిత కోట వెంకటాచలముగారి గ్రంథములను చదువ వలయును. భారత యుద్ధము అయిదువేల సంవత్సరములక్రితము జరిగినదని తెలిసికొనగోరు వారు, నడింపల్లి జగన్నాథరావుగారు వ్రాసిన మహాభారత యుద్ధకాలనిర్ణయమును టి. యస్. నారాయణశాస్త్రిగారు వ్రాసిన శంకరాచార్యకాల నిర్ణయములను చదువవలయును. ఈ రెండు గ్రంథములు ఇంగ్లీషు భాషలో వ్రాయబడి యున్నవి. ఆ గ్రంథములు గ్రహములయొక్క చారము, వాని లెక్కలు మొదలైన వానితో నిండియుండును.

ఈ చరిత్రను పలుమంది పాశ్చాత్యులుదిద్ది పాడు చేసిరి. పంక్తులు తప్పుచదివి దుర్వ్యాఖ్యానములుచేసి హిందువులయొక్కయు, బౌద్ధులయొక్కయు వ్రాతలను పరిహసించి

దుర్మార్గములు చేసిరి. ఈ దౌర్మార్గ్యమును ప్రారంభించినవాడు సర్ విలియమ్ జోన్సు. తరువాత చాలమంది పాశ్చాత్యచరిత్రకారులు వారి ననుసరించిరి. మన వేదాంతముల యం దభిమానముగల మాక్సుముల్లరుకూడ చరిత్ర విషయములో దుష్టముగానే వ్రాసెను. ఇంగ్లీషులో నొక సామెత యున్నది. Blood is thicker than Water.

ఇంతకు సప్తర్షి మండలముయొక్క గమనముమీద మహాభారత యుద్ధకాల నిర్ణయము చేయబడవలయును. ఇది పెద్ద కథ. పోనిండు. పురాణముల ప్రకారము చూచినచో సప్తర్షిమండల చారమునుబట్టి లెక్కకట్టినచో సాంద్రకోటస్ గుప్తచంద్రగుప్తుడని అంగీకరించినచో, నన్నియు సరిపోవును. సరిపోయెడు నీలెక్కయుండగా, సరిపోని లెక్కకట్టి పురాణములు తప్పనుటలోని దెలివి ఏమి? అందులోని న్యాయమేమి? దానియందలి విశ్వాస మిట్టిది.

ఆలెక్క ప్రకారము కలి ప్రవేశము మొదలు సంయుక్త పృథ్వీరాజుల కథ దనుక పాశ్చాత్యులు తారుమారు చేసిరి. ఆ కాలము అనగా షుమారు మూడువేలఏండ్ల కాలము. మహమ్మదు గోరీ వచ్చువఱకు మన చరిత్రలో పాశ్చాత్యులు చేసిన యవక తవకలు కాదని నవలల రూపమున నిరూపించుటకు చేసెడి ప్రయత్న మిది..

అందుచేత దీనికి 'పురాణవైర'మని శీర్షిక ఏర్పరుపబడినది.

# పీఠిక

ఇది మొదటి నవల. ఇందులో భారతయుద్ధమైన తరువాత వందయేండ్లు గడచిననాటి కథ వ్రాయబడినది. నవలకు కావలసిన కల్పన లన్నియు నుండును. కాలము మాత్ర మది. అప్పుడు జనమేజయ మహారాజు తుంగభద్రయొడ్డున, కొందఱుమునులకు కొంత స్థలము దానముచేసినాడు. ఆ దానశాసన మున్నది. మరి యింతకన్న నేమి ప్రమాణము కావలయును. ఈ నవలలోని కథ ఆ నాటిది.

మగధ రాజవంశ చరిత్రము సంపూర్ణముగా గలదు. భారతకాలములో భీమార్జున కృష్ణులు వెళ్ళి, జరాసంధుని చంపిరి గదా? జరాసంధుని కొడుకు సహదేవుడు. అతని కొడుకు మార్జారి. ఇరువదియిద్దరు రాజులు మహాభారత యుద్ధము జరిగిన తరువాత గిరివ్రజము రాజధానిగా వెయ్యి యిరువదియొక్క సంవత్సరములు రాజ్యము చేసిరి. ఇట్లు మగధరాజ వంశచరిత్ర మంతయు చక్కగా నిరూపితమై యున్నది. ఇది మొదటి నవల. ఈ కథలో ప్రధానముగా నాంధ్రదేశమే వర్ణింపబడినది. తరువాత వచ్చు కొన్ని నవలలలో ఈ మగధరాజవంశములు, వాని మార్పులు చేర్చబడును.

పాశ్చాత్యుల చరిత్రలోని మొదటి విచిత్రమేమనగా శాలివాహన మహారాజును, విక్రమార్క మహారాజును కల్పిత చక్రవర్తులనుట. విక్రమార్క మహారాజు కాలములో కాళిదాసుండెను. కాళిదాసు 'జ్యోతిర్విదాభరణము' అన్న జ్యోతిషగ్రంథము వ్రాసి దానిలో తాను రఘువంశ కుమారసంభవ మేఘ సందేశములు వ్రాసితిననియు ఆ రాజునకు తాను స్నేహితుడయుననియు చెప్పికొన్నాడు. ఆవిక్రమార్క మహారాజు కల్పితమహారాజట! (Myth). ఇంక పాశ్చాత్యుల చరిత్రను నమ్ముట ఎట్లు? మన పెద్దలు నమ్ముచున్నారే! దానికి సమాధాన మేమి?

విశ్వనాథ సత్యనారాయణ

# భగవంతుని విహాది ప్రగ



## ౧

వేసఁగిసూర్యుఁడు నడిమింటికి రాఁబోవుచున్నాఁడు. ఎండలో దూరానఁ దెలియుంగరాలు కట్టుచున్నవి. ధాత్రి యుడుకు లుమియుచున్నవి. అదియంతయు జాతినేల. జాతి నేల యనఁగా వట్టికొండప్రదేశ మని కాదు. చెక్కలు చెక్కలుగా ఱాళ్ళ పొరలు పొరలుగా ధాత్రియంతయు నిండి యున్నది. అది యీనేలయొక్క స్వభావము. తీవ్రాతపము మేనిచర్మ మెరియించుట సహజమే. కనులు బైరులు క్రమ్మించుటయు సహజమే. చెవులకుఁ జిఱుతలు వేయుట యచ్చెరువుగా నున్నది. పైనుండి యొకసన్నని జలప్రవాహము వచ్చుచున్నది. ఎక్కువ వెడల్పు లేదు. అంకించి దూఁకినను దూఁకవచ్చును. కాని దానిపేరుమాత్రము నది. ఆమె చంద్రభాగ. పూర్వ మెప్పుడో చందురునినుండి విడివడ్డ యొక్క వెన్నెలపాయ నీటికట్టుగాఁ బ్రవహించియుండుట నామె కాపేరు కల్గుటకు కారణ మయియుండవచ్చును. ఆ చంద్రభాగ ప్రవహించి ప్రవహించి యొకప్రదేశము చేరెను. అక్కడితోఁ గొండ యాగిపోయెను. క్రిందికి నాలుగయిదు తాళ్ళలోతుండును. ఆకొండయంచునుండి క్రిందికి దూఁకెను. ఆప్రదేశ మొకపెద్దలోయ. దూఁకిననీరు పెద్దచెఱువు కట్టుట సహజమే. ఆలోయలోఁ జల్లగా నుండును. నీరు నిలువ

యుండును. పెద్ద చెఱువులుగాఁ గట్టిన నీరు దానికి మించి నప్పుడుగదా ప్రవహించుట. ప్రవహించి చాలదవ్వు పోయి నప్పుడుగాని కొండమీది పలుచని కాలువవంటి కాలువగా నేర్పడదు ఈలోయలోమాత్రము జలసమృద్ధి, చెట్లు, తీగలు, పచ్చిగడ్డి, కాయగసురులు, నోషధులు, చిన్నచిన్న నీటినిలు కడలు, జాలజాలనడుమ సన్నని నీటివెల్లువలు, పట్టిన పాచి చేతఁ గాలుజారుటలు, బ్రహ్మాండములయిన వృక్షములు పెరిగి పై నెండ రాకుండ నెండ తగులకుండ నడివేసంగిలో నాప్ర దేశము హిమాలయపర్వతమువలె నుండునట్లు చేసెను.

మానవజాతి విచిత్ర మయినది. కొందరు పట్టి క్షుద్బా ధానివారణమాత్రజీవులు. మరికొందరు శరీరసౌఖ్యమార్గా న్వేషణాపరులు. ధనముయొక్క లేమియుఁ, గలిమియు నిట్టి మానవప్రకృతిభేదమునకు హేతువులుగాఁ జెప్పఁ దగినట్లు కనిపించును యథార్థమునకు ధనము తత్స్వభావభేదమునకుఁ గారణము కాదు. కొందరు సహజముగా సుఖలాలసులు. కొంద రూరకే బ్రదుకుదురు. ధనవంతులయిండ్లలోననే కొంద రేమి వేసి పెట్టినను దిందురు. కొందరి కాపదార్థ మున్ననే రుచించును. ఇది ధనవంతుల యిండ్లలోననే కాదు. పేదసంసారములలోఁగూడ నిట్లే యుండును. ఒకఁడు తన కిష్ట మైన వ్యంజనము లేక ముద్ద యెత్తఁడు. ఇది ప్రకృతిసిద్ధమైన భేదము.

ఇక్కడ చంద్రభాగ ప్రవహించుచున్నది. జలపాత మున్నది. అడుగునఁ బరమశీతలమైన ప్రదేశము. గ్రీష్మా తప మొడలు బొబ్బ లెక్కించుచున్నది. ఈనడియెండ వేళల

నాయఖాతములోఁ జల్లని ప్రదేశమునందుఁ బోయి చెట్లనీడ నాతిన యేశిలాతలమునందైన విశ్రమించి ప్రొద్దు వాటాటిన తరువాత నింటికిఁ దిరిగి రావచ్చును. ఆప్రాంతమున నొకటి రెండు పల్లె లున్నవి. అచటి కొందరిజనుల కిచట జలపాత మున్నదనియే తెలియదు. కాని యానాఁడు తదధశ్శిలప్రదేశమున నిద్దఱు వ్యక్తు లచ్చట శైత్య మనుభవించుచుండిరి. అందులో నొకఁడు రూపసి. చంద్రబింబమువంటి ముఖము. ఎఱ్ఱని మేను. మనిసి పొడుగరి, చెవులకుఁ గుండలములు, మెడలోఁ జందెము. ఉత్తమక్షత్రియకుటుంబమునకుఁ జెందిన యువకుఁడు. రెండవానియందుఁగూడ క్షత్రియలక్షణము లున్నవి. కాని మనిసి నల్లనివాఁడు. కన్నులు చిన్నవి. మొగములో నేదియో యొకవికారరేఖ యున్నది. వానిని జూచినచో నొకవెగటు తోఁచును. ఇద్దఱును మిక్కిలి చెలి కాండ్రు. వా రొకశిలాతలమున నాసీనులై యుండిరి. రాజు కొడుకు పండుకొనియున్నాఁడని చెప్పవలయును.

ఆయఖాతములోనికి దిగుట కష్టము. మెట్లు లేవు. తీగలను బట్టుకొని కొండతాళ్ళమీఁదఁ గా ళ్ళిడుకొనుచు నెమ్మదిగా దిగవలసియుండును. పై కెక్కు నను నట్లే. వీరిద్ద ఱచ్చటికి జాముప్రొ ద్దెక్కి వచ్చిరి. అచ్చటికి రాజధాని చాలద వ్వున్నది. ఈప్రదేశముయొక్క రామణీయకము పలు నోళ్ళ వినివిని రాజకుమారుఁ డీస్థలమును జూడవలయునని యానడివేసంగిలో నీశైత్య మనుభవించవలయునని నాలు గయిదేండ్లుగా భావించుచుండెను. తొలుతగా నీస్థలరామణీయకమును వినిపించినవాఁ డీస్నేహితుఁడే. ఆస్నేహితునిపేరు

జయద్రథుఁడు. రాజకుమారునిపేరు శ్రీముఖుఁడు. శ్రీముఖుఁడాంధ్రరాజకుమారుఁడు. ఆంధ్రులు త్రేతాయుగమునుండి ప్రత్యేకజాతిగా నేర్పడినవారు. పూర్వము యయాతి యను మహారాజు కలఁడు. శుక్రాచార్యునికొమార్తెయైన దేవయానిని బెండ్లాడినవాఁడు. వృషపర్వునికూతురు శర్మిష్ఠకూడ నాయనభార్యయే. ఈయయాతి కైదుగురు పుత్రులు. వారిలో ననువు పేరుగలవాఁ డొకఁడు. ఆవంశములో బలి యను రాజు పుట్టెను. ఆయన భారతదేశమునఁ దూర్పుప్రాంత మంతయుఁ బాలించుచుండెను. దానికిఁ బ్రాచ్యకదేశ మని పేరు. అబలి కాఱుగురు కుమారులు. అంగరాజు, వంగరాజు, కళింగరాజు, సుహ్మరాజు, పుండ్రరాజు, ఆంధ్రరాజు. ఆబలి తన యీయార్గురు కుమారులకుఁ దనభాగమైన ప్రాచ్యకదేశ మంతయు విభాగించి పంచిపెట్టెను. కృష్ణాగోదావరీనదుల నడుమనున్న యీదేశ మాంధ్రరాజువంతు వచ్చెను. నాఁటి నుండి యీదేశమున కాంధ్రదేశ మని పేరు వచ్చెను. ఈ యాంధ్రరాజు శ్రీరామచంద్రుని తండ్రియైన దశరథమహారాజునకు సమకాలికుఁడు.

ఈశ్రీముఖుఁడు ఆంధ్రదేశమునకుఁ బ్రభువైన రోమపాదునికుమారుఁడు. శ్రీముఖుఁడు చదివినవాఁడు. వివేకి. కాని యావేశము కలవాఁడు. అతనిస్నేహితునిపేరు జయద్రథుఁడు. అతఁ డీదేశమువాఁడు కాఁడు. అతఁ డేదేశమునుండి వచ్చెనో యెవ్వరికిని దెలియదు. పలుమంది పలువిధములుగా జెప్పుకొందురు. కొందరు కాశ్మీరదేశస్థుఁ డందురు. మఱి కొందరు మగధదేశస్థుఁ డందురు. మఱికొందరు నేపాళరాజ

వంశీయుఁ డందురు. కాని యతఁడు బహుదేశములు తిరిగిన వాఁడు. అనంతమైన లోకానుభవము కలవాఁడు. మాట నేర్పు గలవాఁడు. అతని మొగము చూచినంతనే జనులు తొలఁగిపోదురు. కాని యతఁడు కొందరితో స్నేహము చేయును. అతని స్నేహము మద్యమువంటిది. అనుభవించిన కొలఁది మత్తెక్కించును. ఈజయద్రథుఁడు శ్రీముఖునితోఁ జెలిమి చేసెను. అట్లు చెలిమి చేయుటకుఁ గొన్ని పరిస్థితు లేర్పడినవి. జయద్రథుని తల్లియు, జయద్రథుఁడును నాటేండ్ల క్రింద నాంధ్రరాజధానికి వచ్చిరి. ఆరాజధాని కృష్ణాతీరమున నుండెను. క్షత్రియవంశీయులు పలుదేశములు తిరిగి పొట్ట జరుగక వచ్చినవారని రాజదర్శనము లభించెను. రాజు జయద్రథున కేమియు నుద్యోగము నీయలేదు. కాని ధర్మ శాలలో వారికి వసతి యేర్పఱచెను. దినదినము వారికి బత్తె మిచ్చుట కానువాయితిగా వచ్చుచుండెను జయద్రథునకు వేఱే పని లేదు. శ్రీముఖునకు జయద్రథునియందుఁ గొంత ప్రేమ పెరిగినది. జయద్రథుఁడు పదిమంది యున్నప్పుడు శ్రీ ముఖునితో మాటాడఁడు. ఏకాంతముగా నున్నప్పుడు మా టాడును. ఎంతసేపును వానితో మాట్లాడవలయునని శ్రీము ఖునియుత్సాహమే తప్ప జయద్రథుని యుత్సాహము కని పించదు. కాని జయద్రథుఁడు మాటాడిన ప్రతిమాటయు శ్రీముఖునిలో నొకవాంఛయు, నొకనిగూఢమైన యభిలాష యొక్క యుల్బణమును రేకెత్తించుచుండును జయద్రథున కది యొకవిద్యగాఁ గనిపించుచుండెను. నాలుగయిదేండ్లలో

శ్రీముఖుని సర్వవ్యాపారాభిముఖత్వము జయద్రథోపజ్ఞకమై యుండెను. కాని యిది యెవ్వరికిని దెలియదు.

ఈచంద్రభాగాజలపాత రమణీయశీతలప్రదేశదర్శనాగమనాభిలాష శ్రీముఖునియందు ఎత్తినది, యంకురింపించినది జయద్రథుఁడే. శ్రీముఖుని వెంట నిచ్చటికి జయద్రథుఁడు వచ్చుచున్నాఁడనియు, నెవ్వరికిఁ దెలియదు. రాజపుత్రుఁడును గొందరు సేవకులు గుఱ్ఱములమీాఁద నిచ్చటికి వచ్చిరి. దూరముగా నున్న యొకపల్లెటూరిలో రాజకుమారుఁడు విడిసెను. ఆ వెనుకటి నాల్గయిదుదినములక్రింద మువ్వురు సేవకులును, శ్రీముఖుఁడును దత్ప్రదేశమంతయుఁ బరిశీలనము చేసి వెళ్ళిరి. శ్రీముఖుఁడు లోనికి దిగుటకుఁ గొన్ని వీళ్ళుగాఁ గొన్నిచోట్ల మెట్లుగాఁ, గొన్నిచోట్ల నాలంబనమునకు దృఢమయిన లతలుగా మార్గ మేర్పాటు చేయఁబడినది. రెండుమూఁడుదినములీప్రయత్నమంతయుఁ జేయఁబడినతరువాత నొక్క రాజసేవకునితో శ్రీముఖుఁడు వచ్చి యాయఖాతమునఁ గొంతసేపు విశ్రమించి వెడలిపోయెను. మరునాఁడు తానొక్కఁడే యచ్చటికి పోవుదునని యువరాజు చెప్పెను. మార్గము సులభముగాఁ జేయఁబడెను. నిన్న విశ్రాంతి పొందిన పరిచితస్థలములున్నవి రక్షకభటుఁ డంగీకరించెను. అంగీకరించక తప్పలేదు. శ్రీముఖుఁడు నిశ్చయముగా వానిని వారించెను.

ఆనాఁడు జాముప్రొద్దెక్కినతరువాత శ్రీముఖుఁడులోనికి దిగెను. రాజపురుషుఁడు రెండు గుఱ్ఱములను బట్టికొనెను. దూరముగా నొకవృక్షచ్ఛాయయందు నిలుచుండెను. చంద్రభాగానది ప్రవహించు నాకొండపైభాగమున వృక్షమన్నది లేదు.

అన్నియు దుబ్బులే. అవియైన నందం దున్నవి. వృక్ష మని చెప్పుటకు వీలులేనిది ఇచ్చట వృక్ష మని చెప్పవలసివచ్చి నచో దానికన్న గతిలేనిది యొకరెండుగజములు బోదగలిగి పైకొమ్మ లాకులు ముండ్లపొదవలె నున్న యొకచెట్టచ్చట నుండెను. ఆచెట్టునకు నీడ యనుచు నుండునా? ఆచెట్టు నాశ్రయించుటతప్ప రాజపురుషునకు గత్యంతరము లేదు. గుఱ్ఱముల నాచెట్టుబోదకుఁ గట్టివేసి రాజపురుషుఁ డచ్చటనే యుండెను. గుఱ్ఱము లెండకుఁ దపతప లాడిపోవుచుండెను. వానిమేనఁ జెమ్మట లోడికలు కట్టుచుండెను. చంద్రభాగ లోని నీళ్ళు కొబ్బరిపాలవలెఁ బ్రవహించుచుండెను. చెట్టు చంద్రభాగదగ్గఱగా నుండెను. ఆతపముయొక్క తీవ్రతయం తయు రాజపురుషుఁడు చంద్రభాగాజలములచేత నుపశమింపఁ జేయుచుండెను. అంతటితీవ్రమైన యెండయు రాజపురుషుని దృష్టిలోఁ జంద్రభాగాజలములకు లోఁకువ యైనట్లే కనిపించు చుండెను. రాజపురుషుని మనస్సులో నొక్కటియే బాధ. జలపాతముయొక్క యడుగున నున్న రాజకుమారున కేదయిన నాపత్తి కలిగినచో నతఁడు తన్ను బిలిచినను దనకుఁ బిలు పందదు. నడుమనడుమ జలపాతపు కొండనకుఁ బోయి చూచి నచోఁ దన్ను రాజకుమారుఁడు చూడకున్న సరియే. చూచి నచో నెందుకు వచ్చితి.వని కోపపడును. ప్రొద్దు వాటాఱు వఱకు రాజకుమారుని దోడితెచ్చుటకుఁ దన కనుజ్ఞ లేదు. అట్లు చంద్రభాగాల్పశీకరపరిషిక్తతటప్రదేశమునఁ గొంతసేపు నాజానేయపరామర్శబుద్ధియయి, కొంతసేపు గుఱ్ఱములకు నీళ్లు

పెట్టుచును, గొంతసేపు నీళ్ళు తీసికొని పోయి గుఱ్ఱముల ముఖములమీఁదఁ బృష్ఠప్రదేశముల జల్లుచుఁ గొంతసేపు కాలయాపనము చేయుచుండెను.

ఇంతలోపల శ్రీముఖుఁడు లోనికి దిగి తత్పూర్వదినమున విశ్రమించిన శిలాతలమునఁ గూరుచుండెను. ప్రొద్దెక్కుచుండెనో, కాలము గడచుచుండెనో యచ్చట తెలియుట లేదు. అనాఁ డచ్చట నతఁడు జయద్రథునికై ప్రతీక్షించుచుండెను. జయద్రథుఁ డెట్లు రాఁగలఁడు? ఎట్లు వచ్చినను రాజపురుషులకుఁ గనిపింపక తప్పదు. పైనుండి క్రిందికి దిగవలయు నన్నచో రాజసేవకు లేర్పఱచిన మెట్లవంటి ప్రదేశ మతనికిఁ దెలియదు. నీ కెందుకు? నేను వత్తునుగదా యన్నాఁడు. ఈజయద్రథుఁ డతిలోకమేధాశాలి. అతనిని జూచినచో నందఱు తొలఁగిపోయెదరు. తనతండ్రి యతని కొకయుద్యోగమైన నీయనే లేదు. తాను, తనతల్లియు నిన్నియేండ్లుగా ధర్మశాలలో నివసించుచున్నారు. వా రేమియు నడుగరు. తండ్రి యీయఁడు. తానే ధర్మశాలలోఁ గొంత భాగము వానికి నివాసయోగ్యముగాఁ, గొంతవఱకు భోగయోగ్యముగా సంతరింపించెను.

జలపాతమయిన కొండలోయ యడుగుభాగమునందు నీరు చెఱువు కట్టి పాఱి కొంతదూరము పోయినతరువాత మరల సన్నని కాలువగాఁ బ్రవహించుచుండును. ఆకాలువ యేర్పడువఱకు రెండువైపుల నెత్తయిన కొండలు, ఆ కొండలు దాటినతరువాత సమప్రదేశమే. ఆపైన నంతయు మెట్టప్రదేశము. ఆదిగువ నంతయుఁ బల్లపుఁబ్రదేశము. శ్రీ

ముఖున కాకాలువ ననుసరించి రెండువైపుల నున్న యెత్తైన కొండలననుసరించి బల్లపుమేరఁ బ్రవహించు నదిని జూచివత్త మనిపించెను. ఇదియంతయుఁ దనరాజ్యమే. పోయి చూత మనిపించుచుండెను, లేవలేఁడు. కాని దూరాన నాకొండలు తెరపి యిచ్చు తెరపిప్రదేశమునఁ జూచుచుఁ గూర్చుండును. చాలదవ్వున సన్నగా నొకచిన్నపొదవలె నది క్రమముగా వచ్చుచున్నట్లు, కదలుచున్నట్లు, కొంతదూరమైనతరువాత మనుష్యునివలెఁ, జాలదగ్గఱకు వచ్చినతరువాత జయద్రథుని వలెఁ గనిపించెను. శ్రీముఖుఁడు మందహాసముతో నింతదూర మెట్లు నడచి వచ్చితివి? ఈ దేశమంతయు నీకుఁ బరిచితమా? ఆ వెనుక గ్రామము లున్నవా యని పది ప్రశ్నలు వేసెను.

జయద్రథుఁడు నచ్చి కూర్చుండెను. శ్రీముఖుఁ డి ట్లనెను. ఓయి జయద్రథా! నీ కింత భయ మెందులకు? ఇద్దఱము కలసియే వచ్చెడివారముకదా?

జయద్రథుఁడు – రాజకుమారా! నేను బుట్టినప్పటి నుండి తిరుగని దేశము లేదు. దేశములు దిరుగుటయే నాకు వ్రత మైనది. పనియుఁ బాటయు లేక నే నూరకయే తిరిగివచ్చుచుందును. నాకు మహారా జుద్యోగ మేమియు నీయలేదు. నీతోడి నా స్నేహము నలుగురికిఁ దెలిసినచో నా యందు రాజోద్యోగుల కీర్ష్య యేర్పడును. నన్నును, నా తల్లిని మీరు పోషించుచున్నారు. మన స్నేహము రహస్యము గానే యుండవలయును. లేనిచో నీమాత్రము పోడిమి చెడిపో వచ్చునుకదా?

శ్రీముఖుఁడు - నీవు వివాహము చేసికొనుము.

జయ - నాకు వివాహ మైనది. నా కొకకుమారుడు కూడఁ గలఁడు,

శ్రీము - అరే! నాకుఁ దెలియదే! నీయత్తవా .రేయూరు? ఆమెను వదలిపెట్టి యున్నాళ్ళిచట నొంటరిగా నెట్లుంటివి?

జయ - ఆమె కాశ్మీరరాజవంశమునకుఁ జెందిన స్త్రీ. ఆమె కళింగదేశమున నున్నది. మా కచట బంధువు లున్నారు. నే నచ్చటికిఁ బోయివచ్చుచుందును.

శ్రీము - ఔను. నడుమనడుమఁ గొన్నినెలలు కని పించుచుండవు. అచ్చటికిఁ బోయివత్తు వన్నమాట. నీకుమా రునివయ సెంత?

జయ - నాలుగేండ్లు. మీకుమారునితో సమాన మయిన వయస్సు కలవాఁడు. మీకుమారునిపేరు విక్రముడు కదా! ఆయనకంటె నాకొడుకు రెండునెలలు చిన్నవాడు. నాకొడుకుపే రశ్మకుఁడు.

శ్రీము - నీభార్యాపుత్రులను వెంటనే మనరాజధానికిఁ దీసికొని రావలయును.

జయ - రాజకుమారా! ఈ జన్మలు చిత్రమయినవి. తా దూరఁ గంత లేదు, మెడ కొకడో లని నేనును, నా తల్లియే మీపంచలఁ బడి బ్రతుకుచుంటిమి. నాతల్లియు రాజ కుమార్తెయే. కాని తీవ్రమయిన కష్టము లెటిఁగిన జీవి. తీవ్రవ్రతములు దాల్చిన రాణి, ఒకవ్రతముకొఱకు, నొక

పట్టుదలకొఱకు, నొక ప్రతిజ్ఞకొఱకు బ్రదుకు బ్రదుకుసంతయు బలిదానము చేయఁగలిగిని తీవ్రప్రకృతి యామెది. నాభార్య యట్టిది కాదు. మేము క్షత్రియుల మయినను రాజ్యము నెఱుఁగని క్షత్రియులము. బుద్ధిపూర్వకముగా రాజ్యము పరిత్యజించిన క్షత్రియులము. నాభార్య రాజవైభవము నెఱింగిన యింటిబిడ్డ. ఒకధర్మశాలలో, రెండుగదులలో నామె యుండలేదు. ఈమాటలు తమతో నేను తమనుండి ధనము సంపాదించవలయునని గాని. మాకొఱకొకభవనము ప్రత్యేకింపించికొనవలయునని గాని చెప్పుట లేదు. నా దొకవిచిత్రమయిన ప్రకృతి. బ్రదుకుటలో నే మున్నది? వివాహ మాడితిని, భార్య వచ్చినది. తొలుతటిదినములలో సంగమములోనున్న యాతుర్యము తరువాతిదినములలో లేదు. మనము బుద్ధిచేత నూహచేత దానిని బాడమించికొని తొలినాఁటి యాతుర్య మారోపించికొని లేని దున్నట్లుగా భావించికొని వృథాశ్రమ పడుదుము. అది జీవించుట యనుకొందుము. యథార్థముగా జీవితములో నేక్రొత్త యనుభవమయినను నొక్కసారియే జరుగును. తరువాత జరిగెడు ననుభవములలోఁ గ్రొత్తదన మేమియు నుండదు. ప్రథమానుభవస్మృతిచేతఁ దాడితమయిన బుద్ధి వృథా పరిభ్రమించును. కొందరు స్మృతిజనితదనంతరానుభూతియందే విశేష మున్నదని వాదించవచ్చును. నాకుఁ దానియందుఁ బ్రత్యయము లేదు. ఒక సాహసకార్యము చేయుదుము. అది చేయకముందు మనము దానినిఁ జేయఁ కల్గుదు మన్న విశ్వాసము లేదు. విశ్వాస మున్నదనుకొనుము నిశ్చయము లేదు. నిశ్చయముకూడ నున్న దనుకొందము.

ఆసాహసకార్య మాచరించిన తాత్కాలికోద్వేగానుభవము లోని యొకమనశ్చలనము నొకరమణీయప్రాణనూతనపరిచయము తత్సాహసకార్య మాచరించినప్పుడేయుండును. యుద్ధముఁ దిద్దఱు క్షత్రియులు తారసిల్లినారు. ఇద్దఱును రణయోధులే. ఇద్దఱును యుద్ధపాటవము కలవారే. ఇద్దఱును బలశాలురే. ఇద్దఱును జయకాంక్ష గలవారే. ఒకరిని సంహరించుట కొకరెదుర్కొనిరి. కొంతసేపు యుద్ధ మాడిరి. ఒకఁడు రెండవవానిని సంహరించెను. తనకత్తిదెబ్బచేతఁ దనశత్రువు వధింపఁబడినాఁడని తెలిసిన లిప్తలో నాయోధునియొక్క మనస్సె ట్లుండును! తాను చనిపోవుచున్నానని రెండవ వానికిఁ దెలియును. ఆలిప్తలో వానిమనస్సె ట్లుండును? నే నూహింపఁగానూహింపఁగాజీవితముయొక్క పరమరహస్యము తాదృశములైన లిప్తలయందలి విచిత్రానుభవవిశేషముల యందే యున్న దనిపించును. అదియే బ్రదుకుపరమార్థము. లేనిచో నే మున్నది? సూర్యుఁడు ప్రాగ్గిరిశిఖరారోహణము చేసినవెంట మన మందఱము నిద్ర మేల్కొందుము. దైనందినముగాఁ గాల్యకృత్యములు నిర్వర్తింతుము. స్నానపానాదులు సేయుదుము. భోగములనుగూడ ననుభవింతుము. దీనిలోని విశేష మే మున్నది? ఒకకాలువ ప్రవహించుచున్నది. ఈచంద్రభాగానదియే గలదు. దీనిని నది యనుట యేమి? దీనిని నది యని పిలిచెడి యాంధ్రుల వివేకమే వివేకము. ఇదకు గంగానదియంతయైనను లేదు. కృష్ణయు, గోదావరి యును బెద్దనదు లనవచ్చును. ఈచంద్రభాగ చిన్ని కాలువ. ప్రవహించుచున్నది. ఎచ్చట దిగినను నడుములోతు నీ

ఘ్ఘుండవు. అప్రవాహములో నున్న విశేష మేమి? ఏమియును లేదు. నీళ్లు ప్రవహించుచున్నవి. అంతే విశేషము. కాని యీకొండచివఱకు వచ్చినది. అచ్చటినుండి క్రిందఁ బడినది. ఆపడుటలో నైరావతముయొక్క తొండము ఘూర్ణిల్లినట్లు పడుచున్నది. క్రిందఁ బడి యింత చెఱువు కట్టి యీలోయ నంతయు నింత రమణీయము చేసినది! చిత్రచిత్రములయిన స్రోతస్సులు ప్రతిశిలామధ్యమునందుఁ బ్రజ్వలింపించినది. దానిచలువచేత నీకొండలోయయంతయుఁ బులకరించినది. ఆపైన దుబ్బు లేదు. పచ్చిగడ్డి లేదు. నాపఱాళ్లమయము. ఈ లోపల దీనినీళ్ళచేతఁ గొండలోతట్టులలోని శిలాఖండముల నడుమఁగల మృత్స్న తడిసి తదంతర్నిహితప్రాణశక్తి చిత్ర చిత్రములయిన యోషధులుగాఁ బ్రాదుర్భావము గాంచినది. జలసిక్త పృథివీపదార్థమునందు నేవిచిత్రమైన శక్తి కలదో యీ రెండుభూతముల సంయోగముచేత నెట్టిప్రాణము లోన లోనఁ జిఱుకదలికయై, కళకళలై యేయాకారముతోఁ ద్రవ్వి కొని వెలికి వచ్చునో మనకుఁ దెలియదు. ఈరెండుకొండల నడుమగాఁ జడియలుగాఁ గట్టి పొంగిన నీరు పాఱుచున్నది. మరల నీనది కొండమీఁద నెట్టి వట్టినీటిపాయకట్టో మరల నట్టివట్టికట్టే. ఈనదీజీవితములో నీజలపాతము, నీలోయ, యీ విచిత్రౌషధీనికాయసమావిర్భావము నిది యొకవిచిత్రమయిన యనుభూతి. ఈయనుభూతి యీనదీమూర్తికి నిత్యముగా భాసించుచున్నది, ఏతదనుభూతినిత్యతాపరమమాహేశ్వరీ దేవి. యీనదీదేవత పరమయదృష్టవంతురాలు. మానవజీవిత మునం దీసౌందర్యము లేదు. మానవజీవితమునం దొకయును

భూతివిశేషము కలిగినచోఁ దన్నిమేషపరిభుక్తమై తన్నిమేష పరిలుప్త మగును. అందుచేత మానవుఁడు ఒకమహావిచిత్రానుభూతి నొందినపుడు సద్యోమరణము నొందినచో జన్మ చారితార్థ్యము నందును.

నాభార్యను నేను ప్రేమించలేదు. మావంశములో మేము ప్రేమించి పెండ్లి చేసికోము. మాది యొకవ్రతము. మే మొకతీవ్రమయిన ప్రతిజ్ఞ చేసినవారము. తరతరము మే మాప్రతిజ్ఞ పాలించెడివారమై యుందుము. ఆప్రతిజ్ఞాపాలన ముకోసమే మేము జన్మ మెత్తుదుము. మావంశము తరతరములఁ బాలింతుము. అందుచేత నాజీవితముమీఁద నా కధికారము లేదు.

శ్రీము – ఉన్నచో నేమి చేసెడివాఁడవు?

జయ – ఏమి చేసెడివాఁడనా? నాగుండెలో నవధు లెఱుఁగని సౌందర్యాభిమాన మున్నది. ముల్లోకములయందలి సౌందర్యమును బల్లెవాండ్రు సముద్రములోఁ గొన్ని యోజనముల మేర వలలు పఱచి యామేరలోని చేపల నన్నిటిని నొక చోటికిఁ బ్రోగు చేసి వందపడవలనిండ నాచేపలను బ్రోవు చేసినట్లుతత్సౌందర్యమునంతయు నొక్క-చోటికిఁబ్రోవుచేసెడివాఁడను. ఆ ప్రోవు చేసిన సౌందర్యమునంతను స్త్రీగా మూర్తి కట్టించెడివాఁడను.

శ్రీము – అట్టిస్త్రీ లోకమునం దుండదు.

జయ – ఎందు కుండదు? పాండవుల భార్యయైన ద్రౌపది యటువంటిదట!

శ్రీము - కానచ్చును. కానిచో నామె పేర నంతటి మహాయుద్ధము జరిగియుండదు. సరే. ఆస్త్రీ లభించినతరువాత నేమి చేసియుందువు?

జయ - (వికారముగా నవ్వుచు) ఆమెతోడి తొలి రాత్రిప్రథమసంగమమునందు నామహానంద మనుభవించుచు నాయనుభూతివిశేషమును మనసా గుర్తు పెట్టుకొని వెంటనే కత్తి పెట్టి పొడుచుకొనిచనిపోయియుందును. అది తన్నిమేష పరమార్థము. అది జీవితానుభవపరమార్థము.

శ్రీము - నీవు చెప్పినది చాల బాగుగా నున్నది. నిజమే. మఱునాఁటిరాత్రియందుఁ దొలినాఁటిరాత్రియందలి నూత్నతావైశిష్ట్యము లేదు. కాని మఱియొక వినూత్నత కలదు.

జయ - రెండవనాటిరాత్రివినూత్నత యచ్ఛమయిన అనుభవములోని భాగము కాదు. పరిచయము పెంపొందించు కొన్న కొలది మనస్సుచేత నూహ చేసి తెచ్చికొన్న కృత కానుభూతి. మొదటిసారిదియే యచ్ఛమైన యనుభూతివిశే షము. తరువాతఁ దరువాతఁ బొందెడిది సుఖభ్రాంతి. మను ష్యుఁడు జన్మించుచున్నాఁడు. ఈశరీరము పంచభూతసమ్మేళ నము. ఈసమ్మేళనములో నొకక్రొత్తదన మున్నది. బ్రదికిన కొలంది జీవితము ప్రాతబడిపోవుటలేదా? తొలుతటి కొన్ని దినములలో క్రొత్తదన మున్న దనుకొందము. క్రొత్తదన మున్న దనుకొన్నదినములలో పూర్వాపూర్వమునం దున్న క్రొత్తదనము పరపరమునందు లేదుగదా? యాదార్థ్యమునకు దత్ప్రథమదినమందలి నూత్నత్వమే నూత్నత్వము. మొట్ట

మొదటిసారి దేసి ననుభవింతుమో యదియే జీవుఁడు శరీరముతోఁ బొందెడి విచిత్రానుభూతిలోని పరమరమణీయత. తక్కినది ప్రాతపడ్డదనము.

శ్రీము - ఐనచో నీవును నేనుగూడఁ దాదృగనుభూతి నుండి బాహిరింపింపఁబడినవారమే.

జయ - అది యేమి రాజకుమారా! తమరిభార్య లోకోత్తరసౌందర్యవతి యని చెప్పుదురు. తమ రామెను ప్రేమించి వరించిరని చెప్పుదురు.

శ్రీము - ఔనయ్యా! నే నాప్రథమరాత్రమునందుఁ దత్సుఖానుభూతివేళ మరణించలేనుగదా? పోసి. ఏదియో యొకవిచిత్రమయిన యనుభూతివేళ మరణించినచో నీజన్మ కది చారితార్థ్య మగునుగదా?

జయ - అది యేమిమాట. మీరు వేదములు వేదాంగములు చదివినవారు. చాతుర్వర్ణ్యమును రక్షింపదగినవారు. ఆంధ్రదేశప్రజలు మీమీఁద నాశ పెట్టికొనియున్నారు. మీతండ్రి వృద్ధుఁడై యున్నారు. రాజ్యము మీ కప్పగించి వానప్రస్థాశ్రమమునకుఁ బోఁదలంచియున్నారు. రాజకుమార! మనుష్యుల జీవితములు రెండువిధములు. ఒకటిస్వార్థపరమయిన జీవితము. రెండు పరార్థ మయినది. రాజుల జీవితములు పరార్థపరము లయినవి. వారిమీఁద వారికి స్వాతంత్ర్యము లేదు.

శ్రీము - ఈ రెండువిథములయిన జీవితములలో నేది యుత్తమ మందువు?

జయ - నన్నడిగినచో స్వార్థమయిన జీవితమేజన్మకుఁ జరితార్థమైనది. కాని నేను బరార్థమయిన జీవితము గడపు చున్నాను. నా కిది యొకప్రతిజ్ఞ యైనది. ఈప్రతిజ్ఞ నాతో నంతమగునది కాదు. నాకొడుకున కీప్రతిజ్ఞ నే నందించవల యును. అందు చేత నాజీవితమునకుఁ జారితార్థ్యము లేదు. అట్టివిచిత్రమయిన యనుభూతియే చారితార్థ్యము.

శ్రీము - యోగులు బ్రహ్మవేత్తలు నొకవిశిష్టమైన యనుభూతిని బొందుదురని విన్నాముగదా. అదికదా చారి తార్థ్యము.

జయ - అది యొకానొకజన్మయొక్క చారితార్థ్యము లేదు. జన్మకు సహజమయిన చారితార్థ్యము కాదు. శరీరాను భూతవైశిష్ట్యము సంపాదించుటచేత వచ్చిన చారితార్థ్యము కాదు. పలుజన్మలు లేకుండఁ జేసికొనునది. ఆచైతన్యమునకు నీజన్మలకు నీశరీరములకు నేమియు సంబంధము లేదు. ఒకవేళ వారిసిద్ధాంతము లంగీకరించినచో నేదియో యొకవిచిత్రమైన యనుభూతిని బొందవలయు ననియేకదా యీశరీరమును ధరిం చుట. ఈశరీరమును ధరించినప్పు డేతచ్ఛరీరగతపంచభూతస మ్మిశ్రణజనితబహ్వాణుపరామర్శబర మార్థభూతమైన యను భూతి యొకఁ డుండవలయును. దానికిని బ్రహ్మజ్ఞానమునకును సంబంధము లేదు. ఇంతకుముందు చెప్పితి నే. ఈజలపాతము వలన నీలోయయంతయు శిశిర మయినది. ఈలోయలోతట్టు శిలాఖండముల యంతర్భాగము శిశిరమయినది. తదంతర్వర్తి యైన పృథ్వీపదార్థము తడిసి యేవిచిత్రమయిన యనుభూతిని

బొందుచున్నదో మనకుఁ దెలియదు. తదనుభూతిఫలితము తదావిర్భావము ఘూసాదులు నోషధులు. ఏతదావిర్భూతి పూర్వరూపమయిన యీశిశిరతమ్మృత్ పదార్థమునందలి భిన్నాణువులలోపల నొకయవిదితమయిన సంచలన మున్నది కదా. అది నిజమయిన శరీరధారణమునందలి శరీరగతపంచ భూతాణువులు కదలిక గాని కదలిక పొంది పొందఁగలయను భూతి. అట్టియనుభూతిని బురుషుఁడు దాను మనసా ప్రేమించిన లోకోత్తరసౌందర్యవతియొక్క ప్రథమసమాగమము నందుఁ బొందును. తనకుఁ బరమవిరోధియైన శత్రువుయొక్క శిరస్సు ఖండించిన నిముసములోఁ బొందును. లేదా ప్రజ్వలించుచున్న మహాగ్నికుండము దూకుచున్నప్పుడు పొందును. లేదా యిటువంటి మహాజలపాతమువెంట నధఃపాతాళమునకుఁ దనశరీరమును వదలిపెట్టినచోఁ బొందును. ఈయనుభూతివంటిది యిదియే. మఱియొక యనుభూతి దానినిఁ బోలినది యుండదు.

శ్రీము – నీవు చెప్పినది చాలవినూతనమయిన సిద్ధాంతము. నీవు వ్యాసమహర్షి యంతటివాఁడవు. శ్రీకృష్ణదేవుని యంతటివాఁడవు.

శ్రీముఖుఁ డి ట్లనఁగా జయద్రథుఁడు చెవులు మూసికొని మొగము మోకాళ్ళమీఁదఁ బెట్టికొని కూర్చుండెను. ఆచెవులు మూసికొనుట శ్రీకృష్ణుల నామములువినుట నతని కిష్టము లేనట్లు ప్రదర్శింపఁబడలేదు. మరికొంత సేపటికి శ్రీముఖుఁడు జయద్రథా! ఈపాటికెఁ బ్రొద్దు వాటాటియుండవచ్చు ననుకొందును. పైకిఁ బోయి చూతమా యని లేచెను. జయ

ద్రథుఁడు రాజకుమారు ననుసరించెను. రాజకుమారునితోఁ బైకిఁ బోవుటకు జయద్రథున కిష్టము లేదు. అచట రాజపురుషు లెవ్వరో యుందురు వారికిఁ దాను గనిపించును. కాని తాను రా ననరాదు. కొంతదూర మనుసరించి దిగఁబడవలయును. కాని మనస్సులో నొకసందేహము కలదు.

జయద్రథునకు నాలుగేండ్లుగా శ్రీముఖునితోఁ డిరహస్యసంబంధము కలదు. అతఁడు శ్రీముఖునిఁ గాచి వదఁబోసినాఁడు. శ్రీముఖుని స్వభావములోని యెగుడుదిగుడులన్నియు నతనికిఁ దెలియును. శ్రీముఖునకుఁ బరమహాత్మవిషయము లన్నచో మిక్కిలి మమకారము. కాని యతఁడు సంప్రదాయబుద్ధి. క్రొత్తగా దేశమునందు వ్యాపించిన భగవద్గీతయు బ్రహ్మసూత్రములును బఠించినవాఁడు. వానిమీఁది క్రొత్త క్రొత్త వ్యాఖ్యానముల రుచిమఱిగినవాఁడు. ధర్మశాస్త్రములు నిర్ణయించిన జీర్ణములయిన మార్గములందు రేఖామాత్రమయిన వైదొలగనివాఁడు. కాని రాజలక్షణ మధికముగాఁ గలవాఁడు. సుఖానుభూతియందు మమకారము గలవాఁడు. సాహసకార్యములం దెక్కువ యిష్టము కలవాఁడు. జీవితమును దృణప్రాయముగాఁ బరిగణించువాఁడు. ఒక క్రొత్త విషయమును విన్నచో దానిని వెంటనే యనుభవమునకుఁ దెచ్చువాఁడు.

జయద్రథుని రాజపురుషులు చూడరాదు. శ్రీముఖుఁడు కొండపై కెక్కుచున్నాఁడు. జయద్రథుఁడు తటపటాయించుచున్నాఁడు. శ్రీముఖుఁడు వెనుకకుఁ జూచి తన్నను

సరింపుమని యూగినాఁడు. జయద్రధునకుఁ దప్పలేదు. కొండ పై భాగమునకు శ్రీముఖుఁడును జేరెను. చేరి జయద్రధుని రమ్మని నిలఁబడెను. జయద్రధుఁడు తప్పక యనుసరించెను. అతఁడు తనశరీరము కొండతట్టున నుండఁగాఁ దల పైకి నిగిడించి చూచెను. దూరప్రదేశమును బరామర్శించి పరికించి చూచెను. రాజపురుషుఁడు చాల దవ్వున నున్నాఁడు. ఎండ మిటమిట లాడుచున్నది. రెండుజాములు దాటి మూడవ జాములోని మొదటిసగము గడచుచుండఁగా నెండలలోని తైక్ష్ణ్యము విలక్షణముగా నుండును. కనులు కనిపించవు. దూరమునందలి మానిసి విస్పష్టముగా గనిపించఁడు. కనిపించుట కెండలలోని వెలుగుంగరా లడ్డము వచ్చును. మరియు నిర్వృక్షమైన శిలామయమైన ప్రదేశములందలి యెండలు కంటికాంతులను సూటిగాఁ బ్రసరించనీయక మళ్ళించుచుండును. అట్టిప్రదేశమునందు సన్నని నీటిపాయ యొకటి ప్రవహించుచున్నచో నెండలు నీళ్ళను గొట్టును. జల మెండల కెదురు తిరుగును. ఎండలు కల్లోలితము లగును. ఎండలయొక్క తరంగములు విలులితము లగును. తాదృశ విలులితాతపాపస్తరంగములలోఁ గంటికాంతులు సుడివడి చూపు చక్కగాఁ బ్రసరించదు. ఈరీతిగా నెండలు నీటితరంగములును గళవళపడు వెలుఁగుల దారులలో రాజపురుషుఁడున్నాఁడు. మఱియు జలపాత మగుచోట నీయాతపాంధస్సుల సంఘర్షణ మెక్కువ. తా నెవరో రాజపురుషుఁడు తొందఱగాఁ బోల్చుకొనలేఁడు. జయదధుఁడు శ్రీముఖుఁడును జలపాతము జరుగు ప్రదేశమునకుఁ బోయిరి.

రాజపురుషుడు రాజకుమారుని జూచెను. రాజకుమారుఁడని గుర్తుపట్టెను. గుర్తుపట్టె ననగా రాజకుమారుఁడచట నున్నాఁడని దెలియును. లోనికి దిగి పోవు ప్రదేశము దూరానికి గుర్తే. అచటినుంచియే యాయనయెక్కి వచ్చియున్నాఁడుఁ ఆయన ధరించిన దుస్తులు పరిచితములే. ఈ హేతువులచేత విస్పష్టముగా రాజకుమారుని మూర్తి భాసించకపోయినను రాజకుమారుని గుర్తుపట్టఁగలుగుట. ఆ రెండవవ్యక్తి యెవరు? జయద్రథుఁడని తెలిసికొనుట యెట్లు? జయద్రథునకు రాజకుమారున కంత పరిచయ మున్నట్లు చాలమందికిఁ దెలియదు. పైగా జయద్రథుఁ డచ్చటి కెట్లు వచ్చెను. పాతాళలోకమునందుండి యెవఁడైన నాగరాజు రాజకుమారుని దర్శింప వచ్చెనేమో. దూరానికి వ్యక్తి నల్లగా నున్నాఁడు. బక్కపలుచగ నున్నాఁడు. అతని నెక్కడో చూచిన ట్లున్నది. రాజపురుషుఁడు సాహసించి సమీపమునకుఁ బోవుటకు వీలు లేదు, మరియు నెండలు వారిద్దఱిమీఁద దిమ్మరించి పోవుచున్నవి. జలపాతము యొక్క పైభాగపు నీటిపెళ్ళలు విదల్చికొనుచు దూఁకుసంరంభములోఁ బృషత్పరంపరలు తెల్లనిదయ్యాము తల విరియఁ బోసికొన్న ట్లుండెను. ఇంద్రధనుస్సులు విఱిగెను. విఱిసిన స్థితి వేఱు. విఱియఁబోయిన స్థితి వేఱు. విఱిసిన స్థితి నేత్రాభిరామముగా నుండును. విఱియఁబోయెడి స్థితి లోచనకాంతి ప్రతారణముగా నుండును. హరికార్ముకములు విరియుట కాతపముల ప్రశాంతి కావలయును. ఇచట నాతపముల ప్ర

శాంతి లేదు. హారికార్యమ్మకములయొక్క ప్రథమదశయున్నది. ఆస్థితిలో జయద్రథుఁ డెవ్వరో రాజపురుషున కంతు పట్టుట లేదు.

ఇద్దఱును రెండుగడియలసేపు జలపాతముఖమునందుఁ గూర్చుండిరి. శ్రీముఖుఁడు స్నాన మాడుదమా యనెను. ఇద్దఱును దుస్తులను దీసివేసిరి. సరిగాఁ గొండయంచునజలము క్రిందికిఁ బడఁబోవుచోటఁ బడుచున్నచోట స్నానము లాడు చుండిరి. జలపాతముయొక్క వెడల్పు చాలఁ దక్కువ. ఒక పురుషుఁ డందుఁ గూర్చుండి చేతు లడ్డము పెట్టి ధార నడ్డ గించవచ్చును. పురుషుని వెనుక జలము పడె గట్టి నీరు నిలిచి యతని భుజములపైనుండి దొరలిపోవును. రెండుగడియలు తీవ్రాతపముల నైశిత్య మనుభవించిన వారిశరీరముల కా చల్లనినీరు పరమసుఖము నాపాదించెను. శ్రీముఖుఁ డి ట్లనెను. నీవు చెప్పిన శరీరసుఖపారమార్థ్యము ననుభవింప వలయునని యున్నది. ఈధారవెంటఁ గ్రిందికిఁ బోయెదను. జయద్రథుఁడు వల దనెను. శ్రీముఖుఁ డభిలాష నధికాధిక ముగాఁ బ్రదర్శింపఁ జొచ్చెను. జయద్రథుఁ డధికాధికముగ వారించెను. ఆతనిచేతులు పట్టుకొని వెనుకకు గుంజెను. శ్రీ ముఖుఁ డుపసంహారించినట్లు నటించెను. అతఁ డభినయించు చున్నాఁడని జయద్రథునకుఁ దెలియును.

మఱియుఁ గొంత సేపు గడచెను.

అపుడు జయద్రథుఁడు లేచి దుస్తులు ధరించి కొండ లోయలోనికి దిగిపోయెను. జయద్రథుఁడు కొండలోయలోనికి

నాపాటికిఁ బూర్తిగా దిగిపోయియుండునని యనుకొన్నంత కాలములో శ్రీముఖుఁడు బయలుదేరెను. వెలికి వచ్చి దుస్తులు ధరించికొనుచున్నవాఁడు మరల దుస్తులు తీసి నీటి లోనికి దిగినాఁడు.

ఆపాటి కెండలు కొంచెపు దూరప్పుచూ పానవచ్చు చుండెను. రాజపురుషునకుఁ గొంత విస్పష్టముగాఁ గనిపించు చుండెను. ఆరెండవపురుషుఁ డెవ్వఁడో వెడలిపోయెను. రాజ కుమారుఁ డొక్కఁడే యుండెను. అతఁడు మరల స్నానము చేయుటకు దిగెను. నీటిధారలోఁ గూర్చున్న రాజకుమారుడు రాజపురుషునకు సరిగాఁ గనిపించలేదు. రాజపురుషున కేది యో సందేహము కలిగెను. అతఁడు జలము పడుచున్న ధార కడకు వచ్చుచుండెను. రాజకుమారునకుఁ గొంత దగ్గఱగా వచ్చెను. శ్రీముఖుఁడు ధారవెంటఁ బడి పోయెను. రాజపురు షుఁడు పరుగెత్తుకొని వచ్చెను. తానుగూడ ముందువెనుకలు విచారించకుండ ధారవెంట దూకెను.

---

## ౨

ఆకొండమీఁద నర్జునుఁడు శివునిగూర్చి తపస్సుచేసె నని కొందఱందురు. ఆయన తపస్సు చేసినది హిమాలయ పర్వతములలో. ఇచ్చట గాదని కొందఱు. ఇంతకుఁ దపస్సు చేసెనని చెప్పఁదగిన కాలము నాటికి సుమారు నూటయేబది సంవత్సరములక్రిందట. పాండవుల యరణ్యావాసములో

సగము గడచినతరువాత ననుకొందము. అది యేఁడేండ్లు. ధర్మ రాజు రాజ్యము చేసినది ముప్పదియాఱేండ్లు. పరీక్షిత్తు రాజ్యము చేసినది యఱువదియేండ్లు. ఇప్పుడు జనమేజయ మహారాజు పాలించుచున్నాఁడు. ఇంకను నూటయేబది యేండ్లు పూర్తియైనదని చెప్పుటకు వీలు లేదు. అప్పుడే ప్రతీతులు బయలుదేఱినవి. నిజాని కాయూరిలో భారతయుద్ధము నాటికి బ్రతికియున్న కొందఱు కలరు. వారి కప్పుడు చిన్న తనము. ఇప్పుడు వారు వృద్ధులు. నూటయెనుబదియేండ్లు నూటతొంబదియేండ్లనుండి బ్రదికియున్నవారు. వారిలో నొక వృద్ధుఁడు నిశ్చయముగా నీకొండమీఁదనే తపస్సు చేసెనని చెప్పుచుండును. నాచిన్నప్పుడు నే నొకసారి కొండమీఁదికిఁ బోయితిని. అచట నొకాయన కూర్చుండి జపము చేయుచుం డెను. ఆయనప్రక్కనే విల్లంబులు కలవు. నీ విచ్చటి కెందుకు వచ్చితివి వెళ్ళిపొమ్మని కసిరెను. ఆయనయే యర్జునుఁడు. నాకుఁ దెలియునని చెప్పుచుండును. ఆకొండ నంటి కృష్ణా నది ప్రవహించుచున్నది. ఆకృష్ణానది చంద్రభాగానదికి రెండుమూఁడురెట్లుండవచ్చును. రెండువైపుల కొండలు. కొండలను కృష్ణానది భేదించి ప్రవహించుచున్నదని చెప్ప వచ్చును. వర్షకాలములో నీమహానది కొండల కెగువ మహా సముద్రమని చెప్పవచ్చును. కొండలకు సగముమట్టమువఱకు జల ముండును. కొండలనడుమనుండి దిగువకుఁ బ్రవహించు నీరు నిలువయున్న నీటిప్రమాణమునకు సరిపోదు. అందుచేత నీయింద్రకీలపర్వతముకడనుండి వేదాద్రివఱకు నది యొక మహాసముద్రముగా నుండును. వేసంగిలోమాత్రము జలము

సన్నగిల్లును. ఏయేటి కాయేఱు కృష్ణానదీప్రవాహము కొండ లను గోయుచున్నట్లు కనిపించును. అందుచేతఁ బైనున్న కృష్ణానదీ ప్రవాహముయొక్క వెడల్పు యోజనముమేర యుండును. ఈయింద్రకీలపర్వతముయొక్క యెగువ నాల్గు యోజనములకుఁ బైన నదీప్రవాహమునకు దక్షిణదిశయందు నాంధ్రరాజధాని కలదు. రాజధాని యనినంతనే పెద్దపట్టణ మని భ్రాంతి కలుగ వచ్చును. అది మహానగరము కాదు. మఱియుఁ జిన్నపల్లెవంటిది కాను. ఎక్కువభాగ మచ్చటి జనము రాజు రాజవంశము తదాశ్రితులు కొంత సేనయు, ఈరాజధానికి మఱియు నెగువను గొంత దిగువను వరుసగాఁ గొన్ని పల్లెటూళ్ళు కలవు. ఆదేశము సుభిక్షమయిన దేశము. కృష్ణానదీజలము సర్వస్తువులయందు సమృద్ధిగా నందుబాటు లోఁగల స్థలము, పొరలివచ్చు ప్రవాహమునకు నడ్డకట్టలు వేసి పొలాలకు మళ్ళించుకొందురు. నది తీయునపుడు కొంత మేర జలము మళ్ళిపోకుండఁ గట్టలు కట్టి నిలువచేయుదురు. ఈపల్లెటూళ్ళన్నియు వరిధాన్యమే పండించును. ఒకవంద విధములైన వరిపంట పండును. ఆంధ్రదేశము ధాన్యపు రుచి మఱఁగి యాసేతుశీతాచలము నాంధ్రరాజధాని చుట్టుపట్ల నున్న యీబియ్యమును వెల యెంత పెట్టియైనఁ గొందురు. ఆనాఁటి యాంధ్రదేశము రెండు వస్తువులకు ప్రసిద్ధ మాయె నది. మొదటిది బియ్యము. రెండవది తమలపాకులు. కృష్ణా పినాకినీనదులవడుమ సముద్రతీరమునఁ గొన్ని గ్రామములు కలవు. అచట నాగవల్లీవనీసంతానము తుదికవటాకుల కదలిక చేతఁ గామధేనువులు బెదరుచూపులు వేలార్చిన ట్లుండును.

జనమేజయమహారాజు ప్రతిదినము తెలుఁగుదేశపుఁ దమలపాకులఁగాని సేవించఁడని ప్రతీతి. శ్రీకృష్ణదేవుఁడుకూడ నిత్యమాంధ్రదేశపుఁ దమలపాకులనే సేవించెడివాఁడని చెప్పుదురు.

ఆరాజధానిపేరు ధాన్యకటకము. ఆపే రారాజధానికి సహజముగా వచ్చినది. ఆంధ్రదేశ మీరెండుపంటలకు నెట్టి ప్రశస్తి పొందినదో ఖడ్గవిద్యయందుఁగూడ నట్టిప్రశస్తి పొందినది. ఆకాలములో ననఁగా నిప్పటి కయిదువేలయేండ్లకుఁ బూర్వ మొక్కొక్కదేశ మొక్కొక్కవిద్యయందుఁ బ్రసిద్ధి పొందినదిగా నుండెను. ద్వారకానగరప్రాంతమున గదాయుద్ధముయొక్క ప్రశస్తి యెక్కువ. ఆప్రాంతముల గదాయుద్ధప్రవీణు లెక్కువమంది యుండెడివారు. ఆవిద్యలో పాటవము సంపాదింప నెంచినవారు ద్వారకానగరము పోయి నేర్చుకొనెడివారు. హస్తినాపురప్రాంతములయందు విలువిద్యలో నేర్పెక్కువ. ఆంధ్రదేశమునందు ఖడ్గవిద్యానైపుణ్యము మిక్కుటముగా నుండెడిది. ఖడ్గవిద్యానిపుణు లందఱు రాజాశ్రయముకొఱకు రాజధానికిఁ జేరుదురు. రాజు వారందఱి నాదరించును. ఆంధ్రరాజధాని ఖడ్గవిద్యానిపుణులకు నివాసభూమి యని చెప్పవచ్చును. గోదావరీపినాకినీతీరభూములయం దెచ్చటెచ్చట ఖడ్గవిద్యానిపుణు లున్నను వారందఱు రాజధానికే చేరుదురు. ఆంధ్రసైన్యము ఖడ్గవిద్యానిపుణము. ఆంధ్రులయొక్క పదాతిసైన్య మనఁగాఁ బొరుగురాజ్యములకు భయహేతువు.

సామాన్యముగా నాయాంధ్రప్రాంతములయందుఁ దత్తదా యుధవిద్యలకుఁ బ్రశస్తియున్నను దత్సర్వవిద్యానైపుణ్యము రాజవంశములోనున్న యొకరిద్దఱియందు మూర్తీభవించి యుండెడిది. ఏల యనఁగాఁ దద్విద్యామహానిపుణులచేత రాజు రాజకుమారులను శిక్షింపించెడివాఁడు. పరమేశ్వరదత్తమయిన ప్రతిభచేత నందులో నొకఁడు మహాప్రవీణుఁడై నుతి కెక్కెడివాఁడు. ద్వారకలోఁ బూర్వము బలరామదేవుఁడు గదాయుద్ధనిపుణుఁ డగుటకు హస్తినలోఁ గర్ణార్జునులు ధనుర్విద్యానిపుణు లగుటకు నీసంప్రదాయ మొక హేతువు. అట్లే యాంధ్రరాజవంశములోఁగల రాజకుమారు లందఱు ఖడ్గవిద్యానిపుణులు. వారిలోఁ బరమనిపుణుఁడు విజయసింహుఁడు.

విజయసింహుఁడు శ్రీముఖుని తమ్ముఁడు. వారు మువ్వు రన్నదమ్ములు. శ్రీముఖుఁడు, విజయసింహుఁడు, నాగార్జునుఁడు. ఈవిజయసింహుఁడు ఖడ్గవిద్యలో మహానిపుణుఁడు. ఖడ్గవిద్యలో నాతనియంతవాఁ డాసేతుశీతాచలము లేఁడని చెప్పుదురు. ఈప్రభకుఁ గారణమున్నది. ఖడ్గవిద్య యాంధ్రదేశములో నున్నంత గొప్పగా మరియొకదేశములో లేదు. ఆంధ్రదేశములోనున్న సర్వఖడ్గవిద్యానిపుణులు రాజధానియందే కలరు. వాఱందఱిలో విజయసింహుఁడు మహానిపుణుఁడు. కనుక నామాటకు విలువ కలదు.

ఒక్కొక్కవిద్యయం దొక్కొక్క యహంకారలక్షణము సన్నిహితమై యుండును. గదావిద్యయం దొకమోటు

తన ముందును. ఆవిద్యయందుఁ బ్రవీణు లయినవారు మదించిన గజములవలెఁ బ్రవర్తింతురు. వారికి వెనుక ముందు లేదు. కొండలనుగూడఁ బిండి కొట్టఁగలుగుదు మనుకొందురు. మదపుటేనుఁగు తామరకొలనులోఁ బ్రవేశించినట్లు శత్రువును సంహరింపఁగలుగుదురు. సంహరింపలేరు. ప్రవృత్తిమాత్రము మదగజప్రవృత్తి. ఇది గదాయుద్ధాశ్రయమయిన లక్షణము. ధనుర్విద్య యున్నది. అది నేర్చినవానియందుఁ దొందరపాటుండదు. గదావిద్యాప్రవీణుఁడు తాను శత్రువుకడకుఁ బోవును. ధనుర్విద్యాప్రవీణునికడకు శత్రువు రావలయును. గదావిద్యాప్రవీణుఁడు శత్రువుమీఁదికి దూకును. ధనుర్విద్యానిపుణుఁడు శత్రువు తనయమ్ముయొక్క లక్ష్యపుమేరకు రానెదురు చూచును. గదావిద్యానిపుణుని ప్రకృతి మత్తగజప్రకృతి యైనచో ధనుర్విద్యానిపుణుని ప్రకృతి పొంచియున్న పెద్దపులిలక్షణము. ఖడ్గవిద్యానిపుణుని పద్ధతి వీనికంటె వేఱయినది. వాఁడు త్రాచుపామునంటివాఁడు. ఒకలిప్తలోఁ గాటు వేయును. నిముసములోఁ దోకమీఁద నిలుచుండును. అమితవేగప్రకృతి. కాటు వేసినతరువాత నిస్సారపడిపోవును. ఆయావిద్యలయందలి నైపుణ్యము తద్విద్యాగతములైన యీ లక్షణములచేతఁ గాలక్రమమునఁ దద్విద్యా నిపుణునియందు నానాలక్షణములను బాదుకొలుపును. త్రాచుపామున కనవసరముగాఁ గోపము వచ్చును. దానికిఁ దాకిడి తగిలినచో బుస్సుమని లేచును. ఆతాకిడియొక్క స్వరూప మేమని విచారణ లేదు. తాను దేనిని కఱువఁబోవుచున్నదో తెలియదు. ప్రక్క నున్నది శిలాఖండము గావచ్చును. వెంటనే కాటు

వేయును. దానివిషాగ్నికి శిలాఖండము బ్రద్దలు కావచ్చును. దీనికోఅలు విఱిగిపోవనువచ్చును. ప్రకృతి దురతిక్రమణీయ మయినది. అభ్యాసవశముచేతఁ బ్రకృతి కానిదికూడఁబ్రకృతి గా మాఱును.

విజయసింహుఁడిట్టివాఁడయినాఁడు. అతఁడుమిక్కిలి యందగాఁడు, కాముకుఁడు, సులభకోపి, వేగరి. అతనికత్తిపో టెప్పు డెవనికిఁ దగులునో తెలియదు. ఎందుకుఁ దగులునో తెలియదు. ఫలశః త్రాచుపామునకుఖడ్గవిద్యానైపుణ్యమునకు విజయసింహునకు భేదమే లేన ట్లున్నది. అది యొక యవినా భావసంబంధముగా నున్నది. ఇతని యిట్టిప్రకృతి యతఁడు యువరాజు కాక వట్టి రాజకుమారుఁడగుట వృద్ధి పొందు టకు వీ లిచ్చినది. రాజకుమారుఁడగుట నిరంకుశత్వము ప్రబలినది. యువరాజు కాకపోవుటచేత బాధ్యత లేకపోయి నది. మత్స్యముఁడగుటచేత యథేచ్ఛావృత్తి కలవాటు పడి నాఁడు. తండ్రి కితనిమీాద శ్రీముఖునిమీాద నున్నంత శ్రద్ధ లేదు. తల్లి కితనిమీాద నాగార్జుననిమీాద నున్నంత ప్రేమ లేదు. తల్లిప్రేమ మిక్కిలి లేమికనుక నాగార్జుననివలెఁ జెడి పోవుటకు వీలు లేదు. తండ్రికి బిట్టు శ్రద్ధ లేమికనుక శ్రీము ఖునివలె ధర్మమార్గపుఁ బొలిమేరలలో నొదిగియుంచఁబడుట యుజరుగ లేదు. విజయసింహుఁడన్నచో నందఱకు భయము. అతనితో మాటాడునపుడు ప్రాణము లఱచేతిలోఁ బెట్టికొని మాటాడవలయును! అతనికి రాజధానియందే గాక యాసీమ సీమయంతయు స్వేచ్ఛావిహారముగా నుండును.

అంతకు నాల్గుదినముల క్రిందట శ్రీముఖునకు యువరాజ పట్టాభిషేకము జరిగినది. రోమపాదుఁడు రాజ్యపట్టాభిషేకమే చేసి తాను వానప్రస్థాశ్రమము స్వీకరింతునని చెప్పెను. శ్రీముఖుఁడు సుంతయు నంగీకరించలేదు. తనకు రాజ్యమే వలదనెను. తన్ను యువరాజుగా నియమించి తండ్రి మఱికొన్ని యేండ్లు పై పరామరిక చూచుచున్నచో శ్రీముఖుఁడు యువరాజ పట్టాభిషేకమునకు మాత్ర మంగీకరించెను. శ్రీముఖుని రాజును జేయవలయునని రోమపాదుఁడెంతయో యాశించెను. శ్రీముఖుని స్వభావము రోమపాదున కెంతయుఁ దెలియును. అందులో జలపాతమువద్ద జరిగిన సన్నివేశము రాజపురుషుఁడు విన్నవించెను. శ్రీముఖుఁ డిట్టి సాహస కృత్యముల కనుమతించుననియు నతనికి రాజ్యాభిషేకము చేసినచో బాధ్యతనుఁ బొంది యిట్టి సాహస కృత్యములకు దిగఁడనియు రాజభిప్రాయపడి యెట్లయినను రాజ్యము శ్రీముఖున కప్పగించి తాను దొలఁగవలయునని రోమపాదుఁడు భావించెను. రోమపాదునకు నూటయిరువదియేండ్ల వయస్సు. నిజముగా వృద్ధుఁడుకాలేదుగాని వార్ధక్యము రాలేదని చెప్పుటకు వీలులేదు. శ్రీముఖునకు నేఁబదిరెండవ సంవత్సరము. శ్రీముఖున కప్పగార్లు మువ్వురున్నారు. ముగ్గురు స్త్రీ సంతానము తరువాత వరుసగా రోమపాదునకు మువ్వురు పుత్రులు కలిగిరి. వారు నాల్గునాల్గేండ్లెడముగా జన్మించిరి. నాగార్జునకు వయస్సు నలుబది నాల్గేండ్లు.

ఈ యువరాజ పట్టాభిషేకమహోత్సవములు మూఁడు దినములు మహావైభవముతో జరిగినవి. అది నాలుగవ

దినము. ఆనాటిరాత్రి యొక యుత్సవముచేయుటకు రాజవంశములోనున్న యువకులందఱు నిర్ణయించికొనిరి. ఆరాత్రి పూట రాజవంశములోని యువకులందరు సమావేశమై తమ తమ ఖడ్గ విద్యానైపుణ్యమును యువరాజప్రీత్యర్థమయి నెఱపుదురు. ఈ యుత్సవములకు దూర దూరములందున్న రాజవంశీయులయిన యువకులందఱు వచ్చిరి. ఆనాటిరాజ్యస్థితి రాజు రాజధానియందుండును. రాజ్యమునందలి ముఖ్యప్రదేశములకు రాజవంశములోని సమర్థులయినవారిని, పాలకులగా నియమింతురు. వారందఱువచ్చిరి. వారిలోఁ గొందఱు పినాకినీ తీర గ్రామపాలకులు. ఒక పది గ్రామములు కలిపి యొక పాలకుఁడుగా నుండును. అట్టివారొక పదిమంది యుండిరి. మఱి పదిమంది పన్నిద్దఱు గోదావరీతీర గ్రామపరిపాలకులు. వారువచ్చిరి. రాజసేనలోఁ గొంతమంది సేనానాయకులు గలరు. వారును రాజవంశీయులే. వారునుండిరి. ఆనాఁడు భారతదేశసంపద పసువులమందలమీఁద నాధారపడియుండెను. ఈ మందలు విడియు ప్రదేశములకుఁ దొట్టుపట్లని పేరు. రాజ్యమునందిట్టి తొట్టుపట్లు పదిదాకఁగలవు. వానిలో నయిదారింటిమీఁద నధికారులు రాజవంశీయులు. వీరందఱు యువరాజాభిషేకోత్సవములకు వచ్చిరి. వీరితోఁ గనీసము పదిమంది యువకులు యువకులనుటకంటె బాలురనవచ్చును. కొందఱు బాలురు కొందఱు యువకులు కొందఱు కౌమారావస్థయందున్నవారు ఆనాఁడు ముప్పదియేండ్లు వచ్చువఱకు బాలకులుగానే చెప్పఁబడుచుండిరి. ముప్పదియేండ్ల మొదలు ఎనుబది యేండ్లవఱకు యౌవనావస్థయని చెప్పవచ్చును. అప్పటి

నుండి నూటయేబదిఏండ్లు దాటువఱకు గౌమారావస్థగా నుండెను.

ఈఖడ్గవిద్యానైపుణ్యప్రదర్శనోత్సవములందు సందఱు రాజవంశీయులే కాక కొందఱితరులయినవారు కలరు. వారిలోఁ గొందఱు విద్యాగురువులు కలరు. మఱికొంద ఱుత్తమ వర్ణములకుఁజెందినవారును గలరు. ఈవిద్యాప్రదర్శనము చీకటి పడినతరువాత నేర్పాటు చేయఁబడినది. అది శుక్ల పక్షము నాఁడు దశమి.

ప్రొద్దు గ్రుంకినంతనే వెన్నెలలు బిలబిలా చనుదెంచెను. అది శరత్కాలము. కృష్ణాశైవాలినీచితతరంగడోలికా విహారణశీలములయిన జ్యోత్స్నాతరంగములు కన్నుల నప్పళించుకొనుచుండెను. ఒడళ్ళయందుఁ బచ్చకప్పురపుసిరమును మెత్తుచుండెను. కంటికొనలయందు డాగురేకుల తళత్తళలు కనిపించుచుండెను. ఉత్సవములు మూనాళ్ళతో నైపోయినవి. ఇది పరిశిష్టోత్సాహ లక్షణము. ఈవిద్యాప్రదర్శనము కోటలో నేర్పాటు చేయఁబడినది. కోటలో నొకప్రత్యేకమయిన స్థలము గలదు. అది విశాలమయిన రంగభూమి. అది రాజకుమారుల శిక్షాస్థలము. సామాన్యముగా నిట్టిప్రదర్శనమునకు రా జంగీకరించడు. రాజకుమారులలో వివాదములు విలక్షణముగా నుద్భవించును. తొలుత సహృద్వ్యాపారముగా నారంభించును. ఏదియో యొకమలుపులోఁ దామసము చెలరేగును. కోపములు వచ్చును. అది జీవితాంతము కొనసాగు విరోధముగాఁ బరిణమించుటయుఁ గలదు. ఒకొక్కప్పుడు ద్వంద్వయుద్ధములకు నిట్టి సుహృత్క్రీడలు

హేతువు లగుటయు సంభవించినవి. ఈఖడ్గవిద్యావినోదము లీలగా రోమపాదునకుఁ దెలిసినను యౌవరాజ్యాభిషేకము చేసెఁ దనపెద్దబిడ్డయుక్క ప్రకృతి తాను సహజముగా నడుపు లోనికిఁ వచ్చునని యనుకొనిన రాజుమనస్సులోఁ గలిగిన శాంతి నీవిధి బరామర్శించలేదు. దానియందున్న దోష ములు నియమితములు కావు. యాదృచ్ఛికములు అందు చేత రాజు తూష్ణీంభావ మవలంబించెను. మఱియు నిప్పుడు శ్రీముఖునకు స్వయముగాఁ దెలియవలయును. ఈ సన్నివేశ మునందిట్టిదేదయిన సంభవించినచో శ్రీముఖునకే తెలిసి వచ్చును. తెలిసిరావలయును. అని రోమపాదుఁడు తూష్ణీం కృతిఁబూనెను.

ఆవిశాలమయిన ప్రదేశములో రాజవంశీయులయిన యువకులును రాజధానిలోని కొందఱు విద్యానిపుణులును సమావేశమైరి. వారే యందులోఁ బాల్గొనువారును. వారే ద్రష్టలు పాల్గొననివారు నల్గురైదుగురికన్న నెక్కువ లేరు. యువరాజొకఁడు, నిద్దఱు రాజవంశవృద్ధులును గలరు. వా రిద్దఱు వృద్ధులయినను యువకులు చేసికొను సర్వోత్సవము లందు వారు పాల్గొందురు. వారు నిర్వ్యాపారులు. ఒకాయన పేరు హరివర్మ. రెండవయాయన పేరు సహానుభూతి. వీరిద్ద ఱును నారాజవంశములో నొకవైలక్షణ్యముగల వ్యక్తులు. వారు గొప్పరాజకీయవేత్త లని సర్వశస్త్రవిద్యానిపుణు లని గొప్ప భావుకు లని విద్వాంసు లని ప్రతీతి. వారి నందఱు గౌరవింతురు. వా రెప్పుడు నేయుద్యోగము చేసినవారు కారు. ఏయుద్ధములయందుఁ బాల్గొన్నవారు కారు. ఎవ్వరితో

మత్సరించినవారు కారు. గొప్పపండితు లని ప్రసిద్ధియేకాని యేశాస్త్రచర్చయందు బాల్గొన్నవారు కారు. వారిద్దఱకు సంతానము లేదు. ఇద్దఱకుఁ బిత్ర్యములయిన యాస్తులు కలవు. సర్వరాజకార్యములందు సర్వరాజసభలయందు వారిని మన్నింతురు. వారిహితోపదేశముు స్వీకరింతురు.

వీరు కాక మఱియొకపురుషుఁ డున్నాఁడు. అతఁ డెవ్వరో యచ్చట సమావిష్టులైనవారిలో జాలమందికిఁ దెలియదు. తక్కినవారికి లీలగాఁ దెలియును. అతఁ డచ్చటి కెట్లు వచ్చెనో వచ్చుట కెట్లు వీలు పడెనో తెలియదు. కాని యందఱును శ్రీముఖునకుఁ దెలియకుండ రాఁడుగదా, యా యనే యామోదించినపుడు వానియచ్చటి యునికిలోని యోగ్యత తమ రేల పట్టించికొనవలయును. పట్టించికొన్నచో నది యువరాజునకుఁ గోపహేతువు కావచ్చును. అందుచేత నందఱు నూరకుండిరి. కాని యచ్చటనున్నవారిలో నొక్కరి కతఁ డచ్చట నుండుట యిష్టము లేదు. ఒకనికి మిక్కిలి యిష్టము. తక్కినవారికిఁ బట్టదు. అతనియచ్చటి యునికిని వివదించుటకును శక్తి చాలదు. ఆయిద్దఱును విజయసింహుఁడును నాగార్జునుఁడును. నాగార్జునుఁ డాక్రొత్తపురుషుని మిక్కిలి సౌహార్దముతోఁ జూచుటయు మన్నించుటయు నందఱకుఁ దెలియుచునే యున్నది. విజయసింహుఁ డాతనివంక చూడఁడు. అట్టిపురుషుఁ డొకఁ డచటనున్నాఁడని యభిజ్ఞ యే లేనట్లతఁడు ప్రవర్తించుచుండెను. తక్కినరాజకుమారులతనిని నాగార్జునుడు తెచ్చెననియనుకొనుచుండిరి. యువరాజునకుమతి లేకుండ నాగార్జునుఁడు తీసికొని రాఁడు. విజయసింహునకతఁ

డనభిమతుఁడుగాఁ గన్పించుచుండెను. నాగార్జునుఁడే యతనిని దెచ్చినచో విజయసింహుఁ డూరకుండఁడు. యువరాజుకూడ నతనిని మన్నించియుండవలయును. ఈభావములు సమావిష్టు యువకులలో వారిమనసులలో వారికిఁగలిగినది. కానిపై కెవ్వరు నుచ్చరింపలేదు. రాజవంశీయులుకాని యితరవిద్యానిపుణుల కతనిప్రసక్తియే బట్టలేదు. అతఁడు జయద్రథుఁడు. అతఁ డే దేశమువాఁడో తెలియదుగాని రాజవంశీయుఁడని యిచ్చటికి వచ్చెనని రాజుద్యోగ మీయలేదని ధర్మశాలయందుంచి యతిథిగా మన్నించుచుండెనని కొందఱికిఁ దెలియును. ఇంతే యతనినిగుఱించి తెలిసిన విషయము. అతని నిచ్చటికిరమ్మని పిలచినది యువరాజా! నాగార్జునుఁడా. యువరాజు పిలిచినచో నేమి యనుటకును వీలు లేదుగాని నాగార్జునుఁడు పిలిచినచో యువరాజు మన్నించుట చిత్రమే. యువరాజునకు జయద్రథు నకుఁగల చెలిమి యెవ్వరికిని దెలియదు. నాగార్జునునిలోనొక లక్షణ మున్నది. అత డితనిని పిలిచికొని రాకపోయినచో నతఁ డిచ్చటఁ గనిపించినంతనే నీ వెట్లు వచ్చితి వని యడుగును. నాగార్జునుఁ డడుగ లేదుగనుక యువరాజే తీసికొని వచ్చియుండును. ఇది విజయసింహునియూహ. అందుకనియే విజయసింహుఁ డూఱకుండెను. నాగార్జునుఁ డన్నచో విజయసింహునకు కొంత తిరస్కారము. అతఁడు చిన్నవాఁడని ముందు వెనుక లెఱుఁగనివాఁడని పెద్దతో వలెఁ బోవువాఁడని. కాని తనవిశృంఖలత్వమునుగూర్చి తా నెన్నఁడు భావించఁడు.

విజయసింహుఁ డెట్టివాఁడయినను నన్నగా రన్నచో మర్యాద గలవాఁడు. ధర్మ మన్నచో నభిమానము గల

వాఁడు. వైదికధర్మమునందుఁ బరమాదరము గలవాఁడు. అనాదినుండి యీనేలయందు రాముఁడు దైవము. రామాలయములు కలవు. వందయేండ్లనుండి శ్రీకృష్ణుఁడు దైవమైనాఁడు. భగవద్గీత ప్రమాణగ్రంథముగా స్వీకరింపఁబడుచున్నది. వ్యాసమహర్షి భారత మని యొకమహాగ్రంథమును వ్రాసెనఁట. అది వాల్మీకిరామాయణమంత గ్రంథము. ఆంధ్రదేశములోని కింకను రాలేదు. కాని యెవరో పండితులొకరిద్దఱుత్తరదేశములకుఁ బోయి దానినిగుఱించి విన్నవారు కలరు. ఈసర్వవిషయములయందు శ్రీముఖునివలె విజయసింహుఁడును విశ్వసించును. నాగార్జునుఁడు విశ్వసించునో విశ్వసింపఁడో తెలియదు. అతఁడేమాట చెప్పినను నవ్వి యూఱకుండును. విజయసింహుఁ డెంత తొందర మనిసియో నాగార్జునుఁ డంత నెమ్మది గలవాఁడుగాఁ గనిపించును. విజయసింహుఁ డెంత వైదికమార్గమునం దభిమానము కలవాఁడో నాగార్జునుఁడంత కాదని చెప్పుటకు నాగార్జునుఁడు తనయభిప్రాయముల నెవ్వరితోడను జెప్పఁడాయెను. తెలియు టెట్లు?

అందఱు మాటాడుచుండిరి. అందఱు నుత్సాహము ప్రదర్శించుచుండిరి. జయద్రథుఁ డేమియు మాటాడఁడు. ఉత్సాహమును ప్రదర్శించఁడు. అందఱును గ్రొత్త కనుకనటు లుండెనా లేక యది యతనిస్వభావమా. జయద్రథుని చూపులు నాగార్జునుని చూపులతోఁ గలిసినపుడు నాగార్జునునికనులు నవ్వుచుండెను. జయద్రథుని వదనమునందు వికాసము లేదు. రాజకుమారుఁడు త న్నట్లు చూచుటచేత మరి

యెవ్వఁడయినను గొంత సంతోషించకమానఁడు. అతనివదనమునం దావికాసము లేదు.

ఖడ్గవిద్యాప్రదర్శనము సమారంభింపఁబడినది. తొలుత నాఁటిలోని యితరవర్ణములవారిపోరాటములతోఁ బ్రారంభింపఁబడినది. కొంతసేపయినతరువాత గురుస్థానీయులైనవారిలోఁ గొందఱికొందఱి విద్యానైపుణ్యము ప్రదర్శింపఁబడినది. ఒకొకప్పు డిద్దఱే పోరాడుదురు. మరియొకప్పు డొకొక్కపక్షమున నిద్దఱుముగ్గురు చేరి పోరాడుదురు. మరియొకప్పు డొక్కనిమీఁదను నలుగురైదుగురు వొచ్చి పోరాడుదురు.

ఇట్లొకయర్ధయామము గడచెను. అప్పుడు పదిమంది రాజవంశీయులయిన యువకులు విజయసింహుఁడు తనవిద్యానైపుణ్యమును బ్రదర్శించవలయునని సూచన చేసిరి. శ్రీముఖుఁడు మందహాసముతో నంగీకరించెను. విజయసింహునివదనములో నంగీకృతి యెక్కువగాఁ గనిపించలేదు. నల్గురైదుగురడుగుటయు విజయసింహుఁ డూఱక యుండుటయు జరిగినతరువాత హరివర్మయు సహానుభూతియు విజయసింహు నడిగిరి. విజయసింహుఁడు తనవిద్యాప్రదర్శనము చేయవలయునన్నచో నెదిరి యెవ్వఁడు? అతనితో దీటయినవాఁడొక్కఁడే గలఁడు. అతనిపేరు నిరంకుశుఁడు అతఁడు దగ్గఱిరాజబంధువు

రాజవంశము లున్న వనఁగా రాజుయొక్క పెద్దకొడుకు రా జగును. తక్కినకొడుకులు రాజకుమారులు వారిసంతానము రాజవంశము. ఒక్కొక్క రాజవంశములో నైదాఱుతరములనుండి వచ్చు నిట్టిరాజకుమారుల సంతానము ప్రబలి

యుండును. వారిలోఁ బలువుంది రాజకీయోద్యోగములలో సైనికోద్యోగములలో నుండుచు వచ్చుచుందురు మఱియు రెండుమూఁడు తరములవా రయినచో వారు దగ్గఱిరాజబంధువులుగాఁ జెప్పఁబడుచుందురు. తాతాసహోదరులు తండ్రికిఁబినతండ్రిబిడ్డలు. ఇట్టివా రుందురు. వీరిలోఁ జాలమంది పరదేశములకుఁ బోయి రాజ్యములోననే దవ్వులకుఁ బోయి నివసించుచుందురు. కొన్నికుటుంబములు రాజధానియందే యుండును. వారు పరస్పరము దగ్గఱబంధువులుగాఁ బరిగణించికొందురు. ఈనిరంకుశుఁ డట్టివారిలో నొకఁడు. అతని తండ్రియు రోమపాదుఁడును సహాధ్యాయులు. కలిసి శస్త్రాదివిద్యలు నేర్చికొనిన వారు. అభ్యాసకాలమున నిరంకుశుని తండ్రి రోమపాదునికంటె నధికనైపుణ్యముకలవాఁడని సర్వజనాంగీకృతమయినవిషయము. అతనితండ్రి తనతనయునకు సర్వవిద్యలు నేర్పెను. అతనితండ్రియు రోమపాదుఁడును నేర్చిన విద్యలలో భేదము లేదు. ప్రదర్శించు నేర్పులో నున్నది భేదము. నిరంకుశున కీసంగతి తెలియదు. తనతండ్రి రాజుకంటె నెక్కువ ఖడ్గవిద్యావేత్త యని యభిప్రాయము. ఆవిద్యయంతయుఁ దనయందు సంక్రమించినది. పైగా విజయసింహునకుఁ దనకు ఖడ్గవిద్యాగురువు తనతండ్రియే. కాని యతనితండ్రి యతనిని ప్రత్యేకసమయములయందుఁగూడ శిక్షించుచుండెను. ఇది నిరంకుశునకు భ్రాంతిహేతువు. విజయసింహుఁడును నిరంకుశుఁడును సుహృద్ద్వంద్వయుద్ధమునందుఁ బూర్వము పెక్కుసారులు పాల్గొనిరి. విజయసింహుని చుఱుకుఁదనము నిరంకుశునియందు లేదు. విజయసింహుఁడు

సంప్రదాయేతరముగా నొకొకప్పుడు యుద్ధము చేయును. అది సంప్రదాయేతర మని విస్పష్టముగాఁ జెప్పుటకు వీలు లేదు. ఒకానొకని కొంకొక్క విద్యయందుఁగల ప్రతిభాసంపత్తి సంప్రదాయబద్ధమై సంప్రదాయేతరవిషయ మన్నట్లు భాసించి చర్చింపఁబడినచో సంప్రదాయబద్ధమయినదిగానే నిరూపింపఁబడును. దానినే ప్రతిభ యందురు. ఆప్రతిభ విజయసింహునకు ఖడ్గవిద్యయందుఁ గలదు.

వీరిద్దఱకు బాల్యమాది యంతర్మాత్సర్యము కలదు. పైగల బంధుత్వమర్యాద కెప్పుడును భంగము లేదు. వారి కంతర్మాత్సర్యములు గలవని వారిద్దఱికే తెలియును. విజయసింహుని ఖడ్గవిద్యా ప్రదర్శనప్రసక్తి వచ్చినవెంటనే యెదిరి నిరంకుశుఁడని యందఱకును దెలియును. విజయసింహుఁడు నిరంకుశునివంక నొకచూపు చూచెను. నిరంకుశుఁడు తిరిగి చూచెను. ఆచూపులు దక్కినయందఱకు సామాన్యముగాఁ గనిపించెను. వారిద్దఱియొక్క యంతర్మాత్సర్య మా చూపులలో నున్నది. దానిని జయద్రధుఁడు వెంటనే గ్రహించెను. వారిద్దఱు కాసెకోకలు బిగించి రక్తచందనాలంకృతులయి ఖడ్గములు పూని రంగావతరణము చేసిరి. అంతవఱకు నాల్గుదివ్విటీలు వెల్గుచుండెను. మఱినాల్గు వెల్గింపఁబడినవి. విజయసింహుఁడు తన కత్తిని డాలుమీదఁ గొట్టిమ్రోగించెను. ఆ మ్రోతలో నొక తిరస్కారమును జయద్రధుఁడు భావించెను. అంతకుఁ బూర్వము జయద్రధుఁడు సర్వ విద్యా ప్రదర్శనమును జూడనేలేదు. తన యచ్చటి యునికి తానే

యెఱుఁగడు. ఇంతలో నతనికి జాగ్రత్తకలిగినది. అతనిలోపల నున్న సర్వఖడ్గవిద్యాజ్ఞాన నైశిత్యము వానికన్నులలో వచ్చి కూరుచున్నది.

తొలుత నిద్దఱు కత్తిసాములోఁ దమ నేర్పు వెలయించుట ప్రధానముగా నెదురొకనుట యప్రధానముగాఁ గ్రీడించిరి. కొంతసేపటికి సులభములయిన కత్తిపోటులను డాళ్ళతో నొడ్డికొనుచు లఘులంఘనములచేత నివారించుకొనుచుండిరి. ఒక విద్యలోని ప్రాథమికవిషయములయందుఁగూడ సిద్ధహస్తుఁడయినవాఁడు ప్రకటించు చాతుర్యము విలక్షణముగా నుండును. అల్పశక్తిమంతులకదియే మహావిషయముగా ననిపించును. గడియగడియన్నరపాటు వారిద్దఱు తమశరీర లాఘవమును విద్యాపాటవమును బ్రదర్శించిరి. ఇంతలో నిరంకుశుఁడు పొడిచిన యొకపోటు సుహృద్యుద్ధలక్షణము నతిక్రమించినట్లు కనిపించెను. విజయసింహుఁడు దానికి వెంటనే సమాధానమిచ్చెను.

జయద్రథునకు వెంటనే యొకభావము కలిగెను. నిరంకుశుఁడు మర్యాదాతిక్రమణము చేయఁగలవాఁడు. అవసరమైనచో విజయసింహుని సంహరించుటకు వెనుదీయఁడు. మఱియు విజయసింహుఁడు శోకత్రొక్కిన త్రాచువలె ఖడ్గవిద్యయందు నిత్యవ్యగ్రుడు. ఏమఱుపాటుగా నతనికి ఖడ్గవిద్యలో నేమి చేయుటకును వీలులేదు. అంతటితో ఖడ్గయుద్ధము నిజముగా బ్రారంభమయినది. మాత్సర్యము పెరిగినట్లు కనిపించినది. విద్యాప్రదర్శనముకంటె జయాభిలాష యధికముగా భాసించుచున్నది. అరగడియసేపు కత్తుల తళ

త్తుల తప్ప మఱియొక్కఁడు కనిపించనట్లు కనులుమిఱుమిట్లు గొలుపునట్లు వారిరువురు రెండు కోడెత్రాచులు పెనవేసి కొన్నట్లు యుద్ధము సాగించిరి. ఖడ్గవిద్యాపాటవము దానియంద లి లాఘవము తెలియనివారికి వారిద్దఱు విడువడు మేరకు వారి శరీరములు రక్తమయములుగా నుండుననుకొనుట జరుగును. అదియేమియు లేదు. ఆ విద్యాస్వభావమే యటువంటిది. ప్రతిలిప్తయందు నొకనికత్తి మఱియొకని కంఠమునందో వక్షమునందో బాహువునందో పార్శ్వమునందో దిగఁబడఁబోవుచున్నట్లు కనిపించును. రెండవవాని తనూచాలన నైపుణ్యము చేత హస్తప్రసరణ చాతుర్యముచేత రెండవవాని కత్తియే మొదటివానికాపత్కారిగాఁ గనిపించును. అవియన్నియు నా విద్యలోని మెలఁకువలు. ఒక్కొక్కపద్ధతి కొక్కొక్కపేరు. ఒక ప్రయోగమునకు మఱియొక ప్రయోగము విఱుగుడు. ఇట్లిద్దఱరగడియసేపు తమ నేర్పంతయు వెలయించిరి. గురువులు సంతోషించిరి. హరివర్మయు సహానుభూతియు సెబాసనిరి. అంతసేపు జయద్రథుఁడు వారిలోని భేదమును గుర్తుపట్టుటకుఁ బ్రయత్నించెను. ఎవ్వరి యాధిక్యమును భాసించలేదు. విద్యానుబంధిగాఁ బరస్పరము పోరాడుచున్న మెలఁకువలలో దానికిట్లొడ్డుకొనుట. దీనికిట్లొడ్డుకొనుట మొదలయిన విద్యాపద్ధతులు జరిగినంతసేపు విస్పష్టముగా నెవరియాధిక్యమును జెప్పుటకు వీలులేదు. ఏకగురుముఖమునఁ జదివినవిద్య విద్యాధారమార్గమున నేకాకృతిగనేయుండును. ఈ యేకాకృతి భిన్నమగుటకు వారియందు స్పర్ధభాసించవలయును. స్పర్ధననుసరించి యొకరినొకరు గెలువవలయునన్న తీవ్రతపుట్టవలయును. ఆ తీవ్రత

పుట్టినపుడు విద్యాపరిజ్ఞాన సౌధముయొక్క సోపానము లొక దాని తరువాత నొకదాని నెక్కినట్లుండదు; పదిసోపానము లొక్కసారి లంఘించినట్లుండును. ఆలంఘించిన వేళ నెదుర్కొనుటకుఁ బ్రత్యర్థి పదునొకండు పండ్రెండు సోపానములు లంఘించినఁగాని సాధ్యపడదు. దానికిఁ బ్రతిభ కావలయును.

ప్రతి విద్యలో నొకక్రమముండును. ఆ విద్యలో నిష్ణాతుఁడైనను బ్రతిభారహితుఁడా క్రమమునే యనుసరించును. ప్రతిభావంతుఁడు క్రమరహితముగా సర్వప్రదేశములయందు నెచ్చటఁబడిననచ్చట హఠాత్తుగానైనసరే తాను మేల్కొన్నవాఁడయి ప్రవర్తించును.

పోరాటము జరుగఁగా జరుగఁగా నట్టిజాగ్రత్త విజయసింహునకున్నంత నిరంకుశునియందుఁ గనిపించలేదు. నిరంకుశుని యందొక వైశిష్ట్యమున్నది. క్రమపరిణామములోఁ బ్రతి విషయమునందు గాఢత్వము నధిక పరిచయము భాసించుచున్నది. విజయసింహునియందుఁ గ్రమపరిణామ రహితముగ దేనియందయినను సద్యోవ్యగ్రత భాసించుచున్నది. విజయసింహుఁడు హఠాత్తుగా నొకమెలఁకువను బ్రదర్శించును. అది తట్టుకొనుటకు నిరంకుశుఁడు సమర్థుఁడే కాని లిప్తైక దేశమునఁ గొంచెము వెనుకముందాడుట భాసించుచున్నది. అదితొలఁగినంతనే యిద్దఱును సమానులుగాఁ గనిపించుచుండిరి. నిరంకుశుఁడొకసారియైనను హఠాత్క్రమణము చేయుట లేదు. విజయసింహుడు చేయునవన్నియు హఠాత్క్రమణములే. అన్నింటికి నిరంకుశుఁడు తట్టుకొనుచున్నాఁడు. కానియట్టివాఁడు తన్నుఁదా రక్షించుకొనఁగలఁడుగాని శత్రువు నాక్రమించలేఁడు. కాని

నిరంకుశుని వెలయింపు నిస్సంశయముగా నధికశిక్షాఫలిత ముగా భాసించుచున్నది. నిరంకుశుఁడదియొక క్రమములో గాని తనకున్నపాండిత్యములోని లోతులను వెలయించలేకు న్నాఁడు. విజయసింహుఁడే లోతయిననుసరే యాకస్మికముగా నందికొనుచున్నాఁడు. అనుకోకుండ నొక విద్యారహస్యమైన మెలకువతోఁడి కత్తిపోటును జూపించుట నిరంకుశుఁడు చేయలే కుండనున్నాఁడు. తనతండ్రి యుపదేశించినక్రమము వానిబుద్ధి యందు రూఢమైయున్నది. విద్యను విద్యగా నేర్చికొన్నాఁడు. దానినిఁ దనదిచేసికొనలేదు. అప్పుడుగాని ప్రతిభ భాసించదు. ప్రతిభయనఁగా దాను నేర్చినవిద్యయందుఁగల సర్వదేశము నందుఁ బ్రత్యేక ప్రత్యేకోపాసనచేసి సాధించినట్లుగా నిత్య వ్యగ్రత కల్గియుండుట.

అది విజయసింహుని యందెందుకున్నది. నిరంకుశుని యందెందులకు లేదు. విజయసింహుఁడు రాజకుమారుఁడు, స్వతం త్రుఁడు. యథేచ్ఛముగాఁ బ్రవర్తించఁగలవాఁడు. నిరంకుశుఁడు రాజసేవకుఁడు. అతనికి స్వేచ్ఛతక్కువ. నిర్వర్తించవలసిన బాధ్యతలు కలవు. విజయసింహునకు నిత్యాభ్యాసముకలదు. నిరంకుశునకు లేదు. మఱియుఁ బరమసూక్ష్మముగాఁజూచినచో విజయసింహునకున్నంత శరీరలాఘవము నిరంకుశునకు లేదు. లేదనగా నెక్కడనో పైస్థాయిలో రేఖాకారముగాఁదఱు గున్నది.

మఱియు నిద్దఱిలో నింకొకభేదము భాసించుచున్నది. విజయసింహుఁడు కత్తిపోరాటము నొకహేలగాఁ జేయుచుం డెను. దానియందొక శ్రద్ధయున్నట్లు చూపించుటలేదు. తన

యిష్టమువచ్చినట్లు తన యవయవచాలనము చేయును. కత్తి విసరును. పెడకుఁదొలఁగించును. వెనుకకడుగువేయును. ముందు నకుదూకును. అన్నియునొకహేలగానున్నవిగాని శ్రద్ధాపూర్వకముగా నున్నట్లులేవు. నిరంకుశునియొక్క యివియన్నియు దీర్చిదిద్దిన విద్యాప్రదర్శనమువలె నున్నవి. దీనికిఁ గారణము వారి జీవలక్షణములయొక్క భేదమా? రాజ్యములోని వారి పరిస్థితులయొక్క స్థితులయొక్క యానుషంగిక ఫలితమా? నిరంకుశునియందొకభయము నెలకొనియున్నదా? నిరంకుశుఁడు మరియొకనితో యుద్ధమాడినచో నెటులుండును. అది చూచినఁగాని జయద్రథునకు నిరంకుశుని యథార్థ స్వరూపము తెలియునట్లులేదు. జయద్రథునకొక్కవిషయము విస్పష్టముగాఁదెలిసినది. నిరంకుశునకు విజయసింహుఁడు రాజకుమారుఁడన్న భయమో, విద్యాసంప్రదాయబద్ధత్వమో యతనిలో నున్నది. అదియేది?

## 3

రాజధాని కృష్ణానది కుడితట్టున. కృష్ణానది సముద్రాభిముఖముగాఁ బ్రవహించి హంసలదీవివద్ద సాగరసంగమము చేసినది. అచటినుండి యెడమతట్టున యోజనముదాటినమేర నొకప్రదేశము సస్యసమృద్ధిగలదేశము. చెట్లు చేమలునల్లుకొనియున్నవి. ఆ ప్రదేశమెటుచూచినను క్రోసుక్రోసునన్నర మేర. అందు దొరువులు చెఱువులు సమృద్ధిగాఁగలవు. నారికేళవృక్షముల వరుసలు పలుచోట్ల ప్రకాశించుచు నాప్రదేశ

మున కమితరామణీయకమును సమకూర్చుచున్నవి. కొద్ది రసాల వృక్షములుగలవు. వేఁపచెట్లుచింతచెట్లునెక్కువ. నడుమ నడుమ విశాలములయిన ప్రదేశములుకలవు. సమృద్ధిగాఁ బచ్చిక బయళ్లుకలవు. ఈప్రదేశమునకుఁ దూర్పుతట్టునఁజిన్ని చిన్ని పల్లెలుగా ననేకములయిన కుటీరములు నిర్మింపఁబడెను. ఒకటి రెండు పెంకుటిభవంతులు కూడఁగలవు. ఆచుట్టుపట్ల దేశము సారవంతమయిననేల. జొన్న రాగి మొక్కజొన్న సమృద్ధిగాఁ బండెడిదేశము. ఎటుచూచినను బదిపండ్రెండు క్రోసులమేర సర్వధాత్రియు నాంధ్రధరాపతిది. రాజుపక్షమున నుద్యోగులాపొలములయందుఁ బంటలఁబండింతురు. ఆ సర్వ క్షేత్రముల యందలి చొప్పదంటు వరి సర్వము నీసస్య శ్యామలమయిన ప్రదేశమునందు నిలువయుంతురు. అదిరాజు గారికున్న తొట్టుపట్టులలో నొకటి. అచటఁ గొన్ని వేలపశు వులుకలవు. ఎఱ్ఱావులు, తెల్లావులు, దోరావులు, దేహమం తయు నల్లగానుండి మొగము తెల్లగానున్నయావులు, మొగాన మచ్చలుగలయావులు, పొట్టివి, భారీయావులు పలువిధము లయిన గోవులసమూహములు తొట్టుపట్టునఁగలవు. గోపాల కులు సుమారు వందమంది గలరు. ఎఱ్ఱనిపగిడీలు తెల్లనిదోవ తులు కొంకికఱ్ఱలు నిత్యపరిశ్రమవశమున నయిన దృఢగాత్ర ములు గలవారు సతతరవికిరణస్పర్శ హేతుకశ్యామలీకృత దేహయష్టులు, పొడుగరులు నిత్యగోపాలనైకమతులు సంచ రించుచుండిరి.

ఒకనాటి ప్రొద్దున సూర్యోదయమైనది. ఉదయదంభో జాత బంధు మందారకుసుమసందోహారుణకిరణ సంతాన తం

తస్యమాన ధారుణీరుహ కిసాలయచ్ఛవిచ్ఛటాపరిదీప్తమైన యాప్రదేశము నాకబలి ముగ్గులు వెట్టినట్లుండెను. అవియొక వింత వెలుఁగులు ప్రసరించి యాలమందలు భౌమములయినవి కావు. ఇదిగోలోకమనిపించుచున్నది. ప్రాతఃకాల సమా యాతమందానిల సుందరతరంగ డోలికాకలిత క్రీడావిలాస పేశలములయిన ప్రాతర్వికసితకుసుమములు శిశువులవలె సుం దరమందహాస ప్రదర్శితాపరిమిత దంతకాంతి ప్రరోహమధుర హేలానిదానములుగాఁ గనిపించుచుండెను. సద్యోవికసిత పద్మశేఖరద్వార నిర్యియాసుమధుకర శిరోదర్శనముచేతఁ జూచుకముతోడి ముక్తకంచుకయైన ప్రౌఢయువతీ పరమరమ ణీయ వక్షోమండలమువలె సరోవరైక దేశములు భాసించు చుండెను. తద్గతోషఃకాల పతితహేమకణచారు శేఖరము లయిన ఘాసాగ్రము లరుణసూర్యకిరణచ్ఛటాసందీప్తములై శత్రుఁని బొడిచితీసినబాకు తుదిఁగల రక్తబిందువులవలె భాసిం చుచుండెను. కొన్ని కోడెదూడలు మోరలువంచి తోఁకలెత్తు కొని నాల్గుకాళ్ళుకలిపి దూకగలుగుట యభ్యాసముచేయు చుండుటను విడంబించుచుండెను. అయెగురుచున్న దూడల వంకఁ దల్లులుముట్టెలు వానివైపునకుఁద్రిప్పి యప్పుడేపగిలి దూదికనిపించు పచ్చిప్రత్తికాయలవంటి కనులతోఁ దదేక ధ్యానవివశములై యుండెను మూఁడుపాలదుత్తలు చేతఁబూని గోపాలకులితస్తతః ప్రచారపరిరమ్యమూర్తులు నెడమచేతు లలో బందపుఁ ద్రాళ్లుకలవారు ధెయ్, ధెయ్-అనుచుఁ బం డిన యావులమందనువదలి మెడపలుపులయొబిపిడికి గొంతులు తెగిపోవునోయన్నంత బిఱ్ఱుగాలాగికొను నాదూడల సడలిం

చుట బెట్టిదమయి కూర్చుండి దూడలను బుజములతోఁ గట్టు కొయ్యలవైపు త్రోయుచు వానిత్రొక్కిడివలనఁ దొఁలుత దీసినపాలదుత్త కొంచెమొడ్డిగిలఁగా నేలనొలికిపోయిన పాలకు దూడలను మోచేతులతో బాదుచుచు దుత్తలను దూరముగా నుంచి మరలఁ బలుపుముడియూడఁదీయఁ బ్రయత్నించుచుం డిరి. ఇంతలో వానితల్లులు తమజీవితపరమార్థమంతయు వానికిఁ బాలిచ్చుటేయన్నట్లు తత్పరమార్థ ప్రతీక్షాపరమములయిన నేత్రములతో నిలంబడి యుండెను. దూడలు పొదుగులలో ముట్టెలుపెట్టి రెండుక్రుమ్ములు క్రుమ్మెనో లేదో గోవులంతలోఁ గుండోధ్నులయ్యెను. బిడ్డకోసము గోవుచేపినవేళ నామె శరీరమునందలి పశ్చాద్భాగము వేల్పువీటియమృతపుశావి ప్రక్క సర్వజనపిపాసాపనయన దోహలమయిన చలువతాతి కుండులవలెనుండును. క్రమక్రమముగా సూర్యకిరణారుణ కాంతులు వళక్షచ్ఛాయలుగా విఱుఁగజొచ్చెను.

ఆతోఁటుపట్టు ప్రాగ్దిశనున్న క్రోసుమేరగల చదరుకుటీరములతో నడుమనొకచోట నొకభవనముకలదు. ఆ భవనమునకుఁ గుడివైపున విశాలమయిన ప్రదేశముగలదు. అదియేఁబది చదరపుగజముల వైశాల్యముగలపట్టు. దానిచుట్టున వరుసఁగా గొబ్బరిచెట్లుగలవు. నీటిబొండములు మొవ్వులలోఁ గనిపించుచున్నవి. ఆప్రదేశమంతయు సికతామయము. ఆయిసుకనేలయంతయుఁ గాలిత్రొక్కిళ్ళచేఁ గ్రుమ్మినట్లున్నది. ఆ ప్రాతఃకాలమున నందిద్దఱు కత్తిపోరాటము జేయుచుండిరి. అందులో నొకఁడు నిరంకుశుఁడు . రెండవయాతఁడు వృద్ధగోపాలురలో నొకఁడు. అతనిపేరు గంగు. అతనికి నూటపాతిక యేండ్లు

దాటియున్నవి. అతఁడు పాతికయేండ్లకుమున్ను ఖడ్గవిద్యా ప్రవీణులలోనొకఁడు. ఆచుట్టుపట్లఁ బలుమందికి ఖడ్గవిద్యా గురువు. అతఁడు తనజీవితమంతయు నాసముద్రతీరప్రదేశము లందేగడపెనేగాని రాజధానికిఁబోయి రాజాశ్రయమెఱింగిన వాఁడుకాఁడు. వాని బంధుగులును వానినేస్తులును గొన్ని యేండ్లు వరుసగా వానిని రాజాశ్రయమునకుఁబంపఁ బ్రయత్నించి ప్రయత్నించి విఫలురైయూరకుండిరి. అతనిపేరు రాజధానిలోఁ దెలియదు. సముద్రతీర దేశమంతయు వానిపే రెఱుంగుదురు. అతని శిష్యులు కొందఱు రాజసేనలోనుండి యితనిపేరప్పుడప్పుడచ్చటఁ జెప్పుచుందురు. అతనినిజూచి యెఱుఁగని జనులకతనిపేరు పేరుగామాత్రమే యున్నది. సైనికులలోఁ గొందఱతనిపేరెఱుఁగుదురు గాని సైనికాధికారు లెఱుఁగరు; రాజోద్యోగులెఱుఁగరు. రాజధానిలోనున్న ఖడ్గ విద్యావిశారదులెఱుఁగరు. నిరంకుశుఁడీతోఁట్టు పట్టున కధికారి గావచ్చి నాల్గయిదేండ్లయినది. అప్పుడప్పుడు గంగుపేరు వినుచునేయుండెను. అతనిని దనవద్దకుఁ దీసికొనిరమ్మని చాల సార్లువార్తలుపెట్టెను. గంగురాలేదు. అతఁడు స్వతంత్రుఁడు. అతనికిగొంత కొంద్రయున్నది. నల్గురు కుమారులుకలరు, వారునలువురును బరదేశములయందుండిరి. ఒకఁడు కళింగ రాజుసేనలోనుండెను. ఒకఁడు కాశ్మీరముననుండెను. ఒకఁడు చేదిదేశముననుండెను. నాల్గవవాఁడు సుహ్మరాజాస్థానమున నొకయుద్యోగి. కొంద్రపండినంతపండును. పదియావులుకలవు. కొడుకులంతోయింతో యప్పుడప్పుడు పంపించుచుందురు. అతఁడింటియందే కూర్చుండియుండును. అతనికి నూట

ముప్పదియేండ్లున్నను వానిశరీరసౌష్ఠవమేమియుఁ జెడలేదు. నిచ్చలును సాముచేయుచునే యుండును. అతనిభార్య వయస్సు డెబ్బదియేండ్లుండును. ఆమె మిక్కిలి వృద్ధురాలుగాఁ గనిపించును. తలయంతయు నెరసెను. ఒడలుముడుతలుపడెను. పొలము పాలంతయు నీమెయేచేయవలయును. ఇల్లామెయేతీర్చవలయును. గంగేమియుఁ జేయఁడు. ఉభయసంధ్యలయందు విశాలమైనదొడ్డిలోఁ గత్తిసాముచేయును. దొడ్డిలోనరఁటిచెట్లు కలవు, రెండుపొన్నమొక్కలుకలవు. అవియేయతని శత్రువులు. తనవిద్యయంతయు వానిమీఁదఁ జూపించుచుండును. ఆపొన్నచెట్లబోదలు తూట్లువడియుండును. ఆయరఁటిబోదెలలో నిటునుండి యటువైపునకు నెన్నిసార్లుకత్తులుదూరినవో తెలియదు. సహజముగా నీటితోనిండియున్న యాబోదెలకు నెత్తురు బైటికివచ్చుటకువీలులేదు. రక్తముపొడసూపకమున్నె తదంతర్జలసమావృతిచేత నెత్తురుపశమించునుగావలయును.

పదివార్తలకు బయలుదేరిరాని గంగుకొఱకు నిరంకుశుఁడు నాఁడు జాముప్రొద్దున్నదనఁగా రెండుక్రోసుల దూరము నడచిపోయి యతనినిలేపి తానుతానని యదలించి బెదరించి, బతిమాలి బామాలి వానినెట్లయినఁ దనవెంటఁగొనితెచ్చెను. నిరంకుశుని భావమిది. ఇతనియందు విద్యలోనేమి క్రొత్తమెలఁకువలుకలవు. ఈమెలఁకువలు రాజధానియందుఁ దెలియనివి. వానివద్ద విశేషములున్నచో నేర్చికొందము. నిజముగాఁ గొన్ని క్రొత్తమెలఁకువలున్నచో నవితాను నేర్చినపుడు తాను ధాన్యకటక గతఖడ్గవిద్యావిశారదులందఱికంటెఁ బై

చేయుఁగాఁ బ్రకాశించును. కాని నిరంకుశునకొక సందేహ మున్నది. తనతండ్రికంటె ఖడ్గవిద్యావేత్త మఱియొకఁడుండఁడు. ఆయనకుఁ దెలియని రహస్యములు పరులకుఁ దెలియవు. ఎచ్చటనో రాజధానికి దూరముగా సముద్రతీరముననొక పల్లెటూరిలోనివసించు వీనియందు విద్యాధిక్యము భాసించుననుట పొసఁగదు. కాని యాశయాశయే. మఱియు గంగునుగూర్చి యొక ప్రథగలదు. ఇతఁడు తనవిద్యను బహుదేశములయందు నేర్చినవాఁడని. రామఠదేశమున, గాంధారదేశమున, లంపాకదేశమున, బాహ్లికమున త్రిగర్తమున నితఁడు పలువోట్లఁబలు మందివద్ద శుశ్రూషచేసి విద్యనేర్చికొనివచ్చినాఁడఁట. రామఠులు లంపాకులు తీవ్రప్రకృతులు. వారియందాంధ్రదేశమున సంప్రదాయముకంటె భిన్నములయిన సంప్రదాయములు కలవని వినికిడి. ఈ యాశచేత గంగు గోపాలుఁడైనను దాను క్షత్రియుఁడయి గంగు తనవార్త నిరాదరించినను దా నధికారియై వినయమవలంబించి నిరంకుశుఁడీపనిచేసెను. గంగుఁగూడఁ దొలుతఁ దనయింటివద్దనే యభ్యాసము చేయుదమనెను. అది నిరంకుశునకు మర్యాదానష్టము. అందుచేతఁ దనతోఁటపట్టు వర్ణించి తానున్నప్రదేశముయొక్క రామణీయకమును వర్ణించి రంగభూమియొక్క రమణీయతయు వైశాల్యమును జుట్టుఁకొన్న కొబ్బరిచెట్లును నచ్చటఁగల దొరువులలోనిఁ నీళ్ళయొక్క మాధుర్యమును వందప్రజకుటుంబముల యుల్లాసమును వానికి నిరూపించి వానినిఁ దోడ్తెచ్చెను.

వారించుమించుగా రెండున్నర మూఁడుగడియలసేపు యుద్ధమాడిరి. తొలుత గంగు తాను నిలుచున్నచోటినుంచి

కదలనేకదలలేదు. నిరంకుశునకుఁ గోపమువచ్చెను. కాని యతఁడు దానిని సహించుకొనెను. తరువాత నతనిమీఁదికి యథేచ్ఛముగామూఁడు మెఱుపులు పడినట్లు పిడుగులు తీవ్రముగా వెలయించెను. గంగు కదలక తప్పలేదు. కాని తొలుతటి మాంత్రికమహిమను పూర్ణముగా విసర్జించలేదు. నిరంకుశుఁడు తనసర్వవిద్యాప్రదర్శనము చేసినగాని యతఁడు లొంగిరాఁడని తెలిసికొనెను. ఐదాఱుమెలఁకువలు కలవు. వానిని దనతండ్రి మఱియెవ్వరికిని చెప్పలేదు. తొలుతఁటినాళ్లలోఁ దనకొక్కనికే చెప్పెననుకొనెనుగాని తరువాత దరువాత వానిని దన తండ్రి విజయసింహునకుఁగూడ జెప్పెనని తెలిసినది. అవి రాజ్యమున మఱియెవ్వరికిని దెలియవన్నమాట విస్పష్టము. వానిలో నాల్గింటిని శత్రువు తప్పుకొనుటకే వీలులేదు. శత్రువు వానిసంగతిఁ దెలిసినవాఁడయినచో నొడ్డికొనవలయును. లేనిచో లేదు. ఆనాల్గుమెలఁకువలు శత్రువుమీఁదఁ బ్రయోగించినపుడు ఇదిగో దీనినిఁ బ్రయోగించుచున్నాను. చేతనైనచో నొడ్డుకొమ్మని శత్రువుతోఁజెప్పి ప్రయోగింపవలయునని తండ్రియాదేశము. ఆమెలఁకువలలో నింకొకవిశేషమున్నది. తక్కిన యెన్నిమెలఁకువలైనను గ్రీడాపరముగాఁ జేయవచ్చును. వీనిని గ్రీడాపరముగాఁ జేయుటకు వీలులేదు. చేతనైనచో శత్రువొడ్డికొనుట, లేనిచో నిస్సందేహముగాఁ దీవ్రముగ గాయపడుట.

నిరంకుశుఁడు వానిని గంగుమీఁదఁ బ్రయోగించుట యెట్లు? అవి వానికిఁ దెలియకపోయినచో నతఁడు నిస్సందేహ

ముగాగాయుపడును. అది తనకభిమతముకాదు. అదియొకవిచిత్ర మయిన కదలికతోఁ దీవ్రమయిన వేగముతోఁ బ్రయోగింప వలసిన ప్రయోగములు. క్రీడాలక్షణముగాఁ గత్తి యెదుటి వాని యెడలొత్తుకొనువేళఁ గత్తి వేగమును దగ్గించుటకు సాధ్యమైనవికావు.

నిరంకుశుఁడు గంగుతో నిట్లనెను. నేటికి మానివేయు దము. నేను నాఖడ్గవిద్యను నీకుఁ బ్రదర్శించవలెనని రాలేదు. నీవువయసుమీఱినవాఁడవు; లోకానుభవముకలవాఁడవు. పలు దేశములందు విద్యనేర్చినవాఁడవని విన్నాను. నీ వద్దనుండి క్రొత్తలు నేర్వవలయునని యున్నాను గాని నీకు నా విద్యా ప్రదర్శనము చేసి చూపింపవలయునన్న విడంబనతోఁగాదు. నీవు సానలుతీరినవాఁడవు. కాలుకదల్చవు. నా తీవ్రతకుఁ గొంచెము కదల్చితివి. నావయసులోనింత వేగముండుటయు నీవయసులో నంతనెమ్మది యుండుటయు సహజమైనవే. ఎవఁడో రాచవాఁడు పిలిచెను, బతిమాలెను. పోదమని వచ్చి తివి కాని నీవలన నే నేదయినఁ నేర్చికొనవలెనని ప్రవర్తించి తివికాదు. మఱియు నిన్నది నేనుదొలుతనడుగను లేదు. నేటికిఁ బలెనే రేపుదయమున మీయింటికి వత్తును. కలిసితిరిగివత్తము. నీకు మనస్సు మెత్తపడినచో నీదగ్గఱనున్న విశేషములు నాకు నేర్పిపెట్టుము. తరువాత నీ యిష్టము–అనెను. గంగు నవ్వి దొరా! నీ విద్యయంతయు నాకు జూపింపలేదుగదా యనెను. నిరంకుశుఁడు నివ్వెఱపోయెను. నావద్దగొన్ని రహస్యప్రయో గములుకలవు. అవి యీరాజ్యములో నాతండ్రిగారికొక్కరికే

తెలియును. నాకును దనకుఁ బ్రియశిష్యుఁడై రాజుగారి రెం డవ కొడుకయిన విజయసింహునకు మాత్రమేయవి నేర్పెను. వానిని నీమీాదఁ బ్రయోగించుటకు వీలులేదు. అవి ప్రయో గించినచో నీవు తట్టుకొన గలిగినచోఁ దట్టుకొనగలుగుట లేనిచోగాయపడుట. అందుచేత నేనవిచూపించలేను. మఱియు నిజమయిన శత్రువుతో యుద్ధమాడునపుడు వాని యాక్రమణ వైఖరినిబట్టి మననేర్చినవిద్యలో మూలమూలలనున్న చిన్ని మెలఁకువలు సద్యస్ఫూర్తిగా భాసించును. అవి యన్నియు నెన్నఁడు నెవ్వరికిని జ్ఞాపకముండవు. పెద్దవిశేషములని చెప్ప టకువీలుండదు. కాని ప్రత్యర్థిప్రయోగమునకు దిరుగు జవా బుగా నెఱపినపుడు తళుక్కుమని ప్రతిభాద్యోతకముగా నుం డును. దీనికి సామాన్యులు నివ్వెఱపోదురు. అట్టివేమైన నా యందుండియుండవచ్చును. కాని విద్యాదృష్టితోఁ బ్రధానము లైనవి నీకు జూపియున్నాను అనెను.

ఈ మాటలనుచున్నప్పుడు గంగు కత్తియుద్ధమునఁ దానుసిద్ధమయ్యెడు వేళ పంచారించిన పాగాయు నడుమునకు గట్టిన కాసెయు నూడదీయుచుండెను. అతఁడు మరల రంగ భూమికిఁబోదము. ఆ ప్రయోగములవైఖరి నేను దెలిసికొన వలయును. రెండుమూఁడు చిన్నిగాయములైనచో లెక్క యేమికాదు. పెద్దగాయములే యనుకొందము వచ్చిన నష్ట మేమి? శత్రువుతో యుద్ధమాడినపుడే గాయములు తగులును. మిత్రులతో నాడినప్పుడు కలుగవని యున్నదా? మన భారత దేశము వాయవ్యదిశయందుఁ జాలమ్లేచ్ఛదేశములు కలవు.

మీకుఁ దెలియునాయనెను. నిరంకుశుఁడు కొన్ని తెలియు ననెను. గంగిట్లు చెప్పెను. పది పదిహేను దేశములుగలవు. పారశీకుల దేశమున కెగువనొక సముద్రమున్నది. దానికి ఖాసాసముద్రమని పేరు. ఖాసాదేశమని యొకఁడున్నది. ఆదేశ మునకు నీసముద్రమునకు నడుమఁ దుషారదేశమని యొకఁడు కలదు. ఐనను నాసముద్రమునకు బేరు ఖాసాసముద్రమని వచ్చినది. ఈ ఖాసాదేశమునకు దిగువ మురవదేశముపైన మహాకేశ మహానాస దేశములు కలవు. ఆపైది మహానాస దేశము. అవి యన్నియు మ్లేచ్ఛదేశములు. ఆ మ్లేచ్ఛులొక విచిత్రమయిన జాతి. వారియందు నాగరకతలేదు. దేవాల యములులేవు. భక్తిలేదు. ఇచ్చట మనబ్రాహ్మణులు యజ్ఞ యాగాది క్రతువులుచేయుదురు. వారుచేయరు. మనుజులు మోటువారు. ఎప్పుడును ముక్కుమీద గోపమునుబెట్టుకొని యెదను. నిత్య సురాపానమత్తులు. పరలోకములున్నవని వారికిఁ దెలియునో తెలియదో వారట్టివారు. ఖాసాదేశపు రాజును రాజుఁగొడుకును యుద్ధమాడుచుండిరి. కొడుకునకుఁ దండ్రి నేర్పుచుండెను. తండ్రికి మోపయిన దెబ్బలుతగులు నేమోయని కొడుకునకులేదు. కొడుకునకుఁ దగులునేమోయని తండ్రికిలేదు. ఇంతలో వారికి గోపమువచ్చెను కోపమును నిగ్రహించుకొనుటయే వారికిఁ దెలియదు. యుద్ధమాడుచు యుద్ధమాడుచుఁ గొడుకును దండ్రి వెక్కిరించెను. వెక్కిరిం చుట యనఁగా జెప్పినది సరిగా గుర్తుపెట్టుకోలేవైతివని మా టాడుట. ఆ కొడుకు వెంటనే తండ్రిని బొడిచిచంపెను. వా రంత దుష్టులు. ఎందుకుఁజెప్పితిననఁగా మైత్రియుద్ధములోఁ

గూడ నొక్కొక్కప్పు డెగుడుదిగుడులు జరుగవచ్చును. నేను పెద్దవాఁడను. మీరు రాజవంశీయులు. నాకుఁ గొంచెముగాయమైనను తప్పులేదు. కనుక మీరా ప్రయోగములు నాకుఁ జూపింపుఁడు. నేను తెలిసికొందును. అని మరల రంగభూమి కవతరించెను. నిరంకుశుఁడాలోచించ నారంభించెను. అతఁడేవయినఁ గ్రొత్తవి చెప్పునేమోయని తానాశించుచుండఁగా నితఁడు తన సర్వరహస్యములను గ్రహించుటకు నెత్తులు వేయుచున్నాఁడు. తన రహస్యములు చెప్పినతరువాత నతఁడు తన రహస్యములు చెప్పునేమో! తన రహస్యము లతనికిఁ దెలియనీయవచ్చునా తెలియనీయరాదా? తనవద్దనున్న విశిష్టమయిన యారు ప్రయోగములలో రెండుతక్కువవి. నాలుఁగెక్కువవి. అందులో మూఁడు ప్రయోగములు చూపించి యప్పటి గంగుయొక్క పరిస్థితి విచారించి తక్కినవి తెలియజెప్పుటయో తెలియజెప్పక యుండుటయో చేయవలయును. కాని యిప్పుడు తటపటాయించినచో నతఁడనుమానపడవచ్చును. నిరంకుశుఁడు వెంటనే తానుగూడ రంగభూమి కవతరించుచు గంగూ! దానికి నీవు తోలుతటివలె నిశ్చలముగా నుండరాదు. మనమునిజముగాఁ బ్రత్యర్థులమన్నట్లు నటించి యథార్థముగా యుద్ధము చేయవలయును. అప్పుడుగాని నేను నానిని నేను జూపించుటకు వీలులేదు. నీవునాకన్నఁ జాలఁ బెద్దవాఁడవన్నమాట నిజమే అని కత్తిదూసెను. గంగుకూడఁ గత్తిదూసి సిద్ధపడెను. అంతటముసలివాఁడు బరిమీఁదఁ బాము తిరిగినట్లు తిరుగనారంభించెను. దాని విలక్షణమైన చంక్రమణమునకు లిప్తకాలముగూడ నజాగ్రత్త వహించుటకు నిరంకు

శునకు వీలులేకపోయెను. పెద్ద ప్రయోగములదాక నెందులకు. సామాన్య విద్య ప్రదర్శనము వేళలోననే ఖడ్గవిద్యలోని ప్రతి చిన్న విషయమే వాని విచిత్ర చంక్రమణముచేత మహా విద్యాగత విషయమువలెనే కనిపింపఁజొచ్చెను. నిరంకుశున కొక్క విషయము తెలిసెను. గంగువద్ద గనుపించుచున్న యీ విలక్షణమయి సౌదామినీ ప్రాయమయిన చంక్రమణ వైఖరి కొంత విజయసింహునివద్ద నున్నది. తనవద్దలేదు. అది విజయసింహుని యాధిక్యము. తనయొక్కయు విజయసింహు నియొక్కయు విద్యావైశారద్యము సమానమే. కాని యతని విచిత్ర చంక్రమణ వైఖరిచేత విజయసింహుని విద్య యధిక మైనదిగా భాసించుచున్నది. ఈచంక్రమణ దురానైపుణ్యము విజయసింహునిఁ దనకంటె నధికమైనవానినిగాఁ గన్పింపఁ జేయుచున్నది. విద్యసమానమైన దగుటచేత విజయసిం హుఁడు తన్నేమియుఁ జేయలేకుండెను. లేనిచోఁ దానెప్పుఁ డైన నతనికి వోగిపోవలసినవాఁడే. ఆ చంక్రమణ పద్ధతి తన యందులేదు. తాను విజయసింహుని గెలువవలయుననగా రెండేమార్గములున్నవి. ఒకటి తానంత చంక్రమణశీలి కావ లయును. అవి తనూలక్షణము జన్మస్వభావము. నేఁడది మాఱుటలేదు. శరీరలాఘవమునకుఁ దానెక్కువ ప్రయత్న ములు చేయుచునేయుండెను. కొన్నాళ్లాహారమే మానివేసి వట్టిగోక్షీరపాయిగా నుండెను. కొన్నాళ్లు సంసారము మాని వేసెను. ఆదినములలో శరీరమునకు లాఘవము సమకూడినను జంక్రమణరేఖాధిక్యము భాసించలేదు. దానివలనఁ బ్రయో జనము కనిపించలేదు. రెండవది విజయసింహుఁడెఱుగని

క్రొత్తవిద్య నేర్చుట. అప్పుడు విజయసింహుని చంక్రమణ మేమియుఁ బనిచేయదు. ఎదిరి యెఱుఁగని ప్రయోగములు నేర్చినవానికాధిక్యము నిశ్చయముగా సమకూడును. అందుచేత గంగువద్దఁ గ్రొత్త ప్రయోగములు నేర్చితీరవలయును. తానునొక గడియసేపు బెట్టిదముగా గంగుతోఁ బోరాడెను. మఱికొంతసేపు జరిగినచోఁ దానలసట పొందిపోవును. ఈ లోపుగనే తాను జూపించఁదలచుకొన్న మూఁడు ప్రయోగములు వానిని దృష్టిపఱచవలయును. అందుచేత రెండు నెక్కువ ప్రయోగములలో నొకదానిని దీని పేరిది యనిచెప్పి ప్రారంభించెను. తాను గుడివైపునకు లంఘించెను. లంఘించుట తడవుగాఁగత్తితోఁ బొడువఁబోయెను. గంగుడాలొడ్డెను. తల్లిప్తలోనే మరియుఁ గుడికిలంఘించి గంగునిస్సంశయముగా గత్తివిసరునన్నచోట డాలొడ్డి తానతని యెడమపాదము నఱుకుటకుఁ బ్రయత్నించెను. గంగునకీ ప్రయోగము తెలియునని తెలిసెను. నిరంకుశుఁడు మఱియుఁ గుడికి లంఘించినంతనే గంగు తాను మఱియుఁ గుడికి లంఘించెను. అప్పటికి నిరంకుశుని కత్తికి గంగుపాదములకు సంబంధముండదు. ఇది మెలఁకువయైన ప్రయోగమేయైనను బెద్దచెప్పికోఁదగినంత ప్రయోగముకాదు. మఱియింకొకఁడుకూడ నిట్టిదే. దాని లంఘనముకూడ గంగునకుఁ దెలియును. దీనిప్రయోగ దశాక్రమమును బ్రయోక్త చెప్పఁడు. దాని పేరును మాత్రము చెప్పెను. ఇందులోఁ గొన్ని పద్ధతులుకలవు. ఒకే ప్రయోగమునకు భిన్న దేశములయందు భిన్న నామములు కలవు. ఆ నామములు సంస్కృత భాషలో[illegible] కొన్ని[illegible]వు; మఱి

కొన్ని దేశభాషలలోనుండును. ఒకే ప్రయోగముపేరు కళిం గాంధ్రప్రాంతము లందొకటి, సింధుదేశప్రాంతములందు మరొకటిగా నుండును. తొలి రెండు ప్రయోగములు గంగునకుఁ దెలిసినతరువాత మూఁడవది యచ్చమైన యాంధ్రఖడ్గవిద్యా పరమరహస్యములలో నొకటి నిరంకుశుఁడు ప్రయోగించెను. అది బహువేగముతోఁ బ్రయోగింపఁబడఁదగినది. ఉద్ధృత చంక్రమణముచేత శత్రువుయొక్క డాలునుఁ దనడాలుతోఁ దాడించును. ఆ తాడనమునకు రెండుడాళ్లును క్రిందఁబడవలసి నదే. అదియొక విలక్షణమయిన తాడనము. ఆ పడుటలో శత్రువుయొక్కడాలు నేలమీఁద గుబ్బగాఁబడును. ప్రయోక్తది డిప్పగాఁబడును. ప్రయోక్త తనడాలును నేర్పుచేత శత్రువు యొక్క డాలుమీఁద గుబ్బగావేసి యా రెండు డాళ్ల చేతనైన యెత్తు ప్రదేశమునను లంఘించి చేతిలోనుండి డాలుజాతిపోయిన దిమ్మ వదలని యెడమచేతిమీఁదగొట్టుట. శత్రువుయొక్క కుడిచేయిపని చేయుచునే యుండును. శత్రువు యొక్క ఖడ్గ మతనిమీఁదికి వచ్చును. డాళ్ల మీఁది కెగురు టయు శత్రువుయొక్క యెడమచేయి నఱకుటయు శత్రువు యొక్క కుడిచేతికత్తి తనమీఁదఁబడకముందే మరల డాళ్ల మీఁదినుండి వెనుకకులంఘించుటయు. ఆసమయమున శత్రువు తనమీఁదికి దూకివచ్చుటకు డాళ్లడ్డముగానుండును. శత్రువు కొట్టినదెబ్బ డాళ్ల మీఁదఁబడును. ఆసమయములో శత్రువునకు ఆచేయినఱుకవచ్చును. ఈ ప్రయోగముయొక్క చాతుర్య మంతయు శత్రువుచేతిలోని డాలుక్రిందబడునట్లుతనడాలుతోఁ గొట్టెడి నేర్పులోనున్నది. దానికింత దూరమునుండి యింతటి

వేగముతో నొక కోణములోఁ గొట్టవలయును. ఆ కొట్టుటకు శత్రువు తన డాలునొక ప్రత్యేకపద్ధతిగా ధరించి యుండవలయును. నిరంకుశుఁడు గంగుయొక్క డాలు నారీతినాడించెను. గంగుడాలు క్రిందఁబడెను. కాని గంగుయొక్క యెడమచేయి దిమ్మువోయినట్లులేదు. తాను తనడాలును గంగుడాలుపైన గుబ్బగా వేసి దానిపై నెక్కఁబోవుచుండెను; చూచెను. గంగు చేయి దిమ్ములేదు. గంగుదూరముగా నిలుచుండెను. నిరంకుశుఁడు డాళ్ల మీఁద దాను నిలఁబడక దూరముగా నిలుచుండి నవ్వుచునిట్లనెను 'ఇదియొక ప్రయోగము. నాడాలు పల్లికవలెఁ బడవలయును. నేను దానిని నేర్పుతో నీడాలుపైన గుబ్బగా వేసితిని. ఈయెత్తైన స్థలమునందు నేనెక్కి యిట్టిట్లు చేయవలయును. ఇది ప్రయోగస్వరూపము' అని నిరంకుశుఁడనగా గంగు ముఖమునందొక వికాసమేర్పడెను. అతఁడిట్లనెను- "డాలునిట్లు తాడించి పడగొట్టుట మరియేదేశములోను నేను నేర్వనివిద్య. బాగుగానున్నది. ఈ తాడింపఁబోవునపుడు మీరింత దూరమున నిలుచుండితిరి. ఈ కోణములో సమీపించితిరి. అప్పుడు నా డాలీప్రమాణములోనున్నది. ఈ యెత్తున నున్నది." అని గంగు తనప్రయోగముయొక్క కొలతలు చెప్పెను. నిరంకుశుఁడాశ్చర్యపడెను. ఇది గంగున కిది వఱకే తెలియునా? కాని యీయర్ధనిమేషములో దాని వ్యవహారమంతయు నర్థము చేసికొనెనా? తెలిసినచో డాలుక్రిందఁ బడకుండఁ బట్టికొనెడివాఁడే. ఈ ప్రయోగము తెలిసినవాఁడయినచో శత్రు వాప్రయోగము నెఱపబోవుచున్నాఁడని గ్రహించినంతనే తనడాలు పట్టింకొనవిధముగాఁ ద్రిప్పును.

త్రిప్పలేదు కనుక గంగునకుఁ దెలియదు. అని నిరంకుశుఁడు నిర్ణయించి నవ్వుచు నిట్లనెను. నీ వీ విద్యలో నఖండుఁడవు. ఈ విద్యలో నెన్ని ప్రయోగములున్నను సర్వప్రయోగ వైఫల్యహేతువయిన యొక జాగ్రత్తకలదు. నిశ్చయము కత్తికి దూరముగాఁ దన శరీరమునుంచుట. కత్తి యెప్పుడెట్లు తిరిగి నను-ఇప్పుడిట్లు తిరుగునన్న నియమమెప్పుడును గలదు. తనశరీరము దూరముగానుంచుట. దిగ్భ్రాంతుఁడు కాకుండుట. శరీరమలసట పొందకుండుట. ఉద్రిక్తుఁడు కాకుండుట. ఈ లక్షణము లన్నియు నీవద్దఁగలవు. ఖడ్గవిద్యలోఁ దులాయుద్ధ మున నిన్నెవ్వఁడును నిర్జించలేఁడు. నావద్దనున్న విశేష ప్రయోగములు నీకుఁ దెలిసి లాభములేదు. నీకు ఖడ్గవిద్య వినోదము. శిష్యులకు నేర్పెడి విద్యగాని శత్రువులను సాధిం చుట కోసమయిన విద్యగాదు. నీవు పరదేశములయందు నేర్చిన నాలుగైదు క్రొత్త ప్రయోగములు నాకు నేర్పినచో నేను నీకొక విధమయిన శిష్యుఁడనగుదును. నేను రాజసైన్య ములో నొక సేనానాయకుఁడుగా నుండ వాంఛించుచుంటిని. రాజు న న్నీతొట్టిపట్టున కధికారిగా వేసెను. రాజును నా తండ్రియు సహాధ్యాయులు నేను సుఖపడవలయునని రాజు యొక్క యుద్దేశ్యము, కాని నాకిచ్చుటనుండుట యిష్టములేదు. నీవు నాకు నాల్గయిదు క్రొత్తప్రయోగము లీదేశములో లేనివి నేర్పిన నేను రాజునెదుట వానినిఁ బ్రదర్శించి యొక చమూపతి యుద్యోగము సంపాదించుకొందును-"అనెను. గంగు మాటాడక నిలుచుండెను అప్పటికి జామున్నర ప్రొద్దె క్కెను. ఎండ రివరివ లాడుచుండెను. వారియొద్దఁ గవచ

ములులేవు; గాని యంగీలుండెను. ఆ యంగీలు తడిముద్దలై యుండెను. రంగభూమిమధ్య ప్రదేశమున నెండ తీక్ష్ణముగా మండుచుండెను. వారి పాదములందు బిగించికట్టిన పాదరక్షల చేతఁగానిచోఁ గ్రిందనిసుక వేడియెక్కుచున్నదని వారికిఁ దెలిసియుండెడిది. గంగిట్లనెను-"ఇప్పటకే మిక్కిలి ప్రొద్దెక్కినది. నేను మరల రెండు క్రోసులమేర నడచిపోవలయును. నేను రెండు, మూఁడు క్రొత్తప్రయోగములు చెప్పుదును. అవి యీ దేశమునలేవు. కాని వానిని నేర్చికొనెడి పద్ధతివేఱు." అని గంగు నిరంకుశుని గృహసమీపమునందున్న రంగభూమి యొక్క యుత్తరపుటెల్లయైన నారికేళవృక్ష పంక్తియొక్క ఛాయా దేశమునకుఁబోయి తనపాగయుఁ గాసెయు నూడఁ దీయుచుండెను. అప్పుడెట్లును గంగు తనకుఁదన క్రొత్తవిషయములను జెప్పఁడు. మరల నెప్పుడో తెలియదు. నిజానికిఁ బ్రొద్దెక్కినది. అతనినిచట నతిథిగానుండుమన్నచో నుండునోయుండఁడో తెలియదు తా నతనిని బలవంతము చేసినచో నతఁడు తన్ను దురర్థము చేసికొనునేమో? తానును దనయుద్ధవేషమునుఁ దీసివేయుచుండెను.

కొంతసేపటికి గంగు బయలుదేరెను. నిన్ను నీ యింట వద్ద డించి నేను తిరిగివత్తునని నిరంకుశుఁడనెను. గం గంగీకరించలేదు. నీవు రాజవంశీయుఁడవు. రాజపురుషుఁడవు, నేను సామాన్యుడను. నాయందింత మర్యాద నెఱపుట న్యాయము కాదనెను. 'ఇది నీయందు నెఱపు మర్యాదకాదు. నీవిద్యయందు నెఱపు మర్యాద' యని నిరంకుశుఁడనెను. గంగప్పు డిట్లనెను. 'అయ్యా! నేను నా విద్యారహస్యములు నీకు జెప్పనని

భయమా! నిజముగాఁ జెప్పెదను. చెప్పుట నాకిష్టములేదు. కాని చెప్పవలయుననియే యున్నది. చెప్పెదను. ఇందాక నేను మ్లేచ్ఛులను గుఱించి కొంత ప్రసంగించితిని. నాకు మ్లేచ్ఛులన్నచో నేమియునిష్టములేదు. నేను రామశాది దేశముల యందుఁబోయి వారితోనుండి వారివలె నటించి కొన్ని నేర్చి కొనినమాట నిజమే. అవిమ్లేచ్ఛదేశములు. అచ్చట శ్రీరామచంద్రుఁడు దేవుఁడుకాఁడు. అచటఁ జాతుర్వర్ణ్యము లేదు. పరమేశ్వరభావము తక్కువ. మనదేశములలో సర్వవ్యవహారములందుఁ బరమేశ్వరుఁడు భాసించుచుండును. ఎవ్వఁడును బరమేశ్వరబుద్ధితోఁ జేయనిపనియేయుండదు. ఒకానొకవ్యక్తికిఁ బరమేశ్వరభావము లేకపోయినను బరమేశ్వరభావముతో నిండిన సంప్రదాయాచారములవలన భారతదేశము నందలి సర్వవ్యక్తుల జీవితము పరమేశ్వరభావమయముగా నుండును. నేను గొల్లవాఁడను. నేనిట్లుమాటాడుట నీకచ్చెరువు గొలుప వచ్చును. కాని నాపరదేశములందలి నివాసముచేత నాయీ స్వదేశమునందలి పారిశుద్ధ్యముచేత వారన్నచో నొక వెగటు కలిగినది, మేము గొల్లవాండ్రముగదయ్యా. భగవంతుఁడయిన శ్రీకృష్ణుఁడు మాకులమున జన్మించెను. భారతయుద్ధము నాఁటికి నేను జిన్నవాఁడను. లేనిచోఁ బోయి భగవంతునిఁ జూచివచ్చి యుండెడివాఁడను. మనదేశమునందు విద్యకును గుత్సితమంత్రములకును సంబంధములేదు. శివకేశవులను శ్రీరామచంద్రమూర్తిని వ్యక్తులుపాసించవచ్చును. తమకు జయము గల్గుటకుఁ గోరవచ్చును. మంత్రములున్నవి. మహాధానుష్కులు నేర్చెడి యాగ్నేయాద్యస్త్రము లున్నవి.

అగ్నియో వాయువో గరుత్మంతుఁడో తన్మంత్రాధి దేవతలుగా నుందురు. ఈయగ్ని వాయు గరుత్మదాదులు సుప్రసిద్ధులయిన దేవతలు వేదమునందుఁ బేర్కొనఁబడినవారు. ఈ దేవతలకును మ్లేచ్ఛ దేశములయందలి దేవతలకు నేమియు సంబంధము లేదు. అచ్చట నింతమంది దేవతలు లేరు. ఆ చారములు లేవు. ఆ యాచారములు స్మృతివిహితములైనవి కావు. సంఘజీవనము నందు వేసులుబాటు కొలఁది వెలసినవి. ఇట్లుండగా వారిలోఁ గొందఱు కొన్ని మంత్రములు నేర్చిరి. ఆ మంత్రము లా దేశములందే వెలసినవి. మన దేశమందు మంత్ర మనఁగా సంస్కృత భాషలోననే యుండును. ఆ దేశములలోని మంత్రములు వారి భాషలలోనుండును. ఆ మంత్రాధి దేవతలు విచిత్రమయిన దేవతలు. మేరువ దేశము నందునొక పెద్ద బావికలదు. ఆ గ్రామములోని సర్వజనులా బావినీరమే వాడుకొనుచుందురు. ఏడాదికిఁ గనీసము నలుగురైదుగురయినను దానిలోఁబడి యాత్మహత్య చేసికొందురు. ఆ బావియొక దేవత. ఒక మంత్రముకలదు. ఆ మంత్రమునకా బావి యధిదేవత. అచ్చటి జనులు కొందఱు తమ విరోధి పేరుతో నామంత్రమును గొన్ని నాళ్లు జపము చేయుదురు. ఆవిరోధి తప్పకుండ నానూతిలోఁబడి చచ్చిపోవును. ఆమంత్రద్రష్ట యెవఁడో తెలియదు. ఈ మంత్రమునకు నేను రేపు నీకుఁ జెప్పఁబోవు నొకఖడ్గప్రయోగమునకును సంబంధముకలదు. ఆ మంత్రమును బదిలక్షలసారు లుచ్చరించి యీఖడ్గప్రయోగమున శత్రువుమీఁదఁ జేసినచో శత్రువుదానిని దట్టుకొనలేఁడు. అది ఖడ్గవిద్య కాదు. ఆ ప్రవేటు నాశ్రయించి తత్కూపాధిదేవత యైన యొక పిశాచము

శత్రువును సంహరించును. మీరు సుక్షత్రియులుఁ ఇట్టి దుష్ట
మంత్రముల నుపాసించరు. నాకప్పుడప్పుడొక సందేహ ముండె
డిది. సామాన్యముగా శకయవనరామకదారదబాహ్లికాది
మ్లేచ్ఛ దేశవాసులు మన భారతదేశముమీఁదికి దండెత్తి
వచ్చుటకలదు. వా రా తుచ్ఛ ప్రయోగమును జేసినచో మన
వీరులేమగుదురని. తత్సందేహ నివారణకొఱకు నేనొకపని చేసి
తిని. నాకు నలుగురు కుమారులు. నా నాల్గవకుమారుఁడు
సుహ్మదేశ రాజాస్థానమునం దొక యుద్యోగి. వానికి నాఖడ్గ
విద్యయంతయు నేర్పితిని. అతఁడు రామభక్తుఁడు. వానిని
గూర్చుండఁబెట్టి రామనామము లక్షసారులు జపముచేయిం
చితిని. నేను బదిలక్షలసార్లు తుచ్ఛజపముచేసి వానితోఁ గత్తి
యుద్ధమాడుచు నా ప్రయోగము వానిమీఁద నెఱపితిని. ఆ
సమయములో వానికేమి తోఁచినదో నాకుఁదెలియదు. వాఁడు
రామా యని కేకవేసి నాకత్తికిఁ దనకత్తి యడ్డముపెట్టెను.
నాకత్తి రెండుగా విఱిగిపోయెను. ఆ సమయమున మాదొడ్డి
లోనిబావిలో నేదియో పెద్దబండపడినట్లు చప్పుడయ్యెను.

తరువాత నాకొడుకుతో నీసంగతియంతయుఁ జెప్పితిని.
నాయనా! ఈ తుచ్ఛమంత్రముల బలమెంతయో చూడవల
యునని నీవు నాకన్నబిడ్డవైనను మన దేశముయొక్క మన
వేదములయొక్క మనదేవతలయొక్క శక్తిని విచారించికొను
టకు నేను నీమీఁద నీప్రయోగముచేసితిని. నీవు చనిపోయి
నచో నేనును గత్తిపెట్టి పొడుచుకొని చనిపోయెడివాఁడను.
మన యీ భారతదేశమునందలి సర్వవిశ్వాసమును నాకుఁ
బోయెడిది. మన సంప్రదాయమునందలి నమ్మకము నశించె

డిది. మనపూర్వులు చెప్పిన యనంతకాలము కల్పములు యుగములు భారతదేశముయొక్క నిత్యత్వము. వీని యందలి ప్రత్యయము నాశనమయ్యెడిది. కాని యట్లుజరుగలేదు. అది మన యదృష్టము" కాని నా పిల్లవాఁడు కొంత పిచ్చివాఁడు. వాఁడు నేని ప్రయోగమును దనమీఁదఁ జేసినందులకు క్షమించలేకపోయెను. తానింకఁ గత్తి ముట్టనని ప్రతిజ్ఞ చేసెను. నా మువ్వురు పెద్దకొడుకులును బరరాజసేనలలోనున్నారు. వీఁడు వట్టి యుద్యోగి.

నిరంకుశుఁడు సగము దూరము గంగుతో వెళ్లెను. అంత వెను దిరిగివచ్చెను.

౪

"గంగునిల్లి దేనా" "మీరెవరు. మీదే దేశము" "మాది సింధుదేశము. ఇదేనా గంగునిల్లు" ఇదే. ఆయన యింటిలో నున్నాడా? "అయనతో నీకేమిపని" నేనాయనను జూడవలయునని వచ్చితిని". ఏమి పని ? నేను కులకనందివద్ద నుండి వచ్చితిని. కులకనందివద్దనుండియా? నేనే గంగును లోపలికి రా, పోదము

ఇద్దఱును గంగునింటిలోనికిఁబోయిరి. గంగు గృహము తాటియాకులపాక. కాని విశాలముగానున్నది. లోపలనంతయు విశాలముగానుండెను. ఆవుపేడతో నలుకఁబడి గచ్చుచేయఁబడినట్లున్నది. గోడలు పాటిమట్టితోఁ గట్టబడినవి. గోడలు కూడ నలుకఁబడియున్నవి. మూలరెండు నులకమంచము లున్నవి. కొబ్బరియాకులతో నేసినచాపలు రెంటినిదెచ్చి గంగు నేలపైఁ బఱచెను. వానిపై నిద్దరును గూర్చుండిరి.

పాకయంతయు నొక్కటియేచావడి. గదులుగాలేవు. ఇంటిలో వంటచేసిన జాడలేదు. వానకల దినములలో గంగు భార్య దొడ్డిలో నొకచిన్న గుడిసెయున్నది. దానిలోవంటచేయును. తక్కినప్పు డారుబయటనే చేయును. వానకాలములోఁదప్ప యింటిలో నెవ్వరును బండుకొనరు. లేనప్పుడు మంచాలు వేసికొని వాకిటిలోననో దొడ్డిలోననో పండుకొందురు. ఇం టిలోఁ బెద్దసామానుకూడలేదు. గోడఁకు దగిలించి మూఁడు ఫాళ్లును నొరలలోనున్న నాల్గుఖడ్గములు నున్నవి. చూచు టకుఁ బరిశుభ్రముగా నున్నది. కాని యంతటి పేదయిల్లు మఱియొకఁడుండునని తోచదు. బియ్యము పోసికొన్న కుండ యైనను లేదు. పాత్రసామాగ్రిలేదు.

వారిద్దఱు కూర్చున్న తరువాత గంగిట్లనెను. కులక నంది నిన్నుఁ బంపించెనా? ఆయననుజూఁచి యెన్నిదినము లైనది. ఆయన క్షేమముగా నున్నాడా? ఆయనభార్య ఇరా వతి యామె యీదేశములలో బుట్టఁదగినదికాదు; ఆమె సేమముగానున్నదా? అప్పటికాయన కిద్దరు మగపిల్లలు. వారు పెరిగిరా? పెద్దవారయిరా? ఏమిచేయుచున్నారు? కులకనంది నిన్నెందుకుఁ బంపించెను? ఆయనకు నేను జ్ఞాపకమున్నానా? ఎన్నాళ్లనాటిమాట ఎనుబది తొంబది యేండ్లనాటిమాట. నాకు గురువుకనుక నేను మఱచిపోలేదుగాని లేనిచో మఱచి పోవలసిన విషయము. కులకనందియా? ఆయనకిప్పుడు రెండు వందలయేండ్ల వయస్సైన నుండవలయును. ఇంతకు జీవించి యున్నాఁడు. సేమముగా నున్నాఁడా?

గంగుమాటాడనే మాటాడుడనియు, వాకిటిముందే వెళ్ళగొట్టుననియుఁ బదిమాటల కొక్కమాట జవాబు చెప్పి నచో గొప్పయనియు వినివచ్చిన యాపురుషునకీ గంగు యొక్క ప్రశ్నపరంపర లచ్చెరువుగొలిపెను. కులకనంది సేమ ముగ నేయున్నాఁడు. చాల వృద్ధుఁడైనాడు. ఇరావతిమిక్కిలి వృద్ధురాలయినది. ఆయన కొడుకులిద్దరు మేరువదేశములో రాజున కంగరక్షకులుగా నున్నారు అని యాపురుషుఁడు బదులు చెప్పుచున్నను గంగుయొక్క ముఖశరీరలక్షణములను బరిశీలించుచునే యుండెను. గంగు ముఖ మూర్ధ్వభాగము గుండ్రగానున్నది. చెక్కిళ్లును గడ్డమును సన్నవడి కోనదేరి యున్నవి. అతనితలయంతయుఁ బాపటదీయఁబడినజుట్టు రెండు పాయలుగా నున్నది. ఆ పాయలు వెనుకకు దీసి ముడివేసి యున్నది. మూతిమీఁద మీసములు లేవు. గడ్డములేదు. కాని మీసము గడ్డమునుండు స్థానములందుఁ జెదరు వెంట్రుకలు గలవు. ఆ రోమములు సర్వమును బాతిక ముప్పది యుండ వచ్చును. అవి యేఁదుపంది ముండ్లవలె నుండును. అతని మొగము చూచుటకు నెగటువేయుచున్నదని చెప్పవలయును. కాని వాని కన్నులలో నొక తళత్తళ కలదు. ఆ కన్నులు నిన్నాకర్షించును. నీకు భయము కలిగించును. మరలఁ జన విచ్చును. అతని ఫాలమున నూర్ధ్వపుండ్రములు కలవు. అతని కంఠము దీర్ఘముగానుండి బలిష్ఠముగానుండి ప్రక్కనరము లినుపచువ్వలవలె నుండెను. బుజములు పొంగియుండెను. ఱొమ్ము విశాలముగానున్నదని చెప్పుటకు వీలులేదుగాని బలి ష్ఠముగా నున్నదని చెప్పవలయును. అతని బాహువు ల్సుప

గుదియలు. నడుము మిక్కిలి సన్నముగానున్నది. అతని బల మంతయుఁ చేతులలో నున్నట్లుండెను. అతఁడా సమయము నందు మేననంగీ లేకుండనుండెను. మొగము చూచినచో నతని వయసు భాసించుచున్నదికాని శరీరమునందతని వార్ధ క్యము కనిపించుటలేదు.

జయద్రథుఁడు గంగుయొక్క శరీరమునంత సూక్ష్మ ముగాఁ దానెందుకు బరిశీలించుచున్నాఁడో తానే తెలిసికొన జాలకపోయినాఁడు. తాను గంగుతోఁ గత్తియుద్ధము చేయఁ దలపెట్టలేదు. మరియు గంగెవ్వరితోడను గత్తియుద్ధము చేయఁడని తానువినెను. అతఁడెవ్వరితోడను స్పర్ధలు పెట్టి కొనఁడఁట. అతనితో నెవ్వరు స్పర్ధలు పెట్టికొనరన్నది మేలి మాట. మఱియెందుకతని శరీరమునంత విమర్శగాఁ బరిశీలించు చుండెను?

గంగిట్లనెను. "నీవీ పూట మాయింటనే భోజనము చేయవలయును. కులకనంది పేరు వినినంతనే నా చిన్నతనమం తయు నాకు జ్ఞాపకమువచ్చుచున్నది. కులకనంది పెద్దకొడుకు సుగానోరి. ఆఁ సుగానోరి యేమనుకొందును. వారి పేరు లదొక చిత్రముగానుండును. ఆతఁడు నాకన్న రెండు నెలలు పెద్దవాఁడు. నాకంటెఁ గత్తియుద్ధమునఁ దానే యధికుఁడనను కొనుచుండువాఁడు. స్నేహముగా యుద్ధమాడుచున్నప్పుడు కూడ శత్రువునుసంహరింపఁ దలంచెడునట్లే తలంచెడివాఁడు. ఆ కొడుకు నన్నెప్పుడు చంపునోయని నాగురువయిన కులక నందికి భయముగానుండెడిది. అందుచేతఁ గొడుకుకంటె నా కెక్కువవిద్య చెప్పెను. నాయందున్న యధిక విద్యావశమున

సుగానోరి నన్నేమియుఁ జేయలేక పోయెడివాఁడు. ఆ దేశ స్థులు దీర్ఘబాహులు. మిక్కిలి యెత్తైనవారు. సహజముగనే దృఢకాయులు. అది జాతిదేశము. ఆ జాళ్లనడుమ వాగుల లోని నీరు జాళ్ల జగించెడిది. దుంపలెక్కువ. స్వాదువులయిన ఫలములెక్కువ. ఆయాహారము మూలమున వారి శరీరములు కఠినతరములయియుండును. ఈ యాధిక్యము సుగానోరికి నా యందుఁ గంటెఁ గలదు. ఆ హేతువునతఁడు నామీదికి సుల భముగా లంఘించెడివాఁడు. కాని కులకనంది నాకుఁ జెప్పిన విద్యచేత సుగానోరి యెంత యేమఱుపాటున దూకినను నేను దానినిఁ దట్టుకొనెడివాఁడను. ఆ దేశస్థుల శరీరము లెంత బలి ష్ఠములయినను మా దేశస్థుల మనస్సులలోని చుఱుకుఁదనము వారికి లేదు. ఈ దేశస్థులు మిక్కిలి చుఱుకుబుద్ధి కలవారు. మేము గొల్లవాండ్రము. మా జాతి యమాయికపుజాతియని మా దేశములోఁ బేరు. అట్టి నా మనస్సునకున్న చుఱుకుఁ దనమే సుగానోరి కుండెడిదికాదు. అతఁడు నాతో సరిగా మాటాడెడివాఁడుకాదు. నేను కులకనందివద్ద నాల్గేండ్లుంటిని. అచ్చట నన్నాళ్లుంటిననఁగా నిరావతియొక్క దయావిశేష మని చెప్పవలయును. ఆమె నాకు సుగానోరికి భోజనమొక్క సారి యెన్నఁడును బెట్టలేదు. తొలుతటి దినములలో సుగా నోరి కత్తిపోట్లు నామేన రెండు మూన్నాళ్లకొకటి కనిపించు చునే యుండెడిది. అట్లుడాది యేణ్ణర్థము గడచెను. ఇరావతికి నాయందు దయగలిగెను. వీఁడెవో పరాయిదేశమువాఁడు. వీఁడు సుగానోరిచేతిలోఁ జనిపోవుననుకొనెను. ఆదేశములలో మనుజులు చనిపోవుట యనఁగా లెక్కలేదు. కుక్కలు చని

పోయినచో నీడ్చివేసినట్లీడ్చివేసెదరు. పైగా నా యూళ్ళ కట్టు చమత్కారమయినది. పరదేశస్థు నెవనినయిన నొక గ్రామములో నెవఁడైనఁ జంపినచో దానికి విచారణలేదు. ఆ పల్లెటూళ్లట్టివి. ఆ పల్లెటూళ్లు భారతదేశమునందలి పల్లెటూళ్లవంటివికావు. ఇచటఁ బ్రతి గ్రామమునకు గ్రామములోని పెద్దలు పాలకులుగా నుందురు. ఏ యన్యాయము జరుగుటకు వీలులేదు. వెంటనే విచారణయు శిక్షయు. ఆయూళ్లలోనట్లుకాదు. ఆ గ్రామములో నేమిజరిగినను జరుగవచ్చును. ఇది యిట్లు జరిగెనని యెవ్వఁడును జెప్పఁడు. ఎవనికిని బట్టదు. ఎప్పుడో కర్ణాకర్ణిగావిని యొక రాజభటుఁడు విచారించుటకు వచ్చును. అతనికి గ్రామము మొత్తముమీఁద గొంత ప్రోవు చేసి యిత్తురు. వాని దారిని వాఁడుపోవును. తానచ్చటినుండి బ్రదికిపోవునో పోవఁడో వానికేభయము. అచ్చటి వ్యవహారమిట్లుండును." ఎవఁడో పరదేశస్థుఁడురాగా వానినావీథిలో నేమియోచేసిరటకదా" యని రాజభటుఁడడుగును. ఆ గ్రామవాసి తాను మాటాడఁడు. రాజభటుఁడు మరల నిటులనును. అతఁడు మఱునాఁడు కనిపించలేదటగదాయని నవ్వును. గ్రామవాసియునవ్వును. దానితో విచారణ పూర్తియయ్యెను. అది యీ దేశముల లక్షణము. ఇట్టి పరిస్థితులలో నేను నాలుగేండ్లచ్చటనుండి బ్రదికివచ్చితిననగా నాయాయువెంత గట్టిదందువు. ఆ యూరిలో సుగానోరియే కాదు. ఉన్న యువకులందఱు నట్టివారే. యువకులేమి, వృద్ధులుకూడ నట్టివారే. యువకులకు వృద్ధులకు భేదమేమనఁగా యువకులు నిర్వ్యాజముగాఁ గవ్వించి మీఁదికి వత్తురు; వృద్ధులురారు. కారిన్య

ములోఁ గ్రౌర్యములో మోటుదనములో నిద్దఱు నొకటియే. నాకొక చిన్న విషయము జ్ఞాపకమున్నది. నిన్నుఁజూచిన యంతటనే యవియన్నియు జ్ఞాపకమునకు వచ్చుచున్నవి. కులకనంది పేరు నామీఁద నొక మంత్రమువలెఁ బనిచేయుచున్నది. నేను బదిమాటలకు మించి మాటాడి యెన్నఁడుఁ నెఱుఁగను. నిన్నఁ బ్రొద్దున నొకాయనతో మాటాడితిని. నేఁడు నీతో మాటాడుచుంటిని. కులకనంది గ్రామము పేరేమి? నోటిలోనాడుచున్నది. ఆఁ ఆఁ విలాఘుర. ఆ యూళ్ల పేర్లు నట్లేయుండును. నేనాయూరికి వెళ్ళినక్రొత్తలో నా గురువు నన్ను నన్నిపనులమీఁద బంపించుచుండెడివాఁడు. ఒక వీథి యున్నది. నేను వెళ్లిన వచ్చిన నావీథి వెంటనే నడువవలయును. ఆ యూరే యొక గుట్టమీఁదఁ నున్నది. ఒక యిల్లు పల్లముననుండును. ఒక యిల్లు పెద్ద బండమీఁద నుండును. అది వీథియని చెప్పుటకుఁగూడ వీలులేదు. అందందు గుడిసెలు నిర్మించినట్లుండెడిదిగాని యదియొక గ్రామమని చెప్పుటకు వీలులేదు. ఆ వీథిలోఁ బల్లములో నొక యిల్లున్నది. అది ఱాతిమిద్దె. మిద్దెయనుటకన్న ఱాళ్లు పేర్చిరని చెప్పవచ్చును. ఇల్లు వెనుకఁ బల్లములో నుండెడిది. ఇంటిముందొక పెద్ద బండయుండెడిది. ఆ బండమీఁద నెండపడకుండ రెండు కఱ్ఱలమీఁద నీతాకులు పఱచియుండెడివి. ఆయఱుగుమీఁద నొకఁడు కూర్చుండెడివాఁడు. వాఁడునాకంటెఁ జిన్నవాఁడు. ఆ దేశములోఁ బదునాల్గేండ్లు రాకమునుపే మనుజులు తాళప్రమాణదేహులగుదురు. బాగుగాఁ బొడుగెదుగుదురు. వారికి గ్రౌర్యముగ్గుపాలతోఁ బెట్టినవిద్య. నారాక పోకలయందు

వాఁడు సర్వదా నావంక నొకచూపు చూచుచుండెడివాఁడు. వాని కన్నులు నామీఁద బడినంతసేపు నాయొడలఁ దేళ్లు ప్రాకుచుండెడివి. ఆ నిర్వ్యాజమయిన కోపము నామీఁద నెందులకో నాకుఁ దెలిసెడిదికాదు. వాఁడు చూచినంత తీక్ష్ణముగా నేను వానిని జూచినచో వానికేమి కోపము వచ్చునో? ఎందుకట్లు చూచెదవని యడుగగా నేనేమి చెప్పవలయును. నీవు నావంక నెందుకట్లు చూతువని యడిగితినా, వాఁడు కత్తిపుచ్చుకొని నామీఁదికి దుముకును. నాకది తెలియును. నేను ఖడ్గవిద్య నేర్చికొనుటకుఁ బోయితిని కాని యచట నెవ్వనిచేతిలోనో చచ్చుటకుఁ బోలేదు. అవియొక విచిత్రమయిన దేశములు. అపుడు జయద్రధుఁడు "భారతదేశము దాటి రెండు మూఁడు దేశములు గడచినగాని ఖాసదేశము రాదు. నీవచ్చటికిఁ బోవుట యెట్లుతటస్థించినది" యని యడిగెను. గంగిట్లు చెప్పెను. నేను బరదేశములకుఁ బోకముందు నాదేశములోఁ గత్తివిద్య నేర్చికొనియే వెళ్లితిని. అచ్చటి విశేషములు నేర్చికొనుటకుఁ బోయితిని. గాని ప్రాథమికవిద్య నేర్చికొనుటకుఁ బోలేదు." అని యూరకుండెను. జయద్రధునికు వెంటనే తెలిసినది. కులకనందియు నాగ్రామమును దాని సంగతి యెంతమైనను గంగుచెప్పెనుగాని తక్కిన విషయములు చెప్పఁడని జయద్రధుఁ డిట్లడిగెను. "విశేషములు నేర్చ కొనుటకుఁ బోయితిరి కదా! నాలుగేండ్లేల పట్టినది." గంగు "మొదటి యేడాది నేను నేర్చినదేమియులేదు. వారియింటిలో బోయి యుండెడివాఁడను. కులకనందివద్ద విద్య నేర్చుటకు వచ్చితినని చెప్పితిని. వారి యింటనేయుంటిని. పదిపండ్రెండు

దినము లెచ్చటనో తింటిని. ఒకనాఁడు కులకనంది భార్యతో వానికిఁగూడ నన్నము పెట్టుమని చెప్పెను. ఏఁడాది గడచెను. సుగానోరితో దేలికగా నెలకొకసారి దెబ్బలాట జరుగుచునే యుండెను. అతఁడు నెక్కుడు దినములు మాటాడకుండెడి వాఁడు. ఒకనాఁడెన్నో ఱిమ్మపుట్టిమీఁది కుతికెడివాఁడు. నేను నాకత్తితో నిత్య జాగ్రదవస్థయందుండెడివాఁడను. నేనతని కత్తిదెబ్బలు నొడ్డికొనుటయేగాని నాకత్తిని వానికత్తి కెన్నడును దాకనీయలేను. అతఁడు నాకుఁ జాలనుపకారము చేసెను. ఆదేశపు జనము మనమీఁదికేవాటుగా దూకుదురో వారికి నిత్యస్వాధీనములయిన కత్తిదెబ్బ లెట్టివో యవి యన్నియు నాకుఁ దెలిసెను. ఆయూరిలో నేనున్న తొలుతటి రెండుసంవత్సరములు కనీసమొక పదిమందితోనైన నిట్టిసంఘర్షణలు జరిగెను. మనము కత్తియందు నేర్పరులమని తెలిసినచో మనజోలికిరారు. ఒకయేఁడాది గడచిన తరువాత నాయూరిలో నందఱికిఁ నేను గులకనంది శిష్యుఁడనని తెలిసెను. తరువాత నాజోలికెవ్వరును రాలేదు. ఈసుగానోరి నాతో మత్సరించుచుండెను. అతఁడెప్పుడు నామీఁదికిఁ గత్తితో వచ్చినను నేనొడ్డుకొనుచుండుటచేత వానికి నామీఁది మాత్సర్యమంతకంతకుఁ బ్రబలెను. అతఁడొక సంగతి గుర్తించెను. ఆదేశమునందలి ఖడ్గవిద్యలోని విలక్షణములయిన ప్రయోగములు నాకుఁ దెలిసియుండవని గ్రహించి మనసులో నాలోచించికొని యొక్కొకదాని నొక్కొకప్పుడు నామీఁదఁ బ్రయోగించెడివాఁడు. నాయొడల గాయమయ్యెడిది. తల్లి చూచెడిది. కులకనందికిఁ జెప్పెడిది. అప్పు డాయన యాప్రయో

గము యొక్క లక్షణము నాకుఁజెప్పి దాని నొత్తుకొను విధా నము చెప్పెడివాఁడు. తక్కిన మూఁడేండ్లు నా విద్యాభ్యాస మిట్టిదే. చివఱకు నేను బయలుదేరి వచ్చుచుండగా నొక ప్రయోగమును జెప్పెను. అది యొక్కటియే యాయన నాకు విశిష్టముగాఁ జెప్పినది. తక్కినవన్నియుఁ దనకొడుకు బాధ నాకు లేకుండుటకుఁ జెప్పినవే.

జయద్రథుఁడు నవ్వుచు నా ప్రయోగము పేరు 'బగల' కాదా? యనెను.

గంగు కూర్చున్నవాఁడు హఠాత్తుగా లేచి "ఎవర వయ్యా నీవు? నీకెట్లు తెలియును? ఇది సింధుదేశములోఁ దెలిసెడి మాటకాదే! నాకుఁ గులకనంది యిది నేర్పినని నీ కెట్లు తెలియును? నీ వెవ్వరవు? నీ విచ్చటి కెట్లు వచ్చితివి? నీవు వయస్సుచేతఁ గుఱ్ఱవాఁడవు. నీవు కులకనందివద్ద శుశ్రూష చేసితివనుటకు వీలులేకుండ నున్నదే? ఆయన బ్రదికి యున్నాఁడో, లేదో, తెలియదు. బ్రదికియున్నను మిక్కిలి వృద్ధుఁడయి యుండును. నీకీ రహస్యము దెలియవలసిన యవ సరమే లేదు. ఈ రహస్యము నాకును గులకనందికిని దప్ప మూఁడవవానికిఁ దెలియదు. నీవెవ్వఁడవని గద్దించెను. జయ ద్రథుఁడు నవ్వుచు నిట్లనెను. "తొందఱలేదులే. నేను నీకు శత్రువనుగాను. నీకును నాకును వయోభేదము చాలయున్నను నేనును గులకనంది శిష్యుఁడనే. పదియేండ్లుఁ గులకనందికి నేను శుశ్రూష చేసితిని. అప్పటికే యాయన వృద్ధుఁడు. ఆయన నడివయస్సులో నుండఁగా నీవు శుశ్రూష చేసితివి. ఆనాఁటి కులకనంది వేఱు. పదియేండ్ల క్రిందటి కులకనంది వేఱు. ప్రతి

దినము సాయంకాలమునందు నాతోఁ గూర్చుండి ప్రాత కాలపుఁ గథలన్నియు జెప్పుచుండెడివాఁడు. ఇరావతి ప్రక్కన గూర్చుండి వినుచుండెడిది. ఆయన కొడుకు లిద్దఱును జెప్పి తినిగిదా మేరువరాజు సైన్యములో నుద్యోగులుగానుండిరని; వార్ధక్యములో నాయనకుఁ దోడెవ్వరు? రెండేండ్లు నేను వారి నాదుకొంటిని. నేనే వారికి రొట్టెలు చేసిపెట్టెడివాఁడను. వారికి రెండు మేకలు, మూఁడు గొఱ్ఱెలు కలవు. వానిపాల నేనే తీసిపెట్టెడివాఁడను. వారించుమించుగా నాఁమీఁద నాధార పడియుండిరి. నాతోఁ బరాచికము లాడుచుండెడివారు. ఆ ప్రాతనాటి కథలన్నియుఁ గులకనంది నాతోఁ జెప్పుచుండెడి వాఁడు చెప్పిన కథయే మరలఁ జెప్పుచుండెడివాఁడు ఎన్నిసార్లైనను విసుగులేదు. ఎప్పుడయిన నిరావతి 'యీకథ నెన్నిసార్లు చెప్పితివి' యనెడిది. ఎన్నిసార్లు చెప్పిన నేమి, నాకెప్పుడును వినవలయుననియే యుండును. మరలఁ జెప్పుమని నేననెడివాఁడను. అందుచేతఁగులకనందికి నామీఁద మిక్కిలి ప్రేమ. అప్పుడప్పుడు నీప్రస్తావనయు వచ్చెడిది. నీవు చెప్పినదంతయు నాకిరావతి చెప్పెడిది. కాని గంగూ! కులక నందికి నీమీఁద నెట్లున్నను నిరావతి కా యెనుబదియేండ్ల క్రిందటి నీమాటలు నీచేఁతలు మిక్కిలి ప్రియములుగా నుం డెను. ఎందుచేతనో నీకు దెలియునా యనెను. గంగు తనకుఁ దెలియదనెను. జయద్రథుఁ డిట్లుచెప్పెను. ఓయీ! పెద్దపులి యున్నది. దాని స్వభావము క్రౌర్యము. దానిని దీసికొనివచ్చి నీవు దానిని పంజరములోఁబెట్టి పాలించుచుండుము. దానికిఁ బ్రేమయనఁగా లాలిత్యమనగా ననురాగమనగా మెత్తని

స్వభావమనఁగా దెలియదు. ఈలక్షణము లన్నియు నీవు దానినిఁ బాలించునప్పుడు దానికిఁ గ్రొత్తగాఁ దెలిసినచ్చును. అందుచేత నిన్నది యొక విలక్షణముగాఁ జూచును. నీయందు దానికిఁ బ్రేమ ప్రబలును. ప్రేమయను నొక గుణమున్నది. దాని యందొక మాధుర్యమున్నదని దాని స్వభావగతము కాని యొక లక్షణము దానియందు సముద్భవించును.. దాని ప్రకృతి దానియందెక్కువ రసించును. అందుచేతనే క్రూర జంతువులు పెంచెడివాని నేమియుఁ జేయవు. ఆకలియైనప్పుడు వాఁడన్నము బెట్టునని ప్రతీక్షించుట యెందులకు? దాని స్వభావమును క్షుధాతురమయిన సమయమునఁ గనబడిన జంతువుమీఁదబడి పీకికొని తినుటగదా! కనుక దాని ప్రకృతిలో నొక మార్పువచ్చినది. ఇరావతికి నీమీఁద దయ కలుగుట కిదియొక కారణము. కడుపున బుట్టిన బిడ్డలయందు మమకారముండుట జంతులక్షణము. ఆబిడ్డలు పులులు. అవి చనుబాలు వదలిన తరువాత నడవిలోని వాని విహారము వానిదే. వాని వేట వానిదే. ఈజంతులక్షణమున కధికముగా వారు మానవులగుటచేతఁ గొంత సౌహార్దము సుంతయాలోచన మఱికొంత యధికమైన యార్ద్రతయు నుండినను నాదేశస్థులయందుఁ గ్రూరమైన వ్యాఘ్రలక్షణమే పాతుకొని యుండును. నీవీ దేశమువాఁడవు. నాగరికమైన దేశమువాఁడవు. మానవ ప్రకృతి వికసించిన దేశములో జన్మించినవాఁడవు. నీవామెయందు గురుపత్నియైనను దల్లిభావము నెఱపితివి. నీవే ప్రేమ యామెయందుఁ జూపించితివో యామె యా ప్రేమ తన సొంతబిడ్డలనుండి యెప్పుడు నెఱుఁగదు. ప్రేమయొక్క

నెఱపుట తామర తూఁడులలోని సన్నని దారములవంటిది; యూహలలోఁ దదనుగతములయిన చేఁతలలోఁ బరమ సుకుమారముగా నుండునుగదయ్యా! ఆజాతిలోలేని యొకానొక విచిత్రమైన సౌకుమార్యముగల నీపుత్రభావము నందలి చిన్ని చిన్ని పనులచేత వెలార్పఁబడుచున్న దైనందినముగా నను స్యూతముగాఁ బ్రవహించుచున్న, యామెయన్నచో నీవు నెఱపుచున్న, యొకదరిసెన పూవువంటి మెత్తనయిన యనురాగ సూక్ష్మతంతువులచేత నామెగుండె నీయెడల నంత మెత్తనయినది. ఆమెత్తన యామె యెదలోఁ బాతుకొన్నది. ఇప్పటికి నామెత్తదనము నామె యూహించినప్పుడామె తద్దేశీయురాలివలెఁ గనిపించదు. మరియు వార్ధక్యముచేత నా మెత్తదనము మిగులఁ బండిన పండువోలె మఱియు మెత్తనయ్యెను. పదిమేండ్లక్రింద నీపేరు వచ్చినచోఁ జాలు నామె ముఖమునందుఁ జిత్రమైన ప్రసన్నభావము గోచరించెడిది. కులకనంది నీకథలు చెప్పుచుండును. ఆమె యేమియు మాటాడదు. అప్పుడామె మొగము చూడవలయును. అస లాదేశీయుల మొగములయందే క్రోధాదులు భాసించినట్లు మెత్తని భావములు భాసించవు. వారు వృద్ధులయినపుడు వారి మొగములును శరీరములును ముడుతలుపడి చూచుటకేమియు నింపుగానుండవు. అట్టి యిరావతి మొగము కులకనంది నీ కథలు చెప్పునపుడు విచిత్రమైన యొక ప్రసన్న భావముతో నుండెడిది.”

ఈ మాటలు గంగునకుఁ దన్నుదీసికొనిపోయి స్వర్గమునందుఁ గూర్చుండఁ బెట్టినట్లుండెను. ఆతఁడు తబ్బిబ్బయ్యెను.

మొదట జయద్రథునియందు గంగునకు లేని ప్రసన్నత యంకు రించెను. గంగు వానితో కులకనంది ప్రస్తావన మిక్కిలిగాఁ జేయుట కులకనంది ప్రస్తావన యెప్పుడు వచ్చినను నా ప్రస్తా వన నధికముగాఁ జేసెడియలవాటేగాని జయద్రథునియందలి ప్రసన్నతకాదు. ఇపు డా ప్రసన్నతకలిగెను. సహజముగాఁ గులకనందికి మ్లేచ్ఛులును దద్భావములును బ్రియములుకావు. ఇట్టి తనవ్యతిరేక భావమును ఖడ్గవిద్యాపేక్షయా యదుపులో బెట్టికొనియే చిన్ననాఁడు కొన్నియేండ్లు మ్లేచ్ఛదేశములలో విద్యాసంపాదనము చేసెను. తరువాత నాప్రసక్తివచ్చినప్పు డెల్ల వారి యాచారములయందు సంప్రదాయములందుఁ దన యనిష్టమును బ్రకటించుచునే యుండెను. జయద్రథునితోఁ గూడఁ దన యనిష్టమును గోపనము చేయలేదు. కాని యతని యెడదలోఁ గులకనంది యన్నచోఁ గల తొలినాటి యార్ద్రిత యెండిపోలేదు. ఇరావతి యన్నచో నాయార్ద్రితకుఁ బచ్చియే యాఱలేదు. ఇంచుమించుగా నెనుబది తొంబదియేండ్లు జరిగి నను దరువాత వాని జీవితములోననే యనేకములైన మా ర్పులు వచ్చినను గులకనందియు నిరావతియు వాని చిన్న నాటి యెడఁగ పచ్చిదనమును నిలుపుకొనుచునే వచ్చిరి. బాల్యము నం దెడదలోఁ గలిగిన రమణీయతా ముద్రలనుఁ దొలగించుకొనుట సాధ్యముకాదు. గంగు జీవితములో జరి గిన మార్పులును దక్కువవికావు. వాని నలుగురు బిడ్డలు తనవద్ద యొక్కఁడయిన నుండకుండఁగా వెడలిపోవుట గంగు నకొక భరింపరాని కష్టముగనే యుండెను. ఏవేళ యెట్టిదో? తనకు మృత్యువెప్పుడు వచ్చునో? యామృత్యువు చెప్పిరాదు

గద? తాను దృఢముగా నున్నమాట నిజమే. ఈ శరీరదార్ఢ్య మునకును మృత్యువునకును సంబంధములేదు. ఆ మృత్యువు హఠాత్తుగా సమీపించినచోఁ దనకిన్ని తులసినీళ్లు పోసెడి వారులేరని వాని మనస్సులో నొక యనుస్యూతమయిన విచారరేఖ యుండుచునే యున్నది. అతఁడేమియు రాజస్థానములు, రాజసైన్య పదములు మెట్టినవాఁడు కాదు. కాని యచ్చటి యొడుదుడుకులు క్రిందుమీఁదులు పలుమంది ముఖముల వినినవాఁడే ఒక విద్యయందు నిష్ణాతుడయినచో దానియందుఁ బ్రౌఢికలిగినచో సహజముగా జీవునకుఁ దదితర విషయములందుఁ గూడ నీప్రౌఢయొక్క లక్షణము వ్యాపించును. గంగునకున్న మనస్సులోని ప్రౌఢి తాదృశమైనది. ఆ ప్రౌఢియొక్క బిగింపువలననే గం గెవరితోడను మాటాడకుండుటయుఁ దనదారి తాను పోవుచుండుటయు జరుగుచుండెను. జయద్రథుఁడు వాని చిననాటి మనసులోని యీ ఖడ్గవిద్యాగురుదంపతుల యందలి మెత్తఁదనమును దన మాటలచేత వికసింపించెను. వయసుముదిరి పెళుసైన జీవితములయందుఁగూడ నార్ద్రిత శుష్కించిపోయిన జీవితములయందు గూడ నీజీవితములయొక్క యీ దార్ఢ్యము సంశయగ్రస్తమై బ్రదుకు దెరువులు వేఱమలఁగిన చోటఁగూడఁ జిననాటిస్మృతులు వానికి విశిష్టమయిన యొక సుకుమారరేఖను బొటమరింపఁజేయుచునే యుండును. ఇట్టి భావము గంగుయొక్క బిగిసిన ముఖలక్షణములయందు భాసించెను. అప్పుడు గంగుయొక్క ముఖములో నొక విధమైన బాల్యరేఖ ప్రకాశింపఁజొచ్చెను. అతని మొగమొక రమణీయతాముద్ర వహించెను.

సౌకుమార్య భావముచేతఁ గిసలయించెను. జయద్రథుఁడు గుండెలు దీసినబంటు. ఆవులించిన త్రేవులు లెక్కఁబెట్టెడి వాఁడు. అతఁడీరీతిగా గంగుయొక్క హృదయముఁ దడిపిఁ నాననిచ్చి, దానియందుఁ దానే విత్తనము నాటఁదలఁచి కొన్నాఁడో, యావిత్తనము నాటుటకుఁ బూర్వము కొంచెము త్రవ్వి తాను పోసిననీరుచేత మృత్తుయొక్క లోపలి పెల్లకూడ దడిసి మెత్తనగుటకుఁ బ్రయత్నముచేయ సంకల్పించినాఁడు.

అతఁడు మరల నిట్లనెను. 'ఓయీ గంగూ! ఆ యిరావతీ కులకనందులన్నచో నీ కింత ప్రేమయుండునని నాకుఁ దెలియును. నాకుఁ దెలియుట యేమున్నది. ఇరావతియే చెప్పినది. వాఁడు నాపెద్ద బిడ్డయనుచుండెడిది. ఒకటి రెండు సార్లు కులకనందియు సుగానోరియుఁ అది యెన్నేళ్లయినది. స్త్రీల లక్షణమిదియే. అతఁడీమె నింకను జ్ఞాపకముంచుకొన వచ్చెనా యనికూడ ననిరి. ఆమె యీ మాటల కెప్పుడును నీయందుఁ దనకుఁగల ప్రేమాతిశయముచేతఁ విలువనిచ్చెడిది కాదు. నాకు నీవన్నచో నెంతయో యభిమానము కల్గినది. నీవామెకుఁ దొలినాడెంత ప్రియమైన బిడ్డవో, మలినాఁడు నేనంత ప్రియమయినవాఁడను. అందుచేత నాకప్పుడప్పుడు నిన్నుఁ జూడవలె ననిపించెడిది. కాని యెచ్చటి ఖాసదేశము? ఎచ్చటి యాంధ్రదేశము? నేనిచ్చటికి వత్తునని యనుకొన లేదు. కాని వచ్చితీరవలసిన యవసరము కులకనంది నాకుఁ గల్పించినాఁడు. వృద్ధులకు వయసు మీఱినకొలఁది కొన్ని పట్టుదల లెక్కువగును. కొన్ని యాచారములయందుఁ గొన్ని సంప్రదాయములయందుఁ గొన్ని నియమములయందు వారి

కథిక ప్రత్యయము కలుగును. చిన్నప్పుడు జీవితములోని యనుభవ జగత్తు క్రమవికాసము నొందుచుఁ దత్తదనుభవ విశేషములయందు మనస్సు ప్రసక్తమై భోగలాలసమనస్సు నాక్రమించియుండును. ఆయనుభవము మిక్కుటమై జీవితము లోని యొడుదుడుకులను భూతిదశకువచ్చి తదాభిముఖ్య ముప సంహరింపఁబడి శరీరానుభవ భావరేఖా ప్రత్యగ్రత సన్నగిలి నప్పుడు దేహియొక్క మనస్సు సంప్రదాయములయందుఁ లగ్నమయియుండును. జీవునకుఁ దెలియకుండఁగనే మృత్యువు సమాసన్నమగుచున్న లక్షణము బుద్ధికి భాసించుచుండును. ఆ బుద్ధి కొన్నియాచారములయందుఁ గొన్ని విశ్వాసముల యందు దృఢముగాఁ దగుల్కొని యచ్చట రమించుచుం డును. ఈరమణము కూడఁ దనకుఁ బరిచితములైన విషయ ములయందే కలుగును. ఒకఁడు వ్యాకరణ శాస్త్రమునందుఁ బండితుఁడను కొందము. పెద్దపండితుఁడే. అదియొక వట్టి విద్యయే. ఆ శాస్త్రము నేర్చినందువలన శబ్దములయొక్క సుష్ఠుత తెలియును. ప్రయోగ రామణీయకము తెలియును. దానియంతట నది భగవంతునికడకుఁ దీసికొనిపోవు విద్య కాదు. కాని తానావిద్యయందు మహాప్రౌఢుఁడైన లక్షణము వార్ధక్యమునందు వానినిఁ దద్వ్యాగతములయిన కొన్ని లక్షణములయందుఁ బట్టుదలకలవానినిగాఁ జేయును. ఆవిశ్వా సమునందు వాఁడు పీటమెట్టికొని కూర్చుండును. వాని జీవిత మున కదియే ప్రధానము. ఆ రీతిగాఁ గులకనంది యొకటి రెండు విషయములయందుఁ జివటిహోజులలో నొకపట్టుదలపట్టి కొని కూర్చుండెను. తనదగ్గఱనున్న విద్యలలో నొకటి రెండు

విద్యలయందుఁ గులకనందికి మహాభిమానము చెలరేగెను. ఆ విద్యలు కులకనంది ముగ్వురన్నచో ముగ్వురికే నేర్పెను. ఆ విద్యలకొక సంప్రదాయము కలదు, ఆచారము కలదు. ఉపాసనాక్రమము కలదు. ఆచరించుటలో నొక పద్ధతి కలదు. కులకనంది మనస్సు వానియందు లగింపఁబడినది. తనకు వార్ధక్యము వచ్చిన తరువాత మరి ముగ్వురకా విద్యలు నేర్పెను. అందులో నేనొకఁడను. మా ముగ్వురి దగ్గఱ నతఁడు కొన్ని వాగ్దానములు తీసికొని మాచేతఁ బ్రతిజ్ఞలు చేయించికొని వానిని నేర్పెను. ఇట్లు మాకు నేర్పు సమయములయందుఁ బూర్వము తనవద్ద నేర్చికొన్న ముగ్వురి విషయము జ్ఞాపకము నకు వచ్చెను. వచ్చినప్పుడెల్లమీ ముగ్వురిచేత వాగ్దానములు చేయించికొనలేదని ప్రతిజ్ఞలు చేయించలేదని యాయన మిక్కిలి యారాట పడుచుండెడివాఁడు. నాతోఁ బలుసారులీ విషయమును ముచ్చటించు చుండెను. నే నొకనాఁడు కులకనందితో నీవిషయము నీ మనస్సున కంత దుఃఖదాయకమయినచో నేను వారి వారి కడకుఁబోయి నీయభిమతమును వారికిఁ దెలిపి వారు నీ కోరికను మన్నించునట్లు చేయఁగలవాఁడనని చెప్పుచుండెడివాఁడను. ఆయన మొదట మొదట నా మాటల కంత పట్టింపిచ్చెడివాఁడు కాఁడు; గాని నేనే పలుసార్లిట్లు చెప్పుచుండుటచేత నొకసారి యిట్టులనెను. ఓయీ! నీకది యెట్లు సాధ్యమగును? ఆముగ్వురిలో నొకఁడు చేదిదేశమునందున్నాఁడు. అచ్చటికిఁ బోయినచోఁ బోవచ్చును. వానితోఁ జెప్పినచోఁ జెప్పవచ్చును. కాని తక్కిన యిద్దఱు ప్రాంతములయందు లేరు. ఒకఁడు వంగదేశము నం

దున్నాఁడు. మఱియొకఁ డాంధ్రదేశము నందున్నాఁడు. వారిని వెదకికొంచుఁ బోవుటయే కష్టము. ఇంతకు వెదకికొంచుఁ బోదువు, వారచ్చట నుండక మఱి యెచ్చటనో యుందురు. అట్లు వారిని వెదకికొంచుఁ బోవుచునే యుండవలయును. అది సులభసాధ్యమైన పనికాదు. మఱియు వా రిన్నియేండ్లు గడచిన తరువాత నామాటకంత పాటింపు నిత్తురా? వారిది మన దేశముకాదు. వారివి మనయాచారములుకావు. వారు నన్ను వచ్చి నాయందుఁ జేసిన శుశ్రూషయొక్క యాధిక్యముచేత నేను వారి కావిద్యలు నేర్పితిని; గాని లేనిచో నేర్పెడివాఁడను గాను. మఱియు నా యాంధ్రదేశము నందున్నవాఁడు పచ్చి భారతీయుఁడు. వానికి వేదమతము నందధికారము. ఆవిద్య నేను వానికి నుపదేశించునప్పుడే వాఁడు స్వీకరించుటకు వెనుకాడెను. దానియందు వానికి విశ్వాసము లేదు. అట్టివానినుండి మనమిట్టి ప్రతిజ్ఞ యింతకాలానికిఁ బోయి చేయించికొనుట తేలికయిన విషయముకాదు.'' అని రెండు మూఁడుసారు లనెను. నేను భయములేదని చెప్పితిని. ఒక విద్యకున్న మరియాద యావిద్యదే. ఆవిద్య మంచిదియో చెడ్డదియో, సంప్రదాయసిద్ధమైనదియో, కాదో? విద్య విద్యయే. అందులో భారతీయులు సంప్రదాయదాసులు. అతఁడు గొల్లవాఁడని చెప్పుచున్నారు. భారతీయ జాతులలో నాకుఁ దెలిసినంత వఱకు నుత్తమ వర్ణముల వారియందుఁ గంటె నవరవర్ణముల వారియందు సంప్రదాయాభిమాన మెక్కువ యుండును. ఉత్తమ వర్ణములవారు శాస్త్రములు చదివి తర్కపద్ధతి యలవాటై వారి సొంత యూహాలు వారు

చేయుచుందును. అవర వర్ణములవారు శాస్త్రగత చర్చా నిరూఢులు కాక విషయములను స్థూలముగాఁ దెలిసికొని వానియందు బద్ధాదరులయి యుందురు అతఁడు గోపాలకుఁడయి యుండుట మఱియు మంచిది. ఆవులను బెంచుకొను వాఁడు నావు పాలను త్రావెడివాఁడు నావులమీఁది గాలి నిచ్చలు తన మీఁద బ్రసరింపించుకొనువాఁడు మనశ్చాంచల్యము కలవాఁడై యుండఁడు. గోవుల యందు దిదియొక లక్షణమున్నది. వాఁడావులను ముద్దుపెట్టికొనును. 'అమ్మా' యని పిలుచును. దానికేదో పేరు పెట్టికొనును. భారతదేశములో నావునకును మనుష్యునకును భేదముగా నెంచికొనరు. ఆమూఢలుకూడఁ దమయింటిలోని పిల్లలనియే యనికొందురు. వారి మనసుమెత్తన వేఱు. నాని గంగడోళ్లు దువ్వుదురు. వానిని ముద్దు పెట్టుకొందురు. మెడలు కౌఁగిలించికొందురు. పృష్ఠ దేశములు, తోకలు, పాదములు గిట్టలు, నిచ్చలు పరామర్శించు చుందురు. వారికి సంప్రదాయమెక్కువ. ఒక తీవ్రమయిన భావమున్నచో దాని తీవ్రత పెఱ విషయముల యందుఁగూడ సహజముగనే భాసించును. నేను పోయి వారిని గలిసికొందును. నీకోరిక వారితోఁ జెప్పుదును. వారిచేతఁ బ్రతిజ్ఞలు తప్పకుండఁ జేయింతును." అని చెప్పఁగా గులకనంది సంతోషించి యిట్లనెను. 'మఱి యీపని కొన్నియేండ్లకూఁద జరుగవలసినది. నీవీ మూఁడు దేశములకుఁ బోవుటయు వారిని వారినిఁ గనుగొనుటయు వారిచేత నంగీకరింపఁజేయుటయుఁ జేసి మరల నింటికిఁ దిరిగివచ్చుటయు నీయుద్యోగము నీజీవితము నీదేశము నీభార్యాపుత్రులు నొక దాని

కొకటి పొసగెడివికావు" అన్నాఁడు. నేను నవ్వితిని. అయ్యా! కులకనంది నాయందొక తీవ్రమైన పట్టుదల కలదు. నీ కొఱకు నిరావతి కొఱకు నేపని జేయుమన్నను జేయుదును. ఆముప్వు రినిఁ గలిసికొని యీ ప్రతిజ్ఞలు చేయించుట పదేండ్లు పట్టినను బట్టవచ్చును. నేనంతవఱకు వివాహమాడను. అనేక దేశ ములు తిరుగుదును. వారి వారి యాచారములు తెలిసికొని యా దేశముల యందలి పరిస్థితులు తెలిసికొనుట దాని యం తటనదియే యొకవిద్య. నేనెచటనో సింధుదేశములోఁ బుట్టిన వాఁడను. ఖడ్గవిద్య కోసమింత దూరముగా లేదా? నాదొక నెందులకు? అటునెచ్చటనో దక్షిణదేశమునుండి యీ గంగే సీవద్దకు వచ్చెనుగదా! జన్మమెత్తిన మానవులలో నెక్కువ మంది తాము జన్మించినచోటి విద్యలే నేర్చికొందురు. అచ టనే జీవితములు వెళ్లబుచ్చికొందురు. కొంతమంది యట్లు కాదు. వారి సంఖ్య యల్పమేకావచ్చును. వారు జన్మించిన చోటివిద్యలు నేర్చుటతోఁ దృప్తిపడరు. తమకుఁ బరమే శ్వరుఁ డిచ్చిన సంపత్తుతోఁడను దృప్తిపడరు. అన్ని దేశము లకుఁ బోవుదురు. అన్ని విద్యలు నేర్తురు. అధికమైన సంపదను సంపాదించుటకుఁ బ్రయత్నింతురు. పరదేశములకుఁ బోయి పరరాజుల కొలువులలో జేరి మెచ్చుట గీర్తి సమార్జింతురు. అచ్చటనే నిలిచిపోవుదురు. వారి సంతానము నాల్గయిదు తరములు గడచిన తరువాత మాపూర్వులిచ్చోటివారు కారు. మేము పూర్వమా దేసస్థులమని చెప్పుచుందురు. కాని వారి యభిమానాదులన్నియు నీ క్రొత్త దేశపు టభిమానములే. వారీ పరజాతిలో గలసిపోదురు. ఇట్టివారిదొక ప్రకృతి. నేను

కులకనంది కీవాగ్దానముచేసి చేది దేశము వంగదేశము పోయి వారిద్దఱిచేతఁ బ్రతిజ్ఞలు చేయించికొని వచ్చితిని. నీవే మిగిలి నావు. చేదిదేశములోని శిష్యునిపేరు శతారి. అతనిని దేలిక గానే కలసికొంటిని. వంగదేశములోని వానిపేరు నిరంజ నుఁడు. అతనినిఁ గనుగొనుటకు నా బొమికలు చిట్లెములు కట్టినవి. నిన్నుఁ గనుకొనుటయు నంత కష్టముకాలేదు. ఏమియులేదు. నీకుఁ గులకనంది 'కాలంజరి' యన్న విద్యను నేర్పెనుగదా! ఆవిద్య నీతోడనే చావఁగూడదు. అది యెవ్వ నికో మరొక్కనికి నేర్పి నీవు చావవలయును. ఆసంప్రదా యము చెడిపోకుండ రక్షింపవలయును. ఈ విద్య యాప్రళ యాంతము సంప్రదాయముగా ననుస్యూతముగా సాగవలయు నని కులకనంది యూహ. దాని యుపాసనా క్రమముతో నా చారముల పాటింపుతోఁ బ్రయోగ రహస్యములతో ఫలాను సంధానముతో నెవనికో యొకనికి నేర్పి తీరవలయును. నేర్ప కుండ నదిలోపింపరాదు. ఇది కులకనందియొక్క పట్టుదల. విశ్వాసము. ఇంతే'' యనెను.

గంగునకు వెంటనే నిరంకుశుఁడు జ్ఞాపకము వచ్చెను. ఈ విద్య యతనికి నేర్పవచ్చును. అతఁడు దీనియందుఁ బట్టు దల కలవాఁడుగా నున్నాఁడు. తన చిన్ననాటి గురువుయొక్క కోరిక తీర్చినట్లుండును. దీనివలన వచ్చెడు నాపదయు లేదు. ఇంత చిన్న పనికోసమీ జయద్రథుఁడు మిక్కిలి శ్రమపడి వచ్చినాఁడు. వయస్సులోఁ దారతమ్యమున్నను జయద్రథుడు తనకు సతీర్థ్యుఁడు. ఈ రీతిగా నొక గురుఋణము తీర్చుట సులభమార్గమున సమాసన్నమై యున్నపుడు తిరస్కరించుట

యేల' యనుకొనెను. జయద్రథునితో ననెను. "ఎవరోయొక రాజవంశీయుఁడు నాకు సమీప దేశమునందలి తోజ్జుఁపట్టు మీఁది యధికారి. తనకేదో నేర్పుమని నాప్రాణములు తీయుచున్నాఁడు. అతనికి నేర్పెదను. ఈ మాత్రమునకు నీవింత దవ్వురానక్కఱలేదు. కాకిచేతఁ గబురంపించినచో నే నీపని చేసెడివాఁడను-అనెను.

జయద్రథుఁడు 'నేనే యాకాకి' నని నవ్వెను.

౫

ఎప్పుడైన గంగునింటికిఁ బరదేశీయులు వచ్చుట కలదు. అచట రెండు మూన్నాళ్లుండి పోవుట కలదు. రాజపురుషుఁడతని యింటికి వచ్చుట యెన్నఁడును లేదు. నిరంకుశుఁడా చుట్టుపట్ల నందఱకుఁ దెలిసినవాఁడే. ఆ కాలమునఁ దోజ్జుపట్టు నధికారియనఁగా గొప్పవాఁడు. అదియొక గొప్ప పదవి. ఏలయనఁగా నట్టి పదవి రాజవంశీయులకుఁగాని యీయరు. సేనానాయకుఁడు కావచ్చును. మంత్రి కావచ్చును. గణకుఁడు కావచ్చును. కాని తోజ్జుపట్టునధికారి కాఁడు. రాజునకు దగ్గఱి బంధువులే తోజ్జుపట్టుల కధికారులుగా నుందురు. తోజ్జుపట్టు లనఁగా గోకదంబముల విడిదిగదా! గోవులనఁగా నాకాలములో ధనము. ఒక రాజుయొక్క ప్రధాన సంపత్తి యతనికున్న యాలమందలనుబట్టి పరిశీలింపఁబడును. క్రయ విక్రయాదులయందు నొక వస్తువుయొక్క

వెలయెంతయని యడుగగా రెండు గోవులు మూఁడుగోవులని సమాధానము చెప్పెడివారు. అందుచేతఁ దొఱ్ఱుపట్టునధికారి యనఁగాఁ బ్రధాన ధనాధికారి యని యర్థము. బంగారము వెండియు నుండెడివి. నాణెములుగా ముద్రింప బడెడివికావు. ఆ లోహములు తూకము ప్రధానముగా వినిమయము జరుగు చుండెడిది. కాని సర్వవ్యవహారము వస్తువులకు బదులు వస్తువులుగనే జరుగును. వస్తువినిమయమునకు దాటిపోయినచో గోధనము తోడనే వ్యవహారము. గోవులయొక్క పరిశీలనము సంరక్షణము నా నాఁడొక మహావిద్యగా భాసించెడిది. నాటికి నూఱు నూటయేఁబది యేండ్లక్రింద పాండవు లుండిరి కదా! వారిలో సహదేవుఁడు మహారాజ పుత్రుఁడయి మహారాజ సోదరుఁడయి మహావీరుఁడయి గోసంరక్షణ విద్యానిపుణుఁడై యుండుటయే దీనికిఁ దార్కాణము. నిరంకుశుఁడు గొప్ప యధికారి.

అతఁడు గంగునింటికిఁ దొలుసారి తెలవాఱుజామున వచ్చినను వానిరాక నెఱింగినవారు పలుమంది కలరు. ఆ నాటి దేశములో సూర్యోదయము కాక ముందఱ మేల్కాని సర్వజనులును స్నానాదులఁ జేసెడివారు. ఆనాటి జనుల దీర్ఘాయుర్దాయములకు నిదియొక కారణము. నాల్గు దినములు గడచిన తరువాత మరల నిరంకుశుఁడు గంగునింటికి వచ్చెను. పలుమంది యతనిని జూచిరి. ఒకగొప్పయధికారి సామాన్యుని యింటికి వచ్చుట పలుమంది గొప్పగాఁ జెప్పికొనుటకు వీల యిన మాట. గంగు గొప్ప విద్యావంతుఁడని యందఱకుఁ దెలియును. కాని నిరంకుశుని రాక యతని గొప్పఁదనమునకు

మణుల మెఱుఁగు పెట్టినట్లున్నది. ఆ ప్రాతఃకాలమున నిరంకు శుని దర్శనము కొఱకుఁ బదిమంది యూరిలోని పెద్దలు వచ్చిరి. ఆమాట నానోట నానోట నిముసములో నాచిన్ని గ్రామమునఁ దెగప్రాఁకి పదిమందియు గంగునింటివద్ద నిరం కుశునిఁ గలిసికొని నమస్కారములుచేసి యిట్లు విన్నవించి కొనిరి. “మాగంగీ యూరిలో నున్నాఁడు గనుక తమవంటి రాజులు ప్రభువులు మాపల్లెలో నడుగుపెట్టుట తటస్థించినది. మా ధాత్రి పవిత్రమయినది. మాపల్లియ ధన్యురాలయినది” ఏతాదృక్ప్రశంసావాక్య పరంపరాపరిచితుఁడయిన నిరంకు శుఁడు వారి నాదరించుచుండెను. వెనుకటిరోజున నిరంకు శుఁడు వచ్చుటయు గంగుతో మాటాడుటయు గంగురాక నుటయు నిరంకుశుఁడు తన తోఁటపట్టు శోభవర్ణించి చెప్పి యతనిని మరులు కొలిపి తీసికొనిపోవుటయు జరిగినది. మరల నిరంకుశుఁడు వచ్చెను. అతఁడేమి మాటాడెడువాఁడో తెలి యదు. ఇతఁడేమి యనెడివాఁడో తెలియదు. ఊరిలోని పది మందియు నుండఁగా నిరంకుశునిచేత బతిమాలించుకొను టయు, దాని బిగియుటయు మొదలయినవి చేయుట న్యా య్యముకాదు. నిరంకుశునకుఁ గోపమువచ్చును. అతఁడెట్లయి నను రాజాధికారి. కారణము లేకుండఁ దన్ను బంధించ వచ్చును. రాజాధికారము క్రిందనుండు వ్యక్తియొక్క విశేష గుణము పరిగణింపఁబడదు. అందుచేత గంగు ఖడ్గమును డాలునుఁ దనచేతిలో గైకొని నిరంకుశునివెంట బయలు దేరెను. ఊరిలోని పెద్దలు గ్రామపుటంచుదాక వచ్చి వెను కకు మరలిరి. వారిలో వారిట్లనుకొనిరి. “గంగునకును రాజ

పురుషునకు మిక్కిలి స్నేహము. ఎంత స్నేహము కాకపోయి నచో నిరంకుశుఁడు కాలినడకను గంగు కుటీరమునకు వచ్చును? ఆయన వచ్చెను. ఇతఁడు మారుపలుకు లేకుండ నాయన వెంటఁబడి పోయెను. ఇద్దఱు ఖడ్గ విద్యాభ్యాసము చేయుదురు కాఁబోలు. ఇతఁడు ఖడ్గవిద్యలో గొప్పవాఁడని తెలియును. పరదేశములకుఁబోయి నేర్చికొని వచ్చినవాఁడు. కొడుకులకు నేర్పినాఁడు. చాలమంది వచ్చి యతనివద్ద నేర్చికొని పోవు చుందురు. కాని యింత గొప్పవాఁడని తెలియదు'' ఆనాటితో గంగునకు గ్రామములో గల మరియాద యిబ్బడియు ముబ్బ డియునయ్యెను.

గంగును నిరంకుశుఁడును దారిని సగము దూరము పోయిరి. గంగు తానిట్లు మొదలుపెట్టెను. ఆనాటినుండి నేనీ ఖడ్గవిద్యను సరిగా నభ్యాసము చేయుటలేదు. దిన దినము ప్రాతఃకాలములఁ గొంత కత్తి త్రిప్పుదును. చెట్లను నఱుకు దును. అంతకన్న నేనేమి చేయఁగలను. నాకుఁ జదువురాదు. ఉన్నకొంచెము నాభార్యయే చూచికొనుచుండును. ఇరుగు పొరుగువారు నాయందలి గౌరవముచేత దానిని దున్నించి పెట్టుదురు. విత్తులు చల్లి పెట్టుదురు. మూవి రెండు పొట్టలు. పది తిన్నను నేది త్రావినను సరిపోవును. నాకిది యొక్కటియే వినోదము. అలవాటయి పోయినది. నామూఁడవబిడ్డ రాజో ద్యోగిగాఁబోయి నాలుగేండ్లపైనయినది. మేమిద్దఱమింటిలో బిక్కు బిక్కు మనుచుఁ గూర్చుందుము. తెలవాఱుటయెట్లు? ప్రొద్దు గ్రుంకుట యెట్లు? ప్రొద్దుపోవుట యెట్లు? రేయిగడ చుటయెట్లు? నాభార్య కెట్లో యెట్లు గడచును. పవలెల్లఁ

బొలములోఁ బనిజేయును. రాత్రికివచ్చి యింత కూడుడక వేసి నాకుఁబెట్టును. తాను బండుకొని గుఱ్ఱుపెట్టి నిదురించును. నేను నాశరీరము నట్లు నిట్లు త్రిప్పుచో నాకు నిదుర పట్టదు. తిన్న యన్న మరుగదు. అందుచేత నభ్యాసముచేసి తీరవల యును. కొడుకులు నన్ను వదలిపోయిరన్న దిగులుచేత నేడాది రెండేండ్లు నేను నిర్వ్యాపారుఁడుగనే యుంటిని. ఆ రెండేండ్లన్నము సయించలేదు. నిదురపట్టలేదు. ఇదికాదు మార్గమని మరల నభ్యాసము నారంభించితిని. ఒక్కనాడును నేను పొలములలోనికిఁ బోయినదిలేదు. నడుము వంచినది లేదు. నేనచటికిఁబోయి యేమిచేయగలను. చెమటపట్టువఱకు గత్తిసాము చేయుటయు, గంటసేపు స్నానము చేయుటయు, నామె పెట్టు కూటికయి ప్రతీక్షించుటయు, దిని కొంతసేపటికిఁ బడినిద్రపోవుటయు, రాత్రి పండుకొని నిదురపట్టనిచో లేక నిదురపట్టెడివఱకు నాకుఁ గొన్ని శ్లోకములు వచ్చును. వానిని జదువుకొంచుఁ బండుకొందును. అయ్యా! నిజానకు శ్రీరామ చంద్రమూర్తి నాకొడుకును రక్షించెనుగాని లేనిచో వాఁడే మయ్యెడివాఁడు. నాబ్రదుకేమి కావలయును. చేతులార గొడుకునుఁ జంపికొని యుండెడివాఁడను. మరియును బుద్ధి మాంద్య మెటువంటిది. ఆమంత్ర మంత శక్తిమంతమో కాదోయని పరీక్షించుటకుఁ గొడుకుమీఁదఁ బ్రయోగింతురా? ఇంతకును బూర్వజన్మ పుణ్యము బుద్ధిలోనికివచ్చి యాదు కొన్నది. కొడుకుచేత రామజపము చేయించితిని. అదిరక్షిం చినది. ఈ తుచ్ఛ విద్యలు మహాశక్తిమంతములుకావు. పైగా నవి శత్రువులమీఁదఁ బ్రయోగింపఁ దగినవి. మన దేశములో

నీవిద్యలు లేవు కొన్ని యల్పిష్ఠములైన విద్యలు నీచవర్ణముల యందుఁగలవు. వాని పుట్టుక తెలియుటకు వీలులేదు. ఆ మ్లేచ్ఛదేశములలోనవి యధికముగాఁగ నచ్చట నివి యెట్లు పుట్టినవి? ఇచ్చట నధమ వర్ణములవారియందే యవి యేల యున్నవి? ఇది విచారించవలసిన విషయము. అసలు విద్య లెట్లు పుట్టినవి మాత్రము లెచట నుత్పన్నములగును. ప్రతి విద్యకు నొక సంప్రదాయము కలదు. గురుపరంపర కలదు. ప్రయోగక్రమము గలదు. విద్యలు తుచ్ఛములయినవే. ఈ హంగామా ప్రతిదానికిని గలదు" ఆపాటికి వారిద్దఱు నిరంకు శుని భవనము కడఁకు జేరిరి. నిరంకుశుఁడును లోనికిఁబోయి యుద్ధవేషమును వేసికొని వచ్చుటకుఁ గొంతసేపు పట్టెను. ఆ నాల్గు దినములక్రింద వీరాడిన యుద్ధవార్త కర్ణాకర్ణిగాఁ బలుమంది గోపాలురకుఁ దెలిసినది. వారు కొందఱువచ్చి చూచుట కాసక్తులై యుండిరి. ఇది మఱలఁ జిన్న సమస్య యయ్యెను. గంగు తెల్లవాఱుజామున మాటాడకుండ నెట్లు బయలుదేరవలసి వచ్చెనో మరలనట్లే నిరంకుశుఁడు వట్టి కత్తిపోరాటము గంగుతో నెఱపవలసి వచ్చెను. ప్రొద్దెక్కినది. గంగుదారిని గంగు వెడలిపోయెను. నిరంకుశునకానాటి సమావేశము నిష్ప్రయోజనమయ్యెను. మరల నెప్పుడు వత్తువని యడుగుటకును వీలులేకపోయెను. గంగు తనంతటఁదాను రాఁడని నిరంకుశునకును దెలియును. అడిగి ప్రయోజనము లేదు 'నేను మరల రేపో యెల్లుండియో వత్తును.' అని తానన రాదు. అనినచో నది తన మరియాదకు నష్టము. తాను గంగునింటికిఁ బోవుట తన ప్రజకుఁ దెలిసినచో వారి దృష్టిలో

దాను తక్కువవాఁడగును. తన కంటె గంగు గొప్ప ఖడ్గ విద్యావేత్తయని యనుకొందురు. అతనివద్దఁ దాను నేర్చి కొనుచున్నాఁడని యనుకొందురు. ఆ రాష్ట్రములో నిద్దఱే మహాఖడ్గ నిపుణులు. విజయసింహుఁడును దానును. వారిద్దఱు సమానులు. సృష్టిలోఁ దనయంతటి ఖడ్గవిద్యా నిపుణుఁడు లేఁడని లోకమనుకొందురు. తాను ననుకొనును. ప్రాసంగిక ముగాఁ దాను నకులుని యవతారమని చెప్పుచుండును. మరి కొందఱు నిదియే చెప్పుచుందురు. దానికది భంగకరముగా నుండును.

మఱల గంగునెప్పు కలసికొనవలయునో నిరంకుశునకుఁ దెలియలేదు. మరల నింకొక దినమున వానియింటికిఁ దెల వాఱుజామున నేగినచో నచట జనము మరల మూగుదురు. ఇచ్చట మరల గోపాలురు మూగుదురు. అందు నిందు నెం దును రహస్యమునకు వీలులేదు. గంగునకేమి పట్టినది. అతఁ డెందుకు రావలయును?

ఈ విచారణతో నెల, రెండునెలలు గడచెను. నిరంకు శునకు మనసులో నొక తీవ్రతకలిగెను. తక్కినవిద్య లె ట్లున్నను తప్పకపాధి దేవతాధి దేవతాకమయిన యాప్రేటు నేర్చికొనవలయును. అది సుక్షత్రియులు నేర్వరానిదని గంగు చెప్పెను. నేర్చినచోఁదప్పేమి? ప్రయోగించినచో దప్పుగాదని అనుకొనుచున్న నిరంకుశుని మనస్సుయొక్క వేఱొక పొరలోఁ బ్రయోగించవలయునన్న యభిలాష లేకపోలేదు. ఎవరిమీఁదఁ బ్రయోగించవలయునో ఎందుకుఁ బ్రయోగించ వలయునో లీలగా మనసులోఁ దారాడుచునే యుండెను.

ఆ మంత్రమునకుఁ బురశ్చరణ చేయవలయునట. దాని నియమములేవో తనకుఁ దెలియవు. అధికారికముగా గంగును రావలసినదని వార్తపెట్టినచో నతఁడవమానితుఁడై తనకా రహస్యమును జెప్పఁడు. రాక తప్పదు కావున వచ్చును. మఱి యీసమస్యాపరిష్కారమెట్లో తెలియుటలేదు. ఆనాఁడు శుక్లాష్టమి. చంద్రుఁడు మూఁడవజామున నస్తమించును. అప్పటికి రేయి జాముచ్చర మిగులును. తానాచీకటిలో నొంటరిగా లేచి గంగునకై పోవలయును. అపు డతఁడు గాఢనిద్రలో నుండును. పిలిచినచో బొరుగింటివారికిఁ దెలియును. అంత నడికిరేయి తా నేగినచో గంగుభార్య యేమనుకొనును. ఆమె యెడదలో నూఱక సందేహములను రేకెత్తించుట యగును. గంగు తన్నుఁగూర్చి యేమనుకొనును. తాను బేదమనసుఁవాఁడనుకొనును. అతని దృష్టిలోఁ దాను బలుచఁబడి పోవును.

అష్టమి గడచెను. నవమి గడచెను. ఏకాదశి వచ్చెను. అచ్చటికి నాల్గు క్రోశముల దూరమునందున్న యొక గ్రామమునుండి యొక బ్రాహ్మణుఁడు ప్రతి యేకాదశినాఁడు తన వద్దకువచ్చి నెలసరి పంచాంగము చెప్పి పోవుచుండును. ఆనాఁడతఁడు వచ్చెను. వచ్చి పలువిషయములు చెప్పుచు 'వచ్చెడి పూర్ణిమనాఁడు చంద్రగ్రహణ మున్న'దనెను. అని యనాఁడుగదా "అయ్యా! గ్రహణ సమయమందు స్నానము చేసి మంత్రోపదేశము పొందినను మంత్ర పురశ్చరణము చేసినను మిక్కిలి ఫలదాయి. మన దేశమున వందయేండ్ల క్రిందటివఱకు నాగ్నేయాది మహాస్త్రము లుండెడివి. క్షత్రి

యులందఱు వానినుపాసించెడివారు. యుద్ధములలో వానిని వారి శత్రువులమీఁదఁ బ్రయోగించెడివారు. మహా భారత యుద్ధముతో నామంత్రము లన్నియు వెనుకఁబట్టెను. దేశము నందెక్కువ శస్త్రవిద్యయే మిగిలెను; గాని యస్త్రవిద్యలు మిగులలేదు. మహా భారతయుద్ధము జరిగిన తరువాత వంద వందయేఁబది\యేండ్లు జరిగినను దేశమింకను గోలుకొనలేదు. రామరావణ యుద్ధము జరిగిన తరువాత మఱలనంతటి యుద్ధము జరుగలేదని పౌరాణికులు చెప్పుచున్నారు. ఒక మహాయుద్ధము జరుగుటయనఁగా నొక ప్రళయము వచ్చుట. భారతయుద్ధము ద్వాపరాంతమున జరిగినది. కృతా త్రేతా ద్వాపర కలియుగములు నాల్గును గలిసినచో మహాయుగము కదా. మహాయుగాంతమున నొక గొప్ప ప్రళయము జరుగును. అదికాక యుగ యుగాంతమునను బ్రళయములు జరుగు చుం డును. త్రేతాంతమున జరిగిన ప్రళయము రామ రావణ యుద్ధము. ద్వాపరాంతమున జరిగినది కురుపాండవ యుద్ధము. కృతయుగాంతమున జరిగినది దేవాసుర యుద్ధము. ఆ కురు పాండవ యుద్ధములోఁ బదునెనిమి దక్షౌహిణుల సైన్యము నశించిపోయెననఁగా నెంతమంది జనము, నెన్ని గుఱ్ఱములు, నెన్ని యేనుగులు నెంత ధనము నష్టమో! ఎన్ని వస్తువులు, ఎంత సంపద? దేశ దేశములయందలి సైనికు లా యుద్ధమునకు బోయిరామెను. మన యాంధ్రులెంతమంది యా యుద్ధమున మరణించిరో తెలియదు. కొద్దిమంది తిరిగి వచ్చినవారు కలరు. మాయూరిలో నొక మహావృద్ధుఁ డున్నాఁడు. అతఁ డానాటి కథలు సెప్పుచుండును. జనము చెవులుకోసికొని విను

చుందురు. తమరు సుక్షత్రియులు. తమరి కేదయిన మహా మంత్రమున్నచో నానాఁడు పురశ్చరణము చేసినచో నది సారవంతమగును.'' అని చెప్పి నిరంకుశుఁడిచ్చిన గోక్షీర మును బియ్యమును గూరలును దీసికొని యా బ్రాహ్మణుఁడు వెడలిపోయెను.

ఆనాఁడు ప్రొద్దు గ్రుంకెను. వెన్నెలలు వచ్చెను. సంజ వెన్నెలలో గోవత్సముల 'యంభా'రవములు పరమ మధురముగా వినిపించుచుండెను. తనకు భోజనము వేళ యైనది. 'మన సవ్యవస్థితముగానున్నది. భోజనము చేయున మనిపించలేదు. వంటవాఁడు ప్రతీక్షించుచుండెను. తన కొకటి రెండుసార్లు కనిపించి పోయెను. వంటయైనది భోజనమునకు రండని వాఁడు నోటితో ననరాదు. వాఁడు ద్వారమునందు నిలుచుండి నిరంకుశునివంకఁ జూచును. దాని తాత్పర్యము వంటయైనదని తాను చెప్పుట. వంటవాఁడదివఱకే రెండు సార్లు ద్వారమునందు నిలుచుండి యీగుర్తు నభినయించెను. నిరంకుశున కొక్కటే దిగులు. గ్రహణమింక నాల్గుదినము లలోనున్నది. ఆనాఁటికా మంత్రోపదేశము జరుగవలయును. గ్రహణము రాత్రి మూఁడవజామునఁ బట్టునని బ్రాహ్మ ణుఁడు వెడలిపోవునప్పుడు తా నడుగగా నతఁడు చెప్పెను. సంపూర్ణ గ్రహణము. ఆ సమయమున నంతయుఁ జిమ్మ చీకటి. గంగారాత్రి తన యింటికి వచ్చుటయో తానచ్చటికి బోవుటయో జరుగవలయును. అది యెట్లు జరుగును? నిరంకు శునకుఁ దెల్లవాఱలేదు. కాని తెల్లవాఱినది. తాను తన రాచఠీవిని వదలుకొనవలయును. నలుగురు నేమనుకొందురో

యనుకొన్న సంకోచమును బరిత్యజించ వలయును. ఇంతలో నొక యూహవచ్చినది. అచ్చట నీతని గ్రామములోఁగాని యిచ్చటి తనప్రజలలోఁగాని పరిశీలించగాఁ దాను గంగును స్నేహితులన్నట్లు వారనుకొనుచున్నట్లు వారి కదలికలలో వారి నవ్వులలో వారి చూపులలోఁ బొడగట్టెను. వారి యెద లలో నున్న యీ మైత్రియన్న భావమునకుఁ దాను వాని యింటికిఁ బోయినచోఁ బ్రాచుర్యము కలుగును. నష్టమేమియు లేదు.

ద్వాదశినాఁడు సంధ్యాకాలమునఁ దానొక రాజ భటుని వెంటఁదీసికొని గంగు పల్లెటూరికిఁ బోయెను. గంగు నిరంకుశునిఁ జూచి నివ్వెఱపోయెను. ఇది రహస్యాగమనము కాదు. బాహిరముగా నున్నది. గంగునకొక యూహ తోఁ చెను. ఇది కాలంజరీ మంత్రోపదేశమునకు యోగ్యమయిన ప్రదేశము. గురునిర్దేశము చేసినట్లగును. కాని గంగు మన స్సులో నొకద్వైధీభావముకలదు. ఈమ్లేచ్ఛదేశ మంత్రమును స్వచ్ఛమైన రాజపుత్రున కుపదేశించుటయా? ఆ మంత్ర ముల కధమ వర్ణములలో వ్యాప్తికలిగిన కలుగవచ్చును. ఉత్తమ వర్ణములకుఁ జెందిన జనులలో నీమంత్రముల నిక్షే పము జరుగుట, కలి ప్రవేశించిన లక్షణము. ఆ మంత్ర మీ యనకే చెప్పవలసిన యవసరమేమి? కడచిన నాలుగేండ్లుగాఁ గత్తివిద్య నేర్చికొనుటకుఁ దనవద్ద కెవ్వఁడును వచ్చుటలేదు. రెండేండ్లు తానావిద్యను మానివేసితి ననఁగా శిష్యులు వచ్చుట మానివేసిరి. మఱికొన్నాళ్లకు శిష్యులుగా నెవరో రావచ్చును. వారికది నేర్పవచ్చును. వారు సైన్యములలోఁ

జేరవచ్చును. వారు సామాన్య యుద్ధములలోఁ బరులమీఁదఁ బ్రయోగింతురు. ఇచట నట్లుకాదే. ఈయన యీవిద్య నేర్చుకొనుట కింత పట్టుదల యెందుకుఁ జూపుచున్నాఁడు. ఇతనికిఁ బ్రబలమయిన విరోధి యెవఁడయినఁ గలఁడా? ఇతఁడు గొప్ప ఖడ్గ విద్యా విశారదుఁడు. రెన్నాళ్లతనితో ఖడ్గవిద్యాభ్యాసము చేయుటచేతఁ దెలిసినది. మొదటిసారి కంటె రెండవసారి తనవిద్యా ప్రదర్శనము ప్రచండముగాఁ జేసినాఁడు. అతని కత్తి దెబ్బలకుఁ దాను గొంచెము గడ్డుగా నొడ్డుకొనవలసి వచ్చెను. ఇంతటి యోధుఁడు మఱియొకఁ డెవ్వఁడో యుండవలయును. అతఁడు నింతటి విద్యావంతుఁడై యుండవలయును. అతఁడును నిస్సంశయముగా రాజవంశీయుఁడై యుండవలయును. ఈ తుచ్ఛమైన విద్యనుపయోగించి యీ రాజవంశీయు నితఁడు సంహరించినచోఁ దన కేపాపము వచ్చునో? ఆతలివాఁడు రాజ వంశీయుఁడయినచో నిట్టి మ్లేచ్ఛవిద్యకు లొంగవలసిన యవసరములేదు. అతఁ డుపనయనాది సంస్కారములు పొందియుండును. వైదిక మంత్రోపాసనా పరుండయి యుండును. తనకొడుకు శూద్రుఁడు. వాని చేత వట్టి రామనామము చేయించెను. దానిముందే యీ తుచ్ఛమంత్రము నిలువలేదు. వైదికమార్గమున మంత్రోపాసనా పరులయిన వారిముందఱ నిది యే మాత్రము నిలువదు. కాని తాను తనకొడుకుమీఁదఁ బ్రయోగించు చూచినది 'బగల','కాలంజరి' కాదు. ఈ కాలంజరిని మఱెవ్వరికో యుపదేశించుమని కులకనంది యాజ్ఞ. ఆ జయద్రథుఁడు చెప్పఁగా విని యూరకుండనైన లేదు. 'అల్లే' యని నోటితో

ననిమైన మానలేదు. ఆ జయద్రథుడు ప్రచండుఁడు. అతఁడు కత్తి వాదఱమీఁద జేయి వేయించి గురువుపేరు చెప్పఁజుం బ్రతిజ్ఞ చేయించినాఁడు. బగల కంటెఁ గాలంజరి భయంకర మైన విద్యయా? ఆవిద్యలలో దేనికే శక్తియున్నదో తానెప్పు డును విచారించలేదు. నేర్చికొనెను; వచ్చెను. వాని ప్రసక్తి నెప్పుడు పట్టించికొనలేదు. తను దన శిష్యులకెవ్వరికి నీవిద్య లను చెప్పలేదు. తన కొడుకులకే చెప్పలేదు. ఈ నిరంకుశు నితో 'బగల' విద్యా ప్రస్తావన తానెందుకుఁ జేసెను? అతని ఖడ్గ విద్యా ప్రావీణ్యము చూచెను. అంతకుమించి ప్రావీణ్య మెట్లుండును? ఆ విద్యయే శరీరముయొక్క యధికలాఘవము. హస్తాల్లంఘనము, నవయవచాలన నైపుణ్యము మొదలయిన వానిచేత నధికముగా భాసించవచ్చును. ఈ నిరంకుశుఁడేదో చెప్పుమెదో చెప్పుమని బలవంతముచేయఁగాఁ దనకు మ్లేచ్ఛ జాతులయందుఁగల ద్వేషముచేత వారి విద్యలయందుఁగల నిరాదరముచేత దానినిఁగూర్చి ప్రస్తావించెను. అది యిపుడుపచ్చి కుత్తుకకుఁ బట్టికొన్నది. మఱియు నీ సమ యమునందే జయద్రథుఁడు వచ్చుటయేమి? ఈ యాజ్ఞ భా సించుటయేమి? ఆ జయద్రథుఁడు చెప్పినమాటలన్నియు నిజ మేనా? అతఁడు నిస్సందేహముగాఁ గులకనంది శిష్యుఁడు. కులకనంది యాజ్ఞ యిచ్చుటయు నిజమే. అతఁడిరావతి పూర్వకాలమునఁ దాను ధరించిన నడుమునకుఁ గట్టికొనెడు గుడ్డ ప్రాతది తెచ్చి నాకు గుర్తు చూపించెను. నా కామెను జూచినట్లేయుండెను. ఆయిరావతి ముద్ర నామీఁద నెంత యున్నది? నా తల్లిమీఁదకంటె నామె మీఁదనే నాకెక్కువ

యనురాగమైనట్లున్నదే. ఔను, నాలుగేండ్లా దేశములో నేనే నాఁడు చచ్చినను జావవచ్చును. ఆమెకు నాయందుఁ గల ప్రేమచేత బ్రదికియున్నాను. ఈ సంగతి నా యెడద మీఁద నంతగా నత్తికొని యున్నది. ఇరావతిమీఁదఁ బ్రేమ యున్నది. కులకనందిమీఁద లేదు. పరిస్థితులనుఁబట్టి యిరావతియొక్క మాట యొత్తిడిచేత నాకతఁడు కొన్ని ప్రయోగములు నేర్పినాఁడు, కాని బుద్ధిపూర్వకముగా నేర్పలేదు. అతని యాజ్ఞ నేనెందుకు నెఱవేర్చవలయును? ఈ యాజ్ఞ నెఱవేర్పవలయునని యిరావతి కూడఁ జెప్పినదిగదా! ఆమె తన దుస్తులలోని యొక భాగమును బంపించెను. నేను గత్తిపట్టిన వాఁడను. కత్తివాదఱమీఁదఁ జేయివేసి ప్రతినచేసి నిర్వహించక పోవుట కత్తివిద్యకు సిగ్గుచేటు. ఆ ప్రయోగము నీయనకే యేల చెప్పవలయును? పరిస్థితులన్నియు నితనికే చెప్పినఁగాని ప్రతిజ్ఞానిర్వాహణము జరుగనట్లున్నవి. నాకొకటి జ్ఞాపకము వచ్చుచున్నది. ప్రతిజ్ఞ చేసినప్పు డీస్ఫురణలేదే. కాలంజరీ విద్య పరున కుపదేశించిన తరువాత నల్పకాలములో నుపదేష్టకేదియో యాపదవచ్చునని కులకనంది నాతో నన్నాఁడు. ఆమాట విచిత్రముగా నిపుడు స్ఫురించుచున్నది. ఇంచు మించుగా వందయేండ్ల క్రిందటిమాట. అది యిప్పుడు స్ఫురణకు వచ్చుటయేమి? అంతయు విచిత్రముగా నున్నది. కులకనంది నా కుపదేశించినాఁడు. అతనికేమి యాపదవచ్చినది? సుగానోరి తండ్రితోఁ గలహించి వెడలి పోయెనని జయద్రథుఁడు చెప్పెను. అదియా యతనికి వచ్చిన యాపద? నాకొడుకులు కలహించక పోయినను నన్ను వదలి

వెళ్లిపోయినారు. నాకట్టి యాపదవచ్చుటకు వీలులేదు. ఆపద వచ్చుననన్నారుగాని యిట్టి యాపదయని నిర్ణయములేదే. అదిరాకమున్నుదాని స్వరూప మెవ్వరికిఁ దెలియును?

గంగు నివ్వెఱ పోవుటయు నూఱకే తన్నుఁజూచుచు నిలుచుండుటయు నేదియో యాలోచించు చుండుటయు నరగడియసేపిట్లు జరిగెను. నిరంకుశుఁడు చివఱ కిట్లనెను. "ఓయీ గంగూ! నీతో నేను మాట్లాడవలయును. మన మిద్దఱ మేకాంతముగా నొక చోటికిఁ బోవలయును. నీకే దయినఁ బనియున్నదా! రాగల్గుదువా? వచ్చుట కేమయిన యభ్యంతర మున్నదా" నివ్వెఱనుండి వెలికివచ్చిన గంగు తానాలోచించి సమాధానము చెప్పుటకు మనసులో వెసులు బాటులేక 'నాకేమియు నభ్యంతరములేదు. తమరి యాజ్ఞయైనచో వచ్చుచున్నాను' అని నిలుచున్నవాఁడు నిలుచున్నట్లే బయలుదేరెను. అప్పటికి వెన్నెలలు వచ్చెను. ప్రాగ్దిశాకాశమున రెండుబాఱలమేర మొఱికియుండియు లేనట్లు కనిపించు చంద్రుఁడు లేఁత దెలిమబ్బు దొలఁగిపోగాఁ దెలి వెండినూక జల్లించెను. వెన్నెలకాయును. ఎండలు కాయును. గాలులు విసరును. సృష్టిలో నివి సామాన్య లక్షణములు. కాయుచునే యుండును. విసరుచునే యుండును. మనమనస్సు వానిమీఁద నుండనపుడు వాని కాయుటలోని, వాని విసరుటలోని తళుకు స్ఫురించదు. అవి కాయుచునుండఁ గాలి విసరుచు నుండఁగా నొక కాలైక దేశమున మనశ్రద్ధ వాని మీఁద వ్యాపించును. అప్పటి వాని సొగసు వేఱు. ఈ శ్రద్ధ వ్యాపించిన కాలైక దేశమునకు దత్కాలమునందే మబ్బు

తొలఁగినతనమునకు సంయోగము కలిగిన వేళమైనచో దాని రమ్యత యెడఁద లోఁతులకుఁ దగులును. నిరంకుశుఁడట్టి యొక నిర్వాణమును దత్కాలము ననుభవించెను.

నిరంకుశుఁడు తనవెంట వచ్చిన భటునితోఁ దాను ప్రొద్దుపోయి వత్తుననియుఁ దనకై ప్రతీక్షించ వలదనియుఁ జెప్పి వానినిఁ బంపించెను. వాఁడు తన చేతిలోని ఖడ్గమును నిరంకుశున కందీయఁ బోయెను. నిరంకుశుఁడు ఖడ్గముతో నవసరము లేదనెను. గంగు 'కాదు కాదు ఖడ్గముతో నవసర ముండవచ్చును. అర్ధరాత్రమునందు దిరిగి యింటికిఁ బోవు వేళ నేమి యెదురువచ్చునో యెవరికిఁ దెలియును. ఖడ్గము దగ్గఱనుండుటయే మంచి'దనెను. నిరంకుశుఁడు 'నేనునిన్నొక చోటికిఁ దీసికొని పోవుచున్నాను. ఆచ్చటి నుండి నీవు నొంట రిగనే తిరిగిరావలయును. నీవద్ద ఖడ్గము లేదుగదా' యని నవ్వెను. గంగు 'నేను రాజపురుషుఁడనుగాను. రాజవంశీయుఁ డనుగాను. నా బ్రదుకెట్లయిన నేమి? ఐనను భటునకు మాఱు నేను దమ ఖడ్గమును మోసికొని వచ్చెదను' అని భటునివద్దనుండి ఖడ్గమును దానుతీసికొని నిరంకుశుని వెంట నడచుచుండెను. నిరంకుశుఁడు ఖడ్గము తనచేతికిమ్మని రెండు మూఁడుసార్లు బలవంతము చేసెను. గంగీయలేదు.

అచటికి నొక క్రోశములోపు దూరమున నొక పెద్ద తటాకమున్నది. అది త్రవ్వినదికాదు. నీటి వాలునుజూచి యడ్డ కట్టవేసి దానిక్రింద సాగు సాగించెడిది. సాగు జరిగెడి మేర నాల్గయిదు పల్లెలుగలవు. ఈతటాకము నెగువభాగమున నీరు వాగుగాఁ దటాకము లోనికివచ్చు ప్రదేశములయందు

సామాన్యముగాఁ బల్లెలుండవు. అంతయు నడవిగా నుండును. వాగులు కయ్యలు కోసియుండును. నిరంకుశుఁడు గంగు నచ్చటికిఁ దీసికొనిపోయెను. అది పెద్ద యడవియుఁగాదు; కాకను పోలేదు. అందందు వల్మీకములు పెరిగియుండెను. చిన్ని దుబ్బులు-ఎండిన తుంగప్రదేశములును గ్రీష్మకాలము వర్షకాలము కాకపోవుటచేత రాత్రులు చల్లఁబడినను, బవల్లెండ కాయుటచేతఁ గొంతమేర గరికయెండి కాళ్లలో గ్రుచ్చికొనుచుండెను. పాదరక్షలుగల నిరంకుశునకాబాధలేదు. వాకిఁటిలో వాఁడు వాకిఁటిలోనుండి బయల్దేరివచ్చిన గంగున కాబాధ కలుగుచుండెను. అతఁడింటినుండి కదలెడివాఁడు కాఁడు. పొలాలలో దిరిగెడి వానికివి లెక్క-యుండవు. కత్తియుద్ధము చేసెడివానికి యుద్ధముచేయు సమయమునందుఁ బాదములకు బిగించి కట్టుకొనెడు చెప్పులు యుద్ధవేష యోగ్యములు. ఆ సమయమునకు వట్టి సమయములకు సంబంధములేదు. కాని యీ గరిక ముళ్లే చల్లఁబడిన తరువాత గొంచెము కొంచెముగా మెత్తఁబడుచుండెను. ఇంతదవ్వు నిద్దఱుమాటాడకుండఁగనే నడచిరి. ఒక సమప్రదేశము చూచి కూర్చుండుటకచ్చోటు మెత్తగా నుండునని భావించి నిరంకుశుఁడచట కూర్చుందమా యనెను. అని కూర్చుండెను. గంగు నిలఁబడియే యుండెను. నిరంకుశుఁడతనిని బలవంతపెట్టెను. తాను గూర్చుండక పోయినచో నిరంకుశుఁడు తానేవచ్చి పట్టుకొని కూర్చుండఁ బెట్టునా యన్నట్లుండి గంగు కూర్చుండెను. కత్తియుద్ధము చేసెడువేళఁ దత్ప్రస్తావన జరిగెడు వేళ గంగున కాయన రాజవంశీయుఁడనిపించలేదు. రెండుసార్లు

వెళ్లెను రెండుసార్లు యుద్ధముచేసెను. ఆసమయముల యందిద్దఱు ఖడ్గవీరులు. గంగుకాభేదము తెలియలేదు. ఈపరిస్థితి తద్భిన్న మయినది. గంగున కతఁడు రాజవంశీయుడుగా భాసింప నారంభించెను. తాను వినయ మవలంబించవలయును. అవలంబించుటకాదు. వినయము సహజముగా నతని గుండెలోనుండి తఱుముకొని వచ్చుచుండెను. గంగునకుఁ గూర్చుండినను ముండ్లమీఁదఁ గూర్చున్నట్లుండెను. నిరంకుశుఁ డిట్లనెను. 'అదియెవో కూపపిశాచ విద్యయంటివి. దానిని గుఱించి విన వలయునని యున్నది. అందుకనియే నిన్నుఁ దీసికొనివచ్చితిని' నిరంకుశుఁ డీమాట యనినంతనే గంగున కాలోచనాశక్తి పోయినది. అతని కిట్లువచ్చుటయుఁ గూర్చుండుటయుఁ బ్రసంగించుటయు నలవాటులో లేనివి. విశ్రాంతి కలవారు ధనవంతులు నధికారులు వాహ్యాళి పోదురు. ఇది వాహ్యాళివలె నున్నది. వాహ్యాళియన్న యూహయు గంగునకు లేదు. ఇద్దఱు స్నేహితులు పనియుఁ బాటయులేక పల్లెకెంతో దూరముపోయి యచటఁ గూర్చుండి ముచ్చటించుకొనుట యన్న విషయ మతని కనుభవములో లేనిది. గంగున కచ్చటి నుండి మొత్త పెందలకడ నింటికిఁ బోయిన నంత ప్రాణము తేలిక యిచ్చునట్లుండెను. అందుచేత నతనికి నూహాశక్తి పోయినది. అతఁడిట్లనెను. 'అయ్యా! తమరికూఱక వినవలయునని యున్నదా? నేర్చికొనవలయునని యున్నదా? నేర్చికొనవలయునని యున్నచో దానికంటెఁ బెద్దవిద్య యొకటి కలదు. మీతోఁ దొలుత నేను మనవిచేసిన విద్య దీనికంటె నల్పమయినది. నాకొడుకుచేత రామ నామము చేయించినంత

మాత్రమున నది వ్యర్థమయినదని మనవి చేసితినిగదా! మీరు నేర్చికొందుమన్నచో నేనింకొక విద్య నేర్పెదను. దానిశక్తిని నేను బరీక్షించలేదుగాని తొలుతఁటి దానికంటె నిది యధికమైనదని నాకు గట్టియూహ యేర్పడినది. ఏల యనఁగా నా గురువు 'దీనిని నీవింకొకనికిఁ జెప్పితీరవలయును. తర తరము దాని వరుస చెడరాదు.' అని నాకాజ్ఞయిచ్చుట చేత నిది మహాశక్తిమంతమయిన విద్యయని నేననుకొను చున్నాను. దానిని మీకు నేర్పెదను. అది నేర్చికొనుటకు గ్రహణవేళ కావలయును'. అనఁగా నిరంకుశుఁడు నేఁడు ద్వాదశి. రేపు నెల్లుండిలేను. ఆ మరునాఁడు పూర్ణిమ ఆ నాఁడు చంద్రగ్రహణమున్నది. రాత్రిమూఁడవజాము గ్రహణము పట్టును. సంపూర్ణ గ్రహణము. నాకది నేర్పుమనెను.

గంగునకు మనస్సులో నేదియో తళుక్కుమనెను. కటుక్కుమనెను. అతఁడాశ్చర్యపోయి యిట్లనెను. 'ఔను స్వామీ! ఆ గ్రహణమునకు మూన్నాళ్లకుఁ బూర్వము రాత్రి రెండు జాములవేళ స్నానముచేసి దీక్షపుచ్చికొనవలయును. ఆమూన్నాళ్లొక నియమముతో నుండవలయును. గ్రహణము వేళ మంత్రము పుచ్చికొనవలయును' అనెను. నిరంకుశుఁడు 'సరే' ఇచటనే రాత్రి రెండుజాములవఱకు నుందము. దూర ముగాఁ జెఱువులో నీళ్లున్నవి. స్నానముచేసి వచ్చెదను. నియమములేవియో నీవు చెప్పుము. 'నేనీ మూన్నాళ్లు వాని నాచరించెదను. పూర్ణిమనాఁడు రాత్రి రెండుజాములవేళ నే నిచటికి వత్తును. నీవును రమ్ము. మనము వచ్చిన తరువాతనే

గ్రహణము పట్టును. ఆసమయమునందు నీవు నా కామంత్ర మును జెప్పవలదువుగాని'.

గంగునకు మనస్సులో మఱల రెండు చీలికలు బయలు దేరును. నోటిదాక వచ్చుచున్నది. 'ఇది తుచ్ఛవిద్య. సుక్ష త్రియ వంశీయులకు యోగ్యమయినది కాదు. దీనివలన నేమి యాపదలు వచ్చునో తెలియదు' అని. "కాని యీమాటలు నోటినుండి రాలేదు. కాని తన మనస్సు తొంబది సంవత్సర ములకు వెనుకకుఁ బోయెను. తానావిద్య వలదనెను. కులక నంది నేర్చికొమ్మని బలవంత పెట్టెను. ఆవిద్య నేర్వనిచో నీ వీ దేశములో బ్రదుకలేవని చెప్పెను. అదినేర్చిన వాని కెదురులేదనెను. నేను నీకీ విద్య చెప్పితినని క్రమక్రమముగా నందఱకుఁ దెలియును. నీ వంక వేలెత్తిచూచెడి వాఁడుండఁ డనెను. తన యనుభవముకూడ నట్టిదే. ఆకొండ దేశములోఁ గులకనంది పల్లెకుఁ జాలదవ్వున నొక కొండప్రక్క నొక బావి యున్నది. ఆ రాత్రిపూట కులకనంది తన్నచట స్నానము చేయించెను. కూర్చుండఁబెట్టి కొన్నిమాటలు చెప్పెను. వాని నామూనాళ్లు జపించుచుండ వలయునని చెప్పెను. నీవు నా వెంట రాఁగూడదు. నేను వెళ్లిన తరువాత జాముసే పుండి నీవింటికి రావలయును. నీ వింటికిఁ దిరిగివచ్చినచో నీవు బ్రదికియున్నట్లే. తరువాత మూనాళ్లు భయములేదు. ఆ రాత్రికి మంత్రము నేర్పెదను. ఆమంత్రము నేర్పిన తరు వాత దానికి యోగ్యమైన కత్తి మలుపులును బ్రయోగము లును బాద చంక్రమణమును నేర్పెదనని చెప్పినాఁడు. తాను స్నానముచేసెను. అతఁడు నాల్గక్షరములతోడి యొకమాట

చెప్పెను. కులకసంది వెడలిపోయెను. తానామాట యనుచు జాముసేపచ్చటనే కూర్చుండెను. తానుఁ బయలుదేరఁబోవు వేళకుఁ జంద్రుఁడస్తమించుచుండెను. తడిగుడ్డలతోఁ దాను బయలుదేరెను. ఆదేశమునందు, బవలెంత వేడియో రేల నంత చలివాడి. వారు ధరించెడు దుస్తులు వంద ముడుతలు గల గుడ్డలు. పవళ్లయందలి యెండ నెంత పరిహరించునో రాత్రుల యందవియు నంతయుక్కపోసి చంపును. కొంత చలినాపును. కాని యవి తడిగుడ్డలైనచో శీతమండలములో నున్నట్లే. ఆగుడ్డలతోఁ దానారాత్రి పడిన యమబాధ తన కంతయు జ్ఞాపకమునకు వచ్చెను. అతఁడు కత్తి చేతఁబుచ్చి కొని యింటికిఁ దిరిగివచ్చుచుండెను. అది యెలుఁగుబం ట్లుండెడి దేశముకాదు. సివంగులుండెడు దేశముకాదు. పాముల కేమి, సమృద్ధిగాఁ గలవు. ఆదారి తనకుఁ బరిచితమయినను బరిచితము కానట్లేయుండెను. వెళ్లునప్పుడు దారిలో వల్మీ కములులేవు. తిరిగి వచ్చునపుడన్నియు వల్మీకములే. పుట్ట లలోనుండి పాములు పడగలూపి తనమీఁదికి వచ్చుచుండెను. అందులోఁ గొన్ని ప్రత్యక్షముగాఁ దనమీఁదికి దూకెను. తాను కత్తితో వాని పడగలయందు నడిమికి ఖండించెను. తరువాతఁ గొన్ని సివంగులు కొన్ని యెలుగుబంట్లు తన మీఁదికి వచ్చెను. వానిని గూడఁ దాను జంపెను. అవి యెచ్చటనుండి వచ్చినవో తనకుఁ దెలియదు. మఱునాఁడు పోయి వానిశవము లచ్చటనున్నవేమో చూడవలయు నను కొనెను. తరువాత రెన్నాళ్లు తాను గదలుటకు వీలులేదు. ఇంటిలోఁ గూర్చుండి నిద్రాహారములు మాని యా యక్షర

ములే యుచ్చరించుచుండవలయును. కదలఁగూడదు. మూఁడవనాఁటి రాత్రి కులకనందియు దాను నచ్చోటికిఁ బోయిరి. ఆరాత్రి పూటఁ దనకు సర్పముల కళేబరములుకాని, సివంగులయు భల్లూకములయు కళేబరములుకాని కనిపించలేదు. ఏమో గ్రద్దలు తినవచ్చును. నక్కలు లాగికొని పోవచ్చును. తాను కులకనంది నడుగలేదు. గంగిట్లనుకొనెను. ఈయన మహా ఖడ్గవిద్యా నిపుణుఁడు. పడగవిప్పి పాములను గోఁజల నడుమగా ఖండించ గలఁడు. సివంగులను భల్లూకములను సంహరించఁ గలఁడు.

గంగు నిరంకుశుని స్నానముచేసి రమ్మనెను. అతఁడు స్నానము చేసి వచ్చెను. ఆనాల్గక్షరము లతనికిఁ జెప్పెను. దాని నియమములన్నియుఁ జెప్పెను. 'నేను వెళ్లిపోవుచున్నాను. మీరు చంద్రాస్తమయమైన తరువాత నీతడిగుడ్డల తోడనే యింటికిఁ బోవలయును. మూనాళ్లు నిద్రాహార ములు పనికిరావు. ఆయక్షరములే యనుచుండ వలయును. పూర్ణిమనాఁడు రాత్రి రెండుజాముల వేళను నేనిచ్చటికి వత్తును. మీరుకూడ రావలయును. రాత్రి రెండుజాములైన తరువాత నేఁడు చీకటిలో మీరింటికిఁ దిరిగిపోవువేళ మీరు మీకుఁ గత్తివిద్యలోఁగల నైపుణ్యమంతయు జ్ఞాపకముంచుకొనవలయును.

## ౬

శ్రీముఖ విజయసింహ నాగార్జునులు ముగ్వురికి వివాహములైనవి. శ్రీముఖుఁడు యువరాజు. రేపు రాజు కాఁబోవువాఁడు. అందుచేత నతనికి రాజ్యము చేయురాజు తన కూతునిచ్చెను. కాని విజయసింహుఁడును నాగార్జునుఁడును భవిష్యత్తులో రాజులుకారు. వారికి రాజ్యముచేయు రాజులు తమ కూతులనీయరు. కాని రాజకుమారులు కనుక రాజ్యము చేయు రాజునకు దగ్గఱివారి కూతులనిచ్చి పెండ్లి చేయుదురు. విజయసింహున కట్టి సంబంధమే వచ్చినది. నాగార్జునుని పెండ్లి మఱియొక రీతిగానయ్యెను. నాగార్జునుఁడు చిన్నప్పటి నుండి కొంత యథేచ్ఛముగాఁ బెరిగినవాఁడు. కృష్ణ కుడి తట్టున రాజధానికి దిగువనున్న పల్లెటూళ్లలోఁగొన్ని యూళ్లకుఁ గలిపి రాజవంశీయుఁ డొకఁడు పాలకుఁడుగా నుండును. అతఁడొక చిన్నకోట కట్టి దానిలో నుండును. ఆయన పేరు విక్రముఁడు. ఆయన రాజధానికిఁ బూర్వము మిక్కిలిగా రాకపోకలు చేసెడివాఁడు. రోమపాదుని భార్యయు నతఁడును గొంత బంధువులు. విక్రముని తల్లియు రోమపాదుని యత్తగారును వ్రేలువిడిచిన మేనత్త మేనమామ బిడ్డలో, యేదో? అందుచేత విక్రముఁడు రాజధానికిఁ బూర్వము తఱచుగా వచ్చుటకలదు. నాగార్జునుఁడు తల్లివద్దనే చిన్నతనమున నెక్కువ తిరుగుచు విక్రమునకు నతనికిఁ బరిచయ ప్రేమములెక్కువయ్యెను. నాగార్జునుఁడు తఱచుగా విక్రముని యింటికిఁ

బోవుటయు నచటనే యెక్కువ దినము లుండుటయు జరుగు చుండెడిది. విక్రమునకు సంతానములేదు. అతఁడు తన దూర బంధువయిన యొక క్షత్రియుని కుమార్తెను దనయింటిలో నుంచికొని పెంచుచుండెను. ఆక్షత్రియుఁడు చాలపేదవాఁడు. కాని యా బాలిక సౌందర్యవతి. వివేకవతి. చూచినవా రందఱు నీమె పట్టమహిషి యగునని చెప్పుచు వచ్చిరి. విక్ర ముఁడా పిల్లకు సంగీత సాహిత్యములు నేర్పించెను. ఆమెపేరు నీల. ఆమె వివేకము కొంత విలక్షణమైనది. ఏ మాట చెప్పి నను దానికి వ్యతిరేకముగాఁ జెప్పును. దానిని హాస్యరసము లోనికి దించును. ఎంత మనస్ఫూర్తిగా గాఢముగా నీవు విశ్వసించిన దానినయిన నీవు చెప్పుము. ఆమె యామాటను విఱిచి వృథాభిమాన పూరితముగాఁ జెప్పఁబడిన దన్నట్లు నిరూపించును. శ్రోతలకు హాస్యరసము కలుగును. చెప్పిన వానికిఁ గోపము వచ్చును. చెప్పినవాని భావమును శ్రోతలు మన్నించుటకు వీలులేకుండ నుండును. విక్రమునకామె కడు పునఁబుట్టిన బిడ్డకాదు. వర్ణముచేత క్షత్రియురాలయినను ధన వంతుల బిడ్డ కాకపోవుటచేత నామె యంతిపురములో నసూర్యంపశ్యగాఁ బెంపఁబడలేదు. ఆమె తండ్రి ఖడ్గజీవి. కొంచెము భూమికలదు. ఆమె తల్లియుఁ దండ్రియుఁగూడ సామాన్య కృషికులవలెఁ బొలములలోనికిఁ బోయి పనిపాటలు చేసికొనుటయుఁ గలదు, ఆపిల్ల యంతః పురములో నుండుట యెట్లు? వయసు వచ్చిన తరుపాత విక్రముఁడామెను గొంత రాజవంశ మర్యాదానుగుణముగాఁ బ్రవర్తింపఁ జేయవల యునని యూహించెను. కాని సాధ్యముకాలేదు. ఆ యిం

టిలో నామెయాడినది యాట పాడినది పాట. ఆ పెంపుడు తల్లి కామెమీఁదఁ జెప్పరానంత మమకారము. ఆ పాతిక యూండ్లు నొకరాజ్యమయినచో సర్వరాజ్య వ్యవహారమామె చేయుచుండెడిది. విక్రముఁడామె చెప్పినట్లు చేసెడివాఁడు. ఆ చేయుట పట్టి మమకారముకాదు. ఆమె వివేకమందుండెడిది. అట్లుచేయుటయే యోగ్యముగాఁ గనిపించెడిది. కొన్ని సందర్భము లిట్లు జరిగిన తరువాత నామె సహజముగనే నాయింటిలో మంత్రిణియైనది.

ఈ వ్యవహార మటులుండఁగా నాయింటికి నాగార్జునుని రాకపోకలు బహుళములై వారిద్దఱికిఁ బరిచయము పెరిగినది. ఆమెతోడి పరిచయము నాగార్జునునకొక విచిత్రమయిన సుఖాపాదకమయ్యెను. రాచయిండ్లలోని బిగింపులు లేవు. నూటికిఁ గోటికిఁ గనిపించును. గనిపించదన్నదోఁ గనిపింపదన్న విషయము లేదు. అవ్యవహితమైన సాహచర్యమును బుజములు బుజములు రాచికొని తిరుగుటయు, హేలాదృక్ప్రసారములు, మధురమందహాస వికాసములు నంగుళ్యంచలస్పృశః పునస్సుకుమార స్పర్శలుచే లాంచల మందపవన వీచికాపులకిత్వలోచనచ్ఛవులు, హస్తప్రసారణావరోధములు, తిర్యగ్గమన తత్పరిహారములు, నేకకార్యప్రవర్తన కాలజనితాధిక్య నిరూపణోత్సాహములు, తత్కాల సర్వానుషంగిక దేహాస్పర్శలు,పరస్పరస్వేదాపనయ నవ్యగ్రహస్తస్పర్శసహాన సంజాతాంతః కామభావనా దృఢీకరణములు, మొదలయిన వానితో వారి పరిచయము. విక్రముఁడును దద్భార్యయు దానినిగూర్చి యాలోచించకుండఁగనే వారిద్దఱి ప్రేమలు

ముడివడినవి. క్రమక్రమముగా నిది రాజధానిలోఁ దెలిసినది. అంతఃపుర వార్తయైనది. నాగార్జునుఁడామెను దక్క మఱి యొకర్తుకను బెండ్లియాడననెను. రోమపాదుఁ డెట్టకేల కంగీకరించెను. కొందఱు పండితులు గోష్ఠిలో నీ వివాహమును మన్నించిరి. భగవంతుఁడైన కృష్ణునకు గల యష్ట భార్యలలో నీలయన్నయామె యుండెడిది. ఆమె గొల్లవారి పిల్ల. నాగార్జునుఁడు శ్రీకృష్ణునంతటివాఁడు. ఇట్టి మాటలుకూడ రోమపాదుని చెవులఁబడినవి. ఆరాజు నవ్వి యూరకుండెను.

పెండ్లి యయ్యెను. పెండ్లికూతురు ధాన్యకటకమునకు వచ్చెను. వచ్చిన తరువాత నామెపని నీరు తొలఁగిన చేప వలె నయ్యెను. పెంపుడు తండ్రి యింటిలో నామె గ్రామమంతయుఁ దిరిగెడిది. అతని పాలనము క్రిందనున్న యూరూరు పోయెడిది. తీర్పులు చెప్పెడిది. ప్రజలను లాలించెడిది కసరెడిది. అచట నామె మాట వేదవాక్యముగాఁ జెల్లెను. రాజధానికి వచ్చిన తరువాత బయటకుఁ బోవుటకు వీలులేదు. పంజరములోని చిలుకయైనది. ఈ పరిస్థితి రెండుమూఁడేండ్లు జరుగునప్పటి కామె మనస్సు నియమింపఁబడిన స్వేచ్ఛనుండి యొక తిరుగుబాటు సంభవించినట్లు పరులకుఁ దెలియని యొక కోపభావ మలవఱచి కొనెను. నాగార్జునునకే యామెతోడి తొలినాటి సుఖము కాదు. నాగార్జును నామె తిరస్కరించుచుండును. సమానమయిన భావనయు విహారమును బ్రసంగమును గల యొకనాటి చెలిమి, నేఁడవి యసమానములగుట చేత నాగార్జునుని యాధిక్యమామె సహించలేకపోయెను. ఎదురు తిరిగెను. ఆ యెదురు తిరుగుట సహజమైనది. తొలి

నాళ్లలో నదియొక హేలగా భాసించినది. ఏడాది రెండేండ్లు వారి యిద్దఱి ప్రతిభలకు సంఘర్షణ జరిగెనని చెప్పవచ్చును. నాగార్జునుఁడు తన ప్రతిభావైశిష్ట్యముచేత నీల నానూత్న పరిస్థితులకు నొదిగించి యామె నేలుటయా? నీల తన ప్రతిభావైశిష్ట్యముచేత నతనినిఁ దనకు వశునిగాఁ జేసికొనుటయా? రెండేండ్ల యీ సంఘర్షణలో నీలది పైచేయి యైనది. కాని నీల యంతఃపుర మర్యాదలకు లొంగియే యుండినది. ఆమె తొలుతఁ గాపురమునకు వచ్చినప్పు డంతఃపుర స్త్రీలలోఁ బరిచారికలలో నామె ప్రవర్తన విస్మారముగానే యుండెను. కాలము గడచినకొలది నామెలోను గొంతమార్పు వచ్చెను. అంతఃపురముకూడ నామెనుగూర్చి కొన్ని మర్యాదోల్లంఘనములయందుఁ బట్టించుకొనుట మానెను. ఆమె యంతియే మన మేమిచేయఁగలమన్న భావము కలిగెను. నాగార్జునునకామె గీసిన గీత. మఱియు మితిమీఱిన యొక సందర్భమున నతఁ డామెను మందలించును. ఒకొకప్పుడామె యూరకుండును. మఱొకప్పు డెదిరించును.

నాగార్జునునకు నీలయందొక రహస్యమైన యాశ యుండెను. ఆమె గొప్ప భాగ్యవంతురాలగుననియు రాజభార్య యగుననియు విక్రమునియింటఁ బలుమాఱులు వినెను. ఆమె విక్రముని యూళ్లను బాలించిన సంగతి తనకుఁ దెలియును. ఆమె రాజనీతివేత్త్రి. ప్రజాపాలన నిపుణురాలు. తనకంటె గొప్పవానిభార్య కాఁదగినది. ఒక మహారాజు భార్యయైనచో రాజు వెనుకనుండి రాజ్యము నడపగల ప్రతిభ గలది

మొదలయిన భావములచేత నతని మనస్సులో నీల మీాద మిక్కిలి గౌరవము కలదు. మఱియుఁ బైకనరాని యొక యాశ కలదు. ఆ యాశ పైకనరానిదేకాదు లోపలఁగూడ ననుకోరానిది. తాను రాజెట్లగును? ఆమె రాణి యెట్లగును? అతఁ డప్పుడప్పు డిటు లూహించును. తన యన్న శ్రీముఖుఁడు రాజైనప్పుడు విజయసింహుఁడు సేనాపతి యగును. విజయ సింహుఁడు మహావీరుడు. అతఁడు పరరాజ్యముల మీాఁదికి దండెత్తి వానిని గెలువవచ్చును. శ్రీముఖుడు తనాన్న రాజ్య మునకు రాజుగా నియమింపవచ్చును. అప్పుడు నీల నిస్సం దేహముగా రాణి యగును.

నీల చెదురుగా నంతిపురము వదలి తదితర రాజపురు షుల గృహములకుఁ బోవుట గలదు. ఆయధికారుల భార్య లతో నామెకుఁ బరిచయము బాగుగాఁగలదు. అంతఃపుర ములో నేదియైన నుత్సవము జరిగినపుడు రాజధానిలోని మహోద్యోగుల భార్యలందఱు కోటలోనికి వత్తురు. ఆ యూరిలోని క్షత్రియాంగనలతో నంతఃపుర స్త్రీల కీరీతిగాఁ బరిచయము కలదు. అంతఃపురములోని స్త్రీవారి యిండ్లకుఁ బోవుట యెప్పుడును లేదు. తొలినాళ్ళలో నీల వెళ్లెను. రాణి దాసిచేత మందలింపించెను. ఒక యేడాది నీల మఱల వెళ్ల లేదు. తరువాత వెళ్లెను. రాణి యూరకుండెను. నీలయుఁ దఱచుగా వెళ్ళదు. వెళ్ళినప్పు డంతఃపురములో గుసగుసలే కాని మందలించుటలు నదుపులోఁ బెట్టుటకుఁ బ్రయత్నములు లేవు.

మఱియు నీల మేడకుఁ జిత్రచిత్రములైన వ్యక్తులు వచ్చుచుందురు. ఆ వ్యక్తు లెందుకు వచ్చిరని యడుగుటకు వీలు లేదు. ఈమె యచ్చటికిఁ బోలేదనుటయే చాలు.

దుస్సల నీల మేడకుఁ బలుసార్లు వచ్చుచుండుటయుఁ బోవుచుండుటయు జరుగుచుండెను. దుస్సలయనఁగా జయద్రథుని తల్లి. తొలుత నీలయే యామెకు వార్త పంపించెను. మొదటిసారి యామె వచ్చినపుడు నీల యామెను మిక్కిలి పరామర్శించెను. 'మా మామగారు చాల యన్యాయము చేసిరి. ఎవరినో పాంథులను ధర్మశాలలో విడిపించినట్లు విడిపించిరి. మీ కుమారునకొక యుద్యోగ మీయరాదా? ఆయన కత్తివిద్యలో గొప్పవాఁడట. మావారు చెప్పుచుందురు. మావారికిని మీ కుమారునకును జెలిమియట. కాని మీ కుమారుఁడు మా వారితోఁ దనకుఁగల చెలిమి చాల రహస్యముగా నుండవలెనని చెప్పెనట. ఎందుకో తెలియదు? ఇతర రాజోద్యోగుల కది యసూయా హేతువగునని చెప్పెనట. ఆ మాట నిజమే. నేను మావారితోఁ జెప్పితిని. మహారాజు వద్దకుఁబోయి యాయన కుద్యోగమిమ్మని మీరు చెప్పరాదా యని. మావారేమియుఁ బట్టించుకొనరు.'

ఈ మొదలయిన మాటలతో దుస్సలకు నీల మేడకు వచ్చుటలో వెనుకాడవలసిన యవసరము పట్టలేదు. ప్రతి దినము ప్రొద్దు గ్రుంకినంతనే నాగార్జునుఁడు డెచ్చటికో పోవును. రాత్రి కొంచెము ప్రొద్దుపోయి వచ్చును. ఆసమయములయందు దుస్సలవచ్చి నీల మేడలో నుండును. ఇద్దఱును బలువిషయములు మాటాడుచుందురు. నీలకు దుస్సల గొప్ప

పండితురాలని తెలిసెను. ఆమెకుఁ దెలియని విషయములేదు. రాజనీతి తెలియును. మతము సంఘము ధర్మవిషయము భారతదేశమందలి బహురాజ్యములలోని పెక్కు విషయములు దుస్సలకుఁ గరతలామలకముగా నుండెను. అన్నాళ్లు తానే తెలివిగలదాన ననుకొన్న నీల దుస్సల ముందెందుకుఁ బనికిరాక పోయెను. క్రమక్రమముగా నీలమీాద దుస్సల కధికారము కలిగెను. దుస్సల యిట్లు చేయుమన్నచో నీల చేయును. ఆమె వలదన్నచోఁ జేయదు. నీలా దుస్సలలు ప్రసంగము చేయుచున్నపుడు పరిచారికలు వచ్చుటకుఁగూడ ననుజ్ఞలేదు. దుస్సల కెన్ని విషయములు తెలియును. ఆమె వృద్ధురాలు. ఆమె వయసు తొంబదియేండ్లుండవచ్చును. తల కొంత నెఱసెనుగాని దంతపటుత్వముకాని శరీర దార్ఢ్యము కాని తగ్గలేదు. నీల యొకనాఁడడిగెను. 'ఏమమ్మా! పురుషులలోఁ గొందఱు నూటయేఁబదియేండ్లు దాటినను బలిష్ఠులుగా నుండుట యెఱుఁగుదును; గాని స్త్రీలలో వందయేండ్లుదాటిన తరువాత నీవలెఁ బలిష్ఠమైన దేహముకలవారినిఁ జూడలే'దని దుస్సల యిట్లు చెప్పెను. "నా కొక్కఁడే కొడుకు. నాకు వేఱ సంతానములేదు. నేనెక్కువ కనినదలేదు. నాకు నలుఁబదియేట నితఁడు పుట్టెను. తరువాతఁ బదునేండ్లకే నా భర్త మరణించెను. నేనించుమించుగాఁ బుట్టినదానను బుట్టినట్లే యుంటిని. నా కాహారనియమము కలదు. మనోనియమము కలదు. పైగా మేము పేదవారము. ఇంత తినునది లేదు. జీర్ణము చేయునది లేదు. అజీర్ణము సర్వవ్యాధులకు మూలము. తనవేళయందు క్షుత్తునకుఁ దగినంతయే యాహారము తీసి

కొనుట, మఱియేమియుఁ దినకుండుటవలన నేవ్యాధియుఁ బుట్టదు. సామాన్యముగా నట్లు చేయరు. పండుగలని-పబ్బము లని యెక్కువ భుజింతురు. మఱియు రాజవంశములలో సురా పానము చేయుదురు. రాజవంశములలో నింకొకవ్యాధి కలదు. యౌవనము ననుభవించుటకు స్త్రీ పురుష సంగమ వ్యవహా రమునకు సురాపాన మధిక సుఖదాయి యనుకొందురు. కామ ప్రవృత్తి బలిసి సురాపాన వివశులయి మఱునాఁడు ప్రొద్దెక్కి లేచి యీ నీరసము పోవుట కెక్కువగా భుజించి పవలు నిద్ర పోయి నిశ్శృంఖలముగాఁ బ్రవర్తింతురు అందుచేత నాయు ర్దాయము భంగమగును. శరీర వ్యాయామము చేయువాఁడు స్త్రీసంగమము పరిమితముగాఁ చేయవలయును. స్త్రీసంగమము చేసిననాఁడు వ్యాయామము చేయరాదు. తత్పూర్వ పరదిన ములయందుఁగూడఁ చేయరాదు. వారమున కేడుదినములు. శనివారమునాఁడు సంగమము చేయరాదు. అష్టమి, ఏకాదశి, పూర్ణిమ, అమావాస్య ఈ దినములు పరిహరించవలయును. నిత్య వ్యాయామము చేతఁగాని రాజపురుషుఁడు రాజ్య వ్యవహార యోగ్యుఁడుగా నుండఁడు. ఇంతింత యినుప చొక్కాలు తొడిగికొనుటకు నెన్నుతొండములు నఱకుటకుఁ గావలసిన బరువయిన యినుప కత్తులు ధరించుటకు శరీర ములో నెంతయో బలముండవలయును. దాని కెంతయో వ్యాయామము చేయవలయును. అటు దినదినము వ్యాయా మము చేయుదురు. ఇటు ప్రతిరాత్రము స్త్రీ సంగమము నెఱ పుదురు. వారి కాయుర్దాయము లెందుకు క్షీణించవు? మన యీ దేశములో దీర్ఘాయుర్దాయమనఁగా రెండు వదలం

యేండ్లు. అందఱును రెండు వందల యేండ్లు బ్రతుకు చున్నారా? నూట యేఁబది యేండ్లు దాటినవారి సంఖ్యయే కొద్ది. అప్పటికే గొప్పగానున్నది. మాత్సర్యములు కలిగి ద్వంద్వయుద్ధములాడి కొందఱు చిన్న వయస్సులోనే చని పోవుచున్నారు. ఒకొక్కప్పుడు తీవ్ర వ్యాధులుకలిగి పోవు చున్నారు. ఈ నియమములు మానినవారు చాలమంది నూఱేండ్లు రాకుండఁగనే చనిపోవుచున్నారు. రెండు వందల యేండ్లు బ్రతికినవారు పల్లెలలో నుందురు. రాజధానులలో నెక్కువ కనిపించరు. క్షత్రియులలో లేనేలేరని చెప్పవచ్చును. ఏలయనఁగా వీరందఱును స్త్రీ భోగలాలసులు, నిత్య వ్యాయా మశీలురు. అధికాహారభోక్తలు, మఱియు రాజ్యవ్యవహారము లయందు నిత్యముగా మనస్సు తవులొత్కని తాపత్రయ మెక్కువ యగుటచేత నదియు నాయుర్దాయమును క్షీణింపఁ జేయును. నా కేదిగులునులేదు. ఎవరిపంచనో యుండెదము. పొట్ట గడచుచున్నది. నాయారోగ్యము చెడలేదు.''

ఒక్కమాట కదలించుము. దుస్సల యింత యుపన్యాస మిచ్చును. ఆ యుపన్యాసమెంతో యనుభవమును జూపిం చును. లోకజ్ఞానమును నివేదించును. మఱియు దుస్సల మాటాడునపు డెదురు మాటాడుటకు వీలుండదు. ఆమె యుపన్యసించువేళ నామె కంఠధ్వనిలో, నామె ముఖలక్షణ ములలో నొక యధికారముద్ర భాసించుచుండును. ఊరకయ వినుచుండవలయును. ఆమె చెప్పిన మాటల కంగీకరించినను నంగీకరించక పోయినను నెదిరివారు సమాధానము చెప్పుట జరుగదు. నీల కామె మాటలన్నియు నంగీకారములే.

నీలకుఁ జిన్నప్పటి నుండియు మతవిషయ మేమియుఁ దెలియదు. ఆమె తన పుట్టినింటఁ దెలియని నాళ్లలోఁ బెరిగినది. ఆఱవయేటనే విక్రముని యింటికి వచ్చినది. విక్రముని యింటిలో విక్రముఁడు నతనిభార్యయు నిద్దఱే. విక్రముఁ డెప్పుడు నింటిలో నుండఁడు. ఎక్కువ భాగము రాజధానిలో వచ్చి యుండెడివాఁడు. ఇంటిలో నతనిభార్య యేకాకిని. ఊరిలో నితనికోట యున్నదే కాని యూరు మిక్కిలి చిన్నది. గుఱ్ఱ లుదికెడివానివద్దనుండి యచ్చటికిఁ బారుగూరునుండి రావలసినదే. ఆ యూరిలో బ్రాహ్మణులేలేరు. క్షత్రియ కుటుంబము వారి యొక్కరిదే. కొంత రాచఠీవి కొంత యాచారభేదము విక్రముని భార్యను దన యింటిలోఁ దన్నే యుండ నిచ్చినది. ఒకరిద్దఱు పరిచారికులు ఒక యవర్ణపు వృద్ధ స్త్రీ వారియింటిలోఁ బనిచేయుచుండును. విక్రముఁ డూరిలో నున్నపుడు సంవాహకుఁ డొకఁడు ఖడ్గవాహకుఁ డొకఁడు నిద్దఱెక్కువ మనుష్యు లింటిలో నుందురు. ఆ యవర్ణపు స్త్రీ వర్ణాశ్రమాచార వ్యవస్థకుఁ జెందిన స్త్రీ కాదు. వారి కేదో విశ్వాసము.

ఈ కథ యైదు వేల యేండ్ల క్రిందటి కథ. కలియుగము ప్రారంభించిన తరువాత వందయేండ్లు గడచిన తరువాత జరిగిన కథ. అది క్రోధినామ సంవత్సరము. శరదృతువు. ఆశ్వయుజ పూర్ణిమ గడచి పది దినములయినది. ఆశ్వయుజ పూర్ణిమనాఁడే నిరంకుశుఁడు గంగువద్ద కాలంజరిమంత్రమును నేర్చుకొనెను. ఐదువేలయేండ్ల క్రిందట భారతదేశమునఁ బ్రజ లెట్లుండిరి? వారి యాచారములేమి? అప్పుడు వర్ణాశ్ర

మాచార వ్యవస్థకుఁ జెందిన మ్లేచ్ఛవర్ణములవారు భారత దేశములో నెట్లుండిరి? అన్న ప్రశ్నరాగాఁ గొంత చెప్పవలసి యున్నది ఈ సృష్టి మూఁడువేల యేండ్లక్రింద జరిగినది. నాలుగువేల యేండ్లక్రింద జరిగినది యని చెప్పువారి వివేకము పరిశీలింపఁ దగినది. పూర్వమొక రాజున్నాఁడఁట. అతఁడు రాజు. తమ పాండిత్యమునకు మెచ్చి బహుమతు లిచ్చునని పండితులాయనవద్దకు వచ్చుచుండెడివారు. ఒకఁడు భాష్యాంత వైయాకరణుఁడు మఱొకఁడు బాధాంత తార్కికుఁడు ఇంకొకఁడు మీమాంసా శాస్త్ర పారంగతుఁడు. ఆ రోజు లోభివారి కెట్లయిన నెగగొట్టవలయును. ఆ రాజు దానికొక యుపాయ మాలోచించెనఁట. 'అయ్యా! నేనా శాస్త్రము చదివితి నీశాస్త్రము చదివితి'ననగా రాజు 'నా కవి యన్నియు నెందులకండి! రాముఁడు మన దేవుఁడుకదా! ఆయన తండ్రి పేరేమి? యని యడిగెడివాఁడు. దశరథమహా రాజని పండితులు సమాధానము చెప్పెడివారు. అంతట రాజు 'దశరథునితండ్రి' 'ఈ అజుఁడు. రఘువు. దిలీపుఁడు. ఈరాజడుగుటయు వారు చెప్పుటయు దిలీపుని తండ్రి యెవ రని ప్రశ్న. వారు శాస్త్రవేత్తలేకాని పురాణవేత్తలు కాక పోవుటచేత వారు మాకుఁ దెలియదనెడివారట. ఈ మాత్రా నికి బాండిత్యమాయని యతఁడు పంపించెడువాఁడు. ఇట్లుం డఁగా నొక గడుసువాడు – వాఁడు పండితుఁడును గాఁడు – ఏమియునుగాడు – తాను పండితుఁడనని యా రాజు నొద్దకు బోయి దిలీప మహారాజు తండ్రి ప్రభవ మహారాజు, విభవ మహారాజు, ఇట్లు మొదలుపెట్టెను. రాజేమిచేయఁ గలుగును?

ఇరువురకును దెలియని విషయము. రాజు కాదనుటకు వీలు లేదు. అఱువది సంవత్సరములు, నక్షత్రములు, యోగములు, కరణములు, రాసులు, గ్రహములు వీనిపేర్లు నడుమ వచ్చును. ఇదియొకకథ. ఈ కథయొక్క తాత్పర్యమేమనఁగా గడచిన కాలమును గుఱించి పలుమందికిఁ దెలియదు. యథేచ్ఛముగా నూహింపవచ్చును వ్రాయవచ్చును. ఎవఁడో సాహసి తన యిష్టము వచ్చినట్లు వ్రాయును. అవివేకులు దానిని విశ్వసింతురు. ఎల్లరును సోమరులు. పరులు చెప్పిన దానిని వెంటనే యంగీకరింతురు.

ఈ కథలో మరియొక యర్థమున్నది. శాస్త్రములు వేఱు. పురాణము పంచలక్షణము. అనఁగా నైదు లక్షణములు కలది. మొదటిది తొలుత సృష్టి యెట్లు జరిగినది యన్నది. రెండవది మరల మరల సృష్టి యెట్లు జరుగునన్నది. మూఁడవది మొదటి రాజవంశము లేవి. నాల్గవది మన్వంతరములనుగూర్చి చెప్పునది. ఐదవది యా రాజవంశముల యొక్క యనుచరితము. అనఁగాఁ బురాణములు సృష్టిని జెప్పును. అనంతకాలమును గుఱించి చెప్పును. రాజవంశములనుగూర్చి చెప్పును. ఈ మూఁడు విషయములు కలిసి పురాణ మనబడును. రాజవంశ చరితమనఁగా నీనాఁడు చెప్పికొను చరిత్ర మన్నమాట. చరిత్ర పురాణములలో భాగము. మన పూర్వులు చరిత్ర నెఱుఁగరన్నమాట చరిత్ర లేనివారనెడిమాట. ఈ సృష్టి జరిగి నూట తొంబదియాఱు కోట్ల సంవత్సరములకుఁ బైన అయినది. కాలము గడచుచుండఁగా సముద్రములు పొంగును. భూకంపములు వచ్చును. అనేక

విప్లవములు జరుగును. కొన్ని ఖండములు కొన్ని దేశములు నశించి పోవును. కొన్ని క్రొత్తగా వచ్చును. అనంతకాలము మీఁద జరుగు నీ స్థితి నడ్డగించువారులేరు. నేటి హిందూ మహాసముద్రమంతయుఁ బూర్వకాలమున భూభాగమందురు. ఆఫ్రికా చుట్టునున్న సముద్రముకూడ భూభాగమందురు. అమెరికా దేశములోఁ బూర్వము గొప్ప నాగరికతకల రాజ్యము లున్నవని రుజువులున్నవి. నేఁడుత్తర ధ్రువము నందు జనులు నివసించుటకు వీలులేదు. రెండు మూఁడు వేల యేండ్లక్రింద యూరపు దేశములేదు. వేయి యేండ్లక్రింద నింగ్లాండులేదు. సముద్రము వైదొలగుటచేత నాభూభాగ ములు పైకి వచ్చియుండును. యూరపు దేశమంతయుఁ బూర్వము మంచు దిబ్బలుగా నుండెడిది. ఆ మంచుదిబ్బ లుత్తర ధ్రువములకు దరలిపోగా యూరపు బైటపడినది. అచ్చటికి జనముపోయి నివసించ నారంభించిరి. ఈ జన మెచ్చటి వారు?

సృష్ట్యారంభమున నున్న దొక్క-భారత దేశము. మానవసృష్టి యిచ్చటనే జరిగినది. భగవంతుఁడు భగవద్గీత లలోఁ జాతుర్వర్ణ్యము నాచేత సృజింపఁబడిన దన్నాఁడు. నేఁటి కొందఱకు మనపురాణములు మన వేదములు శాస్త్ర ములు నబద్ధములు. నిన్న కాక మొన్నఁ గన్నుదెఱచినవారు చెప్పెడిమాటలు నిజములు. దీనికే 'పురాణవైర' మని పేరు. పురాణములు వంశానుచరితమును జెప్పును. ఈ కథయొక్క రెండవ పరమార్థ మిది. శాస్త్రము లెంతచదివినను లాభము లేదు. పురాణములు చదువవలయునని తాత్పర్యము. కాల

క్రమమున మనదేశములోఁ బురాణములు చదువుట తగ్గిపోయి శాస్త్ర పాండిత్యముమీఁద మమకారము హెచ్చినది. అది దేశమునకు ద్రోహమైనది. మనదేశములోఁ బూర్వకవులు చాలమంది తాము పురాణజ్ఞుల మని చెప్పికొందురు. నన్నయభట్టు తాను బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుఁడనని చెప్పికొన్నాఁడు. పురాణమనఁగాఁ జరిత్ర యన్న మాట. ఎప్పుడైనను జదివెడువిద్యలోఁ జరిత్ర యొకయంశ ముగా నుండునుగదా! మనపురాణములట్టివి.

భారతదేశములో భగవంతుఁడు తొలుత సృష్టిచేసెను. క్రమ క్రమముగా మానవులసంఖ్య పెరుగఁ జొచ్చినది. వారు భారతదేశమునంతయు నాక్రమించిరి. యయాతి మహారాజు వంశములో బలియను పేరుగల రాజునకు నాలుగురు కుమారులు. వారిలో నాంధ్రుఁడనువాఁడొకఁడు. ఈ భూభాగము బలి తన కొడుకులలో నొకఁడగు నాంధ్రున కిచ్చుటచేత దీనికి నాంధ్రదేశమని పేరు వచ్చినదని చెప్పఁబడినదికదా!

మానవునిబుద్ధి యెప్పుడును వ్యభిచరించుచుండును. ఒక సిద్ధాంతమున కెదురు తిరుగుచుండును. మానవుని లక్షణ మెట్టిదనఁగాఁ గ్రొత్త యొకవింత ప్రాఁతయొకరోత. అట్టివారి నూటతొంబదియాఱుకోట్ల సంవత్సరములనుండి పుట్టుచునే యున్నారు. కొందఱు సంప్రదాయమునం దిష్టముకలవారు. మఱికొందఱు దాని నెదిరించువారు. వారికి వీరికి నెప్పుడు విరోధమే. ఇదే పురాణవైరము.

మఱియు వారు వీరిని రాక్షసులందురు. వీరు వారిని రాక్షసులందురు. ఇట్లు మనదేశమునుండి లేచిపోయినవారు

మన కర్మలను దెగనాడిరి. అగ్ని వాయు ముఖదేవతలను రాక్షసు లనిరి. ఇక్కడి యాచారములకు వ్యతిరేకముగా బ్రవర్తింపజొచ్చిరి. వారి నిచ్చటివారు వెడలనడచిరి. వారిని మ్లేచ్ఛులని పిలిచిరి. వారు భారతదేశముయొక్క వాయవ్య దిశనుండి ప్రయాణములుచేసి క్రమముగాఁ దక్షిణ భూభాగముల నాక్రమించికొనిరి. ఇప్పు డరేబియా టర్కీ పర్షియా ఈజిప్టు గ్రీసు చైనా మొదలయిన సర్వదేశములయందు వారు స్థావరపుల నేర్పఱచికొని నివసింప జొచ్చిరి. ఈ దేశములకు నేటిపేర్లివిగాని మైదువేలయేండ్ల పూర్వము పేర్లు వేఱు. ఆ దేశములవారే క్రమ క్రమముగా వారి కిష్టమువచ్చిన దేవతల నారాధించుచుఁ గొన్నివందల యేండ్లక్రింద వారిలోఁ గొందఱు క్రైస్తవమతస్థులైరి. మఱికొందఱు మునల్మానులంైరి. తత్పూర్వము కొన్నివందలయేండ్లు వారు యూదులు పారసీకులు. మఱియు వారి పూర్వస్థితి యెట్టిదో యెవ్వరికిని దెలియదు. వా రనాగరికు లగుటచే వారికి వేదములు లేవు. పురాణములు లేవు. ఈ కాల మనంతమని తెలియదు. వారు తామసప్రకృతులు. కండకోసి నెత్తురు త్రావువారు. దైవము పరలోకము సంఘాచారములు దయ మొదలైన మహాభావములగూర్చి తాము తరలివచ్చిన భారతదేశమునందు గల భావములలో స్వల్పముగా స్వీకరించి వారి సంఘాలను నిర్మించికొనిరి. వీరందఱిని మనవారు మ్లేచ్ఛు లనిరి. ఈ మ్లేచ్ఛులలోఁ గొందఱు తెగబడి యితర భూభాగములకుఁ బోయిరి. కొందఱిచ్చటనే నిలచిపోయిరి. ఎవరివలన సంఘమునకు రాజ్యములకు నాపదలేదో వారిని భారతీయులు నెడలగొట్టలేదు.

వారును భారతీయులంబోలె బాటించబడకయే యుండుచుండిరి. వారు సహజముగా నీచజాతులుగా బరిగణింపఁబడుచు వచ్చిరి. ఆసేతుశీతాచలము భారతయుద్ధమునాటికే యిట్టి మ్లేచ్ఛులందందు నివసించుచుండిరి. అందులోఁ గొందఱు బలవంతులై చిన్నచిన్న రాజ్యములు చేయుటయుఁ గలదు.

ఈ రీతిగా దేశమునందుఁ బలుచోట్ల సేవావృత్తి చేయుచున్న మ్లేచ్ఛ వర్ణములవారు సర్వభారతదేశమునందుఁ గలరుకదా. ఆంధ్రదేశమునందును గలరు. అట్టిజాతికి జెందిన యొక ముసలిది విక్రముని యింటిలోఁ బనికత్తె. నీల చదివినచదువులో సగ మామెవద్ద. ఆమెపేరు రేలంగి. రేలంగి యొక్క బుద్ధి బహు మ్లేచ్ఛ కథాసంపుటి. వారి సంప్రదాయము లామెకెన్నియో తెలియును. తత్పూర్వము కొన్ని లక్షల సంవత్సరములనుండి యనుగతముగా వచ్చుచున్న మ్లేచ్ఛ వీరుల కథలు, వారి దైవములు, వారి యాచారములు వారి యారాధనా విశేషములు చాలభాగ మామెకుఁ దెలియును. ఆనాఁడు భారతీయులకేమి మ్లేచ్ఛులకేమి సర్వ పురాణవృత్తాంతములు నానోటినుండి యానోటికిఁ దరతరములగా వచ్చినవేగాని వేఱుగావు. రేలంగి నీలకు గురువు. రేలంగి యంట్లుతోముసపుడు దీపములు వెలిగించునపుడు నిల్లు కసవూడ్చునపుడు వెన్నెలలో నాఱుబయట నీల భోజనము చేసి మంచముమీఁదఁ బండుకొనియుండఁగా నిద్రపోఁబోవునపుడు సర్వకాలములయందుఁ దమకథలే నీలకు జెప్పెను. నీలకుఁ బురాణకథలు తెలిసినది తక్కువ. మ్లేచ్ఛకథలు తెలిసినదియెక్కువ. ఆనాఁడు దేశమునందు రామాలయములు

కలవు. దాన్యకటక రాజధానిలో గొప్ప రామాలయము కలదు. కొన్ని పల్లెటూళ్ళలో రామాలయములుండెడివి కావు.విష్ణ్వాలయములు నుండెడివి. విక్రముని కోటయున్న యూరిలో నొక యాలయమును లేదు. అది యొక పల్లెటూరు. ఆ యూరి జనులెక్కువ కృష్ణచేపలు పట్టుకొని బ్రతికెడివారు.

నీలమనస్సులో తుషారమేరువ లంపాక బాహ్లికాది దేశములలోని మ్లేచ్ఛవీరులు వారి సాహసకృత్యములు వారి శృంగారకథలు నిండియుండెను. వాఁడెవ్వఁడో యొక వీరుఁడు. వాని నామము 'ఆరమ' వాఁడు గొప్పవీరుఁడు. ఆ దేశములో నిద్దరు పెద్ద రాజులు కలరు. ఆ యిద్దరు రాజులకు విరోధము. అరమ యొక రాజుకుమారుడు, రెండవ రాజుకూతురు పేరు 'గీలా' వారి యిద్దరి ప్రేమగాథను గూర్చి రేలంగి నీలతో నెన్నివందల సార్లు చెప్పెనో తెలియదు. వారు పేరు నకు రాజులే కాని పెద్ద వైభవములులేవు. ఆ కొండలో నొక కోట కట్టుకొని యుండెడివారు. క్రమముగాఁ బన్నులుకూడఁ బ్రజలు చెల్లించరు. రాజన్నవాఁడు కొన్ని వందల మందినిఁ గూడఁగట్టికొని యూళ్ళమీాదికిఁ బోయి వారివద్దఁగప్పములు తెచ్చెడివాడు. అది పదేండ్లకొకసారి జరుగవచ్చును. ఇర్వది యేండ్ల కొకసారి జరుగవచ్చును. రాజనఁగానంతే. ఈ యిద్దరు రాజుల కోటలును దగ్గఱదగ్గఱగా నుండుటచేత వారు కప్పములు తీసుకొను గ్రామముల విషయములోవారికి విరోధముండెడిది. రాజు భార్యయైనను రాజు కూతురైనను రాజు కోడలయినను యథేచ్ఛముగాఁ దిరుగుటకలదు. ఆరమ యొకనాఁడు సంజవెన్నెలలో నొక కొండ కొమ్మున

నున్న పెనుబాతి బండపైఁ గూర్చుండి వేణు వూదు చుండెను. ఆ సంజవెన్నెలలో సర్వము నిద్రాణమై యున్న గాలి పొరలలో నా సన్నని సంగీతము శిశిరవాయు తరంగముల మీఁదఁ దేలిపోవుచుండెను. ఆ సమయమున నీలా యాత్రక్కనున్న యొక కొండ కొమ్మననున్న కొండ తేనెటీగల పెద్ద తుట్టె దులుపుచుండెను. ఆమె యొడల నంతయు నొక కంబళీ కప్పుకొనెను. ఇది చాల సాహసము. ఆ కొండ కొమ్మలయందలి తేనెబట్టులను గ్రింద మంటలు పెట్టి వాసములతోఁ బొడిచి యీగలన్నియు లేచిపోయిన తరువాత నా తేనె నోడ్చికొనవలయును. అప్పటికిని గొండ యీగల బాధ తప్పదు. ఈమె చాల సాహసురాలు. చాలవివేకవతి. పలు తేనెతుట్టెల జాగ్రత్తగాఁ బరిశీలించి నిలువెడి తేనె పట్టులో దేనియ యుండుభాగము గుర్తుపట్టెను. ఆమె కంబళీ కప్పుకొని నెమ్మదిగా దానివద్దకుఁబోయి తేనెయున్న భాగము నందు ముసరిన యీగలను సన్నని యాకులతో గాడలతో దొలగించును. ఆ తేనెను నన్నని పుల్లలతో నొక్కి తాను దెచ్చిన యొక బాతిగిన్నెలోని కోడ్చుకొనును. ఆమె యీ సుకుమారమైన బ్రయిత్నములో నా యీగలకు నెవరో వచ్చి తమ తేనె నోడ్చుకొనుచున్నారని తెలియదు. ఆమె శిలా ప్రతిమవలె నిలుచుండును. పొడుగుపాటి పుల్లలు మాత్రమే కదలుచుండును. ఆ కదలికయు నేతేనె టీగకును బాధాజన కముగానుండదు. అప్పటికిని గొన్నియీగలామెను గుట్టవని లేదు. కుట్టినను దద్బాధ నోర్చుకొనవలయును. కదలినచో మరల వంద యీగలు కుట్టును. తేనెపట్టు తేనెపట్టుగా నుం

డగా నిట్లు తాను గొంత తేనె యోడ్చికొని కొన్నియీఁగలు కుట్టిన బాధసహించుకొనుచు తిరిగివచ్చుచుండెను. విస్తార ముగా నీగలు కుట్టినచో బ్రదుకుట యన్నదేలేదు. అవి కొండ యీఁగలు. ఆమె నెమ్మదిగా నడుచుచు వచ్చుచుం డెను. కొంతదవ్వు వచ్చినతరువాత ఆరమ పాడుచున్న సంగీ తమామె చెవులఁబడెను. ఆ గానమాధుర్య మామె హృద యములోనికిఁ జొచ్చి యీఁగలు కుట్టిన బాధ నపనయించెను. వట్టి యపనయించుటవ కాదు. ఆమె హృదయమున కవ్య క్తముగా నదియొక యువకుడు పాడుచుండెనని దెలిసెను. ఆమె శరీరమునందుఁ గుసుమించిన యౌవనము లాహృదయ మున సన్నని పిందెవేయుట కుపక్రమించినట్లుండెను. ఆమె తన వద్దనున్న పిల్లంగోరు తీసికొని తాను గూడఁ బాడనారం భించెను. ఆ ప్రదేశము రెండు కోటలకు సరిహద్దు. ఆరమ కూర్చున్నకొండ తనతండ్రి పాల్యమైన దేశములోనిది. ఆ ప్రదేశమును గూర్చి యిద్దఱురాజులకు మున్ను చాల పోరా టములు జరిగినవి. గీలాదారి యీ కొండనుజుట్టి పోవలసిన దారి. ఆమె కొండ యంచునకు వచ్చి నిలుచుండి పాడనా రంభించెను. ఈమె పాట నతడువినెను. అతడు పాట నాపెను. ఈమె కొంతసేపు పాడి తానువిరమించెను. అతడు మరలఁ బాడెను.. మరల నీమెయందుపుచ్చుకొనెను. ఇట్లు కొంత ప్రొద్దుపోయెను. వారిట్లుపాడుచునే పరస్పర మభిముఖముగా నడచుచుండిరి. ఒకరినొకరు చూచుకొనిరి. అతడు తన తండ్రి విరోధికుమారుడని ఈమెకుఁ దెలియదు. ఆమె తన తండ్రి విరోధి కుమార్తెయని యతనికిఁదెలియదు. ఆ పిల్లంగోరువలపు

పదిదినములు సాగెను. చివరకు వారిద్దఱు పెండ్లిచేసికొందు మనికొనిరి. వారు తమతల్లితండ్రుల గుఱించి ప్రస్తావించుకొననే లేదు. ఆ కొండలలో నొక యాచారమున్నది. తిలివేశియని యొక తీగ యా కొండలలో ప్రాకుచుండెను. అది వివాహమునకు జిహ్నముగా నా కొండజాతుల వారు పరిగణింతురు. ఆ తీగయాకులు దూసి కడియముచుట్టి పెండ్లికొడుకు పెండ్లికూతు చేతికి, బెండ్లికూతురు పెండ్లికొడుకు చేతికిఁ దొడిగికొందురు. ఇది వివాహము యొక్క ప్రధానాంగము. తల్లిదండ్రు లిచ్చుటయు జేసికొనుటయు మొదలైనవి జరిగినప్పుడు తక్కిన యంగములన్నియు నుండును. ఇట్టి హఠాత్ప్రేమలకు నీ ప్రధానాంగమే సరిపోవును. ఇదియే పెండ్లి. వారిట్లు పెండ్లి చేసికొనిరి. కాపురముచేసికొనిరి. వారి వలపుయొక్క ముమ్మరమెంత యనగా, వారి ఈపెండ్లి జరిగెడివఱకు వారు తమతమ తల్లిదండ్రులను గుఱించి ప్రస్తావించుకొననే లేదు. వారి హృదయములలో వారికిఁ దెలియకుండ నేదో భయముండి యుండవలయును. తమ కులము తమతలిదండ్రులు వారిని గుఱించి ప్రస్తావన జేసికొన్నచో నదియొకవేళ తమ సంయోగమున కడ్డము వచ్చునేమో యన్న భయము. ఆ భయము వారికిఁ దెలియకుండనుండెను. వివాహమయిన తరువాత, దెలిసికొన్న తరువాత నాభయము వందరెట్లు నిజమయ్యెను. ఇది ఈ వివాహము బయటికిఁ బొక్కెను. ఆరమ తండ్రి వానిని దనయింటినుండి వెడలఁగొట్టెను. గీలాను నామె తండ్రి కోటలోబంధించి కఠోరముగా బాధపెట్టుచుండెను. ఆరమ వెళ్లి మామగారిని దన భార్యను

దన కిమ్మని యడిగెను. గీలా తండ్రి వానిని వధించెడివాఁడే. కాని యతనితోఁ గత్తియుద్ధము చేసెను. కత్తియుద్ధములో నారమ గెలిచినచోఁ గూతునుబంపింతుననెను. ఆరమ మామ గారిని గాయపఱచెను. మామ యోడిపోయెను. అతఁడు మాట ప్రకారము తనకూతు నారనువెంటఁ బంపించెను. ఈ దంపతులిద్దరు కొన్నినెల లడవులవెంటఁ దిరిగిరి. గీలా తండ్రి యా గాయములను దట్టుకొనలేక చనిపోయెను. ఆరమయే మామగారి కోటకధికారి యయ్యెను. కాని గీలాను దండ్రిపెట్టినబాధలవలన గీలావ్యాధిగ్రస్తురాలయ్యెను. ఆమెను బ్రదికించికొనుట కారమ యెంతో ప్రయత్నము చేసెను. తుద కామె చనిపోయెను. ఆరముఁడు తనమామగారి కోటను వదలి పెట్టెను. ఉన్మత్తుఁడై కొండలవెంటఁ దిరుగుచుండెను. చాల దినములు తామిద్దఱు తేకొండకొమ్మున గలసికొనిరో యచ్చట గూర్చుండి వెన్నెల రాత్రులందు వేణు వూదుచుండెడి వాఁడట. తరువాత నేమయినాడో తెలియదు. వెన్నెల రేల నతని సంగీత మాకొండకొమ్ములయందు వినుపించునని జనులు చెప్పుకొనుచుందురు.

రేలంగి ఈకథ చెప్పుచు నడుమ నడుమఁ బాటలఁబాడుచు నీల మనస్సును వశపఱచికొనెను. ఆమ్లేచ్ఛ భాషలో నీ కథ నెవఁడో కవి వ్రాసెనట. ఆ రేలంగి యాపాటలు పాడును. నీలకాపాటలు సగము కంఠతః వచ్చును. ఆ సంగీతమే వేఱు. ఆపాటల నడకయే వేఱు. ఒకవృత్తమువలె సమచరణములుం డవు. వాక్యము నడుమ నడుమ విఱిగిపోవుచుండును. పలు చోట్ల శబ్దములకంటె ధ్వన్యనుకరణము లధికముగానుండును.

కొండలలోని పెద్ద పెద్ద బల్లులు నోటితో ధ్వనిచేసినట్లు, కొండ గుహలలో గాలులీలలు కొట్టినట్లు, పరువెత్తు గుఱ్ఱముల గిట్టలు ఱాతిమీఁదఁ జప్పుడయినట్లు, యుద్ధము జేయు వేళ కత్తు లొరసి మ్రోసినట్లు ద్రాక్షాఫల గుచ్ఛములమీఁదఁ దుమ్మెదలు రొద చేసినట్లు జాలలు వినిపించునట్లు ప్రస్తావన వచ్చినపుడెల్లఁ బలువిధములైన యట్టి ధ్వనులు రేలంగినోటితోఁ జేయును. ఆ ధ్వనులన్నియుఁ బాటలోని భాగమే. అ రేలంగి గొంతు మైనపుముద్ద. తడిపిన రాగిమట్టి. అది యిట్లువంగునట్లు వంగునని లేదు. నీల రేలంగి శిష్యురాలు. రేలంగికి మనోదాసి.

నీలకు మ్లేచ్ఛుల యాచారములు వారి దైవములు వారి మనోలక్షణములు సర్వము విస్పష్టముఁగా దెలియును. రేలంగి సాహచర్యముచేత నీలమనస్సు మ్లేచ్ఛభావమయమయి యుండెను. ఆమ్లేచ్ఛులదొక సాహిత్యము. ఒక సాహిత్యమునందు రమణము జరిగినచో నది తెలిసినవారికిఁ జదివినవారికిఁ దత్సాహిత్యమునందు వర్ణింపబడిన సంఘాద్యాచారములందుఁ బ్రేమ కలుగును. ఇది సాహిత్యముయొక్క రహస్యము. నీల మనస్సులోఁ బెండ్లియనఁగా అరమునకును గీలకును జరిగినట్లే జరుగవలయునని. మగఁడు తీగతోఁ గడియము చేసి పెండ్లముచేతికి వేయును. పెండ్లాము మగనిచేతి కింకొక కడియము తొడుగును. అపుడు పెండ్లము కొంత సిగ్గుపడవలయును. మగఁడు పెండ్లమును ముద్దు పెట్టుకొనవలయును. కౌగిలించికొనవలయును. పెండ్లికూతు రా కౌగిలింతను వదలింపించికొని పాఱిపోవలయును. పెండ్లికొడుకామె వెంటఁబడి తఱుమవలయును. కొండమలుపులలో వాగుపడకలలోఁ

పెండ్లికూఁతురు మగని నలయించ వలయును. ఎచ్చటనో రహస్య ప్రదేశమున నొక కొండగుహలో నొక పొదవలె వంగినకొమ్మలుగల చెట్టునీడలో గృహముపలెనున్న బండల మధ్య నామె భర్తను ధొరకవలయును. ఆ సమయమునందు యౌవనము చారితార్థ్యము పొందవలయును. అది పెండ్లి. అది ప్రేమ. నీల కొండలలోఁ బుట్టలేదు. కాని యెప్పుడైనను బోయి యా కొండలను జూచిరావలయునని నీలయొక్క గాఢమయిన వాంఛ.

నీలయొక్క మనోలక్షణ మిట్టిదని నాగార్జునునకుఁ దెలియదు. ఆమె యెప్పుడును భర్తతోఁ జెప్పలేదు.

దుస్సలకు నీల మనఃప్రవృత్తియు నామె భావములు సర్వము తాను నాటఁబోవు విత్తనమునకు యోగ్యమయిన క్షేత్రముగాఁదోచెను. ఇద్దఱును గూర్చుండి వైదికాచార ములు రాజ సంబంధమయిన యలవాట్లు సమృద్ధిగా నిందించి కొందురు. ఈ పెండ్లిండ్లేమి? ఈ రాజ్యములేమి? స్త్రీలను జెఱ సాలలోఁబెట్టి బంధించినట్లు నిలుపుటయేమి? అసూర్యంపశ్య లని యొక మరియాదగల మాటయేమి. విడిగాలిలోఁ దిరు గుటకే వీలులేదాయెను. తాను తన తండ్రి భవనమునకుఁ బోవుటకే వీలులేదాయెను. ఎచ్చటికయినఁ బోయినచోఁ గోటలో గుస గుసలు రుస రుసలు. తాను వానిని లెక్క- చేయదు. తానెదురు తిరుగుచున్న భయము కోటలో నంద రికిని గలదు. అందుచేత నామె కొంత బ్రదుకఁగలుగు చున్నది. లేనిచో నామెను జెఱపగడవలెఁ బిప్పిచేసి యుందురు.

## ౭

ధాన్యకటకములో రాజోద్యోగులు చాలమందికలరు. వారంగఱు రాజబంధువులు. కొందఱు దూరపు రాజవంశీయులు. కొందఱు దగ్గఱివారు. ధాన్యకటకమునకుఁ జుట్టుపట్ల జిన్నచిన్న పల్లెటూళ్లు కలవు. వానిలో నచ్చటచ్చట జిన్నచిన్న కోటలుకట్టి పలువిధములయిన రాజ్యాధికారములు కలవారు నివసించుచుందురు. ఇవి యన్నియు విడివిడిగా నుండును. కాని యీ పల్లెటూళ్ళన్నియుఁ గలిపి యొక్కటియే మహానగరముగా వ్యవహరింతురు. ఇంద్రకీలాద్రి మొదలు వేదాద్రి పైవఱకు వ్యాపించియున్న యీ పలు పల్లియల సముదాయమునకంతకు ధాన్యకటకమనియే పేరు. విడివిడి పేర్లతో నాపల్లియలను వారిలో వారే వ్యవహరించుకొందురు. కాని పరులందరు దానినంతయు ధాన్యకటకమందురు. అచ్చట నివసించుచున్న వారందరు పరదేశములకుఁ బోయినప్పుడుగాని యితర స్థలములకు, జనినప్పుడుగాని తాము ధాన్యకటక నివాసులమనియే చెప్పుకొందురు. ఇది యంతయుఁ గలిపిరాజధాని ఇది పల్లియలు పల్లియలుగా నుండినను పేటలుగా వ్యవహరించుటయు గలదు. ఒక్కటియే నగరము. పేటలు విడివిడిగానున్నవి. ఈ నగరమిట్లు నిర్మించుటలో నడుమనడుమ విశాలప్రదేశములు కలుగుట గాలివచ్చుట కెక్కువ సదుపాయముంచుట యెక్కడికక్కడికి జనసమ్మర్దము తక్కువగుట

పరిశుభ్రతకు వీలుండుట మొదలైన బహూపకారములు కలవు. మరియు నీ పల్లియ లారేడుక్రోశములమేర కృష్ణానది పొడుగునను వ్యాపించియున్నవి. ఈ మహానగరమునకు వెడల్పు తక్కువ. వెడల్పు రెండు క్రోశముల లోపల మాత్రమే యుండును. కృష్ణానది యొడ్డుననే యెక్కడు నింతపొడుగునను వ్యాపించి దక్షిణదిశ నొక్కడు పెద్ద ఱాతి బాటలు కలవు. ఆ ఱాతి బాటలమీాద రెండు రథాలొక్కసారి ప్రక్కప్రక్కగా దోలవచ్చును. ఈ వెడల్పునందు గూడ జాలఱాతిబాట లడ్డముగా గలవు. కృష్ణానదిలో నుండి జలము నిత్యముగా నీ మహానగరమంతయు వ్యాపించుటకు నాళికలు నిర్మింపఁబడి నిత్యజలసమృద్ధిగా నుండెను. చూచుట కాపల్లియకాపల్లియయే యథార్థమున కొక మహానగరము. ఆ నిర్మాణ వైఖరిలో నొక చమత్కృతికలదు. అన్నియుఁబల్లెటూళ్ళ వలెనేయుండును. ప్రతి పల్లెటూరులో గుటీరములెక్కువ. భవనములు రెండుమూాటికన్న నెక్కువయుండవు. పశుసంమృద్ధి కలదు. తీగలు చెట్లు పచ్చికబయళ్లు కన్నులపండువుగా నుండును. ఈ మహానగరము యొక్క యెల్లల యందున్న పల్లెటూళ్ళు తూర్పుపడమరల యందున్నవి. నిత్యసైన్య పరిరక్షితములు. దక్షిణపుదిక్కున నాలుక్రోశములమేర బంన్రెండుకోటలున్నవి. ఈ పన్రెండును పల్లెటూళ్లవలెనే కన్పించును. పెద్దకోటలుగాఁ గనిపించవు. వానియందు గండరగండలయిన రాజసైనికులు సేనాధిపతులు నివసించుచుందురు. శత్రువులు రాజధాని మీాదికి దండెత్తివచ్చినచో నుత్తరపు దిశయంతయు కృష్ణానదియే. దక్షిణదిశయందు నీ పన్రెండు కోటలును అలికిడి తగిలినా

యీ మహాసైన్యము కోటగోడవలె నీ యూరుక్రోశముల మేరఁ బరివేష్టితావ్యగ్రులై యుందురు. ఈ యెనిమిది చదరపు క్రోశముల మేరనున్న మహానగరములో రాకపోకలు నిచ్చి పుచ్చుకొనుటలు క్రయవిక్రయములు జరుగుచునే యుండును. కొన్ని పరిస్థితులయందేక మహానగరమువలె గొన్నిపరిస్థితుల యందు చిన్నచిన్న గ్రామములవలె వ్యవహారము జరుగుచుం డును. వట్టియప్పుడు వేదాద్రినద్దనున్న యూరు చాల దూరపు బల్లెగాఁబరిగణింపఁ బడుచుండును. ఉత్సవము వేళ శుభ కార్యములవేళఁ బండగపబ్బముల వేళ సర్వరాజవంశీయుల నడుమ నీ యూళ్ళనడుమ దూరమున్నట్లే కనిపించదు. రథ ములమీఁద రాజవంశీయులు పవలెల్లఁబోవుచుందురు వచ్చు చుందురు. ప్రొద్దున నేపోదురు మధ్యాహ్నమునకు వత్తురు. మధ్యాహ్నములందుఁబోదురు. రాత్రిపడువఱకు దిరిగివచ్చు చుందురు. ఒకచోటఁబెండ్లియగును. మఱియొకచోట నుపనయ నము జరుగును. వేరొక యెడ నేరాజవంశములోనన్నా శిశు వుదయించును. అన్నప్రాశనము జరుగును. ఆ నాఁడీ రెండు క్రోశముల వెడల్పునఁ బదిరెండు క్రోశముల పొడవున నిదియంతయు నొక మహానగరమనిపించును. రథములు నేన్గులు గుఱ్ఱములు తిరిగినవి తిరిగినట్లే యుండును. జనులరాకపోకల కవధియేయుండదు. ఇట్టి పరిస్థితులు సంవత్సరము మొత్తము మీఁద నెన్నియోసార్లు జరుగును. కొన్ని మాసము లవ్యవ హితముగాలుత్సవపరంపరచేత మహానగర మేకాకృతివహించి కొన్ని నెలలు ప్రతి చిన్న యూరు దానికదియే యన్నట్లుం డును. ఇందులో ముఖ్యమైన ధాన్యకటకమునకుఁ గృష్ణ కెగువ

భాగముననున్న యూళ్ళసందడి వేఱు. తూర్పుననున్నయూళ్ళ సందడి వేఱు. తూర్పుటూళ్ళ సందడితక్కువ. పడమటియూళ్ళ సందడియెక్కువ. తూరుపు యూళ్ళ దిగువభాగమున సము ద్రమువఱకు నంతయు నాంధ్రదేశము. అచ్చపల్లెటూళ్ళు. శత్రువుల యొద్దడి తగిలినచోఁ బడమటినుండి కలుగును. దక్షి ణము నుండికలుగును. అందుచేతఁ పడమటి పల్లెటూళ్ళ రక్షణలేదు. వానిస్వరూపము వేఱు. ఇదియంతయు మహానగర నిర్మాణవైఖరి. ఏ రాజవంశీయుని గృహములోననో యొక ఆక్కఱజరుగును. రాజకుటుంబము ప్రవాహములుగా వారి యింటికి బోవుచుందురు. అనేక శుభకార్యములు జరుగును. ఆ శుభకార్యముల వేళ నందరు నొకటియే. రాజును రాణు లును యువరాజును రాజకుమారులును వారి భార్యలతో నా శుభకార్యములు జరుగుచోటికిఁ జోయినచో నా శుభ కార్యము జరిగిన రాజవంశీయుని యిల్లు ధన్యమైనదిగా భావింపఁబడును. అందుచేత వీరు వెళ్ళరని గాదు. వెళ్లుచునే యుందురు. అందరును వెళ్లుదురు. పలుసార్లు వెళ్ళనిది నీలా నాగార్జునులు. కొన్నాళ్లు వారురాలేదేమని పలురాజవంశీ యులు తమలోఁదాము త్రొక్కిళ్ళుపడుటయు నది రెండుమూ డేండ్లు జరుగుటచేత నలవాటగుటయు నీలవచ్చిన తరువాత నాగార్జునుఁడు మాఱిపోయినను కొనుటయుఁ బదిచోట్ల శుభకార్యములు జరిగినచో నొకటిరెండు చోట్లకు నాగార్జు నుఁడొక్కఁడే పోవుటయు జెనుకుగా నెప్పుడైన నీల పోవుటయు జరుగును. నీల పట్టమహిషి కాదు. యువరాజు భార్యకూడఁ కాదు. రాజుమూడవ కుమారుని భార్య. ఆమెతో దక్కిన రాజవం

శీయస్త్రీలు మిక్కిలి చనువుగా మాటాడుటకు గొంకవలసిన పనిలేదు. పోకపోక నీల పోయినపుడు రాజకుటుంబములోని యితరస్త్రీలు నీలతోఁ బరాచికము లాడుటకలదు. నీ వెచ్చటి రాణివనఁగా రాణివికాదు-నీవు గొప్పయింటి బిడ్డవు-ఆమె పేదకుటుంబములోనిదని యందఱకుఁ దెలియును. నీవు రాజ నీతిజ్ఞురాలువు. పదియూళ్ళమీాది పరామరిక చిననాడు చేసితివే యను కొందుము. అదిరాజనీతియాయని. నీభర్త మహావీరుడు-విజయసింహుఁడు ఖడ్గవిద్యానిపుణుడు గాని నీ భర్తకాదని. నీ వసూర్యంపశ్యవు-పొలములవెంటఁ దిరిగినదానవని, నీవు కాలుబయటఁ బెట్టుదువా-మొదలైనయాక్షేపణలు చేయు దురు. నీలకాక మఱియొక ర్తుకయైనచో నీ మాటలకుఁగోపకిం చును. రాజయువతులలో రాజయువతులలో విరోధములు ప్రబలును. మాత్సర్యములు వృద్ధిపొందును. కాని నీలవారి వ్యంగ్యములకుఁ దానేయర్థములు చెప్పును. ఏదోసోమరితనము చేత రాలేదనును. తన స్వభావమదియొకరీతిది. తాను వచ్చి నను రాకున్నను నొకటే యనును. మఱియుఁ దనకీపెద్దరాణి వాసయోగ్యములయిన రత్నాభరణములు వెలగల చీరలు రవి నెరపుటలు మొదలైనవానియందు మమకారము లేదనియు దాను వాని నభినయించలేననియు దద్యోగ్యవేషధారణము లేక వారి యిండ్లకు వచ్చినచో వారు మన్నించుట జరుగదు. కనుక దనకు వానియందు సహజమైన వైముఖ్యము జనించుట చేత దానెక్కువసార్లు రాననియు నచ్చముగా రాకపోవుట బంధుత్వమర్యాద కతిక్రమించుట కావున వచ్చితిననియు సమాధానములు చెప్పుచుండును. వారందరు ననుకొనుచుం

దురు. నీలకుఁగోపములేదు. పట్టుదలలేదు. ఠీవిలేదు. వట్టిబోళా బాలికయని, మరికొందరు రాజస్త్రీలు నీలయందు భావింప బడుచున్న యీ సామాన్య స్త్రీ లక్షణము రాజవంశయోగ్య ముకాదని యామెయందు నిరాదరముచూపుదురు. ఆమెతోఁ కొందరు మాటాడనే మాటాడరు. కాని రాజుగారి కోడలు. పలుకరించక తప్పదు. వారు పలుకరించనక్కఱలేదు. నీలయే పోయి పలుకరించును. వారికామెయందెంత నిరాదరణము న్నను నామెయేవచ్చి పలుకరించినప్పుడు వారు కదలాడి పోవుదురు. సహజముగా వినయమవలంభింతురు.

ఈ పరిస్థితులవెనుక నాగార్జునుని మేడలో నిట్టిశుభ కార్యముల పిలుపులు జరిగినపుడు పోవలసినపుడు భార్యా భర్తలనడుమ గొన్ని ప్రసంగములు జరుగును.

ఒక రాజవంశీయుల కుటుంబములో నక్షరాభ్యాసము జరుగును. పిలుపువచ్చినది. మఱునాడు ప్రొద్దుననే బయలు దేరిపోవలయును.

నాగార్జునుఁడు– 'నీలా రేపు పోవుదమా?'

నీల– 'ఎచ్చటికి'.

నాగా– 'వారువచ్చి పిలిచిరిగదా'.

నీల– 'వారెవరు?'

నాగా– 'నీవెప్పుడు నింతే. పోకపోయినచో మహారాజు గారు నన్ను బిలిచి మందలింతురు. నాకుఁ దలనొప్పిగానున్న దనియో నుత్సాహముగా లేదనియో నేనొకకుంటి సమాధా నము చెప్పవలసియుండును.

నీల- 'నాకు దెలియునుగదా. తరువాత నాల్గు దినములు మనమేడచుట్టును రాజవైద్యులు తిరుగుచుందురు. సాముగరిడీలు నేర్చుగరిడీకి మిమ్ము వెంటఁ బెట్టికొని తీసికొని పోవుటకు రాజభటులు వచ్చుచుందురు. సుకుమారములయిన భోజనపదార్థములు మన మేడకు వచ్చుచుండును.'

నాగా;- 'నీలా! అక్షరాభ్యాసమునకుఁ బోయిన దప్పేమి?'

నీల- అక్షరాభ్యాసమెందులకు. రాచపిల్లవాండ్రు కత్తి పట్టుట నేర్వవలయును. కత్తిపట్టించిన యుత్సవములు చేయుదురు. దానికి స్త్రీలు పోనక్కఱలేదు. పురుషులు మీరు వెళ్ళుచునేయుందురు గదా? ఎప్పుడో యొకసారి కత్తిపట్టిన యుత్సవమునకు స్త్రీలనుగూడఁ బిలుతురు. అప్పుడు నేను తప్పకుండవచ్చుచునే యున్నాను. రాజవంశములలో నక్షరాభ్యాసమనునది యర్థములేనిమాట. అక్షరములు వ్రాయింతురు. ఇంతకంటె వ్యర్థమైనపని మఱియొక్కటిలేదు. ఏ రాజపురుషుఁడు వ్రాయఁగలుగును? అప్పుడు వ్రాయింతురు. దానితో సరి. వ్రాయసగాండ్రు దేశమునందుందురు. వారందరు బ్రాహ్మణులు. కొన్ని పేదరాజ వంశకుటుంబములలో వ్రాయఁ గలిగినవారున్నారు. వారిపట్టింపులేదు. మీరు మీ పేరును వ్రాయగలరా? నన్నడిగినచోఁ జదువనుగూడలేరు. అన్ని విద్యలునోటితో జెప్పుదురు, నోటికివచ్చును. వేదపండితులకు శాస్త్రపండితులకే చదువను వ్రాయను రానప్పుడు రాజవంశములలోని బాలురకు అక్షరాభ్యాసము చేయుట యెందులకు? కొన్ని విద్యలు ముఖమునందుండునవి. కొన్ని విద్యలుచేతిలో

నుండునవి. ముఖములోనుండు విద్య పేరు చదువు. చేతిలోని విద్య పేరే విద్య. సాలెవాఁడు బట్టలు నేయుట, కుమ్మరి కుండలు వానుట. అగసాలి నగలు చేయుట, ఇవి విద్యలు. కత్తితో ధనుస్సుతో గదతోఁ బోరాడఁగలుగుట విద్య. అక్షరాభ్యాసము చదువునకు సంబంధించినది. విద్యలకు సంబంధించినది కాదు. నాకు విద్యయందున్నంత గౌరవము చదువునందు లేదు. చదువు మనకుఁగాదు. బ్రాహ్మణులది. మనది విద్య. విద్యయందున్న మర్యాద నాకుఁ జదువునందు లేదని చెప్పితిని గదా?

నాగా- 'ఊరక వెళ్ళివచ్చిన దప్పేమి? పోనిచోనన్నియు సంకటములే. రాజుగా రనుమానపడుదురు. నేనచ్చేటనో కనుపించినపుడు రాజ వంశీయులు నావంక విచిత్రముగా జూతురు. అది యసహ్యముగానుండును. నేను యువరాజునైనచో నేను వెళ్ళకపోవుటకింత పాటింపు వుండెడిది కాదు. శ్రీముఖుడు వెళ్ళ లేదనుకొనుము. అన్నగారో అల్లుఁడుఁగారో- ఉన్నవరుసతో - మాయందుదయ జూడఁ లేదు. మీరు మా యింటికివత్తురు. మేము చరితార్థుల మగుదుమనకొంటిమి. తమరు రాకపోవుటచేత మా యింటిలోని యుత్సవమునకు శోభయేలేదు. మొదలైన మాటలుమాటాడెదరు. నేను వెళ్ళక పోయినచో వారి దయ. ప్రక్క-చూపులు చూచుచు నన్ను దాటిపోవచ్చును. ఆ ప్రసక్తియే లేకపోవచ్చును. అతనికి నాకు వరుసమైనచో మిమ్మ మరదలు తనకొంగున ముడివేసికొనియున్నదని యుల్లసమాడుదురు. అందుచే వెళ్ళివచ్చినచో నష్టమేమి?'

నీల- నేనొక్కటి చెప్పెదను. మన మనస్సులలో ఒక్క దానిని విశ్వసించుచున్నాము. రాజ్యములు పోయిననుసరే. ఇటు సూర్యు డటు పొడిచినను సరే. విశ్వసించిన దాని నాచరించుట పరమోత్తమ లక్షణము. ఉత్తములయిన పురుషులు విశ్వసించిన దాని నాచరింతురు. మీారుత్తములైన పురుషులు. మీారట్లుచేయుట నా కభిమతము.

నాగా- నీలా! చదువునందు నిరాదరము నాకులేదే. నీవు చెప్పిన విభాగము నాకుఁ దెలియదు. నీవు చేసిన యీా విభాగము నీ నోటివెంటనే రెండుమూడు సార్లు వింటిని. నేనా విభాగము చేయలేదు. నాకు దానియందు విశ్వాసమును లేదు'.

నీల- లేనిచో మీారు వెళ్లవచ్చును. విభాగముచేయుటకు మున్ను విభాగము చేయఁగల యాలోచన చేయవలయును. మీారాలోచనచేయరు. పలుమంది పరంపరగా వచ్చు భావములను విచారణలేకుండ స్వీకరింతురు. ఆలోచనగల బ్రదుకునకు నాలోచన లేని బ్రతుకునకు జాల భేదమున్నది. నేనుచేసిన విభాగమునందు మీాకు విశ్వాసములేదు. విశ్వాసమెట్లు పుట్టును. మనతాతయ్య చెప్పినాడు గనుక పుట్టునా? దానిపేరు విశ్వాసమా? అది గొర్రెల లక్షణము. ఒకగొఱ్ఱె నీటిబోదెదాటఁగా దక్కిన గొఱ్ఱెలు దానివెంటఁబడి పోవును. మనము మనంత నాలోచించవలయును. నేను చెప్పిన మాటలకు సమాధానమున్నచోఁ జెప్పుఁడు. నేను మీాకు బ్రియురాలను. నా యందు మీాకు బ్రేమయున్నది.

మీ యందు నాకున్నది. నేను మిమ్ము గంగలో దింపను. మీరు నన్ను డుసులోదింపరు. మనకిద్దఱ కభిమతమైనదొకటే కావలమును. విద్యయుఁ జదువు నొకటియే యందురా?

నాగా- 'కాదు'.

నీల- ఐనచో మనము విధ్యాభిమానులము. మనము వెళ్లము.

నీల- నాకుఁ దెలియును. మీరు నాకంటిపాపలు. నా గుండెలోని రత్నదీపములు. నా బ్రదుకు పరమార్థము చూఱ గొన్న యౌవన జ్యోతులు. నన్ను సముద్ధరించుట కవతరించిన మహాపురుషులు. అర్జునా! నీవు రానిచో నేనేనుయ్యెడిదానను? పేదయింటిబిడ్డను. పెంపుడుతండ్రి నన్నుదీసికొనిపోనిచో నేను బిడక లేరెడిదానను. నులక మంచములు నేసెడిదానను. ఊరి బావి వద్ద నీళ్ళు తోడుచుండెడి దానను. నాయందు నీకు కలిగిన దయచేత నేను రాజాంతఃపురములో నున్నాను. పది మంది గౌరవమునకుఁ బాత్రురాల నగుచున్నాను. పండితురాలుగాఁ బరిగణింపఁ బడుచున్నాను.

నాగార్జునుఁడు నీలను గ్రుచ్చి కవుగిలించికొని కపోలాంస భుజ బాహు కంఠ వక్షస్థల పరిచుంబనములచేత మై పులకరింపించికొని యిరువురును నిమేషమాత్ర పరికల్పిత స్వర్గ వాసులుగా భాసింతురు. ఈ విద్యయంతయు నీలకు దుస్సల నేర్పినదని నాగార్జునునకుఁ దెలియదు.

మఱియొక రాజబంధువుని యింటిలో వివాహము జరుగును. రాజవంశీయుల యిండ్లలో జరిగెడు కొన్ని వివా

హములు కోటలోననే జరుగును. తక్కువ యుద్యోగస్థులు దూర దూరపు రాజవంశీయులు తమ చిన్నయిండ్లలోఁ బెండ్లిండ్లు చేసికొని రాజును రాజకుటుంబమును బిలిచినచో వీరు వెళ్ళరు. వెళ్ళనిచో శోభలేదు. తమకు మర్యాద తక్కువ. రాజకుటుంబ మంతయు వెళ్ళినచో వారికి విడుదులు చాలవు. ప్రతియూరు నొకచిన్న పేటవంటిది. ఎంత పందిళ్లు వేసినను జాలవు. మఱియు నంతటి పెద్ద వ్యయమునకు వారు జాలరు. అందుచేత వారా వివాహములు కోటలోననే జరుపుకొందురు. కోటలోననగా గోటలో బెద్ద దేవాలయమున్నది. ఆ దేవాలయ మెంతయో విశాలమైనది. అది విష్ణ్వాలయము. ముందఱి మండపమునందు సులభముగా వేయిమంది కూర్చుండవచ్చును. రాజబంధువులందరు కూర్చుండుటకు వరుసలుగా ఱాతి యఱుగులు కట్టబడి వానిమీాఁద నాను కొనుటకు వెనుకనమర్చఁబడి పరుపులు దిండ్లు వేయుదురు. వివాహము జరుగుచోటఁ జిన్న కల్యాణ మండపమున్నది. వివాహము జరిగిన తరువాతఁ గందాలో భోజనములు పెట్టుదురు. ప్రత్యేకములైన వంటకములు చేయుదురు. పెద్ద భోజనపు సావడి యలంకరింపుదురు. దైనందినముగా రాజభవనము నందు నాఱువేళల మ్రోగెడి తూర్యారావము లానాడవ్యవహితముగా మ్రోయుచుండును. వివాహము జరిగిపోవును. ఇట్లుకాక మఱికొందఱు రాజవంశీయులు ధనవంతులు. రాచమరియాద యెక్కువ కలవారు. తమ యిండ్ల లోననే వివాహములు చేసి కొందురు. వారి భవనములు తగినంత విశాలములుగా నుండును. పంది

ళ్లును బాకలు వేసినచో సరిపోవును. కోటలోననే జరిగెడి వివాహములు వివాహ మాత్రములుగా గనుపించును. ప్రత్యేక శోభయుండదు. రాజభవనమునందు నిత్యముగా నుండు శోభయే మఱికొంచెము కళను బెంచికొనును. వేరే వివాహముచేసిననే వివాహశోభ యంతయు గలుగును. అట్టి పెండ్లిండ్లకు రాజబంధువులు తండోపతండములుగా వత్తురు. రాజు కోటలో జరుగు పెండ్లిండ్లకు మరియాదగా బురుషులు వత్తురు. చూతురు. రెండు మూడు గడియలసేపు వుండి వెడలిపోవుదురు. ధనవంతులైన రాజబంధువులు తమ యిండ్లలోఁ జేసికొను వివాహములలో నిజమైన పెళ్ళిసందడి కనిపించును. వచ్చెడివారు పోయెడివారు విడిదలలో దిగెడివారు, మాకదికావలయునిదికావలయునని వార్తలు పెట్టు వారు, పోయి పెండ్లి చావడులలో భోజనము చేసెడి వారు, కొందఱు తమ విడిదలకు బోనపుపట్టికలతో నాహారము దెప్పించుకొనువారు, కొందఱు నీళ్ళు తెచ్చెడి వారు. కట్టెలు మోయువారు. ఒకచోట వాద్యములు సాగుచుండును. మఱియొకచోట శాస్త్రచర్చలు జరుగు చుండును. వేఱొకచోట శాస్త్రవిద్యానైపుణ్యము ప్రదర్శింపఁబడుచుండును. రమణీయాలంకార భూషితమైన స్త్రీలు మెఱుపుతీగలవలెఁ గనిపింతురు. ఒకచోట సురాపానగోష్ఠి జరుగుచుండును. వేఱొకచోటఁ బరరాజ్యముల యందలి విషయములు ప్రస్తావించఁ బడుచుండును. పెండ్లియనఁగాఁ బెండ్లికాదు. మూన్నాళ్ళ వినోదము. ఆ పెండ్లిండ్లకు రాజ కుటుంబము పోవును. అదియొక గొప్ప శోభ. ఇట్టియొక

పెండ్లికి మరునాడు పోవలయును. నీలా నాగార్జునులు మాటాడుచుండిరి.

నాగా- 'నీవింకను నిశ్చేష్టయుంటివేల. పుట్టిక సర్దికొనుట లేదు. ఏ చీరలు తాల్చవలయునో యే నగలు ధరించవలయునో యే పరిచారికులను వెంటదీసికొని పోవలయునో విచారించుచున్నట్లులేదు. నాయంగీలు నాధోవతులు నాశిరోవేష్టనములు నాయాభరణములు వేని వేనిని దీసికొని రమ్మందువో చెప్పుము. నీల మాటాడలేదు.

నాగార్జునుఁడు నీలను మఱియును గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను- 'మనము పెండ్లికిఁ బోవుటలేదాయేమి?'

నీల-'మనమందు రేల. మీరు వెళ్ళుఁడు. నేను రాలేను. నాకేలనో యుత్సాహముగా లేదు.'

నాగా- "నీవుత్సాహము కట్టినమూర్తివి. యుత్సాహము నీకు లేదన్నచో నేను నమ్మను. దీనికేదో కారణముండి యుండవలయును. మూన్నాళ్లచ్చట నుండవలయును. చూచుటకెన్నియో వినోదములుండును." ఆ పెండ్లి పీటల మీద గూర్చుండుట యా పెండ్లికూతురు సిగ్గుపడుట బంధువులు పరాచికమాడుట తలఁబ్రాలుపోసికొనుట, చూడముచ్చటగా నుండును.

నీల- మన పెండ్లికివి యన్నియు జరిగినవికదా! యా ముచ్చట తీరలేదా'

నాగా-'ఓసి నీలా! మన పెండ్లి తత్పూర్వమే యైనది. నీవెందుచేతనో మన పెండ్లిలో నుత్సాహముగాలేవు. ఏ

మహామాధుర్యమును స్త్రీయందు వివాహోత్పూర్వము నేను దర్శించి నిన్ను బెండ్లాడ నెంచితినో, యేమహా మాధుర్యమును మన పెండ్లియైన తరువాత వెన్నెలలో మనమిద్దఱము రెండు గుఱ్ఱాలమీఁదఁబోయి కృష్ణలంకలలో ననుభవించితిమో, యా మాధుర్యమును బెండ్లిమూనాళ్లు నే ననుభవించలేదు. అందు చేత నాకుఁ దద్వినోదాభిలాష యట్లె యున్నదనుకొందును.

నీల— 'మనము దేనిని వినోదమనుకొందుమో దాని యందు నిజమైన వినోదముండ వలయును. వినోదమనునది జీవలక్షణముచేత నిండియున్నప్పుడు పుట్టునుగాని వట్టి వస్తుప్రద ర్శనము చేతగలుగదు. కొండలున్నవి. నదులున్నవి. మేఘ ములుపట్టి వర్షించును. పదియేనుగులుబారుగా నడచుచుం డును. వంద రథములను దోలుకొని పోవుచుందురు. ఆవుల మంద యొకచోటనున్నది. వీనిలో వినోదమేమికలదు. అవి సహజముగా నట్లుండును. వినోదమనగా నెట్లుండును. మానవుడు తన శక్తిని బ్రదర్శించి నప్పుడుండును. నిజముగాఁ బ్రద ర్శించకపోయినను దత్ప్రదర్శన లక్షణము భాసించినప్పుడ యిన నుండును. రాజపురుషుఁడున్నాఁడు. ఒక రాజయువతి యున్నది. యిద్దఱును ఖడ్గవిద్యానైపుణ్యము కలవారు. వారి ద్దఱు యుద్ధమాడుదురు. ఆ పురుషుఁడాయువతి కంటె నైపుణ్య మెక్కువ కలవాఁడు. తననైపుణ్యమును బ్రదర్శించును. ఆమె చేతిలోని కత్తి దూరముగాఁబడునట్లు చెదరగొట్టును. ఆమె తన కత్తిని మరల దీసికొనఁబోఁబోవును. అతఁడు తనవామ పాదము కత్తిమీఁదనుంచి యామెపాణిగ్రహణముచేసి యా

మొతలమెత్తి తనవంక చూడఁగా,నితఁడు తన యాధిక్యసూచకమయిన మందహాసముతో నామె తానోటమి పొందిన లజ్జతోఁజూచుచుండఁగా బ్రక్కన వేణుగానములుచేయుదురు. తూర్యస్వనములు వినిపించును. పైనుండి కొండపూలు, తేనె బిందువులు కురియును. పెండ్లి యిట్లు జరుగవలయును. మఱియు వినోదములు కావలయునన్నచో తమ్ముఁడో పెండ్లికూతురుయన్నగారో నన్నుబిలిచి నాసోదరిని బెండ్లాడుమనును. బావమఱదులిద్దఱు యుద్ధమాడుచుందురు. పెండ్లి కూతురు వారి యుద్ధమునాపి తానతనికే ప్రియురాలునగును. అతనిని గాగిలించుకొనును. వారికెలన నుత్తమాశ్వము సజ్జీకృతమయి యుండును. అతఁడు గుఱ్ఱముపైకి దూకి యామెను సందిట నిరికించుకొని మోకాటిలోతు కృష్ణనీళ్లలో గుఱ్ఱపు ముంగాళ్లచేతనీళ్లను జిమ్ముకొనుచు లోతందనిచోట నీదించుకొనుచుఁ గృష్ణలంకలోనికిఁ గొంపోవును. అచ్చట దేవతలు వీరికొఱకు సర్వము సిద్ధముచేసియుంచిరాయన్నట్లు సర్వసంభారములాయత్తపఱుపఁ బడియుండును.ఇంతకు నచ్చటికిఁజేరునప్పటికి దన్నుగోరి తనను గాగిలించికొని తనవెంట లేచివచ్చినదాయన్నట్లున్న యాపడుచుదానితో జగడమాడును. నేనన్నచో నీకుఁ బ్రేమలేదు. యున్నచో నా సోదరునితో యుద్ధమాడుదువా? యుద్ధములో నా సోదరుని వధించిగాని జయించిగాని నా ప్రేమనెట్లు చూఱగొందువు. నిన్ను నేనెట్లు ప్రేమించగలను? అని యామెబిగియును. ఇట్టి రమణీయములైన సన్నివేశములతో జరిగిన ప్రేమకథ పెండ్లిగాని, పీటలమీఁదఁ గూర్చుం

డఁబెట్టి లేవలేని ముసలిదానిని దీసికొనివచ్చినట్లు పెండ్లికూతును దట్టలోఁ గూర్చుండబెట్టి తెచ్చుటయేమి. ఈమె సిగ్గుపడుటయేమి. సిగ్గుపడుట యెందులకు? ఇదివఱకామె యితనిని నెఱుఁగును. పూర్వమే సంబంధము నిర్ణయింపఁ బడినది. వారొకరి నొకరు చూచుకొన్నారు. కనీసము చిత్రపటములకైనను వినిమయము జరిగినది. సిగ్గెందుకు. సిగ్గుపడవలయునని యొక యలవాటు. సిగ్గుపడకపోయినచో నలుగురును విడ్డూరముగా జెప్పికొందురు. అందుచేత సిగ్గుపడుదురు. అర్జునా! నాకీ పెండ్లిండ్లు నచ్చవు.'

నాగా– 'నీలా! శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవి నట్లె దీసికొని వచ్చెను. సరిగా నీవు చెప్పినట్లే రుక్మిణీదేవి పెండ్లి జరిగెను.

నీల– 'ఆహా! ఏమిచెప్పినావు. రుక్మిణీదేవి పెండ్లియట్లు జరిగినదా? క్షత్రియుద్ధమాడిరా? ఆ రుక్మిణి కంటె దాసి యవ్వతె కృష్ణునకుఁ దా నమ్ముడుపోయినది. నన్ను వచ్చి తీసికొని పొమ్మని వార్త పెట్టినది. తానేమి నగలమూటయా చేలములుపెట్టిన పుట్టికయా. ఛీ! ఛీ! మఱియు నా రుక్మిణి యెంత సిగ్గులేనిది. తనయన్నయైన రుక్మిని కృష్ణుఁడు పట్టుకొని తలగొరిగించెను. అంతకంటె గత్తిపెట్టి గుండెలో బొడిచినను బాగుగా నుండెడిది. అంతకంటె శిరశ్ఛేదము మేలు. తన యన్ననట్లు పరాభవించిన మగనితో సంసారమా? ఎంత చీమునెత్తురు చచ్చిన యువతి. మీరందఱది యొక పెండ్లియని యనుకొందురు కాబోలు.'

నాగా-'నీలా! స్త్రీయనగనట్లే యుండవలయునఁట. ఆమె తన్నుఁదాను భర్త కర్పించుకొనవలయునట. భగవంతుని గూర్చి భక్తుఁడెట్లో భర్తనుగూర్చిభార్య అట్లుండవలయు నట. అదియే స్త్రీ జన్మయొక్క చారితార్థ్యమట. వినయశర్మ యని యొక పండితుఁడున్నాఁడు. ఆయన మన కోటలోని దేవాలయములో బురాణములు జెప్పుచుండును. రామాయ ణము చదువుచుండును. ఉపనిషత్తులు చెప్పుచుండును. దేవా లయమునకే రావాయెను. నేనప్పుడప్పుడు పోయి యాయన పురాణ ప్రవచనమును వినుచుందును. రాజ కుటుంబములోని వారందఱును బక్షమున కొకసారియైనను నచటికిఁబోయి కూర్చుండి రావలయును. ఇది యార్య స్త్రీ ధర్మము. రుక్మిణి కృష్ణునకుఁ దనుఁ దానర్పించుకొన్నదట. వేరే రుక్మిణియన్న స్త్రీ లేదు. ఆమె కృష్ణునిలో భాగమైనది. భాగమునకుఁ బ్రత్యేకత లేదు గదా?

నీల-ఆమె భాగమైనచో మఱియొక భాగము కృష్ణుఁడు. ఆ భాగమునకు బ్రత్యేకతలేదు. ఆ భాగమువచ్చి తన్ను దాన యీ భాగమున కల్పించుకొన వచ్చును.

నాగా- 'సరిగా జయద్రథుఁ డీప్రశ్నయే వేసినాఁడు వినయశర్మను'

నీల- జయద్రథుఁడనగా నెవరు?

నాగా- అతఁడొక విచిత్రమైన పురుషుఁడు. తాను తానని యెవ్వరికిని దెలియనీయఁడు. నాతో మిక్కిలి చెలిమి గానుండును. మా చెలిమి యెవ్వరికిని దెలియరాదు. అచటికి

బురాణములు వినుటకు వచ్చెడివారిలోఁ జాలమంది వాని నెఱుగుదురను కొందును. ఎవ్వఁడు నెఱిఁగినట్లు నటించరు. కొన్ని సన్నలచేత నేనాసంగతి గ్రహించితిని. అతఁడెదో దేశపు రాజకుమారుఁడు. ఐదాఱేండ్ల క్రింద మన కోటకు వచ్చెను. నాయనగారి నొక యుద్యోగమిమ్మని యడిగెను. వారు జయద్రధుని ధర్మశాలలో నూఱుగాయగా నుంచిరి. అతని మొగము చూచువాఁడుఁ లేఁడు.

నీల- నాకతనిని గుఱించి మీరెన్నయో సార్లు చెప్పితిరి. మరలఁ జెప్పుచున్నారు.

నాగ- 'నీవు జయద్రధుఁడెవ్వరని యడిగితివి.'

నీల- ఏందుకడిగితిననఁగా మీరాయన కింతవఱ కుద్యోగమిప్పించ లేక పోయితిరని మీకుఁ దెలియుట కడిగితిని. సరే పోనిండు. ఆ జయద్రధుఁడన్న ప్రశ్నకు మీవినయశర్మ యేమి ప్రత్యుత్తర మిచ్చెను?

నాగా- నేను జయద్రధున కుద్యోగమిప్పించుటకుఁ జాల ప్రయత్నము జేసితిని. చిన్నన్నగారి కేమియు నిష్టము లేదు. ఎందుకిష్టము లేదో తెలియదు. అతని ప్రసక్తి వచ్చి నప్పుడెల్ల నాయనగారు చిన్నన్నగారి మొగము చూతురు. వారు కనుబొమ్మలు ముడుతురు. నాయనగారు మాటాడరు. నేను నాయనగారి దర్శనమున కెప్పుడు వెళ్ళినను జిన్నన్న గారితో గలిసియే పోవుదును. ఒంటిరిగా నేను నాయనగారి దగ్గఱకుఁ బోవుటకు నాకెదో భయముగా నుండును. పెద్దన్న గారి వద్దకుఁ గూడ నే నొక్కఁడను పోను.

నీల- 'నిజముగా మీరు కనిష్ఠ సోదరులు. కనిష్ఠ సోదరులకెంత భయభక్తులుండ వలయును. మీవద్దనున్నవి. వాల్మీకి నాటికి మీరులేరు కాని, యున్నచో దన రామాయణములో భరతునో శత్రుఘ్నునో మీవంటి తమ్మునిగాఁ జిత్రించెడివాఁడు. ఆ నాఁడు మీరు లేకపోవుట వాల్మీకి దురదృష్టము!

నాగా- ఓసి నీలా! నీకీకథలన్నియు నెట్లు దెలియును? నేను నిన్ను బెండ్లియాడు నాటికి నీవద్ద నీ పాండిత్యములేదే. నీకు రుక్మిణీ కల్యాణకథ చాల విస్పష్టముగాఁ దెలియునే. వట్టి రామాయణ కథ కాదే. ఆ యన్నదమ్ములు వారి భక్తి ప్రపత్తులు నీకింత బాగుగా నెట్లు తెలియును? నాకుఁ దెలియకుండ నీవు దేవాలయమునకు బోయి ప్రతి దినము శర్మ పురాణప్రవచనము వినివచ్చు చుంటివి కాబోలును. నే నెప్పుడో పక్షమునకొకసారి పోవుచుండెడివాఁడను. నా కన్న నీకెక్కువ తెలియును. అందఱును రామాయణమును కథగా వినియుందురు. నీవు రామాయణమును గూర్చి పై మెట్టులో మాటాడుచుంటివి. నీకిదియెవరు చెప్పిరి?

నీల- 'సరేగాని యీ ప్రశ్నకు మీ వినయశర్మ యేమి సమాధానము చెప్పెను?'

నాగా- నా వినయశర్మయేమి, నీ వినయశర్మయే. ఆయన జెప్పిన పురాణ రహస్యముల నీ కెక్కువ దెలిసినది. ఏమిచెప్పినా కృష్ణుఁడు భగవంతుఁడని చెప్పెను. భగవంతు డనగా సంపూర్ణుఁడఁట. వేదములోని యొక వాక్యము చదివి

వెను. 'పూర్ణమదఃపూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదుచ్యతే పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే' అది పూర్ణము. ఇది పూర్ణము. పూర్ణమయినదాని నుండి పూర్ణ మైన దాని దీసివేయుము. మిగిలెడిది పూర్ణమే. రెండొకట్లు కలిపినచో రెండుగాని రెండు సున్నాలు గలిపినచో నొక సున్నయే. సున్నాలోనుండి సున్నతీసివేసినను మిగిలినది సున్నయే. కృష్ణుఁడు పూర్ణాకృతి. రుక్మిణిపోయి యతనిలోఁ బ్రవేశించినది. ఆ కృష్ణునకు, దఱుగుటయులేదు పెరుగుటయు లేదు'–

నీల– "మఱి రుక్మిణి కూడ నింకొక సున్నకదా. ఆ సూత్రమామెకును బట్టవలయును"

నాగా– 'నీ వడిగినది నిజమే. జయద్రథుఁడూఱ కొన్నాఁడేమి?

నీల–'అతఁడీ ప్రశ్న వేసినచో నందరు నతనివంక చూ తురు. మొదటి ప్రశ్నకే చూచియుందురు. తాను రహస్యముగా నుండవలయు ననుకొన్నవాఁడు మిక్కిలి దూరముగాఁ బోవ నెందుకుఁ బోవును. కాదు జయద్రథుఁడు తాను మరల బ్రశ్న వేసెను. ఏమి జరుగును. వినయశర్మ వాని నదలించి కూరుచుండఁబెట్టును. వినయశర్మ రాజాశ్రయము కలవాఁడు. నేఁడు గానిచో రేపయినను నెదో యుద్యోగము సంపాదించు కొని మనవలయునను కొనుచున్న జయద్రథుఁడు నాటితో నా యుద్యోగభావమునకు నీళ్లువదలికొనవలయును. ఇంత కును దెలిసినదికదా రుక్మిణి వట్టి పేద మనసు కలది. అది

పెండ్లికాదు. పెండ్లియనఁగా స్త్రీ పురుషులకు సమాన ప్రతి పత్తి యుండవలయును. ఇరువురి యందు నొక శౌర్యరేఖ భాసించవలయును. పుట్టెడి సంతానము వీరులు పుట్టుదురు. లేనిచో నసమర్థులు జనింతురు. ఎవఁడో యెదో చెప్పును. అదియే నిజము. దానిని బట్టుకొని ప్రాకులాడు చుందురు. ఈదేశ మనాదినుండియు నిట్లే యున్నది. వేదములు భగవంతుని నోటినుండి వచ్చినవట. ఆ భగవంతుఁడెచ్చట నున్నాఁడో వాని నోరెంతయున్నదో మనకుఁ దెలియదు. ఈ దేశము నందఱు ఋషులే. గడ్డము పెంచి, ముక్కుమూసి కొని, కొంత నిర్జనమైనచోటఁ గూర్చుండుము. నీ వొక ఋషివి'

నాగా– 'కొంత నిర్జనమైనచోట నెందులకు'

నీల– పూర్తిగా నిర్జనమైనచోట నైనచో నెలుగు బంట్లు రావచ్చును. పులులు రావచ్చును. మరల బొట్ట గడచుట యెట్లు? దారి. బోవు వెంటఁ బోవువా రెవ్వరో యొకరిద్దఱు చూడవలయును. అచ్చట నొక ఋషికూర్చుండి తపస్సు చేయుచున్నాఁడురా యన్నవార్త వ్యాపించ వలయును. జన మరటిపండ్లు, కొబ్బరికాయలు, చెఱకుగడ ముక్కలు, వక్కలు తమలపాకులు తీసికొనిపోయి యీయ వలయును.'

నాగా– 'వక్కలు తమలపాకులు నెందులకు.'

నీల– 'ఇక్షుకండములున్నవి గదా. అవి మన్మథుని ధనస్సులోని ముక్కలు. ఏ ముక్కలుగానో మన్మథుని ధనస్సు

న్నిప్పుడు తాంబూల సేవనము లేనిచో నెట్టుని పెదవియెట్లో ప్పును?

ఇద్దఱును గిలాకిల నవ్వుకొనిరి. నాగార్జునుఁడు వెడలి పోయెను. పెండ్లికిఁబోవుట యెట్లును లేనేలేదు. నాగార్జునుని మనస్సులో నొక భయము తోఁచెను. సీల యీ మాట లెవ నితోనైన ననునేమో. ఇవి క్రమముగాఁ గోటలో . వ్యాపిం చును. తన తలిదండ్రుల చెవిని బడును. దాని వలనఁ జాల కష్టములున్నవి. ఈ భార్యను పదలిపెట్టుమని రాజు శాసించ వచ్చును. ఆమెను దేశనిష్కాసనము చేయవచ్చును. తానా మెను వదలి నిముసము బ్రదుకలేఁడు. ఇంత తెలివిగల చాన యెచ్చట నుండును.? ఏమి వివేకము? ఏమి చర్చానైపు ణ్యము? మాటాడుచుండఁగా నెన్నో గూఢార్థములు పెట్టి యొక్కొక్కమాట మాటాడును? పూర్వము నాగార్జునుఁ డామెను వట్టి సౌందర్యవతి యని యనుకొనెను. మధురమైన స్వేచ్ఛాప్రవృత్తి కలది యనుకొనెను. హేలామధుర కుల్య యనుకొనెను. పరమ రమణీయ శృంగార భావ సుధాలహరి యనుకొనెను. ఇప్పుడామె శాస్త్ర రహస్య పరిజ్ఞాత్రి. పరమ వివేకనిధి. తార్కిక శిరోమణి. వలచినచో భారతదేశము నంతయు నూతనమైన యొక సంవిధానమునందుఁ దీర్పఁ గలయువతి. పరంపరగావచ్చు ప్రాత యూహలయొక్కయు ప్రాతత్రోవల యొక్కయు పరిష్కారము చేయఁగల మహా మేధావి. ఇట్లనుకొనుచుఁ గొంత దూరము పోయి యెడదలోని సన్నని భయము నణచికొనలేక వెనుదిరిగివచ్చి సీలతో నిట్లనెను. 'సీలా! ఓసి నా ప్రాణపదమా! నా యజ్ఞాన

మును తొలగించుటకు వచ్చిన మణిదీపమా! సర్వజగత్తును పాలింపగల మేధాసంపత్తి గల్గిన యువతీశిరోరత్నమా! నేను నిన్నొక్కటి ప్రార్థించుచున్నాను’ నేఁడు నీవు నాతో మాట్లాడినట్లు మరియెవ్వరితోఁడను మాటాడనని నాకు వాగ్దానమిమ్ము. ఇట్లు మాటాడితివా మన తలలు పోవును. మన యిద్దఱ మొకరి కొకరము కాకుండాబోదుము. నేను నిన్ను వదలి లిప్త నిలువలేను. మరెవ్వరితో నిట్లు మాటాడనని నాకు వాగ్దానమిమ్ము. అని యనెను. నీల కొంత సేపాలోచించి యిట్లనెను. నేను నీకేవాగ్దానమీయక ముందు నీవు నాకొక వాగ్దాన మీయవలయును. నాకీ దేశము రుచించలేదు. నాకీ యాచారములు రుచించవు. నేను కొండలలోఁ బుట్టవలసిన దానను. నా గురువు రేలంగి. ఆమె నా మనస్సునుఁదీర్చినది. ఈ రాజ్యముతో నీ లోకముతో నా కవసరము లేదు. నా ప్రియుఁడవయిన నీకు నా కెట్టి భావములు కలవో యట్టి భావములు కలవేని నా జీవితము చరితార్థమయనట్లు”.

ఇద్దఱును వాగ్దానములు నెఱపికొనిరి.

---

## ౮

వినయశర్మ గోదావరీ ప్రాంతము వాఁడు. ఆయన వయస్సు నూట డెబ్బది దాటియుండును. ఆయన ధాన్యకటకమునకు వచ్చి రెండేండ్లాయెను. ఈ రెండేండ్లనుండి ప్రతి దినముదయమున సూర్యోదయాది మూఁడు గడియలు గడచిన తరువాత విష్ణ్వాలయములోఁ గూర్చుండి పురాణ మారంభించును. మూఁడు మూడున్నర గడియలసేపు పురాణమును జెప్పును. రాత్రి సూర్యాస్తమయమైన తరువాత మరల వచ్చును. మరల రెండు మూఁడు గడియలు పురాణమును జెప్పును. ఆయన యొక గ్రంథము నుండి చెప్పునని లేదు. ఆయనకు సంస్కృత రామాయణము కంఠపాఠముగా వచ్చును. ప్రధానముగా రామాయణము పురాణము జెప్పుచున్నట్లుండును. గాని బహు పురాణ కథలు చెప్పుచుండును. చెప్పుచు ననేక విషయములు చెప్పును. ఆ విషయములలోఁ గృష్ణలీలలు కౌరవ పాండవులయుద్ధము వ్యాసమహర్షి వ్రాసిన బహు గ్రంథములను గుఱించి ప్రస్తావించును. అనంతకాలమును గూర్చి భోధించును. అనేక యుగములు గడచుచున్న యుగము, నలకథ మొదలైన పూర్వ రాజ కథలు సర్వమును జెప్పుచుండును. అందఱును వినుచుందురు.

ఆ వినయశర్మ యొక్క పూర్వ వృత్తాంత మెవ్వరికిని దెలియదు. ఎవరో వృద్ధ బ్రాహ్మణుఁడు వచ్చినాఁడు.

రాజుగారి నాశ్రయించినాఁడు. పురాణములు చెప్పికొంచు జీవించుచున్నాఁడనియే యందఱు అనుకొందురు. కాని జయద్రథుఁ డట్లనుకొనలేదు. తానదివఱకు నాల్గేండ్లుగా ధాన్యకటకము నందున్నాఁడు. ఏ పండితుఁడు వచ్చినను రాజదర్శనము చేయును. సన్మానము పొందును. వెడలిపోవును. అచ్చటనుండి ఇట్లు పురాణములు చెప్పుట మున్నెవ్వరు చేయలేదు. రాజధానిలో గోటలో నుండి పురాణములు చెప్పెడి యలవాటు లేదు. పెద్ద పెద్ద పల్లియలలోఁ బట్టణములలోఁ బురాణములు చెప్పెడివారున్నారు. రాజధానిలో నందులో గోటలోఁ గొందఱు పండితులుందురు. వారు రాజకుమారులకు శిక్షా గురువులు. రాజకుమారులకు నధ్యయనము చేయించు వేద పండితుఁ డొకఁ డుండును. శాస్త్రగురు వొకఁ డుండును. రాజనీతియు శాస్త్రవిద్యయు నేర్పెడివారుందురు. శాస్త్రవిద్య నేర్పెడివారు సామాన్యముగా క్షత్రియులు. రాజనీతి కఱపెడివారు బ్రాహ్మణులు కాని క్షత్రియులు గాని యౌదురు. వీరు కోటలోనే యుందురు. వారి వద్ద నెప్పుడును రాజకుటుంబమువారు రాజకుమారులు నేర్చికొనుచునే యుందురు. వారెప్పుడయిన రాజసభకుఁ బోవుట కలదు. శాస్త్ర చర్చలు చేయుటయుఁ గలదు. కోటలోఁ బురాణము చెప్పుటకుమాత్ర మిదియే మొదలు. ఈ వినయశర్మ తొలుతఁబోయి రాజుగారి దర్శనము చేసెను. వెంటనే యీ పురాణములు చెప్పుట ప్రారంభించెను. ఎవరైనఁ బండితుఁడు వచ్చినచో రాజ దర్శనము కొంత యాలస్యముగానే యగును. ఐన తరువాత రాజానుగ్రహము కల్గు

టకు మఱికొంత కాలము పట్టును. ఈయన వచ్చుచునే కోటలోఁ బాగావేసెను. ఈ సంగతి జయద్రధునకుఁ గలిగించి నంత సందేహము మఱియెవ్వారికిని గలిగించలేదు.

వినయశర్మ వృద్ధురాలైన తన భార్యతో వచ్చెను. వారికి విడిది కోటలోనే ఏర్పాటు చేయఁబడెను. వినయశర్మ పుట్టుపుర్వోత్తరములు తెలిసికొందుమన్నచో జయద్రధునకు సాధ్యముకాలేదు. దుస్సల వినయశర్మ భార్యతో మాటాడుటకుఁ బలుసార్లు ప్రయత్నించెను. ఆమె యెప్పుడు వెళ్ళినను వినయశర్మ భార్య వంటచేసికొనుచుంటి ననును. పలుసార్లు వారి యింటికి గొళ్లెము పెట్టి యుండును. ఆమె యెచ్చటికిబోయెనో దెలియదు. ఒక్కొకప్పుడు వినయశర్మ యొక్కడే యుండును. దుస్సల మటాడకుండఁ దిరిగిపోవును.

జయద్రధుఁడు పోయి వినయశర్మతో మాటాడ వచ్చును. అతనికిష్టము లేదు. ఒక్కటే మార్గము కలదు. తాను పురాణములకుఁ బోయి యాయన చెప్పిన పురాణమును విని యా లక్షణములను బట్టి వినయశర్మ యేప్రయోజనమును సాధించుట కచటికి వచ్చెనో తెలిసికొనవలయును. అతఁడు రెండేండ్లు పురాణమును జెప్పినను జయద్రధున కంతు పట్టలేదు. జయద్రధుఁడు కొన్నాళ్ళూరిలో నుండఁడు. ఆ సమయములో వినయశర్మ కొన్ని మాటలు మాటాడెనని జయద్రధునితో గొందరు చెప్పుదురు. ఆ మాటలను బట్టి జయద్రధున కేదో, యనుమానము తగిలెను. ఆ మాటలు తాను లేనపుడే చెప్పుట యేల? తాను పురాణమునకు వెళ్లెడి

దినములే యెక్కువ. తాను లేనప్పుడే యీ ప్రసంగము వచ్చుట యేల? అట్లయినచో వినయశర్మను, దాను జయద్రథుఁడని తెలియును. తాను పురాణమునకు వెళ్లి యెప్పుడును ప్రశ్న వేయఁడు. ఒక్కనాఁడే వేసెను. అతఁడు వేయఁదలఁచి కొనలేదు. తాను ప్రశ్న వేసినచో దాని కెట్టి పరిణామము కలుగునో చూడవలెనని వేసెను. దాని కేమియు పరిణామము జరిగినట్లు లేదు.

వినయశర్మ యింటి కెవ్వరును బోరు. ఒక రాజపురుషుఁడు పోవును. ఆ రాజపురుషుని పేరు చంద్రశేఖరవర్మ. అతనిని గుఱించి జయద్రథుఁడు తెలిసికొంద మన్ననూ దెలియదగిన దేమియు గనిపించలేదు. కాని యీ వర్మకుఁ గోటలో బెద్ద యధికారము గలదు. అతఁడు రాజునకంగరక్షకుఁడుగానుండు నందురు. అతఁడు రాజు వద్దనున్న సమయమే కనుపించదు. ఎక్కువ కాలమతని యింటిలోనే యాతఁడుండును. ఆయన సంపన్నుఁడని చెప్పవలయును. ఆయనకుఁ బలుమంది పరిచారకులు గలరు. కాని జయద్రథున కొక యనుమానము. తొలుత శ్రీముఖుని జలపాతమునందుఁ దాను దూకించిన వేళ-తాను దూకించలేదు. తన మాటలకు నొక యుత్సాహము పుట్టి యతఁడే దూకెను-మారనుగాఁ జెట్టు దగ్గఱ నిలుచున్నది యితఁడేనా యని. కాని యీ యెండలలో నితఁడవునో కాదో తెలియుటకు వీలులేదు. జయద్రథుఁ డతని వంకఁ జూచెను. అపుడతనిని గుర్తుపట్టుటకుఁ జాలఁ బ్రయత్నించెను. ధగధగ మణులనొక పాత్రలోఁ బోసి గలసరించి క్రమ్మఱించినట్లున్న

యీా యెండలలో నేమి తెలియును. కాని జయద్రధుని కన్నులు చాల సునిశితములైనవి. సునిశితములైనవే కావు, ఆ నాడు జయద్రధుడు తన కంటికొక కాటుక పెట్టుకొనెను. భారత దేశమునకు వాయవ్యదిశ యందున్న రామకహార హూణ బాహ్లిక కిరాతశకబర్బరాది దేశములవారు దానిని దివా కాలముల నేత్రములకుఁ బెట్టికొందురు. అవి కొండ దేశములు. వానలులేని దేశములు. గ్రీష్మపుటెండలు మండించు దేశములు. ఆ యెండలలో గనుచూపు దూరమున కానుటకు నెండలకు కన్నులు మిఱుమిఱు లాడ కుండుటకు నది యొక యంజనము. నా దేశవాసుల నేత్రములకుఁ బెట్టికొందురు. ఆ యంజనము నా నాఁడు జయద్రధుఁడు తన నేత్రములకుఁ బెట్టుకొనెను. అతనికి సువిస్పష్టముగా గనిపించవలసినదే. కాని కనిపించలేదు. కనిపించినంత వఱకు జరిగిన ఫలిత మేమనఁగా నీ చంద్రశేఖరవర్మ యీా రాజ పురుషుఁడే యై యుండ వలయునని. అతఁడు తన్ను గుర్తుపట్టఁ గలుగుట యసంభవము. ఆ నాఁడు జయద్రధుఁడు తన వేసము చే మార్చెను. తానానాఁడు ధరించిన దుస్తులు దైనందిన ముగా దాను ధరించినవి కావు. తనయింటిలో రెండు పెద్ద బుట్టలనిండఁ బలువిధములైన దుస్తులు కలవు. వానిలో నా దుస్తులున్నవని యెవరికిని దెలియదు. ప్రేముతో నా దినములలో బెద్దపెద్ద బుట్టలల్లెడివారు. వానికి మూతలు కొక్కెములు నుండెడివి. జన సామాన్య మందఱు తమ వస్తువులన్నింటిని వానిలోననే భద్రపఱచి కొనెడివారు. అ బుట్టలను దెఱచుట కెవ్వరికిని సాధ్యముకాదు. ఆ బుట్టలనఁగా

జయద్రథుని బుట్టలు. ఆ బుట్టలను దెఱచుటకుఁ దొలుత నొక మంత్ర ముచ్చరింప వలయును. ఆ మంత్రము నెఱుఁగనివాఁడా బుట్టను దెఱవ బూనినచో నొక పాము తెఱవ బోయిన వానిని గఱవఁబోవును. ఆ పాము మూరెడుండును. ఎఱ్ఱగా నల్లగా నుండును. శాక దేశములో నున్న మహా పర్వతములలోననే యీ పాముండును. ఆ మంత్రమునకు నా పామునకు సంబంధము. కాని యందులో నొక్కటియే లోపము. ఆ పాము కఱవ వచ్చును. ఆ బుట్ట తెఱచెడివాఁడు కరచినను సరే యని బుట్టను దెరచినచోఁ బామేమియుఁ చేయలేదు. అది పాము కాదు. సామాన్యముగా నందఱును భయపడి పాము కనిపించినంతనే పారిపోదురు.

అది యట్లుంచి చంద్రశేఖరవర్మ తన్ను గుర్తుపట్టుటకు వీలులేదు. ఆమిడి యెండలో నేత్రాంజనములేని వర్మ మాఱు దుస్తులులో నున్న తన్నెట్లు గుర్తుపట్టును?

జయద్రథుఁడిట్లు తనవైపునుండి యాలోచించి వినయశర్మయుఁ జంద్రశేఖరవర్మయు నానుపానులు దెలిసికొనలేక యుండగా నొకనాఁటిరాత్రి దుస్సల; కొడుకుతో నిట్టుల ననెను. 'ఓయీ నాయనా? వినయశర్మ భార్యపేరు జాహ్నవి. ఆమె రాణి గారికి రాజవంశములో నున్న యితర స్త్రీలకుఁ బోయి పురాణ కథలు వినిపించుచుండును. అమె కదే పని. నాకిన్నాళ్లుగాఁ దెలియలేదు. ఇప్పుడెందుకుఁ దెలిసినదనఁగా నామె యువరాజు భార్య యొక్క యాజ్ఞానుసారము నాగార్జునుని భార్యయైన నీల కుపదేశించుటకు వచ్చెను. ఆమెయం

దరకు నుపదేశములు చేయుచున్నది. ఆమె కొక్కవేదము రాదుతప్ప దక్కిన వన్నియుఁ దెలియునట. రాణిగారికి మంత్రోపదేశము చేసినది. యువరాజుకిఁ జేసినది. విజయ సింహుని భార్యకుఁ జేసినది. పెక్కుమంది మంత్రుల యిండ్లలో సేనాపతుల యిండ్లలో నంతఃపుర స్త్రీలందరకు నామె గురువు. యువరాజామెను వెంటఁబెట్టుకొని నిన్న నీల వద్దకు వచ్చెనట. ఈ సంగతు లన్నియు నామె నీలతోఁ జెప్పెనట. జయచంద్రుఁడు 'నీల యేమియు ననలేదు గదా' యని యడి గెను. దుస్సల అనకపోవుట యేమి? ఆమె తొందర గల మనిషి. మీరు నాకుఁ జెప్పనక్కరలేదు. నా మతము నాకు దెలియును. నా దేవతలు నాకున్నారు. నేనిదివరకే యుప దేశము పొందితిని' అన్నదట. నా పేరు మాత్రము చెప్ప లేదు. కాని నే నచ్చటికి దినదినము పోవుచుండుట పరిచా రికల కందఱికిఁ దెలియును. వారు ముడిపెట్టి కొందురు. అంత జయభద్రుఁ డిట్లనెను. 'అమ్మా! నేను దినదినము నీ వచ్చటకి బోవుటకు బూర్వమే యొక హేతుకల్పనము చేసి దాని వ్యాప్తి తెచ్చితిని నేను నీతో చెప్పలేదు. రేపు నీలతోఁ జెప్పుము. ఆమెకు నీకు సంబంధమేమిటని నీల నెవరైనా నడిగినచో నీల యిట్లు చెప్పవలయును. నీలకు విక్రముఁడు పెంపుడు తండ్రి. అసలు తండ్రి యున్నాఁడు. ఆయనది శంభ రుని దీవి. ఈ దీవి కృష్ణాగోదావరుల మధ్య సముద్రతీరము ననున్నది. ఈ భారతీయుల పురాణములున్నవే పట్టరాని కట్టుకథలు. వానిలో నిది యొకటి. కృష్ణునకుఁ బ్రద్యుమ్నుఁ డను నొక కుమారుఁడు కలఁడు. వాఁడును జనిపోయెను.

యాదవులు త్రాగి తందనాలాడినపుడు వారొకరినొకరు పొడిచికొని చచ్చిరి. అందులో వాఁడు కూడఁ చచ్చియే యుండవలయును. వాఁడు వైకుంఠనగరములో వేంచేసి యున్న శ్రీమహావిష్ణువులువా రున్నారే వారి కుమారుడు మన్మథుఁడు. సర్వ స్త్రీ పురుషుల సంగమమునకు వాఁడట హేతువు. ఈ జాతికిట్టి కల్పనలు చేసికొనుటకు సిగ్గయిన లేదు. వాఁడొక బూతు దేవుడు. వాఁడు శివుని కంటిమంటలో దహింపఁబడెను. ఆ శివుడేమిటో యాకంటిమంట ఏమిటో యాదహింపఁబడుట యేమిటో యీ కథ ఏమిటో ఇదియొక నాగరికతయేమిటో దీనిని రక్షించుటకు రాజ్యములు-ఇట్టి దుష్టములైన విశ్వాసములు లేనివారు వీరికి విరోధులు. వారందఱిని వీరు దేశమునుండి వెడలఁగొట్టుదురు. ఈ విశ్వాసములు లేని రాజ్యము లన్నియు మ్లేచ్ఛరాజ్యములు. ఉరగాభిసార దరద బాహ్లీక కిరాతశక యవన బర్బర రామఠహార హూణాది దేశము లన్నియు మ్లేచ్ఛదేశములట. ఎందుచేత మ్లేచ్ఛ దేశములు? వారు యజ్ఞములు చేయరు. పశువులను జంపరు. దొంగ జపములు చేయరు. దేవాలయములు కట్టరు. అందులో విగ్రహములను బెట్టరు. ఆ రాముఁడు దశరథరాజు కొడుకు. దేవుడఁయిపోయినాఁడు. అది చాలక మనకీ కృష్ణుఁడొకఁడు వెలసినాఁడు. వీడొకఁ దేవుడు. ఆ మన్మథుఁడు వీని కడుపునఁ బుట్టినాడు. శంబరుడను రాక్షసుని సంహరించినాఁడు. రాక్షసుఁడనఁగా వారు వ్రాసినట్లు కోఱలు గీఱలు వుండవు. రేపు ప్రొద్దున నేనొక రాక్షసుడఁను గావచ్చును. నీ వొక రాక్షస స్త్రీవి. ఈ శంబరుదీవి యీ శంబరాసురుని పట్టణము. ప్రద్యు

మ్నుడాశంబరుని సంహరించెను. ఆ హస్తినాపుర రాజులకును నీ యాంధ్రరాజులకును నొక రాజకీయమంనన యంతస్సంధి ప్రాయమైన యొక రాజకీయ సౌహార్దముకలదు. ఈ రోమపా దుని తండ్రికి ధృతరాష్ట్రునకుఁ గొంత సౌహార్దము కలదు. రోమపాదుని తండ్రియుఁ గృష్ణుని తండ్రి వసుదేవుఁడును స్నేహితులట. ప్రద్యుమ్నుఁడు వచ్చి శంబరుని సంహరిం చినప్పు డాంధ్రసైన్యములు చాల సాహాయ్యము చేసెను. ఈ కథనొకఁడు చెప్పెను. వాఁడు భారతీయ మతమునకు వ్యతిరేకి. పైకి వారి మతానుయాయివలెనే నటించుచుం డును. ఇట్టి వారెందఱో యున్నారు.

దుస్సల-ఓయీ! నీవు చెప్పఁదలచి కొన్నది నీల కన్న తండ్రి విషయము. అది వదలిపెట్టి యింత చెప్పితివి. నిన్ను గూర్చి నాకదే భయము. నీవూరిలో లేనప్పుడు నీకుఁదవులు మాటలు వినయశర్మ పురాణములో జెప్పెను. నీవు దానికిఁ దగినట్లు ప్రశ్న వేసితివి. రహస్య గోపనము సంపూర్ణముగాఁ జేయుట నీచేతఁగాదు. చూడుము. విషయమును వదలిపెట్టి శంబరుదీవిపేరు రాగనే యాకథయంతయుఁ జెప్పితివి. ఇంత చెప్పుట వృథా కదా.

జయద్రథుఁడు- నీవు గనుక నట్లు మాటాడితిని. మఱియొకరితో నిట్లెందుకు మాటాడుదును!

దుస్సల- "యది యాలోచన లేని మాట. అట్లు మాటాడుట నీ స్వభావములో నున్నది. మన స్వభావము మనలను మరపించి బయటకి వచ్చును. మనకుఁ దెలియని

వేళలలో వచ్చును. స్వభావములో నుద్రేకముండ వలయును. గాని య్యా యుద్రేక మెప్పుడు బైటికి వచ్చునో యెవరికిం దెలియును. నీతి యనగా స్వభావమును గూడ నదుపులోం బెట్టికొన గలిగినది."

జయద్రథుండు- ఔనమ్మా! దీనికి నేనా కారణము. నీవే కారణము.

దుస్సల- 'నీవేమనుచున్నావో నాకుం దెలియును. అప్పుడీ యంతర్విరోధము సాగించుటకే వీలులేకుండెడిది. మనము క్షత్రియులమే కావలయును. ఇట్లు చేయుచునే యుండవలయును. క్షత్రియులము కానిచో మన పథకమంతయుం బట్టబయలే. కానిమ్ము శంబరుని కథ యేమియో చెప్పుము.'

జయద్రథుండు- 'నీల కన్నతండ్రి డి యూరది. అచ్చట మనము మూడేండ్లుంటిమని కొందఱికి జెప్పితిని. అచట మన మున్నప్పుడు నీల యొక్క పుట్టినింటి వారికిని మనకును జాలం బరిచయము కలదు. అందుచేత నీవు నీల యింటికి బోవుదువు. ఆమెకు నీయందు సహజముగాం బ్రేమ యుండును. నీవు గురువవని యామె యందఱితో జెప్పకుండం గట్టు దిట్టము చేయుము. మఱియు నాజాహ్నవి నీలవద్దకువచ్చును. యువరాజ్ఞి యూరకుండదు. అంతిపురములో నెవ్వరికిని నీల మీాద నభిమానము లేదట. ఒక్కయువరాణికే కలదట. నీల యొక్క యథేచ్ఛా వర్తనమునకు దక్కిన రాజస్త్రీ లందఱు ముక్కలును మాతులును ముడిచికొంగాయువరాణి మాత్రము

సవ్వునట. ఆమెలో నొక స్వతంత్ర భావముండి యుండవల యును. నీవు యువరాణితోఁ బరిచయము చేసికొనలేదా? నేను యువరాజుతోఁ జేసికొంటినికద.

దుస్సల- 'దానికొఱకే ప్రతీక్షించుచుంటిని. నేను యువరాణి మేడకుఁ బోరాదు. అచ్చటికి మహారాణియుఁ దదితర వృద్ధరాజ స్త్రీలును దఱుచుగా వచ్చుచుందురు. నే నచ్చటికి బోయి చేయదగిన దేమియు లేదు. మన బండారము బైట బెట్టికొనుట తప్ప యువరాణి తరచుగా నీల యింటికి రాదు. నీల కేదయిన పనియున్నచో యువ రాజ్ఞి యింటికి దానే పోవలయును. అది రాజల మర్యాద. కాని నీల మేడలోఁ నేదియైన యుత్సవము జరిగినచో నందఱు రాజస్త్రీలును వత్తురు. యువరాజ్ఞి కూడ వచ్చును. అప్పుడు యువరాజ్ఞిని 'అక్కా- నీవు కొంతసేపు వుండి పోదువుగాని' యని నీలచేత ననిపించి రెండుమూఁడుసార్లు ట్లయిన తరువాత నేను యువరాజ్ఞితో మాట్లాడుట సంఘ టించు కొనవలయును. దీనికి గాలము పట్టును. నీవు వేసిన పథక మెంత దూరము లోనికివచ్చినది? దానిని గుఱించి నాకుఁ జెప్పవచ్చునా?

ధర్మశాలలో తమకుఁ బ్రత్యేకింపఁ బడిన స్థలములో వారిద్దఱర్ధరాత్రమున నీప్రసంగము చేయుచుండిరి. నడుమ నడుమ జయద్రథుఁడు పోయి యింటి చుట్టును దిరిగి యెవ రైన నుండిరేమో యని చూచి వచ్చుచుండును. ఆ ధర్మ శాలలో వీరు నివసించు గదికి దక్షిణపువైపున గోడయుం

డెను. ఆ గోడ కావతల మఱియొక గదియుండెను. ఆ గది వీరిది కాదు. అది ధర్మశాలలో భాగము. అది పెంకులు కప్పిన యిల్లు. ధ్వని గోడలో గుండఁ జొచ్చికొని పోకపోయి నను బైకిఁబోవును. అతఁడు ప్రతి దినమును గోడలో రంధ్ర ములేవైన నున్నవేమో యని జాగ్రత్తగాఁ బరీక్షించుచుం డును. ఏదయినఁ బురుగు తొలచిన బెజ్జమున్నచో దానిని చిక్కని సున్నపు టడుసుతోఁ బూడ్చుచుండును. ఇచ్చటి మాటలు గోడ వెనుక వారి కెవ్వరికిని వినిపించవు. అతనికిఁ జెప్పరానంత యనుమానము. ఆ గోడ యింటికప్పు వరకు గట్టఁబడియే యున్నది. ఇంటి కప్పునడుమ కోపుగానుండి రెండు వైపులకు వ్రాలియుండును. వ్రాలిన చోటునుండి కోసగాఁ దేలినభాగము కుడ్యమునకంటె భిన్నమయి నది. అదియును గోడపెంచినదే కాని యా త్రికోణముగా నున్నభాగము క్రిందగోడ యంతగట్టిది కాదు. ఒక్క టాయి పేర్చినది. పైన మన్నలికి సున్నము చేయలేదు. తానూరకే యందులోనుండి దానినలికించి సున్నము చేయించుఁడని యడుగుట సందేహమునకుఁ దావిచ్చుట. గదిగోడ ఎత్తుగలదియే. ఆ పైనకల యొంటిటాతి గోడలో నుండి మాట లవతలికి వినిపించుటకు పీలున్నచో యున్న దేమో తెలియదు. ఒక నిచ్చన వేసికొని పైన బెజ్జములున్న వేమో చూడవలయును. ఆ రేండ్లనుండియుఁ దానున్న భాగములో నిచ్చనయే లేదు. ఎప్పటికిఁబడిన నప్పుడే నిచ్చెన తేవలయునని. దెచ్చినచో నెవరేమియందురో యని. తాము దాచుకోవలసిన వస్తువు లేమియు లేవు. ప్రతి దినము

తెల్లవారకమున్న గోటలోనుండి సర్వసామాగ్రియు వచ్చును. కట్టెపుల్లలు దగ్గరనుండి వచ్చును. ఊరగాయ పచ్చళ్ళ దగ్గర నుండి వచ్చును. తాము దాచికో దగిన వస్తువే మున్నది. ఒక యటకగా నేర్పఱచి దానిపైనఁ దానేమిపెట్ట వలయును. తన భిన్న వేషధారణము కొరకయిన వస్త్రాద్య లంకరణములు దాచికొని బుట్టలు పెట్టవలయును. వాని నటక కట్టి పైనఁ బెట్టినచో నా యొంటిరాతి గోడ యెప్పుడును దనకు గనుపించుచు నుండదు. నెవరయిన నా యొంటిరాతి గోడపైనుండి వచ్చి యీపెట్టెలు పరీ క్షించ వచ్చును. అందుచేత నా పెట్టెలు గదిలో నేల మీద నుండుటయే మేలు. ఎవరైన నా బుట్టలు దెరచి యీ వింత వస్తువులేమిటని యడిగినచో నేమని సమా ధానము చెప్పవలయునో యతఁడు పూర్వమే యాలోచిం చుకొని యుండెను. తల్లికొడుకు లెప్పుడును గుసగుసలు గానే మాటాడు కొనుచుందురు. అతని కావేశము వచ్చి నప్పుడు మాత్రము కొంచెము బిగ్గరగా మాటాడును. ధర్మశాలాధి కారియైన బ్రాహ్మణుడున్నాఁడు. అతనికిని దన కును జాల స్నేహము. జయద్రధుఁడుని వాని తల్లియుఁ జాల మంచివారు. వారి కొకరిజోలియు నుంటియు నక్కఱ లేదు. ఏదో నాల్గు మెతుకు లుడకవేసికొని తిని యెచ్చట కయిన బోయినచో బోదురు. లేనిచో మంచపు బెట్టెలను గాగిలించుకొని బండుకొందురు. అని యీ బ్రాహ్మణుడు కోటలోఁ గొందరతోఁ జప్పెనని జయద్రధుఁడు వినెను. అయినను జాగ్రత్తకోసము తాను తల్లితో మాటాడుచున్న

వుకు పోయి మూఁడుదెసల నింటిచుట్టు చూచి వచ్చు చుండును.

తల్లి గట్టిగాఁ జెప్పెను. జయద్రధుఁడు వినయశర్మ నింక నేమియు ప్రశ్న వేయరాదు. తానే నీలకు భోధించి జాహ్నవి శిష్యురాలిని జేసి రహస్యములు కనుగొనును. ఈ లోపుగా జయద్రధుని పధకము ఫలించినచో నంతయు సులభతర మార్గమే యగును.

ఇచట దుస్సలా జయద్రథులు తన్నిశార్ధభాగము నందుఁ బ్రసంగించు చుండిరి. ఆ సమయమునందే యచట జహ్నవి వినయశర్మలు ప్రసంగించు చుండిరి. ఎవరైన విను చుండిరేమో యన్న శంకచేత వినయశర్మ మాటిమాటికిఁ బోయి యింటిచుట్టును దిరిగి వచ్చుటలేదు. వారువెవరికైన వినిపించిపోవునేమో యని గుసగుసలు పోవుటయు లేదు. కాని జహ్నవి కంఠము సన్ననిది. ఆమె మాటాడు చుం డఁగాఁ బది గజములు దూరము వినిపించుటయే కష్టము. వినయశర్మ కంఠము గంభీరమయినది. కాన మాటాడి నంతసేపు జాహ్నవియే మాటాడెను. వినయశర్మ నడుమ రెండు మూఁడు ప్రశ్నలుతప్ప మఱి యేమియు మాటాడ లేదు. ప్రధానముగా వారు రహస్యముగా మాటాడ వలసిన యవసరము లేదు. అతని యింటిచుట్టుగా చంద్రశేఖరవర్మ యొక్క పరిచారికులు నలుపురు నలువురు విడతలు విడత లుగాఁ గాపుందురు. వారు కాపున్నారని యెవరికిని దెలి యదు. వా రాకాశమునందెగురు పిట్టనైన నెందుకు తిరుగు

చున్నదో యని విచారించెడివారు. వారిని గుర్తుపట్టుటకు వీలులేదు. వారు రాజ సైనికులు కారు. రాజ సేవకులు కారు. బిచ్చి బికారులు. ఒకఁడు బిచ్చగాఁడు. ఒకఁడు కమ్మరి. ఇట్టివారు. పైగా వారా యూరిలోని వారే. ఆ కోటలోని వారే. అందఱికిఁ దెలిసిన వారే. వారు చంద్ర శేఖరశర్మ యొక్క రహస్య చారులని యెవ్వరును నను కొనరు. వా రనాదినుండియు నా కోటలో నుండిరి. ఆ యా వృత్తులు జేయుచున్నారు. వారి ననుమానించుట యెట్లు?

అగ్నిహోత్రము లయిన తరువాత జాహ్నవి భర్తతో నిట్లనెను. 'మనమిద్దరము రెండేండ్లయిన దీయూరువచ్చి. పిల్లలేమయినారో తెలియదు. పెద్దవాఁడు జనమేజయమహా రాజువద్ద నుండెను. రెండవవాఁడు మగధలో శ్రుతశ్ర వోమహారాజు వద్ద నుండెను. వారివద్ద నుండి వార్త లేమియు లేవు. మనము ప్రధానముగా జనమేజయ మహా రాజు నాశ్రితులము. ఇది శ్రుతశ్రవోమహా రాజునకు గోప హేతువు. రెండవ వానిని గూడ జనమేజయమహారాజు వద్దనే యుంచరాదా!

వినయశర్మ- "జాహ్నవీ! పాండురాజు దిగ్విజయము చేసినప్పటినుండి యాసేతు శీతాచలము వారియాధిపత్యము క్రిందనున్నది. ధుర్యోధనుఁడా భోగము ననుభవించెను. రాజసూయ యాగముతో సామ్రాజ్యాధిపత్యము ధర్మరాజు నకు వచ్చెను. కురుపాండవ యుద్ధమయిన తరువాత యుధిష్ఠిర మహారాజు తురగమేధమును జేసెను. దానితో సామ్రా జ్యము వారి క్రింద స్థిరపడినది. పరీక్షిన్మహారాజు తానటు

వది యేండ్లు పాలించెను. తరువాత జనమేజయమహారాజు నకు రాజ్యము వచ్చెను. యుద్ధములో జరాసంధుని కొడు కైన సహదేవుండు చనిపోయెను. ఆయన కొడుకు సోమా పియేం బదినాలుగేండ్లు రాజ్యము చేసెను. శ్రుతశ్రవసుడు రాజ్యమునకు వచ్చెను. రాజసూయ యాగమునాండు కృష్ణ భీమార్జునులు పోయి జరాసంధుని వధించిరి. 'తరువాత నలుబది యేండ్లకు భారత యుద్ధము జరిగినది. జరాసంధుని కొడుకున కాకోపము పోలేదు. దుర్యోధనుని పక్షమున యుద్ధము చేసెను. ఆ వంశములో. నాకోప మిప్పటికిని బోలేదు. శ్రుతశ్రవసునకుం గూడ నాపగ యున్నది. కాని యేమిచేయం గలుగును? ఇప్పుడు భారత దేశములో నున్న యే రాజును జనమేజయున కెదురు తిరుగలేదు. నాకుం దెలిసినంతవరకుం గొన్నివందల యేండ్లవరకుం బాండవ వంశ సామ్రాజ్యాధిపత్యము పోవునట్టిది కాదు. మన రెండవ బిడ్డ శ్రుతశ్రవసుని కొలువులో వట్టి యుద్యోగి కాదు. జనమేజయ మహారాజు యొక్క గూఢచార దళాధిపతి. అతని కేమియు భయములేదు. నీవు మనసులో తొందర పడ నక్కరలేదు."

జాహ్నవి- 'వట్టి యుద్యోగి యైనచో నేను తొందఱ పడు దానను గాను. గూఢచారిదళాధిపతి కనుకనే తొందర పడుచున్నాను.

వినయశర్మ- 'ఐనచో నన్ను గుఱించి కూడం దొందరపడ వలయును. నిజమేలే నేను వృద్ధుండను, ఎట్ల యిన నీకేమి!'

జాహ్నవి- 'ఈ మాటలకేమిగాని మిమ్ము గుఱించి తొందఱపడవలసిన యవసరము లేదు. ఆంధ్ర రాజ్యమునకు హస్తినాపుర రాజ్యమునకు విరోధము లేదు. ఎన్నియేండ్లనో యుండి వారు సామ్రాజ్యాధిపతులును, వీరు సామంతులును. వీరెదురుతిరిగిన జాడయేలేదు. వీరిలో నింతవరకు గొమ్ములు బొడుచుకొని వచ్చినవారెవ్వరును లేరు.'

వినయశర్మ- 'కాలమెప్పుడు నొక్కరీతిగనే యుండదు. భవిష్యత్తులో వీరికిని గొమ్ములు పొడిచికొని వచ్చును. దానికిఁ గొన్ని యేండ్లు గడువ వలయును.'

జాహ్నవి- 'ఎన్నియేండ్లు'

వినయశర్మ- 'ఇప్పుడప్పుడే తొందర లేదు. అప్పుడే యెక్కడ? ఇంకను రెండు వేల మూడు వందల సంవత్సరములు గడువ వలయును. అప్పుడు నీవు వుండవు. నేనుండను'

జాహ్నవి- అంతవఱకు హస్తినాపుర సామ్రాజ్యమే యుండునా'

వినయశర్మ- 'మాగధు లూఱకుందురా. క్షత్రియ రాజ్యమే పోవును. పదునేను వందల యేండ్లు గడచిన తరువాత మాగధులు భారతదేశ చక్రవర్తు లగుదురు.

జాహ్నవి- 'అగునో కాదో యెవరు చూచినారు.

వినయశర్మ- కాలజ్ఞులు చూచినారు.

జాహ్నవి-'సరే. నన్ను రాజ కుటుంబములో నున్న స్త్రీలతో మాటాడి వారి వార్తలు కనుగొని రమ్మని చెప్పితిరి గదా, ఆ వార్తలేమిటని నన్నడుగరేమి!

వినయశర్మ- నేనడుగ కుండగనే నీవప్పుడప్పుడు చెప్పుచుందువు గదా! నే నడుగుట యెందులకు?'

జాహ్నవి- ఒకరి కొక పని యప్పజెప్పినప్పుడు వారా పని యెట్లు చేసిరో కనుగొనుచుండ వలయును.'

వినయశర్మ- 'యెవరి కప్పజెప్పుదుమో వారు గాఢ ధర్మశీలురయినచో నడుగ నక్కఱలేదు.'

జాహ్నవి- అడుగకుండ జెప్పి గాఢధర్మశీల ననిపించి కొందును. యువరాజు శ్రీముఖుఁడున్నాఁడే యాయన భార్య కాళింది'

వినయశర్మ- 'ఒకాయన భార్యపేరు నీల. మరొకా యన భార్య పేరు కాళింది. తక్కిన యార్గురుకూడ నుండిరా.'

జాహ్నవి- 'రోమపాదుని భార్య పేరు రుక్మిణి. నాగ్న జితి యన్నట్లు లేదు.'

వినయశర్మ- 'సరే కాళిందిని గూర్చి యేమి చెప్పుదువు.'

జాహ్నవి- మీరడుగకుండ నేను చెప్పవలయును.

వినయశర్మ- మొట్టమొదట నడుగఁ గూడదు కాని నడుమ నడుమ నడుగవచ్చును.

జాహ్నవి- రాజ స్థానీయు లెట్లయిన మాటాడ వచ్చును. ఆ కాళింది పుండ్రదేశపు రాజుకూతురు. ఆ వివాహ మైనపుడు మనము హస్తినలో నున్నాము. ఆమె చాల విచిత్రమైన వ్యక్తి. ఆమె మనసులో నేమనుకొనుచుండునో మనకుఁ దెలియదు. మన మేమన్నను నవ్వుచుండును. ఎంత

విద్యాధరపు వార్త జెప్పినను నవ్వుటతప్ప నింకొక పనిచేయదు. చాల సౌందర్యవతి. విశాలమయిన మొగము. మంచి ఫాల భాగము. జాల జక్కని కన్నులు. నిండయిన విగ్రహము.

వినయశర్మ- 'ఆమెకు సాముద్రికము చూచితివా.'

జాహ్నవి- ఆమె తన హస్తమును నాకుఁ జూపించ లేదు. ఎంతమందియో స్త్రీలు నాచేఁ జూడుఁడు నా చేయిచూడుఁడని యెగఁబడిరి. కాని యామె యొక్కసారి యైనను తన చేయి నాకుఁ జూపించలేదు. నేనొకసారి యడి గితిని. ఆమె నవ్వియూరకుండెను. యువరాజ్ఞి పదవియం దున్న యామె హస్తమును నేను లాగికొని చూచుట మరి యాద కాదు.

వినయశర్మ- 'ఆమెకుఁ దారకమంత్ర ముపదేశిం చితివా'.

జాహ్నవి- పెద్ద రాణి బలవంతముచేత నామె యుప శము పొందినది.

వినయశర్మ- 'ఉపదేశించిన గురువునకుఁ గొన్ని యధి కారములు కలవు. వాని నుపయోగించి నీవామె చేతినిఁ జూడవచ్చును'.

జాహ్నవి- 'అయ్యాడా అదియంత తేలిక పనికాదు. ఆమె వద్ద నున్న ఠీవి చాల గొప్పది. ఆమెను జూచినచో లోపల సన్నని భయము వేయును. ఆమెతో జనవుతీసికొను టయే సాధ్యముకాదు. నేను బ్రాహ్మణిని. వృద్ధురాలను. ఉపదేశ గురువును. ఆమె నాకెంత గౌరవమీయవలయునో

అంత గౌరవమిచ్చును. కాని యామెనడుమ నానడుమ నొక బద్దె గీసినట్లుండును. మహారాణి కూడ నామెకు దూర ముగానే యుండును. అత్తగారని యామెమీద నీమెనెఱపు గౌరవమునకు మితియుండదు. ఒకనాఁడిద్దఱు గలసికొని నప్పుడు నేను జాగ్రత్తగాఁ బరీక్షించితిని. కోడలు పెద్దగా గౌరవించిన దేమియులేదు. కాని యామె చిఱునవ్వు నవ్వును. ఒకడుగు ముందునకు వేయును. ఏదో వంగినట్లుండును. చెప్ప రానంత గౌరవము చేసినట్లు కనిపించును.'

వినయశర్మ- ఆమె చేయి చూడనక్కఱలేదు. ఆమె యొక మహాస్త్రీ. మహారాజ భార్య కాదగిన స్త్రీ. నేటికి నామనస్సులో నొక సంశయము తొలఁగినది.

జాహ్నవి- నే నుపదేశగురువు నయినతరువాత నాయం దామె మరికొంత విశ్వాసము ప్రకటించుచున్నది. ఆమె పది మాటలలొక్కసారి యనగాఁ నేనెప్పుడును వినలేదు. నేఁడు వంద మాటలన్నది. చెప్పెదను. ఆమెకు దనభర్తయైన శ్రీముఖుని గూర్చి భయముగా నున్నది. ఆమె పుట్టినింట నొక గొప్ప జ్యోతిష్కుఁడున్నాడట. ఆయన శ్రీముఖుని జాతకము చూచినాడట. ఆయన వద్దఁ గాళింది సంస్కృతము జదివెను. కొంచెము జ్యోతిషము నేర్చెను. ఆయనకుఁగాళింది యన్నచో మిక్కిలి ప్రేమ. ఆమె కాపురమునకు వచ్చునప్పు డామెను బిలిచి రహస్యముగాఁ 'వల్లీ! నీకే తెలిసియుండును. కాని నేను జెప్పకుండ నుండలేకున్నాను. వచ్చెడు ప్లవంగ సంవత్సరములో నీ భర్తకొక యాపద్దయున్నది.అది మ్లేచ్ఛుల

వలన వచ్చును. నీవు నీ భర్తను జాగ్రత్తగాఁ జూచుకొను చుండుమని చెప్పెను. ప్లవంగ నామ సంవత్సరమింక మూఁడేండ్లున్నది. ఆమె యనుమాన మేమనఁగాఁ బ్లవంగ దాఁక నాగనక్కఱలేదని. ఈ లోపుగనే యేదో యాపదరావచ్చునని. ఆమెకు బుట్టినింటినుండి వచ్చిన పరిచారకులు చాల మంది కలరు. వారిచేత ధాన్యకటకములో నెక్కడనైన దుర్జనులైన మ్లేచ్ఛులున్నారేమో యని వెదకించినదట. ఎవ్వరును లేరు కాని యామె మనస్సునకు మాత్రము శాంతిలేదు. నిండైన మనిసికనుక బైకుబుకదు. రెండేండ్ల నుండి యామె మనసులోనున్న యీ భావము నాకుఁ దెలియ లేదు. నేఁడామె నాతో జెప్పినది. మరియు నామె నాతో నిట్లన్నది. జిన్నమ్మగారూ! నేను నా భర్తయొక్క కదలిక లన్నియుఁ బరిశీలించుచుంటిని. ఆయన నాయందు మిక్కిలి ప్రేమ కలవాఁడు. ఏకపత్నీవ్రతుఁడు. ఇతర రాజకుమారుల లక్షణము లాయనయందు లేవు. ఆయన మనస్సులో నున్న సర్వ భావములు నాతోఁ జెప్పును. కాని యొక్క విషయము దాచుచున్నాఁడు. నేనచ్చోటకి వెళ్లుచున్నాను. ఇన్నాళ్ళ లోవత్తును. అని నాతో చెప్పును. కాని పక్షమున కొకసారి యాదిన మీదినమని చెప్పుటకు వీలులేదు. ఒకప్పుడది పక్షమును మించిరావచ్చును. ఒకప్పుడు వారములోననే రెండు రోజులు కావచ్చును. ఈ వారమని నియమము లేదు. ఆయన రాత్రులందెచ్చటికో పోవును. అర్ధరాత్రమున బయలు దేరి పోవును. కోడి కూయకముందే తిరిగి వచ్చును. ఈ వెళ్ళుటయు వచ్చుటయు నెవ్వరికిని దెలియదు. నాకొకర్తు

కకే తెలియును. ద్వారరక్షకునకుఁ దెలియును. మీ రెక్కడికిఁ బోవుచున్నారని నేనడిగితిని. ఆయన యిట్లనెను. "ప్రియురాలా నేను నీకు దరువాతఁ జెప్పెదను ఈ యొక్క విషయములో మాత్రము నన్ను బలవంత పెట్టకుము. ఇందులో బలవంతపెట్టనిచో నీకు నాయందుఁ బ్రేమయున్నదని విశ్వసింతును." ఇట్లాన పెట్టినతరువాత నేనేమి చేయగలను? ఆయన మరొక స్త్రీ యందు వాంఛచేతఁ బోవుచున్నాఁడని నేననుకొనలేదు. యాధార్థ్యమునకు స్త్రీ పురుషుల హృదయముల యొక్క రహస్యములు పరస్పరము తెలియుననుటకు వీలులేదు. వెలిచిన్నెలచేతఁ బరిస్థితులచేత సఖ్యము ననుమీాయ మానమగుచున్నది. నా భర్త యొక్క ప్రకృతి వానినంత మఱుగుపఱచగలిగినదని నేననుకొనను. నాకొక యనుమానము కలదు. ఎవడోఁ పురుషునితో నీయన యొక రహస్యాలోచనము చేయుచున్నాఁడని. యా పురుషుఁడెవఁడో ప్రచండుఁడై యుండవలయును. అతఁడొక్క పురుషుఁడే కానక్కఱలేదు. కొందఱు కలిసి యొక రహస్యమాలోచనము చేయుచుందురనుకొందును. అది నిస్సందేహముగా రాజకీయ విషయము కాదు. ఐనచోఁ గాబోవురాజు నీయననందులోఁ గలిపికొనరు. నా యుద్దేశమేమనఁగా నేదోయొక యసాంప్రదాయకమైన యధ్యాత్మిక భావ పరంపరా వశులయిన కొందఱి రహస్యమాగమమని. సంప్రదాయేతరమైన వైదికమార్గేతరమయిన కొన్ని మంత్రములు కొన్ని యుపాసనలు కలవు. వాని విషయములో గొందఱిట్లు ప్రవర్తింతురు. తాను సుక్షత్రియుఁడు. యోగాభ్యాసము చేయు

వచ్చును. మా పురోహితుఁడున్నాఁడు. గొప్ప మంత్రసిద్ధి గలవాఁడు. ఆయనవద్ద మంత్రోపదేశము పొందితే. నడ్డి జాము వరకుఁ గూర్చుండి పురశ్చరణము చేసికొను మనుము. నేను వలదంటినా? నేను నా భర్తయొక్క స్వభావమును గాపురమునకు వచ్చిన నాటినుండి సూక్ష్మసూక్ష్మముగాఁ బరిశీలించి యట్టిపెట్టి కొంటిని. పవలెల్ల నాయన నాకుఁ గనిపించఁడు ఎప్పుడో తప్ప. రాత్రులందు మారహాః కేళి సమయములందు జరుగు సన్నివేశములను బట్టియే యాయన స్వభావమును నేను నిర్ణయించికొంటిని. ఆయన యాత్మలో నొక యతృప్తి కలదు. ఏదో నిరవధికానందము పొందవల యునని కలదు. ఒకపని చేసినచో నేదో యొక తృప్తి వచ్చు నని యాయన యనుకొనును. అదిచేసి తీఱును. నేనేమయిన ననుకొందుననియైన జూడఁడు. ఆ స్నేహితుఁడెవఁడో యీయనయందలి యీప్రకృతిని గనిపెట్టి దానిమీఁద నాఁడుచున్నాఁడు. వానిపేరు నాకుఁ దెలియదు. నే ననుకొనుటయేగాని వాఁడున్నాఁడో లేఁడో కూడ నాకుఁదెలి యదు. ఉన్నచో వాఁడీయన నాకర్షించుచున్నాఁడు. నాకుఁ దెలిసిన కొంచెము జ్యోతిశ్శాస్త్రమువలన దాని లోతు పాతులు తెలిసికొనుట నాకుఁ జేతఁగాదు. నాగురువు నా తండ్రి రాజ్యములో నున్నాఁడు. ఆయన యెప్పుడైన వచ్చు నేమో యని యెదురు చూచుచుందును. ఆయన యెప్పుడు నురాలేదు. నన్ను దనగడుపునఁబుట్టిన బిడ్డవలెఁ జూచుకొని యుండెడివాఁడు. నేను వచ్చెడునప్పు డన్నాను గూడ. తాతా! నీవెప్పుడైన వచ్చి నన్ను జూచిపోవుచుండ వలయునని?

'తల్లీ తప్పకుండ వత్తు'నని యన్నాఁడు. ఈ మాటలు మీ కెందుకు చెప్పుకుంటివనఁగా మీరు మీభర్తగారితో వీనిని జెప్పవలయును. ఆయన యీఆకే పురాణములు జెప్పుట కిచ్చుటికి రాలేదని నేననుకొనుచున్నాను. నేను పలుసార్లు వచ్చి తెర వెనుకనుండి వారి మాటలు విన్నాను. ఆయన బ్రహ్మజ్ఞాని. పరమాత్ముఁడయిన శ్రీ కృష్ణదేవునిఁ గన్నులారఁ దనచిన్నప్పుడు చూచినవాఁడు. ఆయన యెట్టివాఁడో యీ సామాన్యులకుఁ దెలియుటలేదు. నేను బదిపండ్రెండు సార్లకన్నాఁ బురాణమునకు రాలేదు. ఆయన భగవంతు ద్వైపాయనునిఁ జూచినాఁడు. శ్రీ కృష్ణదేవునిఁ గన్నులారఁ జూచినాఁడు. భారత యుద్ధము జరుగుచున్నప్పుడు తాను యుద్ధభూమిలోఁ దిరగినవాఁడు. అర్జునునకు శ్రీ కృష్ణ దేవుఁడు గీతోపదేశము చేసినపుడు తానారథ సమీపము నందున్న వాఁడు. ఆయనతోఁ జెప్పుము. దెలిసికొమ్మనుము" అన్నది.



## ౯

విజయసింహుని భార్యపేరు భామ. ఆమె బక్కపలుచగా నుండును. శ్యామలవర్ణము. పెద్దకన్నులు. దుస్తులుధరించుటలో నామెకున్నంత ప్రీతి మరినెవ్వరికి నుండదు. ఆ కాలములో నాంధ్రదేశమునకుఁ బశ్చిమ దిశయందున్న దేశమునకుఁ బేరు విదర్భ. విదర్భకును దెలుఁగు దేశమునకును నిజముగాఁ బొలిమేర యనిలేదు. ఆ మధ్య భాగములోఁ గొన్ని యూళ్ళు విదర్భరాజునకును బన్నులు చెల్లించవు. ఆంధ్రరాజునకును జెల్లించవు. పదేండ్లకొకసారి యా రాజో యీ రాజో దమ యధికారులను బంపించును. ఆ యేడాది యే రాజునుద్యోగులు వచ్చినచో నారాజు నుద్యోగులకు వారు పన్ను చెల్లింతురు. తక్కిన తొమ్మిదేండ్లో పదేండ్లో వారు పన్నులేయీయరు. ప్రతిగ్రామములోను బెద్దలుకూడి మనము పదేండ్లు పన్నియలేదుగదా యెప్పుడోయప్పుడెవరికో యొకరికిఁ బన్నియనిచో మనము బెడద తెచ్చి నెత్తినఁ బెట్టికొన్నవారగుదుము అని నలుగురి నొప్పించి యాకప్పము చెల్లింతురు వీరు పన్నులను గ్రహించిరని తెలిసినచో వారురారు. వారు గ్రహించిరని తెలిసినచో వీరురారు. కడచిన నందయేండ్లలో వారు వారొక్కసారి పన్నులను గ్రహించుటకు వెళ్లుట యొక్కసారియే జరిగినది. ఆ యుభయోద్యోగులు మేము వెడలిపోవుదుమనగా మేము వెడలిపోవుదుమని యిద్దఱును

వెడలిపోయిరి. ఆసారి యా గ్రామ నివాసులకు వరుసగా నిరువదియేండ్లు పన్నులేలేవు. ఆ గ్రామములన్నియు సుమారేఁబదియుండును. ఈ యేబది గ్రామముల కొక రాజున్నాడని జెప్పవలయును. ఆయనకు వారు పన్ను లీయరు. ఆయన యనుగుఁడు. ఆయనయటు విదర్భులకు సామంతుఁడుగాఁడు. ఇటు నాంధ్రులకుఁగాఁడు. ఆయనకుఁగరగ్రహణము చేయు సామర్థ్యములేదు. ఆశలేదు. ఆయనయంతటిప్రభు వాయనయే. ఆయనకు రాజ్యములేదు. ఉన్నది ఈ యేఁబది గ్రామములే. ఆయనకు సొంతముగాఁ గొంత యాస్తికలదు. ప్రతి గ్రామములోనను గొంతకొంత వ్యవసాయమున్నది. ఆ వ్యవసాయమా గ్రామస్థులుచేసి పెట్టుదురు. ధాన్యమాయనకుఁ దోలిపెట్టుదురు. ప్రతి గ్రామములోనను వందవంద యావులాయనకున్నవి. ఏయూరి గోసంపద నాయూరివారు రక్షించుచుందురు. ఈ గోవులను బాలించుటయు నీ ధాన్యమును బండించి పెట్టుటయూ నా గ్రామముల ప్రజలు వానికిచ్చు పన్ను, ఇంకొకటిలేదు. తన ప్రజలుకావున దనకిట్లు చేసిపెట్టు చున్నారని యాయన యనుకొనును. మరియాదకు మొగమాటమునకుఁ జేసిపెట్టుచున్నా మని వారనుకొందురు. ఆయన రాజుకాని రాజు. ఠీవిలో నాడంబరములో నాయన చక్రవర్తిననుకొనును. పరరాజులు దండెత్తినచో విదర్భమీఁదికి దండెత్తుదురు. ఆంధ్రగ్రామముల మీఁదికి దండెత్తుదురు. ఆయన యేఁబదిగ్రామముల వంకఁ జూచెడివారు లేరు.

ఈ రాజని చెప్పఁబడెడు క్షత్రియవంశీయుని యింటిలో నున్న యందఱు సామ్రాజ్యాధిపతి యింటిలోఁ బోవుగర్వాహంకారములు గలవారు. గొంత సంపన్నగృహస్థులు. తిండి తిప్పలకు లోటులేదు. వారికిఁ గోటలేదు. సైన్యములేదు. మంత్రులులేరు, ఉద్యోగులులేరు. ఆపల్లెటూరిలో నొక బ్రాహ్మణుఁడు వారికిఁ దాటియాకులమీఁద లెక్కలు - డొక్కలు వ్రాసిపెట్టును. ఆయనయే మంత్రి. ధనాధికారములు లేకపోయినను బిలుచుటలు - మరియాదలు నెఱపుటలు నొక చక్రవర్తి తన మహామంత్రితో వ్యవహరించినట్లే యుండును. సహజముగా నతనిమాట యాగ్రామములోఁ జెల్లును. ఆ గ్రామములో నేమి, ఆ యేఁబది గ్రామములలోను జెల్లును. ఆయన సేవకులలో నొకఁడున్నాఁడు. సేవకులందఱిమీఁద నధికారి. అతఁడెప్పుడును గుఱ్ఱముమీఁద దిరుగుచుండును. నడుమున కొక పట్టాకత్తి వ్రేలాడుచుండును. అతఁడు పోయి యీగ్రామములలోనున్న పశువుల నప్పుడప్పుడు చూచి వచ్చుచుండును. ఆ యూళ్ళలోఁ బండిన ధాన్యమును దోలికొనివచ్చుచుండును. అతఁడే యారాజుగారి సేనానాయకుఁడు. ఇది యంతయు జెప్పుటకుగాని చూచుటకు గాని హాస్యముగాఁ గనిపించును. కాని యాయేఁబది గ్రామముల ప్రజలు నాక్షత్రియునిఁ దమకు జక్రవర్తియందురు. చక్రవర్తియనియే వ్యవహరించికొందురు. క్షత్రియుఁడు కూడఁ దాను చక్రవర్తిననియే యనుకొనును ఈ చక్రవర్తిత్వమంతయు నా వంశములోఁ బుట్టినవారి యహంకారము నాశ్రయించియున్నది. ఆ హంకారమును దుష్టాహంకారముకాదు.

వారి కుటుంబమునకు సబంధించిన యహంకారము. ఆయన చాల యుదారుఁడు. ఆయన చేతి కెముక్కలేదు. విద్వాంసులు వత్తురు. యాచకులు వత్తురు. నిజమున రాజుకోటలోఁ గాడ వారింతటితృప్తి పొందరు. ఆయన యిచ్చునది యెక్కువయు నుండదు. అతఁడు తనకు అధికమైనది యిచ్చును. మరియు నాయింటిలో నందఱును జదివినవారు. సంగీత సాహిత్యములు వారిసొమ్ము. ఆయనయున్న గ్రామములోఁ బదిమంది పండితులుకలరు. వారాయన నాశ్రయించికొని యుందురు. ఈయన వారికిచ్చిన మడి-మాన్యములు లేవు. వారినిఁబోషించినదిలేదు. వారికేవో సొంతపొలములు కలవు. వారి బ్రదుకులువారు బ్రదుకుదురు. వీరి యింటికివచ్చి విద్యావ్యాసంగము చేయుదురు. ఆయన కొడుకుఁ గూతుంఁడ్రకుఁ దమవిద్యలు చెప్పి పోవుచుందురు. ఆ రాజు మంచి పండితుఁడు. గానమునందు మంచి యభిరుచికలవాఁడు. కొంత పాడఁగలవాఁడు.

ఆయనకు నలువురు కూతుండ్రు కలరు. వారిలోభామ కడసారపుఁ బిల్ల. ఈ భామమీఁద నాతండ్రికున్నమమకారము చెప్పుటకు వీలులేదు. ఆమెకు సర్వశాస్త్రములుచెప్పించెను. ఆమెకు దెలియనివిద్యలేదు. శ్రౌతము చక్కఁగాఁదెలియును. వ్యాకరణము దెలియును. తర్కముదెలియును. ఆమెగొంతెత్తిపాడినచోఁ మేకలాలకింపవలయును. కాని యామె సౌందర్యవతియని చెప్పుటకు వీలులేదు. ఆమె విద్యను జూచి యే చక్రవర్తి కుమారుఁడోవచ్చి పెండ్లాడి తీసుకొనిపోవునని వారు చాల సంవత్సరము లెదురుచూచిరి. ఏ రాజకుమారు

డును జూలేదు సరికదా మింటినుంచి యే వేలుపును దిగిరా లేదు. పైగా వేలుపులు మింటినుంచి దిగివచ్చుటమానివేసి నూఱు నూట యేబది యేండ్లగుచున్నది. మహాభారత యుద్ధము నకు బూర్వము దేవతలు దిగివచ్చెడివారట. కృష్ణనిర్యాణ ముతో యుధిష్ఠిర చక్రవర్తి స్వర్గమునకు వెళ్ళుటతో దేవ తలు దిగివచ్చుటలేదని జనులు చెప్పుకొనుచుందురు. యుధి ష్ఠిర చక్రవర్తి మహాభారతయుద్ధము జరిగినతరువాత ముప్పది యాఱేండ్లకు స్వర్గస్థుడయ్యెను. అంతకుగొంచెము పూర్వ మున భగవంతుడైన శ్రీకృష్ణుడు భూమినివీడి వెడలి పోయెను. ఏనాడు కృష్ణుడు భూమిని వదలిపోయెనో యా నాడే కలి ప్రవేశించెను. "యస్మిన్ కృష్ణో దివంయాతః తస్మి న్నేవహివత్సరమ్. ప్రతిపన్నం కలియుగమితిప్రాహుఃపురా విదః" భగవంతుడీ ధాత్రియందున్నంత వరకుఁ గలి యీ ధాత్రిని స్పృశించుటకు సమర్థముకాలేదు.

ఆ దినములలో రాజులు తమకూతులకు స్వయంవర ములు చాటించుటయు రాజకుమారులు వచ్చుటయు నుం డెడిది గాని రాజకుమారులు గుఱ్ఱములెక్కి రాచకూతుండ్ర కోసము వెదికికొని పోవునవసరములేదు. అట్లెవ్వరును రాలేదు. భామతండ్రి స్వయంవరమును జాటించనులేదు. ఎవరో యొక పెద్ద పండితుడు ధాన్యకటకమునకుఁ బోయి రోమపాదునితో నీ చక్రవర్తి విషయమును జెప్పెను. భామ పాండిత్యమును వివేకమునుగూర్చి చెప్పెను. రోమపాదుడు తన రెండవ కుమారుడయిన విజయసింహునకుఁ జేసికొందుననెను. భామ తండ్రి చక్రవర్తి. రోమపాదుడు పట్టి రాజు. చక్రవర్తి వచ్చి

యొక సామాన్యరాజుల యొక్క రెండవకుమారునకుఁ బిల్ల యిత్తునని చెప్పునా? జెప్పఁడు. ఒకరాజు పోయి యట్టి సామాన్యుని యింటికిఁబోయి కొడుకునకు వివాహముచేసికొని వచ్చునా. పోఁడు. ఈ వివాహమెట్లు జరుగవలయును? దాని నా బ్రాహ్మణుఁడే సంతరించెను. ఆ యేడాది యా యేఁబది గ్రామములమీఁది పన్నులు గ్రహించు నుద్యోగులమీఁద నధికారిగా విజయసింహుఁడు పోవలయును. ఆ చక్రవర్తిగారి యూరుపోవును. చక్రవర్తిగారెదురు వచ్చును. మర్యాదలు నెరిపికొందురు. చక్రవర్తిగారు విజయసింహునితో నిట్లనును. 'అయ్యా మీరుగొప్ప రాజకుమారులు. కార్యావింతరముమీఁద మా కోటకు దయచేసితిరి. మీ సుగుణములకు మేము మెచ్చికొన్నాము. యింటికి వచ్చిన యతిథిని సత్కరించ వలసిన బాధ్యత మాకున్నది. మేము మాకుమార్తెనిచ్చి మిమ్ము సత్కరించుచున్నాము.' దానికి విజయసింహుఁడు 'అయ్యా! తమరు చక్రవర్తులు. తమకుమార్తెను మాకిచ్చుట మేమెంతయో గౌరవముగా భావించుచున్నాము. మీ కుమార్తె సకల విద్యావతియట. మాయందనుగ్రహముచేత మీరిట్లు చేయుచున్నారు,' అనవలయును. పెండ్లి జరుగును. విజయసింహుఁడు మూనాళ్ళచట నుండును. తరువాత దండ్రికి దాను వార్తపంపును. రోమపాదుఁడు కొడుకునకు మరలవార్త పంపించును మీరు చక్రవర్తి కుమార్తెను మాకుఁ దెలియకుండ వివాహమాడుట మేమంగీకరించుచున్నాము. సంతోషించుచున్నాము. ఏనుగులు, గుఱ్ఱములు, కొంతసైన్యమును బంపించుచున్నాము. మీరు మీ భార్యను చక్రవర్తి

కూతుకుఁదగిన మరియాదతో నింటికిఁ దీసికొనిరావలయును.

ఈ యాచారముల పాటింపుతో వివాహము జరుగుట కా బ్రాహ్మణుఁడు మధ్యవర్తిత్వము చేసెను. రోమపాదుఁడు నవ్వుచు నంగీకరించెను. ఆపెండ్లి యట్లు జరిగినది నిజముగా జూచినచో విజయసింహుఁడు నేనాపిల్లను జేసికొననవలయును. విజయసింహుఁడనలేను. అతని ప్రకృతివేఱు. అతని కిదియొక యుత్సాహకరమైన లక్షణముగా భాసించెను. ఆ చక్రవర్తిని గుఱించి విజయసింహుఁడు చాలసార్లు వినెను. ఆయన పండితుఁడని యుదారుఁడని ప్రతీతుఁడు. వారియింటిలో సంగీత సాహిత్య సరస్వతులు నాట్యమాడుచుందురని చెప్పుకొందురు. విజయసింహుఁడు ముచ్చటపడెను. తాను వెళ్ళెను. ఆ యాచారములు జరిగెను. పెండ్లియైనది విజయసింహుఁడు మామగారి యింటిలోనుండెను. భామయొక్క యక్కగార్లు నలుగురు. వారి నలువురకు వివాహములయ్యెను. నలువుర ల్లుండ్రును సామాన్య క్షత్రియులే. అల్లుండ్రు నలువురు పెండ్లి జరిగిన నాఁడు వచ్చిరి. తమపాలాలు చూచుకొనుటకు వెడలిరి. ఆనలుగురు చాల సౌందర్యవతులు. సౌందర్యవతి కానిది భామ యొక్కతియే. ఆ నలువురు పండితురాండ్రు కారు. పండితురాలయినది భామ యొక్కతియే. వారు చక్రవర్తి కూతుండ్రే కాని మాటలలోననేతప్ప వైభవములోఁ గారు. అంతఃపుర మర్యాదలలోగాదు. వారియిల్లు కొంత పెద్దదేకాని రాణివాసము పాటింపు దగినంత వైశాల్యము లేనిది. పరిస్థితులన్నియు సామాన్యసంసారములోనివి. అత్తగారు వచ్చి యల్లునితో మాటాడును. వదినగార్లు మరిదితో

పరాచికములాడుదురు. ఇతనికిఁ గావలసిన సదుపాయములు సేవకులకంటెను ముందు వదినెగార్లే నెఱపుదురు. మూఁడుదినములయిన తరువాత రెండేన్గులతో బదిగుఱ్ఱాలతో విజయసింహుని, భామను దీసికొనిపోవుటకు వంద పదాతిసైన్యము వచ్చెను. విజయసింహుఁడు బయలుదేరలేదు. వచ్చిన రాజాధికారితో రేపుపోదము రేపుపోదమనును. ఒక వదినెగారు ముఖప్రక్షాళనమునకు నీరుతెచ్చును. మరియొకామె స్నానమునకు నీళ్లుతోడును. మరియొకయామె వడ్డించును. ఒకామె ప్రక్కసవరించును. మరియొకామె పరాచికమునకు విసరినట్లు నటించును. ఉన్నది నలుగురు వదినెగార్లు. అతని మనసునకు నలుబదిమందిగాఁ గనిపింపఁ జొచ్చిరి. ఎచ్చటనైన నల్లని మేఘములో దెల్లని మెఱపుండును. ఇచ్చటఁ దెల్లని మేఘములో నల్లని మెఱపుగనిపించెను. ఆమె భామ. ఆ భామకుఁ జెప్పరానంతసిగ్గు. అంతచక్కని విద్యుతో నంతయొత్తయిన లజ్జయొట్లు కలసియున్నదో తెలియదు. విజయసింహుఁడు రెండు స్వర్గముల మధ్య నూగులాడుచుండెను. ఒకటి దివాస్వర్గము. రెండవది నిశాస్వర్గము. దివాస్వర్గము లేతయెండలు కాయుచున్నది. పక్షుల కలకలారవముతో నిండియున్నది. మందమారుతములతో సందడించుచున్నది. పూవుల గుబాళింపుతో ఘ్రాణేంద్రియ తర్పణము చేయుచున్నది. ఇంక నిశాస్వర్గము. దాని వైలక్షణ్యము దానిదే. ఒక మధురమైన వీణానాదము వినిపించును. దానిలోని వాక్చమత్కృతి కవధిలేదు. అచటి లజ్జాభినయము మధురాతి మధురము. చేతికందును. ఇంతలో దుసికిలించుకొనిపోవును. ప్రయత్నించి పట్టుకొ

స్నచో మధుధారలు పిండును. ఒక కల్పవృక్షపునీడను గూర్చు న్నట్లుండును. ఒక కామధేనువుపైనుండి చల్లనిగాలి వీచి నట్లుండును. అది యచ్చముగా స్వర్గము కాదు. భూతలము కాదు. భామకామశాస్త్రవిశారద. అతనికొక్కొక్క నిశ యొక్కొక్కనూత్నస్వర్గముగానుండెను. ఆ స్వర్గమధిరోహించుటకు నిశాభాగమంతయుఁ బ్రయత్నమే. అపరనిశాభాగ మంతది కైవసమగును. ప్రయత్నమునుండివిరమింపవలయునన్నవిసువు పుట్టదు. ప్రయత్నగతసర్వ క్షణములు సుధాదోహనసీమలు. తెల్లవాఱులు నిద్రలేదు. ఎఱుపువిఱిగిన కనులతో మాంద్యమువాయనిమనసుతో శ్రమపడినమేనితో వదెనెగారలుచేయు. పరిచర్య వానికి సమర్థముకాని శరీరములోపల నున్నయొక భావనామణీయ లోకమునందు విహరించుచున్నట్లుండును. ఇట్లు పదునేను దినములు గడచినవి. వదినెగారలను వారి భర్తలు పిలిపించుకొనిరి. దివాస్వర్గమంతరించెను. నిశాస్వర్గమే మిగిలెను. ఈ స్వర్గమిచ్చటనైనను ధాన్యకటకముననైన నొక్కటే.

ఈ పదునేనుదినములలోఁ జక్రవర్తి పని సగమయిపోయెను. ఏన్గులు గుఱ్ఱములు వంద పదాతిసైన్యము మఱి పాతికమంది యితరోద్యోగులు పడితినులుకుఁ దగినంత సంపత్తు లేని చక్రవర్తి. మరియాదకొఱకుఁ బ్రాణములు కోసుకొను చక్రవర్తి. వారు సామాన్యుఁడైన యొక రాజునింటికివచ్చి తిమనుకొనలేదు. తమ రాజకుమారుఁడు నిజముగా నొక చక్రవర్తికూతును బెండ్లాడెననుకొనిరి. వారు రాజభవనములందు పడిది దిగలేదు. పదిపశువుల పాకలలో విడిది దిగిరి.

వారికిజరుగు మరియాద వారిభోజనసౌష్ఠవము నాపల్లెటూరి చుట్టునున్న విశాలములైన పొలములు, వారిని బరువుల పాక లలో విడిసితిమనిపించుకొనునట్లు చేయలేదు. ఆ యూరువదలి పోవుట వారికిష్టముగూడ లేకపోయెను.

విజయసింహునకు దానిన్నాళ్లు రాజకుమారుఁడనని మహాఖడ్గవిద్యానిపుణుఁడనని యనిపించలేదు. ధాన్యకటక ములో దనకున్న మర్యాద తనకీవియు నతడు మఱచిపోయెను. ఆ పదునేనుదినములతఁడు వచ్చిన సేనకుఁ గనిపించినజాడయే లేదు. అతని మనస్సును వదినెగారలు మథించి వెన్నదీసిరి. భామ దానిని గరగించినేయిచేసెను. విజయసింహుడు తిరిగి ధాన్యకటకము చేరువేళకు భామకు దాసానుదాసుఁడయ్యెను. ఆమె యెంత చెప్పినచో నంతే. ఆమె శృంగార సామ్రాజ్య పట్టమహిషి. ఒక తెలిదీవియేలు శ్యామలశరీరచ్ఛవిపరిదీపిత యైన మహారాజ్ఞి. విజయసింహునకు భామయందక్త్రైమో, కాదో తెలియదు. ఆమె శృంగారరస సర్వస్వమూర్తి. అది యొక్కటియే తెలియును. వదినెగారలలోని సర్వసౌందర్య మామెయందున్నవని భావించును. ధాన్యకటకమునకుఁచేరిన తరువాత గొన్నాళ్ళకు గాని విజయసింహుని కీభ్రాంతి వదల లేదు. ఏడాది గడచిన తరువాత భామ భామగా మిగిలెను. ఆమె సౌందర్యవతికాదు. కాని యామె తన హృదయ సామ్రాజ్యమున కధినేత్రి. ఆమె తనవంకఁ గోపముగా జూచును. తానామెవంక దీనముగాఁ జూచును. ఆమె కదు గదు. పోయిచేలాంచలము గ్రహించును. ఆమె విసరికొట్టును. బలవంతముగాఁ గాగిలించుకొనును. ఆమెకౌగిలి సడల్చుకొని

దూరముగాఁబోవును. ఆ సడలించికొనుట యెంత సుకుమారముగానుండునో చెప్పఁదరముకాదు. అందులోఁ బట్టరానంత తిరస్కారమున్నది. చెప్పరానంత యనురాగమున్నది. కౌగిలించుకొని నిదురపోవు పసిబిడ్డప్రక్క బండుకొన్న తల్లి పిల్లను మెలుఁకువరాకుండ మంచమునుండి లేచుటకెట్టి ప్రయత్నము చేయునో యీలక్షణము భాసించునట్లు భామ యతని కౌఁగిలింత సడలించును. తల్లియీలేచుటతో బిడ్డ కదలినచో జిచ్చికొట్టి మరల నిద్రపోఁగొట్టినట్లు—ఆ సడలించుకొనుటలో విజయసింహుని కేమాత్రము కోపమువచ్చునట్లు కనిపించినను దానొదుగును. మరల నెమ్మదిగా సడలించుకొనును. ఈ దృశమహారమణీయ శృంగార శృంఖలముల నుండి విజయసింహునను వదలించుకొనఁ దరము తనకీజన్మకుఁ గాదు. పది జన్మలకుఁగూడఁగాదు.

ఏండ్లు గడచినకొలది నీభార్య యందలి ప్రేమ తచ్ఛృంగార సర్వస్వానుభవములందలి చిక్కఁదనము పలుచఁబడినదిలేదు. కాని స్త్రీముఖాద్యవయవ సుందరరేఖా సందర్శనాభిలాషాజనిత వైలక్షణ్యము కలిగిన యొక కోరిక యతని మనసులో విడిగా భాసింపనారంభించెను. వివాహమయి నాల్గయిదేండ్లు గడచినవి. ఆ వదినెగారలు మరల గనిపించలేదు. కనిపించెడి లక్షణములేదు. తన భార్యయే పుట్టినింటికిఁ బోదు. ఆమెను బుట్టినింటికిఁ బంపించుట ధాన్యకటకరాజవంశమర్యాదాభంజకమైన విషయము. సమానమయినరాజవంశీయులనడుమనే రాచకూతురు పుట్టినింటికి వెళ్లుటయుండదు. ఇచట వెళ్లుటలేదుగదా, పంపించుట మర్యాదనష్ట

మన్న భావముకూడఁ బ్రకాశించుచున్నది. వారెప్పుడిచ్చి టికిరాఁడు. చక్రవర్తి, చక్రవర్తి గనుకరాఁడు. వీరు రాజ్యము లేలువారు కనుక గ్రామాధికారుల యిండ్లకుఁబోరు.

విజయసింహునకు సౌందర్యాభిలాష కేటాయింపఁబడి తన సంసారమునకు సంబంధములేనిదిగా భావమందుఁదనకుఁ గల కోరిక నతిక్రమించినదిగా భావమందుఁ దనకు గల యనురాగమున కణగియున్నదిగా బాహిరింపించఁదగినది కానిదిగా నొక రహస్యమైన యెదో యూహగా దాని కావిష్కారము కలుగుటకు వీలులేనిదిగాఁ దనఖడ్గవిద్యావిశారదత్వజనిత గర్వాహంకార లక్షణములచేత లోనుండి ప్రోత్సహింపఁ బడుచున్నదిగానుండెను. ఈ దినములలో నతనికిఁ గొంత దైన్యముకూడ సంభవించుచుండెను. అతని యందు రాచఠీవి తక్కువలేదు. రాజవంశ మర్యాదతక్కువ లేదు. రాజవంశస్త్రీ లతనికంటికిఁ గనిపించరు. కనిపించునది యితరవర్ణ స్త్రీలు. వారిలోనచట నచటఁ జెదురుగా నొక విలక్షణమయిన నాసచేత మొగమంతయు నుద్దీపిత రమణీయతగల యొకస్త్రీ కనిపించును. తళుకుమన్న కన్నుల నుండి యాకేక ప్రసారము మన్మథుఁడు వింటిత్రాడు పెడగా మ్రోయించి నట్లొకానొక స్త్రీయందు భాసించును. ఒకరుత్క నడక యొయ్యారము నల్లత్రాచునెమ్మదిగాఁ బ్రాకిఁపోవుచు వెనుకనెదో సవ్వడి వినపడగమెత్తి ప్రక్కవాటుగా జూచి నట్లు కనిపించును. తన్నుజూచి యొకానొక స్త్రీ బెదరి తన వంక జూచును. పచ్చికబయలునందు మేయుచున్న లేటిచాన తలమెత్తి చూచుసరికి నెదురుగాఁ బీటవెట్టి కూర్చున్నపులి

దర్శనమిచ్చినట్లు తన కన్నులలోఁ నంకురించుచున్న భీతికల యచ్చెరువు భాసించునట్లు చూచును. క్రమక్రమముగా విజయసింహుఁడిట్లనుకొనెను. ఆ స్త్రీలు తనవంక నల్లెందుకుఁ జూతురు. తనలో గుప్తమైయున్న యొకకాముక లక్షణము తనకనులలో దాను వారి వంకఁజూచు పద్ధతిలోఁ దననిలుచున్న లక్షణములో భాసించునుగాబోలు! ఆతలిస్త్రీ కాముకురాలుకాదు. సచ్ఛీలముకలది. ఆమెలో నేమియభిజ్ఞకలదో యీతనిని జూచినంతనే యితని కాముకలక్షణ మామెకు వెంటనే తెలియుచుండెను. ఈ యభిజ్ఞానమునకు మానవుల సామాన్యపరిజ్ఞానమునకు సంబంధములేనట్లున్నది. మానిసిమైపుట్టిన జాలును. దత్పూర్వము తద్విషయిక పరిజ్ఞానమక్కఱ లేదు. ఏదో యడనుండి తనుముచున్న యభిజ్ఞ కనులయెదురఁ దాండవించినట్లుండెను.

ఒక ఏడాదివిజయసింహుఁ డీయభిజ్ఞాపరిశీలనము చేతఁ గలిగిన యెడదఁలోని నూత్నహృత్కల్పనములను సముదాయించుకొనెను. కొన్నాళ్ళుపోయిన తరువాత నదియతని సహజలక్షణమయ్యెను. ఎచ్చటనో యొకచో సౌందర్యరేఖ గనిపించును. ఆమె కళవళపడును. ఇతఁడు బిడియపడఁడు. మఱి యేడాదిగడచెను. ఈ లోపుగా భామ కితని యందు గాటమైనప్రశ్రయము కలిగెను. తనభర్త తనయందే యనురక్తుఁడు. అతఁడు పరస్త్రీభావము లేనివాఁడు. తన శృంగారలీలలు తక్కువకాలేదు. ఆతనికిఁ దనయందుగల గాటపుఁజెలిమికి వెలితిలేదు. మునుపటివలెఁ బ్రతిదినము తన యంతిపురమునకు వచ్చుటలేదు. ఆయన రేపు శ్రీముఖుఁడు

రాజైనప్పుడు మహాసేనాధిపతి యగును. సామాన్యముగా రాజకుమారులను రాజ్యమునందలి దూరప్రదేశములకు రాజప్రతినిధిగాఁ బంపింతురు. కొన్నాళ్ళ కతఁడే రాజగును. రాజనఁగా సర్వవ్యవహారములందు రాజుగాఁ బరిగణింపఁబడును. అసలురాజు నీరాజును సోదరులు. లేదా దగ్గఱి బంధువులు. ఆ ప్రాంతమంతయు నతని యదుపాజ్ఞలలోనే యుండును. సర్వరాజ్యాంతర వ్యవహారములకు నతఁడే రాజు. పరరాజ్యములతో వ్యవహరించు చున్నప్పుడు మాత్రమే యన్నగారు రాజు. అదియొక స్వతంత్రత. బాధ్యతలేని స్వాతంత్రత. ఇచటగోటలోఁ దమకు సర్వాధికారములులేవు. ఎన్నాళ్ళు గడిచినను నతడు యువరాజు తమ్ముఁడు. లేదా రాజుగారి సోదరుఁడు సేనాధిపతియైనచో నదియొక మర్యాద. రాజు మంత్రి సేనాధిపతి ముగ్వురు సమానకక్ష్యలోని వారు. సేనాధిపతి రాజభోగము లనుభవించును. అనుభవించఁడు. అతనిని రాజనుకొనరు. అతఁడు స్వతంత్రుఁడని ప్రజలను కొనరు. కాని స్వతంత్రుఁడే. ఇతరరాజ కుమారుల భార్యలు తమ భర్తలు రాజ్యపు దూరప్రదేశములలో నొకకొంత భూభాగమునకు రాజులుగా నియమింపఁ బడవలెనని కోరుకొందురు. భామయట్లు కాదు. తనభర్త సేనాధిపతి కావలయునని కోరుకొనును. ఆమెకు విజయసింహుని వివాహమాడక మునుపు శాస్త్రచర్చలు తెలియును. సంగీతవిద్య తెలియును. చిత్రకళ తెలియును. వానిలోని విచ్చిత్తులు తెలియును. తండ్రి యౌదార్యము తెలియును. తండ్రిప్రేమ తెలియును. తల్లి యనురాగము తెలియును. అక్కాచెల్లెండ్రు కలసియాడు

కొనుటలు. కవ్వించికొనుటలు, కోపగించుకొనుటలు, మరల లాలించికొనుటలు, అక్కకోరిన వస్తువులందు మమకారములు వదిలికొనుటలు, తనకొఱకు తనసోదరులు తమ చిన్న చిన్న వ్యామోహములు పరిత్యజించుటలు, మొదలయిన సమిష్టి కుటుంబమైన చిన్నసంసారములోని యల్పసుఖములెఱుగును. కాని యొక నిజమైన రాజవంశంములోనికిఁ గోడలుగా వచ్చి తక్కినవారికిఁ దనకు సంబంధములేకపోవుట తనమేడలోఁ తానే యుండుట, పరిచారికల మొగములుతప్ప బంధుగుల మొగములు చూడకుండుట, యత్తగారో తోడికోడండ్రో యితర రాజవంశస్త్రీలో వారిలో వృద్ధసువాసినులో తన మేడకు వచ్చినపుడు మరియాదలు నెఱపుట. యా మరియాదల వెనుక గాటమైన ప్రేమలేకుండుట, యివి యామెకుఁ దెలియవు. ఇవియన్నియు నామెకుఁ గ్రొత్త క్రమముముగా వాని కలవాటు పడినది. రాజకుటుంబములోని స్త్రీయైనది. కాని తాను చిన్నప్పుడు పెరిగిన పెరుగుదలలోని యొక యార్ద్రిత యామె గుండెలో నెండిపోలేదు. దానికి విశ్రామ స్థానము కనిపించలేదు. తనభర్త తన సంగీతమునువినును. సొక్కును. ఆయన పాడలేఁడు. కాని మధురమైన సంగీతమున కతఁడు పరవశమొందును. అది యతని యాత్మలోని గుణము. అతని గుండెలోనున్న సహజమైన సౌందర్యాభిలాషయొక్క మూలభూతమైనవస్తువేదియో యది రసా స్థానము కావలయును. ఆ స్థానమునుండి స్రవించునొక సన్నని ప్రవాహము సౌందర్యరేఖ యెచ్చట నున్నను నెట్టిదైనను దానిని స్పృశించునేమో! పరిపాకముగలిగి బహుజన్మల సంస్కారము

చేత విశుద్ధమైన యొకజీవునియందలి చైతన్యములో సౌంద ర్యమును గుర్తుపట్టు నొక చిన్నమెఱుపుతీవల చెఱువుండు నేమో! ఆ చెఱువునుండి చిన్నారి కాలువలు బయలుదేరి తత్తద్విద్యా పరిజ్ఞానముకూడ లేకుండ, దత్తద్విద్యలు ప్రద ర్శింపఁబడు వేళ నవి పరమోచ్ఛస్థానమునుబొందిన సమయ ములభాసించు నానందమధునవతరంగములు కభిముఖముగాఁ బ్రవహించి వానిని స్పృశించును. ఈ లక్షణము విజయసిం హునిలో నున్నది. సామాన్యులు విద్యలయొక్క యల్పా ల్పావిష్కారముల స్వరూపము నెఱిగి వానియందు బుర దలోవలె దిగఁబడిపోదురు. సర్వవిద్యలకుఁ బరమార్థమైనది యాయానందకళ. విద్యాస్వరూపమునం దేకవిషయములుం డును. ఈ సర్వము నాయానందకళయందుఁ బర్యసించును. ఆ విద్యయే యొకసరస్వతియైనచో నాయానందకళ యామె యాత్మ. తక్కినదంతయు నామె శరీరము. శరీరమునందెంత సౌందర్యముండును. పాదములు, పాదనఖములు, పిక్కలు. జానువు లూరువులు, జఘనము, బిరుదులు, నడుము, పయో ధరము, లంసములు, బాహువులు, కరము, లంగుళులు, ముఖగల్లచిబుకములు నేత్రములు ఫాలము కేశములు దేనికవి రమణీయములుగా నుండవచ్చును. ఏతత్సర్వసమహార భూత మైన విన్యాసరేఖాపరిమంజులమైన యొక యేదో వస్తువు-అని ర్వచనీయమైన యొక సౌందర్యముగా భాసింపవచ్చును. ఇది యంతయు శరీరమే. ఈ శరీరమునందలి సర్వావయవముల యొక్క పరిజ్ఞాతయైనవాడు పండితుడుగాఁ జెప్పవలయును. ఈ సర్వావయవ సమాహిత దశయందుఁగూడఁ దల్లక్షణ

ములయందుఁగూడ రమించువానినిగూడ భావుకుఁడని చెప్పవచ్చును. కాని నిజమైన భావుకు డాయానందకళను దర్శించి నతఁడు యీతక్కువవారిని భావుకులనుట యెట్లు? చైతన్యముయొక్క లక్షణమిచ్చుటనున్నది. ప్రత్యేక ప్రత్యేకావయవ శోభాభావనా జనితమైన యొక యనుభవము నందలిగాఢత్వ మెట్టిదనగా నాయానంద కళానుభూతి యందలి గాఢత్వముతో సమానమైనది. కనుక బర్యవసానము నందు బండితుఁడై యీ యానందము నెఱిఁగిన వానికిని పండితుఁడై పూర్వజన్మసంస్కారబలముచేతఁ దదానందమును స్పృశించు వానికిని భేదములేదు. లౌకికముగాఁ జాల భేదము కలదు. ఇతఁడు పండితుఁడు అతఁడు పండితుఁడుకాఁడు. కాని విద్యావంతునకు విద్యాప్రదర్శన లోభముగల బుద్ధిగలవానికిఁ దనవిద్య యితరులచేత నాస్వాదింపఁబడవలయునన్న మమకారముగలవానికిఁ దది యానందరేఖ యెవఁడనుభవించునో వానియం దభిమానాదరములు మెండు. వాఁడు పండితుఁడు కావచ్చును. కాకపోవచ్చును. అందుచేత భామకు విజయసింహునియందుఁ బ్రేమపట్టరానిది. తనయందుకంటెఁ దనసంగీతమునందుఁ దనభర్త పరవశుఁడగుచున్నాఁడు. ఆమెజన్మ చరితార్థమైపోయినది. ఆమె శృంగార సామ్రాజ్యమునకుఁబట్టమహిషి. భిన్ననాయికలు వ్యభిచారి సాత్త్వికభావములు రసములు కోపములు తాపముపీసడింపులు విదళించుటలు నభిగమములు స్వాగతములు విలాసములు హేలలు శృంగారరసభాండారమునందామె యెఱుగనివస్తువు లేదు. ఇది యంతయుఁ దన దేహపు మనుగడలోని భాగము. ఆమె వీణా

వాదనము తన శరీరమునకుఁ, దన రాచకూతురుతనమునకుఁ దానొకని భార్యయైనట్టిదానికి సంబంధములేక యెదోపరమేశ్వరదీప్తి తనయందుఁ దాండవించుచున్నదన్న లక్షణము. అందుచేత నామెకుఁ దన విద్యయందు ఇంతటి యభిమానము. అదియే తన మనుగడయొక్క పరమార్థమనుకొనుచున్న లక్షణము. ఈ లక్షణము శృంగారభావమునందు లేదు. అచట విజయసింహుడు తననెచ్చెలికాడు, తనశిష్యుడు, తన బంధు, తనదాసుఁడు. అన్నిటికిమించి తనకు గురువుగాఁ దానను కొనువాఁడు. ఇది విద్యయొక్క పరమావధి స్వరూపము. విద్యలు ప్రదర్శించువారు కలనాఁడు దాని నాస్వాదించు వాఁడు కలఁడు. ఆస్వాదించువానికి విద్యాప్రదర్శనము చేయు వానిశక్తిలో నేపీసమునులేదు. కాని యీ యాస్వాదించు వాఁడు ఈ ప్రదర్శించు వానికిఁ బరమబంధువు. గురుతుల్యుడు. గురువునయిన ధిక్కరించునుగాని యీ యాస్వాదించువాని నెప్పుడయినను ధిక్కరింపఁడు. భామయొక్క యీయేకాకినీ లక్షణమునందు నిరాశ్రయమైన కోటయందుఁ దనకోగుండి యలోని యార్ద్రిత వెలార్పు నొక విశిష్టమైన వేళయందుఁ తన భర్తయైన విజయసింహు నొక్కరుడే పరమదైవము. తన యాత్మలోని యాత్మలో భామ విజయసింహుని దాసి. భార్యారూపముతో విజయసింహుని శృంగార సామ్రాజ్యము నందధికారిణి. తన దేహముతో నతని ధర్మపత్ని.

విజయసింహున కిదియంతయుఁ దెలియును. కాని యతని సౌందర్యపిపాస వానిని దయ్యమువలె వెంబడించు

చునే యుండెను. అప్పుడప్పుడు కోటలోఁ బెద్ద పెద్ద యుత్సవములు జరిగినప్పుడు మల్లయుద్ధములు లక్ష్యవేధనములుఁ పొట్లేళ్ళ యుద్ధములు, ఖడ్గవిద్యా ప్రదర్శనములు, జరుగుచుండును. విశాలమయిన రంగభూమికి దక్షిణదిశ యెత్తైన ప్రదేశమున సన్నని తెరలవెనుకనుండి యంతిపురముస్త్రీలతోఁ గలిసి తాను నా ప్రదర్శనములు చూచుట కలదు. యెప్పుడో యొకటి రెండుసార్లు మాత్రము చిట్టచివరకు రాజాంగీకారము మీఁద వృద్ధులువాంఛానుసారముగాఁ దనభర్తయు నిరంకుశుఁడును గత్తియుద్ధము చేయుట చూచినది. శృంగార రసపరమార్థభూత పరమమధుర వేళలయందు విజయసింహుఁడెట్లు కనిపించెనో తత్ఖడ్గవిద్యా ప్రదర్శనవేళనట్లు కనిపించెను. తదాది పలుసార్లు తాదృశోత్సవముల యందితరుల ఖడ్గవిద్యా ప్రదర్శనములఁ జూచెను. ఆమెకేదియు రుచించదు. తనభర్త బరిమీఁద నిలువఁబడవలయును. వాని చకచ్ఛకత్తనూశీఘ్రలఘు విన్యాసమధుర చంక్రమణ హేలారమణీయత చూడవలయును. భామ కదియొక గాటమయినకోరికగాఁ బరిణమించెను. ఒకటి రెండుసార్లు గదిలోఁ దన వినోదము కొఱకుఁ దన్నుసంతోష పెట్టుటకొఱకుఁ మాటిమాటికిఁ జేసిన తనయభ్యర్థనల నిరాకరించకుండుటకు విజయసింహుఁడు తన కత్తిసామును నెఱపెను. దాని వలన నామెకుఁ దృప్తికలుగలేదు. తనకు రాజపట్టాభిషేకోత్సవములు జరిగినప్పుడు ఖడ్గవిద్యాప్రదర్శనములు జరిగెనని వినినది. దానికంతఃపుర స్త్రీలెవ్వరును వెళ్ళలేదు. ఎవరో రాజవంశీయులైన యువకులు కొందఱు సమావేశమయి తమలో దామది

నెఱపుకొన్నా'నని విన్నది. భర్త నడిగినది. ఆయన నిజమే అన్నాఁడు. నన్ను బిలువకపోయితిరా యన్నది. 'నయము చంకనెత్తుకొని గంతులువేయ మన్నావుకాదు' అన్నాడు. ఇట్లువారు పరస్పరమునొకరొకరి విద్యాభిలాషా పరమ బావనా శీలురయి యుండిరి. ఇది వారి ప్రేమసౌధముపైనఁబెట్టిన కనక కలశము వంటిది.

కాలము గడచుచుండెను. విజయసింహునకుఁ దన మీఁదఁ నున్న ప్రేమలో నేకొంతయులేదు గాని యామె కనుమానము ప్రారంభమయ్యెను. పరిచారికులలో గొందఱు గుసగుసలుగా నుండఁగా నామె యొకరిద్దఱిని బలవంతము చేసి యడుగుటయు, వారు సగముసగముగా నవిస్పష్టముగా నిదమిత్థమని నిరూపింపరాకుండగ నేదియో చెప్పుటయుఁ గూడ జరిగినది. మగని నడిగినది. అతఁడా మాటలు నమ్మ వద్దని వేయిబాసలు చేసెను. బాసలుచేసిన నామెకు నమ్మ కము కుదరలేదు. భార్యాభర్తలనడుమ జరుగు నిట్టిబాసలు చాల విచిత్రముగా నుండును. ఆ బాసలుచేయుటలో విను టలో సర్వసృష్టిలోని మర్మము భాసించుచుండును. అపుడు శరీరము శరీరగతవాంఛ దాని బలము మనసు మనసులోని నాలుగైదు పొరలు వెనుకనున్న జీవుడు ధర్మము భోగాభి లాషకైతవము యాథార్థ్యము గోపనము, అభినయము, తన్నుదాను మోసము చేసికొనుట మొదలయిన యనంత భావసామాగ్రి తత్కాలమున మేల్కొనియుండును. నమ్మెనో నమ్మలేదో వీనికిఁ దెలియదు. తాను నిజము చెప్పెనో చెప్పలేదో తనకుఁ దెలియదు. కాని వీనినన్నింటిని గోపనము

చేయునది యొక సంబంధము కలదు. అది దాంపత్యము. వారి యిద్దఱి నిత్యపరిచితమయిన సంగమాభిలాష.

ఈ పరిస్థితి కొంత ముదిరెను. భామకుఁ గోపమువచ్చు టయుఁ గొన్నాళ్లు మాటాడకుండ నుండుటయు జరిగెను. దానివలన నతని ప్రవర్తనలో మార్పువచ్చినట్లు కనిపించ లేదు, గాని మరల నతఁడు తనవద్దకు వచ్చినప్పటి అభ్యర్థనా దైన్యము రెట్టింపై మూఁడురెట్లయితన కధి కానందమును సమకూర్చుచుండెను. ఆ యానందమామెను గికురించినది. అమో! మానవ స్వభావము. ఇది మానవ స్వభావమేకాదు. సృష్టిలక్షణము. ఒకయెడ జరిగిన లాభములో మరియొకయెడ జరిగిన నష్టము నిరాదరింపబడును. క్రమముగా భామకిది కొంత యలవాటయిపోయెను. నిజముగా విజయసింహునకు విషయమున నిట్టిది జరుగుచున్నదని నమ్ముటకు వీలులేదు. ఎప్పుడో నూటికిఁ గోటికతఁడు కోటవదలి వెళ్లునుగాని నిత్యము కోటలోనే యుండుచున్నాఁడు. ఆ వెళ్ళినప్పుడు వెళ్ళుటకు కారణము సువిస్పష్టముగా నున్నది.

కాని యొకనాఁడు భర్తయొక్క యభ్యర్థనాదైన్య ముత్కృష్టస్థితిని బొంది తన ప్రసన్నత యంగీకృతి తత్సమాన దీనతాలక్షణము నంతరించుకొన్నాఁడు. వారిసుపురి యెడము లేని కపోలములు గల పరిష్వంగ సమయమున నామె యతని చెవిలో నిట్లాడెను. “ఓయి నాయెడదిలోని నిత్యమైన వెలుగా! నా ప్రాణానిలమును వీచుచున్న పన్నీరుచల్లిన వింజా మరమా! నీవు నన్ను వదలిపోకుము. కొందఱు చెప్పిరో

నెడు మాటలు నిజమయినచో నా బ్రదుకులేదు. నేను నీతో సహగమనము చేసెడిదాననుగాని మిగిలి బ్రదికెడి దానను కాను. నీ వెంత రాచకొడుకువైనను నా మార్గము భయంకరమైనది. కొన్ని యేండ్లు సుఖముగా సాగవచ్చును. అది యెప్పుడో తెలియక పొదవెనుకఁ బొంచియున్నపులి పైకుఱికి కంఠ నాళములు త్రెంచవచ్చును. ఎదురుగా వచ్చిన యెంత వీరు నైనను నీవు వధించగలవు. వెనుకనుండి వచ్చిన యాపదనెవ డొడ్డికొనగలఁడు స్వామీ! ఇట్లనుచుండఁగా నా గుండె యదరుచున్నది.”

## ౧౦

అదివఱకెన్నఁడును లేనివి నీలమేడలోఁ గొన్ని పండుగలు చేయుట ప్రారంభమయ్యెను. తొలిసారి యందఱి కబ్బురమేయయ్యెను. అందఱు వచ్చిరి అందఱు వెళ్ళిరి. నీల యువరాజు భార్యయైన కాళింది నెక్కువ గౌరవముగా జూచెను. అత్తగారి నెంత గౌరవముగాఁ జూచెనో పెద్దతోడి కోడలి నంత గౌరవముగాఁ జూచెను. అది యందఱికి సహజముగానే తోచెను. అందఱు తిరిగిపోవునపుడు కాళిందిని 'అక్కగారూ! తమరు కొంచెమాలస్యముగాఁ బోవుదురుగాని నేను మీమేడకే రావలసియుండెను. పలుసార్లు వత్తమను

కాని నేను సహజముగా సోమరిని. నాకు గొందఱియందె క్కువ గౌరవమున్నది. ఆ గౌరవమును నెఱపకుండుట కలసత గాని వేఱొండు కారణములేదు. మీ యందు నా కెంతో గౌరవము. కొంచెమాగి నా తప్పుమన్నించి నన్ను క్షమిం చవలయు'ననెను. ఇంత వినయమునకు కాళింది మాత్రమే మనగలదు? అత్తగారితో మనవిచేసి యామె యాగిపోయెను. అందఱును వెడలిపోయిన తరువాత నీల కాళింది పదము లొత్తంబోయెను. కాళింది వలదనెను. నీల యిట్లనెను. 'అక్కా! నీవొక మహారాజుకూతురవు. నేనొక పేదయింటి బిడ్డను. మీ మఱంది నన్ను కటాక్షించెను. గనుక నేను రాజాంతః పురమునకు వచ్చితిని; గాని లేనిచో నెక్కడనుండవలసిన దాననో యని యీదృశమైన వినయాధిక్యమును ప్రదర్శిం చెను. కాళిందికి వెంటనే సందేహము కలిగెను. నీలయందుఁ దత్పూర్వములేని యింత వినయము హఠాత్తుగా నెందుకుఁ బొడమెను. కాని యామె తన సందేహమును వెలిబుచ్చ లేదు. సందేహము నుద్దీపింపఁజేయు కన్నుబొమలలోని యొక లోమమును గూడఁ గదలనీయలేదు. సుకుమారమయిన యధ రములో రేఖామాత్రముగ గూడఁ నా సందేహమును భాసిం చనీయలేదు. తాను వెంటనే యిట్లనెను. 'చెల్లెలా' నిన్ను గుఱించి పలుమంది పలువిధములుగాఁ జెప్పుచుందురు. నీవు సహజముగా వినయవతివైయుందువని నాకుఁ దెలియును. నేనందఱితో నదియే చెప్పుచుంటిని. ఆమె చాల మంచిదయి యుండవలయును నేననుకొన్నట్లే నిజముగా నీవింతమంచి దానవు. నేనొక మహారాజు కూతునన్న మాట నిజమే. ఏ

మున్నదమ్మా! ఇక్కడికి వచ్చిన తరువాత నందఱమొకటియే. మనపుట్టినయిండ్లకు మనకు నేమి సంబంధము? రాచకూతుండ్ర బ్రదుకులింతే. భర్తలయిండ్లకుఁ బోవువఱకే. వచ్చిన తరువాతఁ బంజరములలోఁ జిలుకలము. భామకు నలుగురప్పగారలు. వారును భామయు గలసిమెలసి యుండెడివారట. ఇప్పుడు భామ యెవరో వారెవరో. నేనీసంగతి తలచికొన్నపుడెల్ల నాకొక విషయము జ్ఞాపకమునకు వచ్చును. నలమహారాజు కథ నీ వెఱుగుదువా'యనెను. నీల యెఱుగదు. ఎఱుఁగనన్నచోఁ గాళింది నవ్వవచ్చును. తాను స్వదేశకథాపరిజ్ఞానము లేనిదిగా భాసింపవచ్చును. ఎఱుగుదునన్నచో నీమె యేమిప్రశ్న వేయునో? అందుకని యెఱుఁగుదుననకుండ నెరుగ ననకుండ నూఱకుండెను. కాళింది యామె నలచరిత్ర మెరుగదని తెలిసికొనెను. తాను దెలిసికొన్న విషయమును దెలియఁజేయకుండ వెంటనే యిట్లనెను. 'నలమహారాజు దమయంతిని విడిచి వెడలిపోయెను. అడవిలో సగముచీర చించుకొని వెడలిపోయెను. యామె యడవులవెంటఁ దిరిగి తిరిగి యొక సార్థవాహుల గుంపువెంట జేదిశమునకు వెళ్లెను. ఆ చేదిదేశపు రాణి యీమె పినతల్లి. అచట గొన్నాళ్లుండెను. విదర్భదేశమునుండి సుదేవుఁడు దమయంతిని వెదకికొనుచు వచ్చెను. చేదిదేశపురాణితో నీమె విదర్భరాజుకూతురని సుదేవుఁడు చెప్పవలసి వచ్చెను. అప్పటినుండి చేదిదేశపురాణి దమయంతిని మఱింత యెక్కువగాఁ బ్రేమగాఁ గౌరవముగాఁ జూడనారంభించెను. ఆమెకీమె పినతల్లి. ఈమె యామె కప్పగారికూతురు. వారొకరినొక రెరుఁగరు. ఆ పిన

తల్లి దమయంతి పెండ్లికిఁ గూడ రాలేదన్నమాట. మన క్షత్రియుల బంధుత్వములుండును. సామాన్యకుటుంబములలో నయినచో నెంతెంతదూరపుబంధుత్వములైనను సులభముగాఁ దెలియుచుండును. అందఱుబంధువులు రాని వివాహము జరుగనే జరుగదు. మనమేమి చేయగలము. అందుచేత నొక చోట జేరినాము కనుక మనమే యక్కసెల్లెండ్రము. కాద య్యా! నిషధదేశమునకుఁ చేదిదేశమునకుఁ జాలదూరము. అందుచేత నొకరి నొకరెఱుఁగరందుమా. ఏమియు దూరము లేదు. కృష్ణా గోదావరి నడుమది యాంధ్రదేశము. ఈ యాంధ్రదేశమునకుఁ బడమరనే విదర్భదేశము కలదు. గోదావరి యాతలివడ్డుననున్నది పుండ్రదేశము. అది నా పుట్టిల్లు. గోదావరి యీాతలనున్నది విదర్భ. తపతినదిదాటినంతనే చేది నిషధదేశములు. ఆంధ్ర విదర్భదేశములనలె నంటుకొనియే యున్నవి. పెద్ద దూరములేదు. అక్కడ దూరము లేదనుట యెందులకు? ఈ యాంధ్ర పుండ్ర దేశముల కెంతదూరము వలదు? నేను వెళ్లునదియులేదు. వీరు పంపించునదియు లేదు. వారు పంపించుమని యడుగటయులేదు. పూర్వ యుగములయందు రాకపోకలకింత యిక్కట్టు లేదనుకొందును. ఎందుకుండి యుండదు? నలకధ కృతయుగములో జరిగినదికదా. కాని రామాయణ కధనాటి కిట్లు లేదేమో! శ్రీరామచంద్రుని వివాహమునకుఁ గౌసల్యయుఁ గైకయియు సుమిత్రయు దరలివచ్చిరని విందుము. అది ఎంతనిజమో? ఆ మాటలు మన కెందుకు? మనము ముగ్వుర మొకచోటఁ బడినాము. నాకు భామయు, నీవును నొక్కటియే"యనెను.

నీల కేమివినుచుండెనో తెలియలేదు. మరియు భారతదేశపు బూర్వకథలలో వ్యాఖ్యానించి జెప్పికోవలసిన విషయములు కొన్ని కలవనియుఁ దెలియును. కాళింది పండితురాలని తాను వినెనది. నీల పల్లెటూళ్ళలో స్వేచ్ఛగాఁ బెరిగినదేగాని మనో నియమమెఱుగని స్త్రీ. ఆమె హృదయము నందలి సర్వసంస్కారము రేలంగినుండి సంక్రమించినది. దానికి దుస్సల ప్రోత్సాహమిచ్చెను. నీల సహజముగా వివేకవతి. కాళింది యొక్క స్వరూపము తాను తెలిసికొనలేదు. తా నేతప్పటడుగులు వేయునో తెలియదు. తాను పొరపాటున నేమిమాటాడినను దుస్సలయొక్క యుపదేశము వ్యర్థమగును. నీల యెడఁదలో నామెకుఁ దెలియకుండ నొక నూతన కథాశ్రవణాభిలాషము కలదు. దుస్సల యేమయినసరే. కాళింది యేమయిన సరే. నలరాజు నట్టడవిలో భార్యయైన దమయంతి చీర చించుకొని యెందుకు పోయెను? కాళింది నడిగి యాకథ తెలిసికొన వలయును. అడిగినచో బాగుగానుండునా? ఈ సారి యూఱకుండి యింకొకసారి యడుగుదు ననుకొనెను. లేదా, తన భర్తనడుగవలయు ననుకొనెను. ఆమె యీ ధ్యానములో నుండెను. కాళింది యింతలో నేను వెళ్ళివచ్చెదనని వెడలిపోయెను. ఆమె వెడలిపోయిన తరువాత నీల యిట్లనుకొనెను. 'ఆమెతో నెట్లు మాటాడవలయునో నాకుఁ దెలియదే. నేనామె నిచ్చట నెట్లాపఁగలను?' ఐనను ద్వారబంధమువఱకుఁబోయి కాళిందివద్ద సెలవుతీసుకొనివచ్చెను.

ఆనాడు దుస్సల ప్రొద్దుపోయి వచ్చెను. వచ్చియిట్లనెను. నీవు యువరాజ్ఞితో మాట్లాడుచుండి యుండుచుందువు.

ఈనాఁడే యామెను గలసికొనుట నా కిష్టములేదు. అందు చేత నేనాలశ్యముగా వచ్చితి ననెను.

సీల- 'నే నామె నెక్కువసేపాపలేక పోయితిని. ఆమె నలమహారాజు యడవిలో దమయంతి జీరచించికొని పోవుట, చేదిదేశము, చేదిదేశపురాణి యాదమయంతి కెదో చుట్ట మట. ఒకరినొకరెఱుగరట, యని యేవేవియో మొదలు పెట్టెను. పట్టుమని పదిలిస్తె లోకే ధోరణిని మాటాడెను. నాకు గ్రుక్కతిప్పుకొనుటకు వీలులేకపోయెను. నేనా పేర్లే యెఱుఁగను. నేనేమి సమాధానము చెప్పగలను? నాపని పాలలోఁబడిన బల్లి విధానమయినది.' అనఁగా దుస్సల యిట్లనెను.'ఒక కథ నీ వెరుఁగవనుకొనుము.' పరులతో మాటాడునపుడు మనమెరుఁగని విషయములు వారు ప్రస్తా వించుచో నొక నేరుపుండవలయును. కథలోని పేర్లు మనకుఁ దెలియకపోయినను నెట్టికథయైనను మానవలోకమునందు జరిగెడిదే కదా. ఈ లోకములో నున్నవి సుఖదుఃఖములు రెండే కదా! సర్వ కథలు వాని నాశ్రయించియే యుండును గదా! సుఖమువచ్చినపుడు చిరునవ్వునవ్వుటయు దుఃఖ విష యములు చెప్పినపుడు'అయ్యో! పాపము! ఔనట్లే జరిగినది మొదలైన మాటలుమాటాడుటయుఁ జేసినచో నవతలివారికి మన కాకథ తెలియదన్న విషయము తెలియదు. ఇట్లనక పూర్వము మనమనస్సు మన మెరుఁగనిదానికి నివ్వెఱ పోవుటయను లక్షణమును జంపుకొనఁ గలిగి యుండవలయును. నీవు పసిదానవు. అడవిపెంపకము కలదానవు. నేను జెప్పినట్లే సారిచేయుము. మనసున కాలక్షణము సహజముగా నుండవల

యును కాని నేర్చుకొనినచో వచ్చునా యనుకొన నక్కఱ లేదు. మన మెవ్వరితోనయిన మాటాడుట్లైనను పోవుటకు ముందుగా, వారేమన్నను సరే నేను ద్వేషము పొందను. నేను నిర్వేఱపోను. నేనాశ్చర్యమును భజించను. అది మన స్సున దృఢముచేసికొని వెళ్ళినచో సుఖముగానుండవచ్చును. మనస్సునకుఁ గూడఁ దనయంతటదాను జాగ్రత్త పడుటయను నొక లక్షణమున్నదని చెప్పవచ్చును" అని బోధించెను. నీల దుస్సలనాకథ చెప్పమని యడుగద మనుకొనెను. అది యడి గిన దప్పేమో? అది మ్లేచ్ఛుల కథకాదు. భారతీయుల కథ. దుస్సలకు మ్లేచ్ఛకథాభిమాన మున్నంత భారతీయకథాభిమా నములేదు. ఒకవేళ దుస్సల కాకథ తెలిసియున్నను కథ లోని రామణీయకము గ్రహించుటకు గాళిందియే చెప్పవల యును.

నీల యింటిలో మరియొక పండుగ జరిగినప్పుడు బంధు వులైన స్త్రీ లందరు వెడలిపోయిరి. నీల ప్రార్థించకుండఁగనే కాళింది వెనుకాడెను. కొంచెము సేపుండి పోవుదమనుకొను చున్నానమ్మా! మొన్నవచ్చినట్లేలేమన్నట్లే లేదు. నాకానా డింటివద్ద నేదో తొందఱపనివుండి వెడలిపోయితిని. నేడు కొంచెము సేపుండవలయుననియే వచ్చితిని' అని కాళింది యా చావడిలోనున్న వేదికమీఁదఁ బరువఁబడిన రత్నకంబ ళముమీఁద నాసీనురాలయ్యెను. నీల కొక బాధ తీఱెను. ఆమె నెట్లాపవలయునా యన్నప్రశ్న యీామె మనస్సులో నున్నది. అయాచితముగ నామెయే యాగెను. నీల యామె ప్రక్క వినయముగాఁ గూర్చుండెను. నీలలోని వినయము

నీలకుఁ దెలియకుండగనే కొంత సహజత్వమును సంపాదించు కొనెను. కాళింది యామెను జూచి నవ్వెను. ఆ కాళింది యొక్క ప్రసన్నమందహాసము ముందునామె నేత్రచ్ఛలి ప్ర సారముముందు ఆమె చెక్కిళ్ళలోని గాంభీర్యముముందు ఆమె కనుబొమ్మల యొక్క మహారాజ్ఞిత్వ లక్షణము ముందు ఆమె ముఖములోని యొక యాజ్ఞాలక్షణము ముందు నీల యెంతటిది? ఏ పాటిది? నీల నిముసములో మెత్తఁబడిపోయెను తాను తోడికోడలుగాఁ దనకు భాసించలేదు. తానేదో దాసిగా ననుకొనెను. ఆమెలోని స్వేచ్ఛాభావమంతయు నిముసములో లుప్తమయినట్లనిపించెను. కాళింది కూర్చున్న పద్ధతియెట్లున్నదనగా నేదయిన నడుగుమిచ్చెదను. ఏదైనఁ బ్రశ్నించుము సమాధానము చెప్పెదనన్నట్లున్నది. నీల తన లోని సందడిని సర్దుకొని యిట్లనెను. "అక్కగారూ! నా యందు దయయుంచి మీరు మీ యింతట మీరే యాగి తిరి. ఆ నాటి నుండియు నేటివఱకు నాకా కథ వినవలయు ననియే యున్నది. నలుఁడు దమయంతి నడవిలో నేలవదలి పెట్టెను? చీరచించుకొని పోవుటయేమి? దేనికిఁ జించికొని పోయెను? దాని వెనుక నేమి కథయున్నది? భార్యయొక్క చీరచించుకొని పోవుట యేమిటి? నాకేమియు నర్థముకా లేదు. ఆ కథ చెప్పు"మనెను. కాళింది నవ్వి యిట్లనెను. 'నీకు గల సందేహము నాకుఁ దెలిసినది. ఎందుకు జించుకొని పోయెననగా నిద్దరును గలిసి యొక్క బట్టనే కట్టుకొన్నా రమ్మా! ఆమె నిదురపోవుచున్నది. ఇతఁడామెను వదలిపెట్టి పోదమనుకొన్నాఁడు. చీర నడిమికిఁ జించనిచో నతడెట్లు పో

గలడు?-ఈ మాట వినిన తోడనే నీల కోడలు పులకరించెను. ఆమె మనస్సులో నేదో విచిత్రమైన శృంగారజగత్తునందు మబ్బుతొలగిన చందమామ వెన్నెలలు క్రమ్ముకొంచెను. భార్యాభర్తలిద్ద ఱొక్కవసనమును దరించిరా. ఇదియేమి విలక్షణమయిన శృంగారము? వారిద్దరు నంతయొకటియా? అంత మనైక్యముగా నున్నవారిలో మగడు చీరచించికొని యెందుకుఁబోయెను? డాఁగురుమూఁత లాడుటకా? అప్పుడె చ్చటనున్నారు? ఏకశయ్యాగతులై యుండిరా? తమ మేడలో నొక గదిలో నిద్రించుచుండిరా? ఏదైనఁ గొండలలోనుండి రా? అతఁడు పోయి యేఱాతిబండ వెనుకనైన దాగియుం డునా? ఈమె పిలిచినచోఁ బలుకునా? ఈమె పిలిచిన పిలుపు నకుఁ గొండలన్నియుఁ బ్రతిధ్వనించునా? అది వేణునాదము వలెఁ గొండగాలుల తరంగములలోఁ బెళ్ళుబెళ్ళలు విఱిగిం చునా? వాయుతరంగములలో బీట్లుకలుగునా? అతఁడు మాఱుపలికినపు డెట్లుండును? ఆరమునియొక్కయు గీలాయొ క్కయు శృంగారమును మించిన శృంగారముగా నున్నదే, యనుకొనుచు గీలా యారములపేరు లెత్తకుండఁ బ్రశ్నల న్నియుఁ గుఱిపించెను. కాళింది యామె భావనానైశిత్య మునకు సంతోషించెను. ఈమె ఇంతచక్కని యూహా రమణీ యతగలబాలిక చెడిపోవుచున్నదను కొనెను.

తరువాత రెండుమూఁడు గడియలకాలము నలచరిత్ర మంతయుఁ గాళింది నీలకుఁ జెప్పెను. కథ యడ్డనడక నడచెను. మొదలుపెట్టి తుదవఱకు రాలేదు. చిట్టచివర వఱకు నీల ప్రశ్నలు వేయుచుండుటయే. ఆ ప్రశ్నలకు సమాధానములు

చెప్పుటతోడనే కథయంతయుఁ దిరిగెను. ఆ ప్రశ్నలలోని సొగసెంతయని చెప్పవలయును? ఆమె యడిగిన ప్రశ్నలను బట్టి యీామె సమాధానములను బట్టి కథ వ్రాసినచో నది యొక పరమవిలక్షణమైన కావ్యంబు గావచ్చును. ఆమె కట్టి ప్రశ్నలు స్ఫురించుచుండెనో యీామె వట్టి ప్రశ్న వేయను. ప్రతికల్పమునకు నిరువది శాఖలు నిరూపించును. ఆ శాఖ లన్నియు నర్ధవికసితలతాంత పేశములై యుండును. కాళింది యొక్క మనస్సే యొక్కవ్యక్తియైనచో నా వ్యక్తి యొక్క ఘ్రాణేంద్రియతర్పణము తదర్ధవికసిత పుష్పగుచ్ఛ వినిర్గత పరిమళ ప్రత్యగ్రతాస్వాచ్ఛతా పరమానుభవ పరమే శ్వరముగా నుండును. కాళింది తాను యువరాజ్ఞినని మఱచి పోయెమ. నీల తాను తోడికోడలనని మఱచిపోయెను. దుస్సలశిష్యురాల నని మఱచిపోయెను. దుస్సలా ప్రోత్సా హమువలనఁ గాళింది నచట క్షణియించుచున్నదానవని తత్ప్ర యత్నమును మఱచిపోయెను. కాళిందియు దత్కథాలహరీ మధురతరంగడోలావిహారణ సంజనితానంద మధురలోకము లలో నుండిపోయెను. ఆమె గురువు. ఈమె శిష్యురాలు. ఆమె యక్కగారు ఈమె చెల్లెలు. వారిద్దరు తమ కష్టము లొక రితో నొకరు చెప్పుకొన్నట్లు నలదమయంతులు పడ్డకష్టము తామే పడుచున్నయట్లు ఆ నలదమయంతుల దుఃఖ కథవినుట యేదో దూరముగా దొలగించఁబడి యనుభవదశనుండి ప్రతా రింపఁబడి నిత్యప్రతీక్షా సంజనిత దుఃఖవార్ధి నిమగ్నమై యున్న యొక శృంగార భావముచేత వారి హృదయములు తాడింపఁబడుచుండెను. ఆ కథలోని ప్రధానరసము

శోకమా శృంగారరసమా? శోక రసమునకు శృంగారరసము నకు సంబంధమేమి? కథ వెనుక నున్న దంతయు వారి యిద్దఱి పరస్పర ప్రేమభావమే. వారి ప్రేమ చేతనదుఃఖము పాలింపఁబడుచుండెను. వారి హృదయములు దుఃఖము ననుభ వించుచున్నను వారి జీవలక్షణముల యందు శృంగారరసము జీవవాహినిగా ప్రవహించుచుండెను.

చిట్టచివఱికిఁ గథలో నడుగవలసిన ప్రశ్న మిగులలేదు. అప్పటికి రెండు మూఁడు గడియల ప్రొద్దుపోయెను. దుస్సల వచ్చి వీరిద్దఱి తన్మయస్థితిని ద్వారబంధమునుండి చూచెను. ఆమె కేమియు నర్థముకాలేదు. ఏమి చెప్పుకొనుచుండిరో తెలియలేదు. నీల ఆమె వంక జూచెను. ఆ భావనాప్రపంచ మునుండి వెలికివచ్చుట జరిగెను. ఆ నిమిషములో నీల యొక్క స్థితి చాల విపరీతముగా భాసించెను. దుస్సల యిది వఱకే గురువు. ఆమె వచ్చినంతటనే యామెను గౌరవించుట తనకు నిత్యమయిన అలవాటు. ఆమె వట్టి గురువు. ఎదురుగా గూర్చున్నది యువరాజ్ఞి. ఈమె మూఁడుగడియల కాల ములో గురుపదమధిష్ఠించెను. గురుపదము నతిక్రమించి యీామె యందు యువరాజ్ఞీత్వమున్నది. తాను వెంటనే లేచి దుస్సలయందు గౌరవము నెఱపినచో నిస్సందేహముగా యువరాజ్ఞని దిరస్కరించినట్లు. అట్లు సేయనిచో దుస్సలయం దవినయము నెఱపినట్లు. అంతలో నీల మనస్సులో నొక కైతవము భాసించెను. ఆ కృతకత్వమెందుకు భాసించినదో యామెకుఁ దెలియలేదు. తాను దుస్సలచేతఁ బ్రోత్సహింపఁ బడి యీపనియందుఁ బ్రవర్తించెను. ఆమెయందిప్పుడవిన

యను జూపినచో నెదో తనకుఁ దెలియని యొక ప్రధానమయిన పథకమునకు భంగము వాటిల్లును. దుస్సలా పరోక్షమునందు గాళిందియొక్క క్షమాపణ వేడికొనవచ్చును. అని యూహించి వెంటనే లేచి దుస్సల వద్దకుఁ బోయి యామెను దోడితెచ్చి మఱియొక వితర్దికమీఁద గూర్చుండబెట్టి కాళిందితో నిట్లనెను. 'అక్కగారూ! ఈమె పేరు దుస్సల. ఈమె కుమారుని పేరు జయద్రథుఁడు. వీరిదే దేశమో నాకుఁ దెలియదు. సింధుదేశమని నాకుఁ జెప్పినట్లు గుర్తు. ఆజేండ్ల క్రింద మన కొలువులో నీమె కొమారుఁడుద్యోగము సంపాదించుటకు వచ్చెను. మామగారీ తల్లికొడుకులను ధర్మశాలలో విడియింపించెను. ఈ యాఱేండ్లు వీరిని బరామర్శించలేను. దిన బత్తెము పంపించుచున్నారు. నడుమ నడుమ నీమె కుమారుఁడు రాజుగారిదర్శనము చేయుటకనుజ్ఞ వేడికొనును. మామగారిప్పుడు కాదిప్పుడు కాదని గడుపుచున్నారు. ఒకదినమా రెండుదినములా యాఱేండ్లయినది. ఈమెయు వృద్ధురాలు తమ దర్శనము చేయవలయునని యామె కోరుచున్నది. నా మేడకు దఱచుగావచ్చుచుండును తనకు మీ దరిసెనము చేయించుమన్నది. మొన్న తమరు వచ్చినపుడు మిమ్మాస్పుటకు బ్రయత్నించినది. మీతో నీ మనవి చేయుదమనియే. నేఁడు మీరుండఁగనే యామె వచ్చినది. నన్ను క్షమింపవలయును-'' అన్నది. దుస్సల మనసులో నివ్వెఱపోవుచుండెను. ఈ నీల యెవరు. తన శిష్యురాలేనా? ఈ మాటాడుటయేమి? ఈ వినయమేమి! ఆమెయందీమెకింత గౌరవమున్నదా? యథార్థముగా యువరాజ్ఞినిఁ గలిసికొనుటకిది రెండవసారి.

తాను ద్వారబంధమున నిలిచిచూచినప్పుడే నీల కూర్చున్న వైఖరి యామె మనోవ్యగ్రత తన శిష్యురాలి లక్షణముగా లేదు. ఆ నాఁడు యువరాజ్ఞి యచ్చట నిలువనే లేదన్నది. వారిద్దఱు కలసిమాటాడినదీ రెండు మూఁడు గడియలే. ఈ యల్పమయిన కాలములో యువరాజ్ఞి నీలఁమీఁదఁ దన ప్రభావము పండించినచోఁ గాళిందినిఁ దనవైపునకుఁ ద్రిప్పివైచుట యటులుంచి నీలయొక్క భక్తికే నీళ్లొదుకొనవలసివచ్చునన్నట్లుండెను. కాక, నీల యొక్క యీ విషయము యథార్థముకాక యభినయమందమా? యంత యభినయము నీల ప్రకృతిలో లేదు. తాను కొన్ని నెలలు నీలను గాచి యొఁడబోసినది. దుస్సలకేమియుఁ దోచలేదు. కాళిందివంకఁ జూచెను. ఆమె మొగమెట్లున్నది? ఆమెన వఖండ మహామండలమునకు రాణి కాదగిన తేజశ్శాలిని. నామె కన్నులలో నొక కాంతి ప్రసారము కనుపించుచున్నది. ఆ వెలుఁగుల ప్రసరణము దుస్సల పరిచ్ఛేదములుగాఁ జేసి యూహింప నారంభించెను. ఐదాఱు వెలుగు రేఖలు వచ్చుచున్నవి. ఒక రేఖ యిట్లుండెను. ఈమెయు నీమె కొడుకును వచ్చి యాతేంక్లయినదా? మామగాఱూఱకే భత్యమును పంపించుచుండిరా? దర్శనమేయిచ్చుటలేదా? ఈమెకొడుకెవ్వరో, అతనిని గుఱించి తెలిసికొనవలయును. మఱియొక రేఖయిటులుండెను. నేను యువరాజ్ఞిని. నాయందీమె నెఱపవలసిన మరియాదయుండెను. ఆమె యామరియాద నెఱపలేదు. ఆ నెఱపకపోవుటకు హేతువేమి? ఈమెకు నీలమీఁద నెదో యధికారముండవలయును. నీల

యీామె చెప్పినట్లు నడుచుకొనెడు మనిసికావలయును. ఆ యాధారము చూచుకొని నాతో నిట్లున్నది.

ఆ రేఖ వెనుక నింకొక రేఖయుండెను. ఆ యధికారము సామాన్యమయినది కాదు. విశిష్టమైనది. ఏదియో యాధ్యాత్మిక విషయములకు సంబంధించినది. ఆధ్యాత్మికముగా భాసించుటలేదు. దానియందేదో సంప్రదాయేతరమైన లక్షణము కలదు. మఱియు నొక రేఖ యిట్లున్నది. ఈమె నన్నుదన శిష్యురాలినిఁ జేసికొనవలయునని తలంచుచున్నట్లున్నది. ఈమె నాకేమియుపదేశించును? ఈమె యెవ్వరు?

ఇట్లు కాళింది యూహించుచున్నదని దుస్సల గ్రహించెను. కంటిచూపులో నిట్టి మనసు వెనుకటి యూహాలు భాసించుననుట కెట్లు వీలుండును? ఎవరి మనస్సులులోనికి బదితాళ్ళలోతు త్రవ్వికొని వెలికివందతాళ్ళయెత్తు పెరుగునో వారి మనస్సులు వేఱు. వారి దృష్టులు వేఱు. వారి యభిజ్ఞానము వేఱు.

మఱియుఁ గాళింది దుస్సలవంకఁ జూచెను. తాను యువరాజ్ఞియై లేచి దుస్సలకు నమస్కరించవలయునన్నట్లు కాళిందికిఁ దోఁచెను. దుస్సల కనులలో నొక ధార్ష్ట్యము తాండవించుచుండెను. ఆ ధార్ష్ట్య మెట్టిదనఁగాఁ గొందరు తమకుఁ దామ యెంతోగొప్పవార మనుకొనుచుందురు. తరచుగా మంద ప్రతిభులతోఁ గలసికొనుచుందురు. ఆ మందప్రతిభులు వారిని గొండ కెత్తుచుందురు. వారు తాము కొండయెత్తు

న్నామని యనుకొనుచుందురు. ఈ దృశ్యాల్ప ప్రతిభావంతు లకు మహాపురుషులుందురని తెలియదు, తమకంటెఁ బండి తులుందురని తెలియదు. వారిలోఁ గొందఱియందు నంతటి పాండిత్యముండి వినయముండునని తెలియదు. తమ వద్దకు వచ్చిన ప్రతి వారును దమ్ము గౌరవించవలయుననియే వారి యుద్దేశము. ఆ గౌరవము పొందుటకే తాము జన్మించితి మని వారి యుద్దేశము. ఆ లక్షణము దుస్సల కన్నులయందుఁ గనిపించుచుండెను. అట్టి లక్షణమునకు దెలుఁగుభాషలో నొక మాట యున్నది. అది సంస్కృతపు మాటయో, తెలుఁగు మాటయో తెలియదు. దార్ష్ట్య మన్నమాట పైచెప్పిన సర్వలక్షణములలో నిముడ్చుకొని నందున్న యర్థమీయదని యాంధ్రజాతి దానికి ధార్ష్ట్యకమని పేరు పెట్టెను. ఆమె కనులలో ధార్ష్ట్యకము కనిపించుచుండెను. ఈ ధార్ష్ట్యకము నకొక లక్షణమున్నది. ఎదిరివారి ప్రతిభ తెలిసికొనికూడ దానిని మన్నించదు. ఆతలివాని ప్రతిభను నొక్కొక్కప్పుడు తెలి సికొనఁగలదు. తన యనుయాయులతోనది ప్రతిభ కాదనియే చెప్పుచుండును. ఇదియొక మ్లేచ్ఛ భావము. అనగా ధర్మేతర మయిన భావము.

ఈ పరస్పరావలోకములు నొకరిభావము లొకరు జదివికొనుటలు నిమేషకాలములో జరిగినవి. దుస్సలా కాళిం దులలో వారి జీవసంపుటి గతలక్షణములను బట్టి యొక భేద మున్నది. దుస్సలా జీవలక్షణముయొక్క స్వరూపము పూర్వ మే చెప్పఁబడినది. ఇంకఁ గాళిందియొక్క జీవలక్షణ మెట్టిదో

యామె మాటలను బట్టి తెలియవలయును. కాళింది యిట్లన్నది. 'తమ పేరు దుస్సలాదేవియా? ఈ పేరెచ్చటనో విన్నట్లున్నది. తమరి దర్శనమెప్పుడును జేయలేదు. నాకుఁ జిన్నవార్త పెట్టినచో నేను వచ్చుట కనుజ్ఞయిచ్చెడిదానను. తమరు వృద్ధులు. లోకానుభవము కలవారివలెఁ గన్పించుచున్నారు. గొప్పయింటియందుఁ బుట్టినట్లున్నారు. మీ లక్షణములోననే యధికారము గలిగిన స్థితి పరులచేత గౌరవింపఁబడుట యలవాటయిన లక్షణము కనిపించుచున్నది. తమరికి నావలన నేదయినఁబని కావలసినచో నాకుఁ జేతనైనంతవఱకు జేసిపెట్టెదను' అనెను. దుస్సల తికమకపడెను. ఆమె మాటలలో వ్యంగ్యమున్నది. ఆక్షేపమున్నది. గడుసుదనమున్నది. చివఱిమాటలు నీవేదైన నన్నడుగుము. చేసి పెట్టెదననుచున్నవి. అంతకుమించి నీకు నాకు సంబంధము లేదట్లున్నవి. ఆమెకుఁ దాను దనసిద్ధాంతమును జెప్పుటకుఁ గాని తాను మాటాడుటలో నామెపై నొక యధికారము నెఱపుటకుఁ గాని వీలులేనట్లు కనిపించుచున్నది. దుస్సలయనుభవములోనున్న విషయమేమనగా నామెను జూచి యందఱు నమస్కరింతురు. క్రొత్తవారిని దనవద్దకు రప్పించక పూర్వము తనకుఁ బూర్వమున్న శిష్యులచేత వారికి దన గొప్పదనము చెప్పించి వారు వచ్చెడివేళకే తాను గురుపీఠమవలంబింపఁదగిన స్థితిలో దానుండును. ఇచ్చటఁ గూడ నదియే ప్రయత్నము చేసెను, కాని యట్లు జరుగలేదు. ఏమి జరిగెనో తెలియదు. ఆ తలివారికిఁ దన ప్రతిభ మున్నె చెప్పఁబడియున్నచో దనయధికారము తొలుతటి నుండియేసాగును.

లేని చో నదియొక క్లిష్టమయిన స్థితి. తన ప్రతిభాసమున్మేషము చేత వారినిలొంగఁదీసి యప్పుడధికారము నారంభించవలయును. ప్రత్యక్షములో నెదిరి వారిని లొంగదీయుట చాలఁగష్టము యిన పని. పరోక్షమున వారిని సుముఖులను జేసి ప్రత్యక్షము నందుఁ దమయధికారమును జెల్లించవచ్చును. ఇది సర్వమానవ సృష్టియందు సహజముగా నున్నయొక లోపము. ఈ మానవహృదయాంతర్గత దోషమును రాజనీతిశాస్త్రమును, గామశాస్త్రమును గుర్తించినవి. రాజనీతిశాస్త్రములో సామ దాన భేదదండములున్న నాల్గుపాయములలో సామదాన భేదములు మానవహృదయమును బరోక్షములో లొంగఁదీయు ప్రయత్నములు. విషయమును విషయముగా గాకుండ దత్పార్శ్వస్థలమున నుండి దానినిఁ దాడించుట. యెదురుగా వచ్చిన దెబ్బ నెవఁడయినఁ బ్రతిఘటించును. ప్రక్కగా వచ్చినదానిని దట్టుకొనుట కష్టము. వ్యవహారమున్నది. ఏ వ్యవహారము యొక్క స్వరూపమయినను నాల్గు మాటలలో జెప్పివేయవచ్చును. సామోపాయమేమిచేయును. ఉదాహరణలు చెప్పును. సామ్యములు చూపించును. వానియందితర దేశములయందు గలిగిన ఫలితములను జెప్పును. మనసులోని విషయమునుండి పెడద్రోక్కించును. సూటిగానున్న వ్యవహారమును మఱియొక దృష్టినుండి చూపించును. అనఁగా నే వ్యవహారమును దానియంతట నది వ్యవహారము కాదని యర్థము. సర్వ విషయములును దదితర బహు విషయముల చేత వికార్యమాణములై యొప్పును. సామదానభేధములీ వికార్యమాణతాదశలోనివి. ఇట్లే కామ శాస్త్రముకూడ. దూతి

చేత ఫలించెడి నాయికానాయకుల సంయోగము ప్రత్యక్షము నందు ఫలించదు. ప్రత్యక్షమునందది యెప్పుడును బాసం గదు. మఱియు నేను నిన్నుఁ బ్రేమించుచున్నా నన్నదాని కిని మఱి నడుమనెవ్వతెయోవచ్చి వాఁడు నిన్నుఁ బ్రేమిం చుచున్నాఁడన్న దానికి, నెంతో భేదముకలదు. మానవప్ర కృతిలో సహజముగాఁ బ్రత్యక్షమయిన దానియందు నిరాద రణము, పరోక్షమయిన దానియందాశ, సర్వమానవకో టియు నాశమీాఁద బ్రతుకుచున్నది. ఆశయనగా భావికాల మునకు సంబంధించినది. అనఁగా బరోక్షము.

ఈ మానవహృదయాంతర్గత సహజదోషము నవలం బించి డాంబికులు తమవద్దకు రప్పించకమునుపే యాగంతు కుల యెదలలో శిష్యులద్వారా తమయందలి గౌరవబీజములను నాటింతురు. దుస్సల కాళింది విషయమున నీప్రయోగమును జేయుదమనుకొనెను. ఆమెకుఁ దెలియకుండ నాప్రయోగము విఘటితమైనది. ఎట్లు విఘటితమయినదో నీలతో నేకాంత ముగ మాటాడినఁగాని తెలియదు. దుస్సల యిపుడు రెండు శృంగములమీాద నధిరోహించియున్నది. ఈరెండు సమ స్యలు కలిసియున్నవి. తన ప్రయోగమెట్లు విఘటితమైనదో తెలిసికొన్నచో గాళిందియందుఁ దనప్రతిభాముద్ర వేయుట సులభముగా నుండును. లేనిచో నిది కష్టమగును. ఈ రెండు నేకకాలమునందు సంఘటించెను. ఇది సర్వదా దుర్జనులు జీవితములో ననుభవించునట్టిది ఇది తప్పునట్లులేదు. కాళిందికి వెంటనే యెదో సమాధానము చెప్పవలయును. మనోలక్షణ

మెట్టిదనగా మనస్సులోని యూహలు గాలికే గదలాడిన తటాకములోని నీటితరంగములవలె వచ్చుచుండును. ప్రతి తరంగ మనంత మాశిశరపృషత్పరిషత్సహారచాత మయినది. కలిపితరంగము. ఆ తరంగముయొక్క కదలిక లిప్తకాలములో జరుగును.

దుస్సల యిట్లన్నది! ఔనమ్మా! మేమువచ్చి యారేండ్లయినది. నాకొడుకునకు రాజదర్శనమే యగుటలేదు. అతఁడెన్నోసార్లు మీాదర్శనము నన్నుచేయుమని యడిగెను. రాజదర్శనము ప్రత్యక్షముగాఁ జేయుటసాధ్యముకాదు. ఎవరిచేతనో చెప్పించికొనవలయును. మానవబుద్ధి కిదియొక లక్షణము. ఒక యధికారితో నొకపని యున్నదనగా మానవుని బుద్ధి వెంటనే యెవనిచేతఁ జెప్పించినచో నీపనిజరుగునని విచారించును. గాని తానుబోయి యెదుటబడి యడుగుదమనుకొనడు. ఇది యెదో మానవబుద్ధి. గతమయిన నిశ్చితమయిన దోషముగాఁ గనిపించుచున్నది. నేను బ్రత్యక్షముగా మీావద్దకు రావచ్చును. నాకొడుకునకు మహారాజుగారు దర్శనము నీయకుండ నెలయించినట్లే నాప్రయత్నము మీాయందు వృథాయగునేమో యని నాకు భయము. ఈ నీలాదేవిని నేనెఱుఁగుదును. ఈమె నెఱుఁగుదుననగా నిజముగా నేనెఱుఁగను. ఈమెనుగన్న తల్లిదండ్రులు శంబరదీవి నివాసులు. అచట నేనును నాకొడుకును రెండేండ్లు నివసించితిమి. ఈమె తల్లిదండ్రులకును మాకును చాలబరిచయము గలదు. ఆ సంబంధమును బురస్కరించికొని యీామె మేడకు వచ్చితిని. మిమ్ము్మను నేను గలిసికొనునట్లు చేయించుమని యీా

మెను నడుగుచుంటిని. ఈనాటికి మిమ్ముఁజూచుట కలిగినది.'
కాళింది ప్రతిమాటను జాగ్రత్తగాఁ బరిశీలించుచుండెను.
నీల తన తోడికోడలు. ఆమెయు రాణివంటిదే. ఆమె విష
యమునఁ బ్రయోగించిన యేమాటయందును దుస్సల
గౌరవమును జూపించుటలేదు. తనయందును గౌరవమును
జూపుటలేదు. అంతకంటెఁ గాళిందియొక్క నెత్తురులో
నున్న రాచబిడ్డతనమును మరొకదానియందామె బుద్ధిని
లగించెను. శంబరదీవియందు వీరు పూర్వము రెండేండ్లు నివ
సించిరి. అది నిజమేనా? దానిని గనుగొనవలయును. కాళింది
కనులలో నెదో యొక లిప్తసహస్రైక దేశభాగమున నొక
తీక్ష్ణత భాసించిన లక్షణము దుస్సల చూచెనుగాని యది
యెందుకో దుస్సల గమనించలేదు. నీలకుఁదనకు గల పరిచ
యము నిట్లుగా సమర్థించవచ్చునని తనకొడుకు చెప్పినమాట
మనసులోనాడి ప్రస్తుతసందర్భాపతితమయి దుస్సలనోటివెంట
నామాటలు చెప్పెను. ఆమె జయద్రథునికంట గడుసుది.
తాను మాటాడుచున్నది యొక రాజపురుషునితో నైనచో
నొక రాజకీయవేత్తతో నైనచో నామె యీ సంగతిని
జెప్పెడిది కాదు. తానొక యువరాజ్ఞితో మాటాడుచున్నది.
ఆమె యెంత వివేకివతియైనను దీనిలోని యాథార్థ్యాయాథా
ర్థ్యములు బరిశీలించు పనిపెట్టుకొనదు. రాజకీయ వ్యవహా
రములలో మెలఁగెడి వ్యక్తియైననే యట్టి పరిశీలనమునందు
శ్రద్ధవహించును. కనుక దుస్సల కాళింది కనులలోనికివచ్చిన
తీక్ష్ణరేఖకుఁ దన కొడుకు చెప్పిన యబద్ధమును దాననువదిం
చుటకు సంబంధము కలుపలేదు.

కాళింది యిట్లనెను. 'ఇది నా చేతిలోని పనికాదు. నేను యువరాజు గారితో మనవిచేసెదను. మహారాజుగారితోఁ జెప్పించెదము. ఆయిన నాఁడేండ్లనుండి పట్టి దినవెచ్చమిచ్చి మిమ్మిచ్చటనుంచుట యూరకే విన్నవారికే న్యాయమనిపించదు. తమరి కుమారుని పేరేమి?

దుస్సల- జయద్రథుఁడు.

వెంటనే కాళింది మనస్సులో దుస్సలయు జయద్రథుఁడును వీరుతల్లికొడుకులేమిట యనిపించెను. వినయశర్మ భారతకథను జెప్పుచుండగా దానుగొన్నిసార్లు వినెను. ఒకసారి వీరికి సబంధించిన కథ వినెను. ఈ నామములేమిటి? ఈ విపరీత సంబంధమేమిటి? కాళింది మనసులో నీయూహ చెక్కిళ్ళకు కనుబొమలకు గంటివెలుగులకు సంబంధములేకుండ జరిగినది. కాళింది యిట్లన్నది, "ఔను, నీలమ్మగారు చెప్పినది. మఱచిపోయితిని. వారికేవిద్యలోఁ బ్రావీణ్యము?

దుస్సల- "అతఁనికి బలు విద్యలు తెలియును. ప్రధానముగా ఖడ్గవిద్య నెఱుఁగును. దానిని బహు దేశములందభ్యసించినవాఁడు. ఒక దళాధిపతిగా నతని నియమింపవచ్చును. లేదా రాజనీతియందు నిపుణుడు. ఒక యుపమంత్రిగా నియమింపవచ్చును. మహారాజుగారిదయ. వారతనిని నేకార్యమునందు నియుక్తునిఁ చేసినను నాబిడ్డ సమర్థముగా నిర్వహించఁగలఁడని నాకు ధైర్యము కలదు."

కాళింది- దళాధిపతిగనే వేయవచ్చును. మామఱఁది గారున్నారు. విజయసింహులు. ఖడ్గవిద్యయందలి మీ కుమారుని సామర్థ్యము వారికిఁ దెలియచేసినచో నింతకష్టమేయుం

డెడిదికాదు." వారే తండ్రిగారితో మనవిచేసెడివారు. పూర్వమెప్పుడో యుద్యోగమిప్పించెడివారు" అన్నది. కాని కాళింది మనస్సులో నింకొక యూహవచ్చెను. ఆతేండ్ల నుండి యనేక ఖడ్గవిద్యా ప్రదర్శనములు జరిగెను. దేనిలో నను నితఁడు పాల్గొనలేదేమి? పాల్గొన్నచో నంతటివిద్యా ప్రవీణుడయినచో నతనిపేరందఱును జెప్పికొనెడివారే. తన కును దెలిసెడిదే. ఏదోరాజబంధునయినను నిరంకుశునిఁదాను వినలేదా? అతనిని ప్రదర్శనములందు జూడలేదా? హరివర్మ జయసింహుఁడు రాథంతరి మొదలయిన ఖడ్గవిద్యానిపుణుల పేర్లు రాజ్యమునందందఱకును దెలియును. కోటలో నందఱి కును దెలియును. అంతఃపుర స్త్రీలు కూడ వారి విద్యాప్రద ర్శనములు జూచియేయున్నారు. ఈమె కుమారుఁడు దళాధి పతిగా నుండుటకిష్టము లేనివాఁడు కావలయును. తన విద్య ప్రదర్శించినచో దనకిష్టములేని యుద్యోగములో నిఱికికొనిన వాఁడగును. ఆతనికి రాజనీతికి సంబంధించు యుద్యోగము కావలయును. ఒక యుద్యోగమును వాంఛించి యాయేండ్లు ధర్మశాలలో నుండి యూఱక తినుచు నెవరుందురు? ఆ యు ద్యోగమువలన నధికప్రయోజన మెదో సాధింపవలయునను వారుందురు. వారికి జీవనము గడుపుట ముఖ్యముకాదు. ఆ ప్రయోజనమును సాధించుట ముఖ్యము. అంతటి ప్రయోజ నమేమయి యుండును!

కాళిందిచేయు నీ యాలోచన దుస్సలకిదమిత్థమని తెలియలేను. గాని తన కనుకూలముగా లేని యూహలామెకు వచ్చినవని తెలియును. కాళిందికిఁ దాను దేనినో వెదకుచు

న్నది. ఆ వెదకుచున్నది యిదియేమో యనిపించెను. ఈ జయద్రధుఁడెవరు? తనభర్త యెవనివశమునవో పడినాఁడని పూర్వమే తాను నిర్ధారణ చేసికొనినది. అతఁడితఁడా? నీల తన కెంత యుపకారము చేసినది. అట్లయినచో దుస్సల నీల నొక మోహవాగురలోఁ దగుల్కొలిపినది. నీల యమాయకురాలు. ఆనందవీథిలోని యొక నీహారవేశము, నలచరిత్ర లోని రామణీయకమునకు నిముసములో వశమయి పోయిన యకృత్రిమమయిన, రమణీయమైన, స్వభావము కలది. నీల పెంపకము సరిగాలేనిదని తానిదివఱకు విన్నది. దానికిఁ దార కాణ కనిపించెను. ఇందులోని యంశములెంతవఱకు నిజమో పరిశీలించి కనుగొనవలయును. ఇచటినుండి వెడలిపోవల యును. దుస్సల కనుమానము కలుగకుండఁ దానుమరియాదయు వినయము నభినయించవలయును. వెంటనే వినయ శర్మకుఁ గబురంపింపవలయును. దుస్సలా జయద్రధుఁలిచ్చటికి రాకముందు శంబరదీవియందు రెండేండ్లుండుట నిజమేనా?



ధాన్యకటకమునకు రెండుక్రోశముల దిగువనొక గ్రామ మున్నది. ఆ గ్రామమునందెక్కువ పల్లెవారు. ఆ గ్రామము నకు సూటిగాఁ కృష్ణానదిని దాటిపోయినిచో నవియన్నియు గొండలు, పెద్దమహారణ్యము. ఆ కాలములో ననఁగా నేటికి

నైదువేల యేండ్లక్రిందటఁ జెన్పఁబడినది గదా? కృష్ణానది యింద్రకీలాద్రి కెగువ భాగమున మహాసముద్రము. యింద్ర కీలాద్రి దగ్గఱ రెండు కొండల నడుమ నొక పెద్దకాలువకు మించినవెడల్పుగల ప్రవాహము కృష్ణానదికిలేదు. అందుచేతఁ గృష్ణానది యింద్రకీలాద్రి మొదలు వేదాద్రివఱకు నన్నిఋతువులయందు నిండి మహాతటాకమువలెఁ గొన్నిచోట్లఁ బెద్ద మడుగువలె మొత్తముమీఁద నొక మహాసముద్రమువలె నుండెడిది. నాఁడు కృష్ణానదీతరణము సుసాధ్యమయిన పనిగాదు. వర్ష ఋతువునందుఁ బొంగివచ్చి సమీప దేశముల నెన్నింటినో ముంచుచుండెడిది. తక్కిన ఋతువులయందు బ్రహ్మాండమయిన జలసముద్రముగా నుండెడిది. పైనుండి ప్రవాహము రాకపోయినను మహాసముద్రమువలె నుండును గనుక నే మాత్రము మబ్బుపట్టినను గాలి వీచినను నది భయంకరముగా నుండును. దుస్తార్యముగా నుండును. అందుకనియే నాఁడు వేదాద్రిమొదలింద్రకీలాద్రి వఱకు గృష్ణకిరుదెసలఁ బదిపల్లె వాండ్ర పల్లియలుండెడివి. తరువాత రెండువేల యేండ్లకు ఇంద్రకీలాద్రి వద్ద రెండు కొండలనడుమఁ గృష్ణానదికి వెడ ల్పెక్కువయ్యెను. వేల సంవత్సరములమీఁదఁ గృష్ణానది రెండు కొండల నటునిటు కోసెను. కోసి ప్రవాహము విజృంభించి యెగువనీరు నిలుచుట మానివేసెను. దిగువ సముద్రమువఱకు నదీ ప్రవాహము వెడల్పయి విజృంభించెను. రెండు కొండలను గోసి ప్రవాహము పెద్దదగుచున్నకొలఁది ధాన్యకటకము వఱకు నెగువ వేదాద్రి వఱకు సముద్రమువలె నుండిన మహానది వెడల్పు తక్కువయి యటునిటు గ్రామములు

బలియఁజొచ్చెను. నడుమ నిసుక లంకలువేయుట మొదలు పెట్టెను. వేసంగిలోని ప్రవాహము కుదించికొని కొన్నిచోట్ల నొద్ద కాలువగా మాత్రమే ప్రవహించు చుండును. ఇరుదెసల సికతాస్థలము లెక్కువయ్యెను. ఈ కథాకాలమునాటికి రెండు మూఁడు వేలయేండ్లు గడచిన నాటికింద్రకీలాద్రి దగ్గఱ కృష్ణానదికి నేఁడున్న నెడల్పు కలిగెను. సముద్రము వఱకుఁ గృష్ణలోతుగా నిత్యము మహాప్రవాహముగా నుండెడిది. ఆ నాఁడు కృష్ణానదిలో నావలు తిరుగుచుండుటయు, నాంధ్రులు తదితర ద్వీపములతో నావికా సంబంధము కలిగియుండుటయు జరిగెను. ఈ కథాకాలమునాటికిఁ గలియుగములో సుమారు నూఱేండ్లకు మించిగడువలేదు. ఆంధ్రరాజులు మగధమును బాలించిన నాటికిఁ గలిలో రెండువేల మూఁడువందల సంవత్సరములు గడచెను. ఆంధ్రులు సుమారైదువందల యేండ్లు మగధాధిపతులయి సర్వభారత సామ్రాజ్యమున కధిపతులయి యుండిరి.

ఇప్పటి కృష్ణవేఱు. ఆంధ్రరాజులనాటి కృష్ణవేఱు. ఈ కథాకాలమునాటి కృష్ణానదివేఱు. ఈ కథాకాలమునాఁటి కిని నేటికిని సరిగా సగము కాలములో నాంధ్రసామ్రాజ్య ముండెను. కలియుగము నేటికి నైదువేలయిరువదియేండ్లయి నది. ఆంధ్రసామ్రాజ్యమునాటికి రెండువేలమూఁడు వందల యేండ్లు గడచినది. ఏ నాఁడు యుధిష్ఠిరుడు దివంగతుఁడ య్యెనో యానాటినుండి యుధిష్ఠిర శకము ప్రారంభమ య్యెను. కురుపాండవయుద్ధము పదునెన్మిదిదినములు జరి గెను. యుద్ధమయిపోయిన తరువాత యుధిష్ఠిరుఁడు సర్వభా

రత సామ్రాజ్యాధిపతిగా నభిషిక్తుఁ డయ్యెను. ఆయన ముప్పదియాఱేండ్లు రాజ్యముచేసెను. ఆయన రాజ్యము చేయుచుండగా ముప్పదియేడవయేట భగవంతుడైన శ్రీకృష్ణుఁడు దివంగతుడయ్యెను. ఆ నాఁడు సప్తర్షిమండలము మఖా నక్షత్రమును వదలిపెట్టెను. మేషరాశియందు సప్త గ్రహములుండెను. ఇది చాల విధ్వారమయిన కాలము. ఏడు గ్రహము లొక్కరాశి యందుండుట కాలముయొక్క శుభలక్షణము కాదు. ప్రమాదిసంవత్సరము చైత్రమాసము శుక్లపక్షప్రతిపత్తు ఆఱుగడియల ముప్పదిలిప్తలకు నా నాఁడు కలియుగము ప్రవేశించెను. నాటినుండి భారతదేశకార్తాంతికులు కలియుగము యొక్క లెక్క ప్రారంభించిరి. ఇది (పుస్తకము వ్రాసిన యేఁడు) వికారినామ సంవత్సరము. ఇప్పటికిఁ గలిప్రవేశించి సరిగా నైదువేలయిరువది సంవత్సరములు గడచినవి. శ్రీకృష్ణుఁడు స్వర్గగుడయిన తరువాతఁ గలి యిరువదియాఱేండ్లు గడచినది. పూర్వము సప్తర్షిమండలము మాఘ నక్షత్రములయందుండెడిది, అప్పుడాశ్లేష యందు బ్రవేశించెను. సప్తర్షిమండలమొక్కొక్క నక్షత్రమునందు వందయేండ్లుండును. ఆ మండలముయొక్క గమనము వెనుక వెనుకగా నుండును, మఖానక్షత్రము వెనుకటి నక్షత్రమాశ్లేష. వందయేండ్లాశ్లేష నక్షత్రమునందుండి యాశ్లేష నుండి పుష్యమికిఁ బోవును. ఇది పశ్చాద్గమనము. సప్తర్షిమండలము పూర్తిగా నిరువదియేడు నక్షత్రములను దిరిగివచ్చునప్పటికి రెండు వేల యేడువందల సంవత్సరములగును. శ్రీకృష్ణదేవుఁడు దివంగతుఁడైన యా నాఁడే కలిప్రవేశించినది మొదలు నేటివఱకీ

సప్తర్షి మండలముయొక్క నక్షత్రములను దిరుగుట యొకసారి పూర్తియయ్యెను. రెండవ తిరుగుటలో నింక మూఁడువందల నలుబది సంవత్సరములు గడచినచో రెండవ పరిభ్రమణము పూర్తియగును. ఆ నాటికి మరల సప్తర్షి మండలము మాఘ నక్షత్రమునందుండును. సప్తర్షిమండలమున యొక మాఘనక్షత్రము నందలియునికిలో తొబ్బదినాలుఁగేండ్లు గడచును. ఇది కలియుగపులెక్క. ఈ కలియుగము ప్రవేశించిన తరువాత నిరువదియాఱేండ్లకుయుధిష్ఠిరుఁడు స్వర్గాధిరోహణముచేసెను. యుధిష్ఠిరశకమా నాఁడారంభించినది. దీనికే లౌకికశకమనియు సప్తర్షిశకమనియుఁ బేరు. ఈ శకముయొక్క లెక్క కాశ్మీరదేశమునందు మొదలుఁబెట్టబఁడెను. దానికిఁ 'గాశ్మీరాబ్ద'మని కూడఁబేరు. అనఁగా యుధిష్ఠిర, లౌకిక, సప్తర్షి, కాశ్మీరాబ్దములు అనఁగా నన్నియునొకటే. కలిలో నిరువదియాఱేండ్లు గడచిన తరువాత నీ శకము ప్రారంభమయ్యెను. ఈ శకము ప్రారంభమయిన తరువాత రెండువేల మూఁడు వందలయైదు సంవత్సరములకు నాంధ్రుల సామ్రాజ్యము వచ్చెను. కలిప్రవేశించిన నాటినుండి రెండువేలమూఁడు వందల ముప్పదియైదు సంవత్సరములు గడచిన తరువాత నాంధ్రసామ్రాజ్యము వెలసినదని యర్థము.

ఈ ప్రస్తుత కథాకాలము నాటికిఁ గలి నెన్నియేండ్లు గడచిన వనఁగా గలిలో యుధిష్ఠిరుఁడు బ్రదికినది యిరువదియాఱేండ్లు కలి ప్రవేశించినప్పుడు పరీక్షిత్తునకుఁ బట్టాభిషేకము జరిగెను. పరీక్షిత్తునకు రాజ్యమప్పగించి ధర్మరాజు తన సోదరులతో వానప్రస్థాశ్రమమునకు వెడలిపోయెను. అప్ప

టికిఁ బరీక్షిన్మహారాజునకు ముప్పదియాఱేండ్లు. ఆయన యరు వదియేండ్లు రాజ్యము చేసెను. ఆయన సర్పదష్టుఁడై చనిపో యెను. జనమేజయుఁడు రాజ్యమునకు వచ్చెను. జనమేజ యుఁడు రాజ్యమునకువచ్చి యేఁబదిరెండు సంవత్సరముల య్యెను. నాటికి సరిగా గలిప్రవేశించి నూటపదుమూఁడు సంవ త్సరము లయినది.

ధాన్యకటకమునకు దిగువ రెండుక్రోశములమేర నొక పల్లియ యున్నదని చెప్పబడినదిగదా! దానిపేరు 'అగ్నిగ్రా మము'. అచ్చటనున్న ప్రజలు పల్లెవారు. కాని వారందరు తాము క్షత్రియులమని చెప్పుకొందురు. ఈ వంశమువారు కలిలో సుమారు నాల్గువేల యేండ్లు గడచిన తరువాత రాజ్యములు గడించి భారతదేశములో గొన్ని మండలము లేలిరి. కాని నాటికిఁ బల్లెవారే. వారిలోఁ గొందరు బలిసి రాజ్యములు చేయవచ్చును. తక్కినవారందరిది నావికా వృత్తియే. తరువాత రెండువేల యేండ్లకు నాంధ్రసామ్రా జ్యము వెలసిననాటికి గృష్ణానది వెడల్పెక్కువై నావలు సముద్రము వరకు నడచిననాటికిఁ బరద్వీపములతో నాంధ్ర సామ్రాజ్యమునకు సంబంధము విజృంభించిన నాటికీవంశీ యులు పరద్వీపగత విలక్షణసంప్రదాయ సంపర్కముచేతఁ జాల మారిపోయిరి. కాని కల్యాదిలో నంత మారిపోలేదు. వృత్తి, నదులను దరింపజేయుటయు, మత్స్య సంగ్రహణము మొదలయినవైనను, నాచారములు కొంత క్షత్రియవంశాను కూలములుగా నుండెడివి. వారు ప్రధానముగా నగ్ని నుపాసిం చెడివారు. అందుచేత నగ్నివంశీయులని పేరువచ్చినది. ఆ

నాఁడు వారిదొక విలక్షణమయిన మతముగా నుండెడిది. ఆనాఁడు బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులును యజ్ఞయాగాది క్రతువులు చేసెడివారు. చాలమంది నిత్యాగ్నిహోత్రులు. వారు నిత్యాగ్నిహోత్రులైనను వారియొక్క యగ్నియుపాసనా లక్షణము వేరు. ఈ యగ్నివంశీయుల యుపాసనాలక్షణము వేరు. చాతుర్వర్ణ్యమువారు నగ్ని నుపాసింతురు. వారి కగ్ని నిత్యోపాసనావిషయిక దైవము. పరదైవము కాదు. చాతుర్వర్ణ్యమువారికి నారాయణుఁడు పరదైవము. అగ్ని యుపాసనాభాగములోనిది. ఉపాసన లనేకవిధములు. ఓంకారోపాసనము, అక్షిపురుషోపాసనము అగ్న్యుపాసనము మొదలయినవి, కాని యనంతకాలము గడచుచున్న కొలఁది మానవుల బుద్ధులు మారిపోవు చుండును. పరమేశ్వర నిర్మితమయిన చాతుర్వర్ణ్య వ్యవస్థనుండి బుద్ధులు తొలఁగిపోయి మ్లేచ్ఛులై జనులు శక యవన బర్బర దరదాది దేశములుపోయిరి. అచ్చటినుండి మరియును దూరముబోయి నేటికి గ్రీస్ అని పిలువఁబడుచున్న అయోనియా దేశము నాక్రమించిరి. యవనశబ్దమే అయోనియా యయ్యెను. సర్వసృష్టికి సర్వవిషయములకు భ్రంశమనునది లక్షణము. శరీరము యౌవనవేళవరకు వృద్ధిపొందును. అచ్చటనుండి జీర్ణమగుట మొదలు పెట్టును. పుట్టుట, పెరుగుట, జీర్ణమగుట ఇది యొక్క శరీర లక్షణమేకాదు, సర్వసృష్టి లక్షణము. సృష్టియందున్న సర్వవిషయములకిదియే లక్షణము. సృష్ట్యారంభమయినది, కృతయుగాంతమువరకు పెరిగినది, అచ్చటనుండి యంశాంశయందుఁ దరుగుట ప్రారంభించినది.

కలియుగముయొక్క తుదినాటికి సంపూర్ణముగా నశించును. ఇది కాలముయొక్క పుట్టుటయుఁ బెరుగుటయు, జచ్చుటయు. ఇట్లే జాతులు వృద్ధిపొందును. ఒక యున్నతస్థితికి వచ్చును. జీర్ణదశ ప్రారంభమగును. సామ్రాజ్యముల స్థితియు నిట్టిదే. భిన్న భాషలయొక్క స్థితియు నిట్టిదే. ఇట్టి స్థితి యెఱుఁగని భాష యొక్కటే. అది సంస్కృతము. అందుచేత దాని కమరభాష యనిపేరు. జగత్తునందలి తదితరములైన సర్వభాషలును సంస్కృతముయొక్క యపభ్రంశములు. మ్లేచ్ఛులు భారతదేశ వాయవ్య దిశగాఁబోయి సంస్కృత శబ్దములనువారి యిష్టము వచ్చినట్లుచ్చరింప నారంభింపగాఁ గాలాంతరమున నవి వేరు భాషలుగా భాసించెను. నూట తొంబదియాఱుకోట్ల సంవత్సరములలోఁ బూర్వయుగములు వదలిపెట్టఁగాఁ బ్రస్తుత మహాయుగమారంభించి ముప్పది తొమ్మిదిలక్షల యేఁబదియెనిమిది వేల సంవత్సరములు గడచినవి. ఒక మహాయుగముయొక్క ప్రమాణము నలుబదిమూఁడు లక్షలయిరువదివేల వత్సరములు. సృష్ట్యారంభమునుండి జరిగిన సుమాఱు నూటయెనుబది యాఱుకోట్ల సంవత్సరములలో నిట్టివి కొన్ని మహాయుగములు గడచెను. ఆ మహాయుగములలో గూడ మానవులుండిరి. అప్పుడును నేటివలెనే భారతదేశమునుండి యిట్టి వర్ణవ్యవస్థ గిట్టక లేచిపోయి మ్లేచ్ఛులై యితరదేశముల నాక్రమించినవారుండిరి. యుగయుగాంతములందుఁ బ్రళయములు వచ్చును. కొన్ని భూ భాగములంతరించును. కొన్నిజాతులు నశించును. కొన్ని భాషలు లుప్తమగును. ఈ ప్రళయములలో సృష్ట్యాదియందలి ప్రథమ మహాయుగమునందలి

మ్లేచ్ఛులును గొందరు మిగిలినచో మిగిలియుండవచ్చును. అందుచేత మ్లేచ్ఛులు భారతీయులతోఁ బాటు సృష్ట్యారంభ మైన తరువాతఁ బదునెనిమిదిలక్షల సంవత్సరములనుంచియు నుండియేయున్నారని చెప్పవచ్చును. కాని యుగయుగాంతము నందు నడుమ నడుమ జరుగు ప్రళయములచేత నెన్నియో మ్లేచ్ఛదేశములు భూకంపములచేత, సముద్రములు పొంగి వచ్చుటచేత, మంచుకొండలు వచ్చి యాక్రమించుటచేత మహాయుద్ధములచేత నశించి పోవుచుండును. మిగిలిన మ్లేచ్ఛులను భగవంతుడు కల్క్యవతారమును బూని నశింపజేయును. మరల కృతయుగము ప్రారంభించును. ఇది సృష్టిక్రమము. దీనికిని వందయేండ్లో రెండువందల యేండ్లో బ్రదుకుచున్న మానవులలో నొకజాతి తాత్కాలికముగా ధనవంతమై యధికారవంతమయి నిర్మించిన లెక్కకట్టుచున్న యలుపపు టూహాలకును సంబంధములేదు. ధనముచేరి నంతనే పాండిత్యము లేకున్నను రామయ్య రామశాస్త్రి యగును. భీమన్న భీమవర్మ యగును. రామిగాఁడు రామా రావుపంతులగును. ఇవి బహు స్వల్పకాలికములైన విషయ ములు అనంతకాలము, పరమేశ్వరుఁడు మొదలయిన వాని యందు విశ్వాసము లేక ధనాహంకారము, వర్ణాహంకారము, పాండిత్యాహంకారము, పరాక్రమాహంకారము, విజయా హంకారము దేశాహంకారము, బహువిధాహంకారముల చేత ప్రలోభితమైన జాతి దుష్టమై దుష్టసిద్ధాంతములను నిర్మించును. వానికిఁగొంత కాలము చలామణి జరుగును. మోహితులు తత్సిద్ధాంతముల నాశ్రయింతురు.

ఇది యంతయు నెందుకుఁ జెప్పవలసి వచ్చినదనఁగా నా యగ్నిగ్రామవాసు లగ్నియే పరదైవతమని భావింతురు. వారికి నారాయణుఁడు లేఁడు. కొందఱకు వాయువే పరదైవము. కొందఱి కగ్నిపర దైవతము. కొందఱకు మృత్పదార్థము పరదైవతము కావచ్చును. వారిలో నీ పల్లెవాంద్రు నేతాదృశులు. ఈ రీతిగా నారాయణుఁడు సాక్షాత్పరదైవతమన్న మతములోననే భిన్నమతస్థులుకలరు. నారాయణుఁడు వైకుంఠమునందు న్నాఁడు. ఆయన శంకచక్ర గధాద్యాయుధములు గలవాఁడు. ఈ దృశ్యమూర్తిమంతమైన నారాయణ దైవము నిత్యమనువారు కొందఱు. మూర్తి యనినంతనే ద్రవ్యవంతము. అది పదార్థము. పదార్థమునకు నిత్యత్వములేదు. ద్రవ్యము నశించును. దానితో మూర్తియు నశించును. కనుక మూర్తిమంతమయిన దైవమునకంటె నమూర్తమయిన యొక శక్తి యున్నది. అది దైవము. అదియే బ్రహ్మ పదార్థము. కాని శక్తిత ప్రధమావర్తమైన ఈ మూర్తికిని ననావర్తమైన యాబ్రహ్మకును భేధములేదని కొందఱు, ఈ రెండుశాఖలవారు భ్రష్టులుకారు. తదితరులు కొంత కొంత భ్రష్టులు. మ్లేచ్ఛులు పూర్తిగా భ్రష్టులు. భ్రష్టత్వము మ్లేచ్ఛభావసంబంధి. అగ్నియే పరమదైవముగా నుపాసించు వారిలో గొంతమ్లేచ్ఛత్వమున్నది. అందుచేత నా పల్లియలోనివారు జయద్రధుని సిద్ధాంతముకనుకూలురు. జయద్రధుఁడీ రాజ్యమునకు ధూను కేతువుగా వ్యవహరించుచున్నాఁడని లీలగా వారికిఁ దెలియును. ఆ యూరిలో నొక పెద్దయింటిలో భూగర్భగృహమున్నది. దానియందు జయ

ద్రధుని యనుయాయులు సమావేశమగుచుందురు. సామాన్య ముగా నాసమావేశము మబ్బులుపట్టిన రాత్రులయందు హోరున గాలివీచు రాత్రులియందు రాజధానిలో మహోత్స వములు జరుగురాత్రులందు రాజధానికి దూరముగానున్న గొప్ప రాజవంశీయుని యింటిలో నేపెండ్లియో జరిగి రాజ ధానిలోని యందఱును దదుత్సవమునకు బోయిన నాఁటి రాత్రులందు నీ సమావేశములు జరుగుచుండును. ఒక వృద్ధ మంత్రి చనిపోవును. ఒక గొప్ప సేనాపతి చనిపోవును. యువ రాజునకు గొడుకుపుట్టును. రాజకుమారునకు వివాహమగును. కోటలో నేవియో పెద్ద ప్రదర్శనములు జరుగుచుండును. ఆ నాఁడీ సమావేశము జరుగును. లేదా మూన్నాళ్ళు, నాల్గు నాళ్ళు ముసురుపట్టి దేశమంతయుఁ జికాకుగానుండును. గవాక్షమును దెఱచుటకే మనుష్యులు తల్లడిల్లిపోవుచుం దురు. ఆ వైపునుండి జల్లువచ్చుచున్నది. ఈదురు గాలితో వచ్చిన యావానజడికి గవాక్షపుఁ దలుపు మూ యులోపల దాల్చినయంగీ తడిసిపోయి మానిసివిహ్వాలిం చును. అట్టి రాత్రులందీసమావేశములు జరుగును. అట్టిరా త్రులందీ సమావేశములు దీర్ఘకాలము జరుగును. కొన్ని ప్రధాన కార్యములకు బదకములు వేయబడును. సామాన్య ములైన రాత్రులందు, వేసిన పదకములెల్లు సాగుచున్నవో మాత్రమాలోచింపబడును. అది శ్రావణ కృష్ణపక్ష చతుర్దశి.

నడివర్షఋతువు. కడచిన పది దినములనుండి సూర్య దర్శనములేదు. కృష్ణానది విపరీతమయిన వాయువులచేతఁ దాడితమయి యెఱ్ఱని నీళ్ళతోఁ గాళికాదేవి మాటిమాటికి

నాలుక నార్చుచున్నట్లుండెను. అంతటి భయంకరమయిన కృష్ణానదిమీఁద నిర్భయముగా సురక్షితముగాఁ జలికి వణకక సమశీతల ప్రదేశమున విహరించుచున్నట్లు ప్రవర్తించఁగల పల్లెవాండ్రు, రెండు చిన్న నావలను అగ్నిగ్రామమునుండి కృష్ణానది యాతలియొడ్డుననున్న పర్వతారణ్యములలోనికి నడపికొని పోవుచుండిరి. గాలి తివ్రముగ వీచుచున్నది. గాఢాంధకారముగానున్నది. కన్ను కన్ను పొడిచికొనుచున్నను నావలలోఁ గూర్చున్న యొకరికి మరొకరు విస్పష్టముగాఁ గనిపించుటలేదు. ఆ నావలు పోవుచున్నవి. ఆ నావలకుఁ దమ్ము నెవరయిన వెంటాడుచున్నారోయన్న భయముకూడఁగలదు. నావలను నడుపువారి యతిప్రగల్భతయే నావలు నడుచుచున్నవని యందులోని వారనుకొనుచున్నట్లు చేయుచున్నవి. చెకుముకిరాయి కొట్టి నిప్పు కలిగించుటకుఁగూడ వీలులేదు. అట్లుచేసినచో నెవో నావలు వెళ్లుచున్నవని దూరేక్ష్యులకుఁ దెలియవచ్చును. ఆనావలెంతయో వేగముగాఁ బోవుచున్నవి. ఆపోవుటలో వర్షానదీతీవ్రప్రవాహమే కారణము. నావికులయొక్క చుక్కానిపట్టు నేర్పుచేత సన్నగాఁ దెడ్డువేయు మెలకువచేత నావలుత్తర దశగాఁ బోవుచున్నవి. గాని లేనిచోఁ బ్రాగ్దిశగానే పోవును. ఆనావలావలియొడ్డు పట్టుటకుఁ దేలికగా నొక యామముపట్టెను. ఆనాఁడచ్చట గృష్ణానది కొండల నంటుకొనియే యుండెను. ఆ నావలలో నుండి నలుగురు మనుష్యులు దిగిరి. నావలు నడిపినవారు నలుగురు. దిగిన నలువురు పదిగజాలముందు పోకముందే యీ నలుగు రానావల నొకయొడ్డునకుఁజేర్చి యచటఁ బాతియున్న

కొయ్యలకు బిగించికట్టి యా కొయ్యలకు సమీపముననున్న రెండు నేల బొరియలలో ముసుగులువెట్టి, యప్పటికెంత సేపటి నుండియో నిదురపోవుచున్నవారివలె నటింప నారంభించిరి. అట్టిరాత్రులందు బడవల నడుపువాండ్రు నివసించుటకు నేలలో బొరియలు త్రవ్వి వానిపైనఁ గఱ్ఱలువేసి పైన నాకు లలములుకప్పి మట్టిపోసెడివారు. అవి గాలికెగిరిపోవు. బొరి యలుకూడాఁ జాలలోతుగాదు. సులభముగా లోనికిఁ బ్రాక వచ్చును. మరల వెలికి రావచ్చును.

దిగిన నలువురు కొండలలోని యరణ్యములలోనికిఁ బోవుచుండిరి. వారు రెండు మూఁడు గడియలు నడచిరి. వారిలో ముగ్వురు మహాంధకారమున నాపర్వతారణ్యము లలో దారి గుర్తిడుకొని నడువఁగలవారు. నాల్గవవానికా పర్వతములు తెలియవు. ఆదారి యసలు తెలియదు. పట్టపవ లయినచోఁ మనమిచ్చట దిగితిమి, యీయరణ్యములోనికిఁ బొవుచుంటిమి యని, యాయనకుఁ దెలియవచ్చును. ఆ కొం డలు నాయరణ్యములు నాయన చూచియే యుండెను. ఐ దారు సార్లు వేటకుఁగూడ నచ్చటికి వచ్చెను. పవలయినచోఁ గొంత గుర్తు పట్టవచ్చును. కనీసమిచ్చోటి యరణ్యములని తెలిసికోనచ్చును. ఇప్పుడా యంధకారములో నాయన కేమియుఁ దెలియదు. తన్ను నడిపించుకొనిపోవు వారిమీదనే సంపూర్ణముగా నాధారపడియుండెను. వారు నాతనియందు మహాగౌరవము నెరపుచుండిరి. ఆ నలుగురు పోయి పోయి యాయడవిలో నొక కొండలోయలో నొక గుహాదేశము చేరిరి. గుహాముఖము దగ్గరకుఁ బోవువరకు నచ్చట

మనుష్యులున్నారనే దెలియదు. ఆ గుహా ముఖమును గోపనము చేయుచు రెండు వైపుల బండరాళ్లున్నవి. దారి మూఁడవవైపు నుండి యున్నది. ఆ మూఁడవవైపున నానికొని యొక పర్వత మేటవాలుగానున్నది. బాగుగా నెఱిఁగినవారికే తెలియనలయును. గాని లేనిచో నా గుహాలోనున్న వెలుఁగు మరియెవ్వఱికిని గనిపింపదు. ఈ ముగ్గురు నాయనను గుహాలోనికిఁ బ్రవేశపెట్టి గుహా ముఖముననే నిలుచుండిరి. ఆ తక్కిన మువ్వురెవ్వరోకూడ నాయనకుఁ దెలియదు. గుహాలో మంచి వెలుతురుగా నుండెను. నాల్గుకాగడాలు వెలుగుచుండెను. అవి కాగడాలుకావు. అడవిలోని కొన్ని చెట్లనుండి కట్టెలుకొట్టి వాని చివఱలు కొంత మెత్తగా నూరగా నలగఁగొట్టి దానికగ్గి ముట్టించినచో నవి దివ్వటీలవలె వెలుఁగును. అవి యట్టివి. ఆ వెల్గులో జయద్రథుఁడు వచ్చి నాగార్జునునకు స్వాగతమిచ్చెను. నాగార్జునునకు జయద్రథునిఁ జూచిన వెంటనే మొగములో నొక వికాసము కలిగెను. అంథకారములో దెలియలేదు గాని యింతసేపు నాగార్జునుఁడు తానెచ్చటికిఁ బోవుచున్నాఁడో తనకే తెలియక, తన వెంట వచ్చినవారు తన్నేమి సేయుదురో తెలియక యది యేదో ధైర్యముచేత గుండెబిగబట్టుకొని వచ్చుచున్నాడని వ్యక్తమైనది. దివిటీలు తదాది వారిద్దఱి ననుసరించెను. గుహ కడుపులోనికిఁ బోయిరి. అచ్చట నొక స్త్రీ కూర్చుండెను. ఆమె మిక్కిలి వృద్ధురాలు. ఆ నాఁటి లెక్కప్రకారమామెకు రెండువందల యేండ్లుండవచ్చును. ఆమె యొడలంతయు ముడుతలుపడియుండెను. శరీరము శుష్కించియుండెను. ఆమె యొక

బొమికలు ప్రోగువలె నున్నది. నోటిలో దంతములు లేవు. ఆమె నేత్రములు మాత్రము ప్రకాశమానముగా నుండెను. ఆమె మెడలో నొక పూసలపేరు కలదు. ఆ పూసలయొక్క పరిమాణము ఒకదానికొకటిసరిపోదు. వర్ణసామ్యములేదు. జాతి సామ్యములేదు. అవికొన్ని గవ్వలు, కొన్ని పెద్ద రుద్రాక్షలు, కొన్ని సన్నని యడవిపూసలు, నాల్గయిదు వ్రేలెడంత నిడివిగల ఫల్లలు. ఆమెయొక చిన్నిగుడ్డను గొంత జఘనభాగమునఁగొంత వక్షోభాగమున నమర్చికొనియుండెను. వక్షోభాగముమీఁద నున్న గుడ్డ తిరిగి తిరిగి జాతిక్రిందఁబడి పోవుచుండెను. ఆమె తన కిష్టమయినచో నా గుడ్డను ఱొమ్ముపైకిలాగి మెడకు బిగించియున్న యొక సన్నని పూసలపేరులోనికి దానికొంగును దోఁపును. ఆమెను జూచినచో నాయంధకారములో నా గుహాగహ్వరములోఁ బీటవెట్టికొని కూర్చుండిన యొక పిశాచమనవలెను, కాని జయద్రథుఁడున్నాఁడు. దివిటీలు పట్టుచున్న నల్వురున్నారు. వారు నల్వురాటవికులు. వేషములు కిరాత వేషములు. వారు చాల వినయమవలంబించుచున్నారు. జయద్రథుఁడు నాగార్జునునితో నిట్లనెను. "ఈమె యే కోణంగి. ఈమె భవిష్యత్తు చెప్పఁగలదు. తమరితో మనవిచేసితిని గదా! తమచేతి నామెకుఁ జూపించినచో నామె మీాభవిష్యత్తును జదువును" అనెను. నాగార్జునునకు గొంతజుగప్స కలిగెను. ఆయనపుట్టినదాది నిట్టి పరిస్థితులెఱుఁగఁడు. జయద్రథుఁడు నతఁడుకొన్నియేండ్లక్రింద గలిసికొనిరి. తన్నుఁజూచి జయదత్రఘుఁడు నమస్కారముచేసెను. ధాన్యకటకములో దత్పూర్వము నాగార్జునుఁడు జయద్రథునిఁ జూడలేదు. మీారె

వ్వరని యడిగెను. జయద్రధుఁడు నాగార్జునునితో నాఁడు తన్నుగూర్చి చెప్పిన మాటలు నాగార్జునునకు నద్భుతరసమును ఘటించెను. అతఁడు పిచ్చివాఁడేమో యనుకొనెను. పిచ్చివాఁడు కాదని తెలిసెను. తమరిని నేను దరువాత సందర్శింతునని జయద్రధుఁడు వెళ్ళిపోయెను.

"నా మాటలు మీరు నమ్ముటకు నాకేయే విద్యలు వచ్చునని తమతో మనవిచేసితినో వానిలో గొన్నింటిని నేను మీకుఁ జేసి చూపింతును. అప్పుడు మీరు నన్ను నమ్మవచ్చును. ఆ విద్యలు మీకు రహస్యముగా జూపించవలయును. తమరు రాజకుమారులు. సాహసించి నేను చెప్పిన యొకనాటిరాత్రి నావెంట వత్తురేని నేనొక చోటికిఁ దీసికొనిపోయెదను. అచట నామాటల యాధార్థ్యము మీకుఁ దెలియును. ఇదచాల రహస్యవిషయము. నేను మిమ్ముఁ గలిసికొన్నట్లు మీనుండి యెవరికిఁ దెలిసినను మీకు మీరు నేను నెఱపుదునన్న విద్యా దర్శనము చేయలేరు." అని చెప్పి వెడలిపోయెను. ఆ చెప్పుటలో వినయము కలదు. అధికారము కలదు. బెదరింపు కలదు. తరువాత నొకనాటిరాత్రి యేర్పఱిచిన సంకేత ప్రదేశమునుండి జయద్రధుఁడు నాగార్జునునిఁ గలిసికొని యగ్ని గ్రామమునకు దీసికొనిపోయి యచటి పెద్ద గృహములో నాగార్జునునిఁ గూర్చుండఁబెట్టెను. తన విద్యాప్రదర్శనము చూపెను. తొలుతఁ జిన్న చిన్న ప్రయోగములు చేసెను. ఒక కఱ్ఱపుచ్చికొని దానిని విసరివేసెను. అది పామయ్యెను. జయద్రధుఁడు దానితోకనుబట్టికొనఁగా నది మరలఁ గఱ్ఱయయ్యెను. ఆ మూలనొక గొంగళి

యుండెను. ఆ గొంగళి పై కెత్తి యొక కొంకె కఱ్ఱను బాతి, గొంగళిని దాని మీఁద వేసెను. నాగార్జుని( గన్నులు మూసికొని వెంటనే తెఱువుమనెను. నాగార్జునుఁడు కనులు మూసికొని రెండు ఱెప్పపాటుల కాలములోఁ దెఱచెను. ఆ ఆ కొంకెకఱ్ఱయు గొంగళియును నెలుఁగుబంటి వెనుకాళ్ళ మీఁద నిలుచున్నట్లుండెను. ఆ భల్లూకము నాగార్జునునకు మిక్కిలి సమీపమున నున్నది. నాగార్జునుఁడు జయద్రధుఁడు విద్య నెఱపుచున్నాఁడని మఱచిపోయి తన నడుములోని బాకును దీసి దానిని(బొడిచెను. గొంగళియు గఱ్ఱయు క్రిందఁబడెను, జయద్రధుఁడు నవ్వెను. అతఁడిట్టి వెన్నియో వింతలు చూపెను. అది వారి యిద్దఱి ప్రధమ సమావేశము. నాఁడు మొదలు నాగార్జునకు జయద్రధుని మీఁద నొక లక్ష్యము పెరిగెను, కాని యతనివద్ద గొన్ని యిట్టి విద్యలున్నవని మాత్రమే యనుకొనెను. తరువాత నొక ఏడాది గడచిన తరువాత సింహాస్య ప్రదేశమునకు నాగార్జునుఁడు రెండు మూఁడు సార్లు వెళ్ళిన తరువాత జయద్రధుఁడా తనతో తన ఖడ్గ విద్యానైపుణ్యమును గూర్చి ప్రస్తావించెను. అతఁడెవరో యాటవికుల వద్ద నింద్రజాలాదివిద్యలు నేర్చినవాఁడని నాగార్జును డిన్నాళ్ళనుకొనుచుండెను. నాగార్జునుఁడు విశ్వసించలేదు. కాని నాగార్జునునకు ఖడ్గవిద్య తెలియనిదికాదు. శ్రీముఖుఁడును విజయసింహుఁడును తనకంటెఁ బెద్ద వారగుటచేత, వారికి నిరంకుశునితోఁ గలిపి నిరంకుశుని తండ్రి ఖడ్గవిద్యనేర్పెను. ఆ దినములలో నాగార్జునుఁడు చిన్నవాఁడు. ఇతనికి వయసు వచ్చిన తరువాత నిరంకుశుని తండ్రి వద్దకు రోమపాదుఁ డితనిని గూడఁ బంపిం

చెను. ఆయన కప్పటికేదో వ్యాధిపట్టుకొన్నది. ఇతనికి విద్య సరిగా నేర్పఁజాలకపోయెను. ఇది యిట్లుచేయవలయు నది యిట్లుచేయవలయునని సర్వవిద్యా రహస్యములను నాగార్జునునకు జెప్పెను గాని ఖడ్గవిద్యనోటితో నేర్చుకొనెడిది కాదు. సిద్ధాంతముకన్న నాచరణము ప్రధానమయిన విద్య. ప్రదర్శించుటలో ప్రయోగించుటలో విజయసింహుఁడు దేశము మొత్తము మీఁద నధికుఁడని సర్వజనులకుఁ దెలియును. కాని తద్విద్యా రహస్యములు నాగార్జునునకుఁ దెలిసినంత మఱియెవ్వరికిని దెలియదు. ఆ నాటినుండియు నేటివఱకును గొన్ని విద్యలిట్లున్నవి. ఆ విద్యాగురువులుందురు. ఆ విద్యలను వారు పలుమందికి నేర్పుదురు. వారా విద్యాప్రదర్శనము చేయలేరు. కాని వారు విద్యాగురువులు. కోటలో ఖడ్గవిద్యా ప్రదర్శనములు జరుగునపుడు పలుమార్లు నాగార్జునుఁడు పరీక్షకుఁడుగా నిర్ణాయకుఁడుగా మధ్యవర్తిగా నుండును. ఒకటి రెండు విషయములు నాగార్జునుఁడు చెప్పఁగా విజయసింహుఁడును నిరంకుశుఁడును నేర్చికొన్నవి గలవు. ఇది నాగార్జునుని ఖడ్గవిద్యా పరిజ్ఞానము. అతడు కత్తియుద్ధము చేయలేకపోయినను సర్వము తెలిసినవాఁడు. ఎంతవాఁడయిన నెదురుగావచ్చి యతని నేమియు చేయలేఁడు. అందుచేత జయద్రథునితో నీ ఖడ్గవిద్యానైశారద్యము నాకుఁ జూపించుమని యడిగెను. మరల నొక మేఘమాలా పరిచ్ఛన్నాకాశమయిన నొకనిశావేళ నాయింటిలో వీరిద్దఱు కత్తియుద్ధమాడిరి. జయద్రథుని సామర్థ్యము నాగార్జునుఁడు తెలిసికొనెను. నాటినుండి జయద్రథుని మీఁద గౌరవమేర్పడినది. తరువాత బహు

ప్రసంగముల యందు జయద్రథుఁడు నాగార్జునునితో వ్యంగ్యముగా నతఁడే రాజగునన్నట్లు మాటాడు చుండెను. ఇతఁడతని మాటలకర్థమేమిటని యడిగెను. అతఁడు చెప్పఁడు. నీల యొక దేశమునకు రాణికాఁదగినదని విక్రముని యింటిలోని ప్రతీతి. ఆమెను గూర్చి నాగార్జునునకు గొప్ప యభిమానము. ఆమె రాజనీతిజ్ఞురాలు. ఆమె భర్త యొక దేశమునకు రాజయినచో నామె రాజ్యనిర్వహణముచేయఁదగినదిఁ యన్నయూహ నాగార్జునునకున్నది. జయద్రథుఁడు పలుసార్లు తానురాజగునన్నట్లు వ్యంగ్యముగా మాటాడిన పుడు వాని బుద్ధి నీలను గూర్చి తనకున్న యాశాభిమానములచేతఁ దాడితమై కొంచెము కొంచెముగాఁ దానే దేశమునకయిన రాజగునేమోయన్న భావమును రేకెత్తించుకొన్నది. ఇట్లు రెండు మూఁడేండ్లు జరిగిన తరువాత జయద్రథుఁడిట్లనెను, "నాకుఁ దమకు రాజగుదురని యొక విశ్వాసము కలదనెను. నాగార్జునుడు నా యన్నగారలిద్దఱున్నారు నే నెట్లగుదును? వారు పరదేశమేదయినను గెలిచి దానికి నన్ను రాజుగా నియమింపవచ్చును..

జయ- 'అట్లు కాదు. అట్లుకాదు.' మఱియెట్లని నాగార్జునుఁడుగఁగా జయద్రథుఁడు సమాధానము చెప్పడు. ఒకనాఁడు జయద్రథుఁడు నాగార్జునునితో నిట్లనెను.'ఒకమహా గుహలో నొక యక్షిణికలదు. ఆమె పవలెవ్వరికినిఁ గనిపించదు. రాత్రులందు మాత్రమే యా గుహలో నుండును. ఆమె వృద్ధురాలివలె గనిపించును. నిజానికి వృద్ధురాలుకాదు, యక్షిణి. గాఢాంధకారములు క్రమ్మిన యే మహానిశాసమ

యమునందో వానలు గ్రమ్మరించు చుండగాఁ దలదాచుకొ నుటకు వీలులేక యడవిలో జిక్కువడిననాఁడు యాదృచ్ఛిక ముగా నా గుహలోఁ బ్రవేశించినచో వానినా యక్షిణి ప్రతారించును. నాకారీతి నొకసారి జరిగినది. నేనా గుహ లోనికిఁ బోయి యది యేప్రదేశమో చూతమని చెకుముకి రాయి వెలిగించితిని. ఆ యక్షిణి కనిపించెను. పరమ వృద్ధు రాలుగాఁ గనిపించెను. నా దగ్గఱనున్న మంత్రముల శక్తి చేత నాకామె యక్షిణియని దెలిసినది. నేనామెను గొన్ని మంత్రములచేత వశపఱచికొంటిని. ఆమెకు భూతభవిష్యద్వ ర్తమానములన్నియుఁ దెలియును. ఆమె నాచేయిచూసి సాముద్రికము చెప్పినది. నేను మిమ్ము నామె వద్దకు దీసి కొని పోవుదును. నా మనసులో నెందుచేతనో మీరీదేశ మునకు రాజగుదు రనిపించుచున్నది. మీకిద్ద ఱగ్రజులు కలరు. అందుచేత నదిపొసఁగదు. నాకీయూహ యెందుకు గలిగినదో తెలియదు. ఆమెనుబోయి కలిసికొందమని చెప్పెను.

తరువాతఁ జాలసార్లు నాగార్జునుఁడాతని వొత్తిడి సేయుటయు జయద్రథుఁడు తగినవేళ రావలయుననియు గొన్ని నాళ్లుజరిగిన తరువాత జయద్రథుఁడిట్లు చెప్పెను. ఆ యక్షిణి సర్వదా ఇచ్చట నుండును. నడివర్షకాలము కావల యును. నాల్గయిదు దినములు వదలని ముసురు పట్టవలయును. ముసురునాళ్ళు నాల్గున్నవనఁగా. నొకనాటి నడిమరాత్రి యామె వద్దకుఁ బోవలయును. ఆమె కృష్ణయవతలనున్న మహారణ్యముమధ్య నొకకొండగుహలో నుండును. నేనె

పుడు చూడవలయునన్నవామె నట్టి దినములందే చూతును. అని చెప్పెను. నాగార్జునునకుఁ దొందఱ యెక్కువయ్యెను. అతఁడు మూర్తితాల్చిన ప్రతీక్షయయ్యెను. ఆతనికి తాను రాజగుదునను దానికంటె నీల రాణియేనన్న దానికిఁ బట్టరానంత కోరికగా నుండెను.

ఈ ప్రతీక్ష నాగార్జునునకిట్లు ఫలించెను.

నాగార్జునుఁడు తన చేతిని యక్షిణికిఁ జూపించెను. దివ్విటీలు రెండు రాజకుమారుని చేతిలోని రేఖలుఁ విస్పష్టముగా గనిపించుటకు దగ్గఱగావచ్చెను. యక్షిణి చూచెను. పెదవి విఱిచెను. చేయితీసివేయుమని సంజ్ఞచేసెను. నాగార్జునుఁడు చేతిని వెనుకకు లాగుకొనెను. ఇంతలో నాల్గుకాగడాలు హఠాత్తుగా నారిపోయెను. గుహలో నొక వికటాట్టహాసము బయలుదేరెను. అంతవఱకు నాగార్జునునకు భయము కలుగలేదు. అప్పుడతని కొక భయమువేసెను. ఈ జయద్రధుఁడు తన్నిచ్చటికి సంహరించుటకుఁ దీసికొని వచ్చెనా? అతనికేమి ప్రయోజనము? ఇది నిజముగ యక్షిణీమాయయా? ఆయక్షిణి తనయధీనము నందున్నదని జయద్రధుఁడు చెప్పెను. నాగార్జునుడు తానొక్కఁడు. అది యక్షిణి యగునో కాదో వేరుమాట. జయద్రధుఁడును నల్గురు దివ్విటీల వారు కలరు. గుహాముఖమున ముప్వురున్నారు. వారెనమండుగురు. దివ్విటీలవారి వద్ద గత్తులులేవు. నాగార్జునుఁడు తన నడుమునకు నొడ్డాణమువలెఁబెట్టికొన్న కత్తిని దెచ్చెను. అది తెచ్చినట్లెవ్వరికినిఁ దెలియదు. అతఁడు నడుమునఁదుండి కత్తిని లాగెను. నిరంకుశుని తండ్రి యతని కొక విద్య నేర్పెను. దాని పేరు

సర్వదిశారక్షిణి. ఆ కత్తిమెత్తనిది తాటియాకువలె వంగును. అది త్రిప్పుచుండగా త్రిప్పుచున్నట్లే తెలియదు. అతనియొడలిమీఁద దెబ్బపడదు. నాగార్జునుడీ సర్వదిశారక్షిణిని ప్రయోగించుచుండెను. ఇంతలో జయద్రథుని పెద్ద కంఠధ్వని వినిపించెను. 'ఓసి యక్షిణీ! నిన్ను గుహాయందే బంధించెదను. ఈయన నాకుఁ బరమమిత్రుడు. ఆయన భవిష్యత్తు నీవు చెప్పితీరవలయును. లేనిచో నష్టదిగ్బంధనము చేసెదను. నిన్ను గుహాలోఁ బాతిపెట్టెదను. నీ యక్షమాయచేత నీ దివిటీలార్పితివి. వెంటనే వెలిగింపుము. ఇదిగో నేను నిన్ను బంధింపఁబోవుచున్నాను. ఈ మాటలు పూర్తియైనంతనే యావృద్ధురాలి కంఠమునుండి కొన్నిమాటలు వచ్చినట్లు వినిపించెను. అవి విస్పష్టముగ లేవు గాని తెలియుచునేయుండెను. 'ఇతఁడు రాజుకాఁడు. అగుటకొక్కటే త్రోవయున్నది. ఇతని కన్నగార్లిద్దరున్నారు. వారి మరణమునకితఁడు మార్గములు వెదకినచోఁ గనీసము దానికి సహాయపడినచో వారు మరణింతురు. అప్పుడితఁడు రాజగును. ఇతఁడదిచేయలేఁడు. చేసినచో నితఁడు రాజగును. ఇతఁడు రాజయి యేమి ప్రయోజనము? ఇతని భార్యయున్నది. ఆమె గొప్ప రాజనీతివేత్త్రి. ఇతఁడా యన్నగార్లను సంహరించుటకు సాయపడఁడు.. వారి మీఁద గంటె నితనికి భార్యమీఁద ప్రేమ ప్రబలమైనచో నట్లు జరుగ వచ్చును''

ఇంతలో దివిటీలు మరల వెలిగినవి. అచట ముసలిది కనిపించలేదు.

## ౧౭

వేదాద్రికి మూఁడు నాలుగు క్రోశముల కెగువఁ గృష్ణా నది యుత్తర వాహినిగాఁ బ్రవహించి మరలఁ బ్రాగ్దిశకు మరలి సముద్రమువఱకుఁ బ్రాగ్వాహినిగానే పోవుచుండును. ఆయుత్తర వాహినిగాఁ మలఁగినయెడ నాంధ్రరాజులు గొప్ప కోటకట్టిరి అక్కడ నది మిక్కిలిలోతు. తరణము సులభ మయినదికాదు. ఆ కోటకుఁ బ్రాగ్దిశయంతయు ధాన్యకట కమే. కోటగూడ ధాన్యకటకములోనిదే. శత్రువులనుండి రక్షించఁదగినదొక్క దక్షిణదిశయే. ఆవైపునను జాలదవ్వు వీరిరాజ్యభాగమే. ఆకోట తొలుతటి దినములలోఁ జాల ప్రా ముఖ్యము వహించి యుండెడిది. విదర్భదేశాధీసు లెన్నాళ్లు బలవంతులై యుందురో యన్నాళ్లు విదర్భాంధ్రులకుఁ జెలిమి యుండునో అన్నాళ్లు నాకోటను గుఱించిన భయములేదు.

కృష్ణా గోదావరుల నడిమిదేశము విదర్భాంధ్రము లాక్రమించి యుండెను. తపతికెగువ నిషధ చేదిదేశములుం డెను. ఈ రెండు నదుల నడిమిభాగము బహుకాలముగా మ్లేచ్ఛయవనశకబర్బరహూణ జాతులు నివాస మేర్పఱచికొని నదిగా నుండెడిది. వారికి రాజ్యములులేవు. అదియంతయు మహారణ్యప్రదేశము. దేశనిష్కాసితులయిన రాజవంశీయులు పోయి యచటనుండుటయు వారచ్చటి మ్లేచ్ఛ జాతులకు నాయకులుగా వ్యవహరించుటయు వారు తఱచుగాఁ గెలని

రాజ్యములమీఁద దండెత్తుటయు నాదేశపు రాజు సమర్థుడయినచో వారిని దండించి మరలఁ గొన్నాళ్ళవఱకుఁ దలయెత్తకుండఁ జేయుటయు నిట్టి పరిస్థితి యనాదిగా వచ్చుచుండెను. వారు భారతదేశ నాగరకతా విముఖులగుటవలన సుస్థిరపరిపాలనమును సాంఘిక మర్యాదలను వదలిపెట్టి యథేచ్ఛముగా నుండి, సోమరులగుటచేత నేదియో తినుచు నెట్లో కాలము గడపుచు జీవించుచు మేచ్ఛులయి యాటవికులై, యనాగరకులై బ్రదుకుచు వచ్చిరి. అప్పుడప్పుడు వారి దండయాత్రల వలని భయ ముభయ నదీతీరాంతరములవారి కుండెడిది.

ఈకథా కాలమునాటికిఁ జాలపూర్వము నుండియు నట్టి భయము విదర్భాంధ్రములకు లేదు. అందుచేతఁ గృష్ణ యుత్తర వాహినియై ప్రాగ్దిశకు మలఁగిన యాకోనలోని దుర్గమునకుఁ బ్రాధాన్యమును బోయినది. ఆకోట కొన్ని వందల యేండ్లనుండి నిరంకుశుని పూర్వుల యధికారములోనుండెను. నిరంకుశుని తండ్రి బ్రదికి యున్నన్నినాళ్ళు కోట యాయన క్రింద నుండెడిది. అదుపులోననే యుండెడిది. క్రమ క్రమముగా నాకోటను గూర్చిన శ్రద్ధ సడలెను. వందల యేండ్లుగా నాదెసనుండి యాటవికుల దాడులు లేకపోవుటచేతఁ గృష్ణానది యచ్చట నిత్యమైన యగాధప్రవాహమయి ప్రవహించుటచేత నాకోటమీఁది శ్రద్ధ సడలెను. నిరంకుశుని తండ్రి చనిపోయిన తరువాత నిరంకుశునకు సముద్రతీరము నందలి తొట్టిఁపట్టుమీఁది యధికారము ప్రాప్తించిన తరువాత నా కోటవంకఁ జూచెడివారే లేకపోయిరి. నిరంకుశున కన్నలు లేరు. తమ్ములులేరు. ఒక్క చెల్లెలు కలదు. ఆమెపేరు జాంబ

వతి. జాంబవతి నాగార్జుననికంటెఁ జిన్నది. విజయసింహుని కంటె మిక్కిలియుఁ జిన్నది. ఆకోటలో నిరంకుశుని తల్లియు జాంబవతియు నివసించుచుండిరి. నిరంకుశుఁడు నతని భార్యయు దొల్లిఁపట్టునందున్న రాజభవనములో నివసింతురు. వారిద్దఱిని వచ్చి తమవద్ద నుండుఁడని నిరంకుశు డెంత చెప్పినను దల్లి వినలేదు. 'మీతండ్రిని బెండ్లిచేసికొని నేనీ కోటకు వచ్చితిని. వచ్చినది మొదలొక్కనాఁడైనను నేనడుగు బయటఁ బెట్టలేదు. నేను రాణిని. ఈకోటనాది. నాప్రాణ మిచ్చటనే పోవలయును. మీతండ్రి యిచ్చటనే మరణించిరి. వారినెచ్చోటఁ దగులఁబెట్టిరో నన్ను నచ్చోటనే తగులబెట్ట వలయు' ననెను. తల్లి కొఱకు నిరంకుశుఁడు చెల్లెలినిగూడ నచ్చటనే యుంచవలసి వచ్చెను. ఒంటరిగా నుండుటయేమి న్నది. పరిచారిక లున్నారు. పరిచారకులున్నారు. మఱియు నచ్చట నదీతరణము మిక్కిలి క్లిష్టమయిన వ్యవహారము. రెండువైపులను బల్లెవాండ్ర యిండ్లు కోటగోడలనానికొనియే యున్నవి. మఱికొందఱు రాజవంశమువారి చిన్ని చిన్ని కోటలును దగ్గఱ దగ్గఱలోననే యున్నవి. ఈకోట వద్దనుండి తూర్పుగా వ్యాపించిన యీ దీర్ఘమైన ధాన్యకటకమని వ్యవహరింపఁబడుచున్న పలుదుర్గములకు దక్షిణపువైపున సముద్ర తీరము వఱకు వెడల్పయిన, రాజమార్గము కలదు. నిరంకుశుఁడు గుఱ్ఱమునెక్కినచో దెల్లవాఱుకడ బయలుదేరును. ప్రొద్దు తిరుగకమున్న తనకోటకువచ్చును. ఆ సాయంకాలము, నా రాత్రి యచటనుండి మఱునాడు పవలు రెండు జాములు దాటకముందు తన యుద్యోగభూమికి జేరును

నిరంకుశుఁడు తోట్టుపట్టుమీఁది యధికారము గ్రహింపక పోయెడివాఁడే. తనతండ్రి ఖడ్గవిద్యా గురువగుటచేతఁ దాను బ్రతికియున్నన్ని దినములు తమకున్న భూములమీఁద దగిన శ్రద్ధ వహించలేదు వానిని సేద్యము చేయుచున్న కృషికులు వీరికీయ వలసిన యాఱవభాగములో సగానికి సగమిచ్చి పావిచ్చి కొన్నియేండ్లు పండలేదని ఋణపడి యాయనవద్దకు వచ్చి బతిమాలికొని యాయన దయతో వదలిపెట్టి, నానా విధములుగా వారి రాబడితగ్గెను. నిరంకుశుఁడు కూడఁ దనకు బుద్ధివచ్చునంతకుఁ దండ్రివలెనే వ్యవహరించెను. అప్పటికయి నను దమ భూములమీఁది షడ్భాగమును జాగ్రత్తగా రాబట్టి కొన్నచో నిలువఁద్రొక్కికొన వచ్చును. కాని రోమపాదుడు వారి స్థితి చూచి నిరంకుశునకు నీతోట్టుపట్టుమీఁది యధికార మిచ్చెను. ఆకాలమున దోట్టుపట్టుమీఁది యధికారమనఁగా గొప్పపదవి. రాబడియెక్కువ. అతఁడు సేనానాయకులతోఁ బాటివాఁడు. సేనానాయకులు పదిమంది యుందురు. చమూ పతులు, దళాధిపతులు కొన్నివందలమంది యుండవచ్చును. తోట్టుపట్ల యధికారులు సేనానాయకులతో సమానులు. మహారాజ్య రాజకీయ రహస్యచర్చాసభలో మంత్రులు, సేనాపతులు, తోట్టుపట్టు నధికారులు, దుర్గాధిపతులు వీరం దరుందురు. అందరి సంఖ్యయు వందకు మించియుండదు. అది మహాసభ. ఆమహాసభయే రాజ్యముచేయును. ఈ సభ నలుబదియేండ్ల కొకసారియైనను సమావేశము కావచ్చును. కాకపోవచ్చును. ఎవరయిన పరరాజు దండెత్తి వచ్చుచున్నా డని వార్త తెలిసినపుడే యీసభ సమావేశము జరుగును.

తక్కినప్పుడిది సభయని పేరేకాని దానికి సమావేశము జరుగు మర్యాదలేదు. సేనానాయకులు మంత్రులును శేషింపఁబడఁగాఁ దక్కిన దుర్గాధిపతులు తొట్టుపట్ల యధికారులు నించుమించుగా స్వతంత్రులు. వారి పాలనముక్రింద నెన్ని గ్రామములుండునో యా గ్రామములమీఁద వారే సర్వాధికారులు. కాని వారు రోమపాదునిక్రింది యుద్యోగులు!

ఇట్టి పదవి తాను తనకోటకధికారి యగుటచేత నిరంకుశునకుండనే యుండెను. తొట్టుపట్టున కధికారియగుటవలననట్టి రెండు పదవులు తనయందుండును. తొట్టుపట్టునధికారి క్రింద గ్రామములుండవు. పదిపండ్రెండు గ్రామములు పశుసంపదకలవియుండును. ఆ గ్రామములలో నితరవర్ణములవారుండరు. పసుపాలకులే యుందురు. ఈ పండ్రెండు గ్రామములలోనున్న కొన్ని సహస్రములయిన గోవులు రాజుగారివే. అనగా రాజ్యమునకు జెందినవే. కాని యొక గ్రామములోని గోసంపదయంతయుఁ దధికారిది. ఒక తొట్టుపట్టు నందధికారియైనవానికేఁ బండ్రెండవ భాగము సంపద వానిదన్నమాట. దాని మీఁదఁ జాల రాబడివచ్చును. అతనికి వేయి గోవులున్నవని యర్థము. అతనికి సహస్రగోధనమున్నదని చెప్పికొందురు. ఈ గోధనము నిత్యవృద్ధి పొందెడిధనము. సహస్ర గోవులుండినచో సులభముగా నేఁడాదికి రెండువందల మూఁడువందల కాడిక్రిందికి రాదగిన గిత్తలు చేతిలోనికివచ్చును. అది యంతయు బంగారము, వెండి. ఈ గిత్తలను కృషీవలులు కొందురు. మ్లేచ్ఛులు కొందురు. అనఁగా నాటవికులు. వారు పశువులను గొనిపోయి యడవులలో వానిని మేపికొనివచ్చి వానిని

వ్యవసాయపు టూళ్ళమీఁద నమ్మకొని తీసికొనిపోవుచుండు దురు. బంగారము వెండియు, దిమ్మలుగా, జిన్నములుగా ముద్దలు ముద్దలుగాఁ గరగింపఁబడి వ్యవహారమునందుండును. వినిమయమునకు దాటిన క్రయవిక్రయములు బంగారముతో వెండితో జరుగుచుండును.

అందుచేత నిరంకుశుఁడు తల్లినిఁ జెల్లెలిని దమ కోటలో వదలిపెట్టి తాను తనభార్యయుఁ దన యిద్దఱు పిల్లలు తన యధికార ప్రదేశమున నుండుచుండిరి. తన తల్లి వద్ద నామె పినతల్లికూడ నున్నది. ఆమె యనాదినుండియుఁ దన కుటుంబములోనే యున్నది. ఆమె కెవ్వరును లేరు. తన కుటుంబము నాశ్రయించి యున్నది. ఆమె మిక్కిలి వృద్ధురాలు. కాని యామె కనుచూపు చెడలేదు. దంతపటిమ చెడిపోలేదు. పరిచారకలను మించి యేపనియైన జేయును. ఆమె యున్నచోఁ బరిచారికల నందఱకు భయము. తన యిచ్చటి భూములమీఁది రాబడి నామె తన తండ్రికంటె నెక్కువ గడుసుగా రాబట్టును. అందుచేత నిరంకుశుఁడు నిర్భయముగాఁ దల్లిని చెల్లెలి, నామె పర్యవేక్షణక్రింద వదలిపెట్టి నెలకొకసారియో రెండునెలల కొకసారియో పోయి చూచి వచ్చుచుండును. ఒకొకప్పుడు పది దినముల కొకసారికూడ వెళ్లవచ్చును, ఆకోటగూడ దృఢమయినదిగాని లోని భవనము చిన్నదే. నాలుగయిదు గదులున్నవి. ఒక గదిలో వంటచేసి కొందురు. ఒక గది తండ్రిది. మరి రెండు గదులు తనదొకటియు, జాంబవతి దొకటియు. వంటగదిలోనుండి జాంబవతి గదిలోనికి దారియున్నది. తన తండ్రి గదిలోనుండి

వంటగదిలోనికిఁ ద్రోవయున్నది. తన గదిలోనుండి తండ్రి గదిలోనికిఁ ద్రోవయున్నది. వంటగదిలోనికి ద్రోవయున్నది. తన గది విశాలమయినది. తనతల్లి ఇపుడు సర్వదా తనతండ్రి గదిలోనే యుండును. ఆమె పినతల్లి యెప్పుడయిన బనియున్నచో తక్కిన మూడుగదులలోని కెప్పుడయినా వచ్చును గాని వంటగదిలోనే యుండును. అది గదికాదు. పెద్దచావడి. ఆచావడిలో నొక వైపున వంటచేయవచ్చును. నడిమ భాగ మంతయు భోజనములు చేయుదురు. రెండవ వైపున నామె యుండును. ప్రతి దినము రాత్రులందు భోజనము చేసెడి చోటనే తాను మంచము వేసికొని పరుండును. ఆమెకుఁ దన యప్పగారి కూతురయిన తన తల్లిమీద కంటె జాంబవతి మీఁద నెక్కువప్రేమ.

శ్రీముఖుఁడును విజయసింహుఁడు నాకోటలో ఖడ్గ విద్య నేర్చికొనునపుడు జాంబవతి నాల్గయిదేండ్ల పిల్ల. పసి పిల్లగా నామెయందమెంత యని చెప్పవీలులేదు. బంగారపు బొమ్మ. తెలిదీవినుండి దిగివచ్చిన కందు. ఆమె కేఁడెనిమి దేండ్లు వచ్చువఱకు శ్రీముఖ విజయసింహ నిరంకుశుల ఖడ్గ విద్యాభ్యాసము సాగుచునే యుండెడిది. శ్రీముఖ విజయ సింహులు తరువాత నింటికి వచ్చిరి. వచ్చిన తరువాతఁ బం డ్రెండు పదమూఁడేండ్లు జరిగెను. శ్రీముఖ విజయసింహులు మఱెప్పుడును వారి యింటికి వెళ్లనేలేదు. విజయసింహునకు మాత్రము మనసులో జాంబవతి జ్ఞాపకమందే యుండెను. అతఁడామె నెనిమిది తొమ్మిదేండ్ల వయసులోఁ జూచెను. అప్పటికే యాపిల్ల జగన్మోహినిగాఁ గనిపించుచుండెను.

బాల్యమునందుఁ గూడ జీవునకెక్కడో లింగభావముండును. అది యవ్యక్తముగా నుండును. కొందరికి వయసురాకమునుపే తద్భావము విజృంభించి యుండును. కొందఱకు వయసు వచ్చిన తరువాతఁగూడ దద్భావము నిదురపోవుచునే యుండును. మానవజాతియొక్క పుంస్త్రీభావన, భిన్న భిన్న జీవుల సంస్కారములనుబట్టి భిన్న భిన్న విధములుగానుండును. ఒక జీవునియొక్క తద్భావన (ధర్మము నతిక్రమించి యెన్నఁడునుబోదు. మరియొక్కని భావన మనస్సు నందెన్ని పోకిళ్లు పోయినను శరీరముతో సంఘధర్మము నతిక్రమించదు. మరియొకని భావన మనస్సునందుఁ జెలరేగదు. తత్కాలము నం దధర్మాచరణము చేయును. మరియొకని మనస్సును శరీరమును రెండును దుష్టములే. వేఱొకజీవి మనస్సునందు దుష్టుఁడు, శరీరముచేత దుష్టుఁడు, కాని వాని పశ్చాత్తాపమునకు మితి యుండదు.

ఇన్నియు నింక నిన్నియు భేదములుగా మానవప్రకృతిలో స్త్రీపురుష సంబంధ భావన యెప్పుడెచ్చట నెట్లుండునో చెప్పుటకు వీలుండదు. విజయసింహునకుఁ జిన్నప్పుడే జాంబవతిమీఁదఁ బ్రేమకలదు. అప్పటికి జాంబవతి చాల చిన్నపిల్ల. విజయసింహునకు వివాహయోగ్య వయస్సును రాలేదు. విజయసింహుఁడు తన చిన్నప్పుడు తాను జాంబవతిని వివాహము చేసికొనవలెనని యనుకొనెను. అతఁడు మనసులో ననుకొన్నాఁడని యెవరికిఁ దెలియును? అదియుఁగాక, వారి వీరి కిచ్చి పుచ్చుకొనుటలు తరతరములుగాలేవు. వేఱు వేఱు బంధుత్వములున్నవి గాని యిచ్చి పుచ్చికొను

బంధుత్వములులేవు. వరుస యగునో కాదో కూడఁ దెలియదు. ఆ విచారణయేలేదు. విజయసింహునియొక్క వివాహ ప్రస్తావన జరిగినపుడు నేనామెను జేసికొందునని తాను తల్లిదండ్రులతో జెప్పవలయుననుకొన్నాఁడు. ఇద్దరి వద్దను దనకంత చనువులేదు. రాజవంశములలోని మరియాదలవి యొక వేఱు. బాలకులకుఁ గొంతయీడు వచ్చినంతనే వారి నివసించు మేడలు వేఱు. వారి పరిచారకులు వేఱు. వారి పాలన వేఱు. వారి విద్యాగురువులు వేఱు. నూటికిఁ గోటికిఁ బోయి తండ్రిని జూడవచ్చును. అట్లె తల్లిని దర్శింపవచ్చును. ఈ స్థితిలోఁ దానెవరితోఁ జెప్పును? ఇదిగాక యతని జీవితము మిక్కిలి ఖడ్గ విద్యాభ్యాసములోననే గడచెను. నిరంకుశునకుఁ దనకొక విధమయిన యాంతర్మాత్సర్యము బలిసెను. ఆమాత్సర్యము తమ యిద్దరిమనసులమాత్రమే యుండెనేగాని యెవ్వరికిని దెలియదు. తన గురువు బ్రదికియున్నచో మీ కూతును జాంబవతిని నాకిమ్మని తాను పోయి యడుగవచ్చును. అడుగవలయునని చాలసార్లనుకొన్నాఁడు. గుండె దిటవు చాలలేదు. తన వివాహ విషయములోఁ దానెవఁడు? తండ్రి యెవో సంబంధము కుదుర్చును. తాను బెండ్లాడి తీరవలయును తాను తండ్రి నెదిరించి యొకయువతినిఁ బ్రేమించి వివాహమాడినచోఁ దండ్రి తన్ను తనదారి తన్నే చూచుకొమ్మనును. దేశమునుండి వెడలిపోవలయును.

తన గురువు చనిపోయిన తరువాత నధికారి నిరంకుశుఁడు. తమ యిద్దఱినడుమ గర్భశైత్యములు కలవు. తానడిగినచో నిస్సందేహముగా నిరాకరించును.

ఇట్లుండఁగా నిరంకుశునకుఁ దొట్టుపట్టుమీఁద నధికారము వచ్చెను. కొన్నాళ్లు గడచిన తరువాత విజయసింహునికొక యూహతోఁచెను. నిరంకుశుని తల్లి యామె పినతల్లి యున్నది. వారిద్దఱే యుందురు. తాను రాజకుమారుఁడు. ఆ యింటిలో జనవు కలవాఁడు. ముసలమ్మకుఁ దనమీఁద మిక్కిలి ప్రేమ. తానుబోయి గురుభార్యతోఁ బ్రసంగము చేసినచో నామె యనుకూలించినచో నామెయే తన కొడుకుతోఁ జెప్పును. అప్పుడు తాను నిరంకుశునిలో మాటాడవచ్చును. ఇట్లూహించి నిరంకుశుఁడప్పటిలోఁ దా తొట్టుపట్టువదలి రామకోటకు వెళ్లఁడని తెలిసికొని రహస్యముగ వారికోటకు వెళ్లెను. నిరంకుశుని తల్లియు నామె పినతల్లియు విజయసింహు నాదరించిరి. ఎన్నాళ్ళకుఁ గనిపించితివి నాయనా! యనిరి. ఏవో ఫలహారములు చేసిపెట్టిరి. అప్పటికి జాంబవతి యౌవనవతి. అచ్చటఁ బెద్ద నంతఃపురము లేదు. కనుక నలవాట్లు లేవు. కనుక విజయసింహునివద్దకు జాంబవతియువచ్చెను. తానెనిమిదేండ్ల పిల్లయైనపుడు విజయసింహునితో నెట్లు మెలఁగినదో యట్లే మెలఁగెను. కొంతనవ్వుట, కొంత పరియాచకములు, కొంత మర్యాదలు, ప్రొద్దుక్రుంకుదాఁక పరమోత్సాహముగాఁ బరమ రమణీయముగాఁ గాలమంతయు గడచెను. విజయసింహుఁ డింటికిఁ దిరిగివచ్చెను. ఆ ప్రస్తావనయే చేయలేదు. ఏమి చేయ వలయునో యతనికిఁ దెలియలేదు.

కొన్ని నెలలు గడచిన తరువాత మఱల వెళ్లెను. తన యందు వారు జూపించిన యాదరమున కేమియు లోపము లేదు. కాని జాంబవతి మొదటిసారి వచ్చినంత చనవుఁగా

దన దగ్గఱికి రాలేదు. అట్లు మాటాడలేదు. దూరముగా నుం డెను. కాని తానామె నంక చూచినప్పుడు విలాసముగా నవ్వు చుండును. ఇదమిత్థమని నిర్ణయించరాని యొక లేత సిగ్గామె యందుఁ గనిపించెను. కొంత సేపతఁడచట నుండి మఱల నింటికిఁ దిరిగివచ్చెను. అంతటితోఁ నతనికిఁ దాను ధైర్యము తెచ్చుకొని తల్లి నడుగలేనని తెలిసెను. పైన నామె తల్లి కిష్టములేదు. కనుకనే రెండవసారి జాంబవతి తనతోఁ దొలి నాఁటి చనవు నెఱప వీలులేకపోయినదని యతఁడనుకొనెను. మఱి కొన్నాళ్ళకు మిక్కిలి సాహసించి యొకనాఁడు వెళ్లెను. ఆనాడును జాంబవతి తనయున్న చోటికి రాలేదు. ఒక్క సారియే కనిపించెను. ఆకనిపించినప్పుడు జాంబవతి పైనుండి క్రిందికి సిగ్గుల బరణియయ్యెను. అతఁడు నామె తల్లియు ము త్తవతల్లియు గూర్చుండి మాటాడుచుండగా ముత్తవతల్లి యిట్లనెను. "నాయనా! మాఅల్లుడు గారు జాంబవతికి ఖడ్గ విద్య నేర్పెను. నీకుఁ దెలియునా? నీవు ఖడ్గవిద్యలో గొప్ప వాఁడవందురు. ఆమెను బరీక్షించరాదా" యనెను. నిరంకు శుని తల్లి మాటాడలేదు. అంతటితోఁ బ్రస్తావన ముగిసెను. మఱల నితఁడచటికిఁ బోనేలేదు. అతఁడచ్చటి కిట్లు రెండు మూఁడుసార్లు వెళ్ళినవార్త నిరంకుశునకుఁ దెలిసినట్లు నిరంకు శుని చూపులలో విజయసింహుఁడు గ్రహించెను. యువరాజ పట్టాభిషేకము జరిగెను. నాఁటి ఖడ్గవిద్య ప్రదర్శనములో నిరంకుశుని లక్షణము చూచినచోఁ దన్నతఁడు గాయపఱుప వలెనని యెంచినట్లే తోచినది.

ఇది యిట్లుండఁగా భామతోడి తన సంసార మాధుర్యము నిండుగాఁ బ్రవహించు తేనె కాలువకుఁ బ్రక్కగా నొక సన్నని కొబ్బరిపాలవంటి నీళ్లుగల సెలయేఱువలెఁ దన సౌందర్యాభిలాష ప్రవహించుచున్నదని యతఁడు తెలిసికొన్నాఁడు. తాను వివాహమాడినను దన వదినెగార్లతో నాపదునేను దినములు రమణీయమయిన యొక మహానుభూతి నొందినను భామవలన శృంగార రసముయొక్క సర్వస్వము తాను జుఱ్ఱుగొనుచున్నను సర్వకాలములయందు విజయసింహుని మనసులో నొకమూల జాంబవతి తొంగి చూచుచునే యుండెను. ఆమెమీఁది యనురాగమట్లే యుండెను. ఇప్పుడు తనకును జాంబవతికిని సంబంధ మేమియు లేదు. ఊరకయేపోయి చూచిరావచ్చును. పూర్వమునకువలె నామెతల్లి యనుమానపడనక్కఱలేదు. తానైన నూఱక చూచివచ్చుటయే. పోయి యూఱక చూచినందున ఫలమేమి? కాని మనసులోని తృష్ణ యెట్టిదో. తృష్ణయన్నది విచిత్రమైన పదార్థము. దానిపై రంగు వేఱు. లోనిరంగు వేఱు. లోనవే పది వన్నెలుండవచ్చును. మనసు తన్నుఁ దాను బ్రతారించుకొనుటలోఁ జాలనేర్పరి. మనసు తన్నుదాను బ్రతారించికొనుచుఁ బ్రతారించుకొనుట లేదనుకొనును. ఏమయిననేమి?. ఒకసారి వెళ్లెను. ఈసారి జాంబవతి తనతో వచ్చి స్వేచ్ఛగానే మాటాడెను. తల్లి యభ్యంతర పెట్టలేదు. ఆమె ముత్తవ మరల ఖడ్గవిద్యా ప్రస్తావనము చేసెను. తల్లి జాంబవతికి మంచి సంబంధము చూచిపెట్టు మనెను. కొంత నేపుండి విజయసింహుఁడు తిరిగివచ్చెను. కాని యింటికిఁ దిరిగివచ్చుచు జాంబ

వతి తన యెడలఁ బొందిన లజ్జతో మధురపానీయ మంది య్చుచు హస్తాంచలము స్పృశించుటయుఁ జూచిన యొకటి రెండు చూపులును విజయసింహునకుఁ జిత్రములుగాఁ గని పించెను. చిత్రములేమిటి? భామవద్దఁ దానునేర్చికొన్న తాను జూచిన తనకు బరిచితములయిన ప్రథమ సమాగమాధ్యా యములోని కొన్నియంశములవియే. అప్పటినుండి విజయ సింహుఁడు జాంబవతీరహస్సమాగమాభిలాషామూషిత చిత్త వృత్తియై ప్రవర్తించుచుండెను. దివాసమయము లందె న్నిసార్లు వారియింటికివెళ్ళి యేమి ప్రయోజనము? తల్లియు ముత్తవ తల్లియు నెప్పుడు నుందురు. తానిదివఱకే వివాహి తుఁడు గనుక వివాహ పునఃప్రస్తావన లేనేలేదు. ఆమెతో రహస్యముగాఁ దాను గలియవలయును. అప్పుడామె నిజ ముగాఁ దనయందుఁ బ్రేమగలిగిన దయినచో నీసౌందర్యాభి లాషకొక పరమార్థము కలుగును. అచటికి రాత్రులందుఁ బోవుట యెట్లు? పోయినచో లోనికిఁ బ్రవేశించుట యెట్లు? ఆమెను మేల్కొలుపుట యెట్లు? ఈమెలకువలన్నియు సిద్ధిం చుటకుఁగాను వారికి గోటలోని యాచారములు వారి యింటి లోని యాచారములు వారెవ్వరెచటనెచట నిద్రింతురో సర్వము తెలిసికొనవలసి యుండెను. అందుకోసమయిన మఱి యొకసారి పోవలయును. ఎన్నిసార్లు వెళ్ళిన నన్నిసార్లును దానిచట నుండగా నిరంతరుఁ డచ్చటికి వచ్చుట జరుగ నట్లు చూచికొనవలయును.

ఇన్నిసార్లు వెళ్ళుచున్నందుకుఁ దల్లియు ముత్తవ తల్లియు నేమనుకొనిరో తెలిసికొనవలయును. ముత్తవ లక్ష

ణము తెలిసికొన్నాఁడు. ఆమెకు దొలుతటి నుండియు జాంబవతియుఁ దాను గలసియుండవలయుననియే వాంఛించుచున్నట్లున్నది. అభ్యంతరమంతయుఁ దల్లిదే. ఆయభ్యంతరమయినను నిరంకుశోపదిష్టమేమోయని యనుమానము. అది కాక అచటఁ దానే కత్తివిద్య నేర్చెనా? యువరాజును నేర్చెను. నాగార్జునుఁడును నేర్చెను. వారెప్పుడు నచ్చటికిని బోరే. తానేలపోవలయును? తానచ్చటి కెందుకుఁబోయెను. పలుమంది చూచిరి. ఎందుకనుకొందురు? విజయసింహుఁడొక నిశ్చయము చేసికొనెను. ఏమయినను సరే. తానీసారి తప్పక పోవలయును సర్వము తెలిసికొని రావలయును.

వెళ్లెను. జాంబవతి మఱలఁ జనవుగానే ప్రవర్తించెను తల్లి కిష్టములేనట్లే కనిపించెను. కాని యామె యేమియు ననలేదు. ముత్తవతల్లి వారిద్దఱిని గలపి పలుమాటలలో నోరగా దూరపుటర్థములు వచ్చునట్లు వారిద్దఱు భార్యాభర్త లయినచో నెంత బాగుండుననన్న భావము దూరముగా భాసించునట్లు పదిసార్లు చమత్కారములు చేసెను. జాంబవతీ! నీవు విజయసింహునితో యుద్ధమాడుము చూతునని మూఁడుసార్లు హెచ్చరించెను. మూఁడవసారి జాంబవతి తాను చీర వెనుకకు బిగించికట్టి పైటకొంగు వెనుకనుండి తీసి నడుములో బిగించి కత్తియు డాలును బుచ్చుకొని వచ్చెను. విజయసింహునివద్ద డాలులేదు. కత్తియును లేదు. రాజకుమారలక్షణమయిన బొడ్డులోని బాకుమాత్రమే యున్నది. అతఁడు నవ్వి తనవద్దఁ గత్తి డాళ్లు లేవన్నట్లభినయించెను. వారి యింటిలో

గత్తులకు డాళ్ళకు లోపమేమి? ఆమె రెంటినిఁ దీసికొనివచ్చి యిచ్చెను.

వారి యిల్లెంతటి మేరఁ గట్టఁబడియున్నదో యంతటి మేర యింటికుత్తర దిశయందుఁ గృష్ణానది నానికొని ఖడ్గ విద్యా రంగభూమి కలదు. ఇప్పుడారంగభూమివంకఁ జూచెది వారు లేరు. అందులో నైదారు గజములమేర మ్మాత్రము కొంచెము బాగుచేయించి జాంబవతి యప్పుడప్పుడు తానచట సాము చేయుచుండును. ఈయిద్దరచ్చటనే కత్తియుద్ధమాడిరి. నిరంకుశుని తండ్రి యభ్యాసములేకుండ సిద్ధాంత పూర్వక మయిన విద్య నాగార్జునున కెంత చెప్పెనో జాంబవతి కంత చెప్పెను, నాగార్జునునికి జాంబవతికిని భేదముకలదు. నాగార్జు నుఁడు వాని నెప్పుడు నభ్యాసములోఁ బెట్టినవాఁడు కాదు. తనకు గురువు చెప్పినట్లే తానితరులకుఁ జెప్పినవాఁడు. తాన భ్యాసము చేసినవాఁడు కాదు. ఇతరులమీఁదఁ బ్రయోగించిన వాఁడుకాదు, కాని నితరులు తనమీఁదఁ బ్రయోగించినచో 'ఓహో' ఇదియా ప్రయోగమని తప్పించుకొనఁ గలఁడు. అంతియే. జాంబవతి పలుసార్ల భ్యాసము చేయుటలోఁ దండ్రి వాక్పూర్వకముగఁ జెప్పిన వీని నన్నిటినిఁ దానొక్క ర్తుకయే యయ్యును బ్రత్యర్థి యెదురుగ నున్నాఁడని మనసులోఁ గల్పించికొని వాని నన్నింటి నభ్యాసములోనికిఁ దెచ్చి కొనినది.

విజయసింహుఁ డాజానుబాహువు. నిత్య వ్యాయామ కర్కశ శరీరుఁడు, కొంచెము చామనచాయ మేనివాడు. పరమలాఘవమైన శరీరము కలవాఁడు. సింగమువంటివాడు.

జాంబవతి యతని ప్రక్కన నిలుచున్నచో నతని బుజముదాక వచ్చును. పలుచని శరీరముకలది. కాని వ్యాయామముచేత నామె యొడలు ప్రేపచువ్వవలె నుండెను. పురుష, సంపర్కమెఱుఁగని యామె శరీరము గాలిలోఁ దేలిపోవుచుండెను. ఆమె ధరించిన డాలుగాని ఖడ్గముగాని మహాభారమయినవికావు. సులభములైన యాయుధములు. వానితో నెదిరిని లఘువుగా ననుకొన్నను ఆ కత్తి యేదెసనుండి వచ్చినదో తెలియనియట్లు విలక్షణముగ గాయపరుపవచ్చును. అంత దీర్ఘము కానిదియు మిక్కిలి పలుచనదియు నెట్లుపడిన నట్లు వంగునట్టిదియు నైన యామెచేతిలోని కరవాలము చూపించిన చోటనే తగులునని చెప్పుటకు వీలులేదు. ఎదిరివాని డాలుయొక్క యంచునందు నామెకత్తి నడిమి ప్రదేశము తగులవచ్చును. డాలు చివరకు నెదిరివాని యొడలికిని మారములేనిచో నామెకత్తి ప్రక్కవాటుగా దిరిగి యెదిరికిఁ దగులవచ్చును. విజయసింహుఁడెంత లాఘవము కలవాఁడయినను మిక్కిలి తేలికయైన యామె శరీరముతోడి దూకుటలకుఁ బ్రక్కవాటు దెబ్బలకుఁ దట్టుకొనుట కష్టమయి పోయెను. యుద్ధము సమానులయందు జరుగవలయును. తాను సింహము. మఱియొక సింహముతో యుద్ధమాడవచ్చును. ఎదురుగా వచ్చినది లేడి. దానికి భయములేదు. దానియందు దనకుఁ బ్రేమయున్నది. ఆలేడికిని దనకువలెనే కోరలు నఖములు గలవనుకొనును. ఆలేడి యాసింహము నెంత ప్రతారించును. జాంబవతి విజయసింహుని నంత ప్రతారించినది.

ఈ సుహృద్యుద్ధము పూర్తియగువేళకు జాంబవతి నెత్తురు మొగమున కెక్కి శరీరము నందలి నరములుబ్బి యుత్సాహముచేత మొగము వికసించి విజయలక్ష్మివలె నుండెను. విజయసింహునకు నాల్గయిదుచోట్ల శరీరము గీసి కొని పోయి నెత్తురు వచ్చుటయు జరిగెను. ఆ యుద్ధమును దర్శించిన వారిద్దఱే. తల్లియును, ముత్తవతల్లియును. పరిచారిక లచ్చటికి వచ్చుటకు నిషేధింపఁబడిరి. యుద్ధములో జాంబవతి నెరపిన యీ నైపుణ్యమునకుఁ దల్లి చాల సంతోషించెను. తత్కాల సంతోషములో విజయసింహుఁడు పురుషుఁడనియు వివాహితుఁడనియు, జాంబవతి యవివాహితయు స్త్రీయని మఱచిపోయెను. అతనియెడలఁ గలిగిన చిన్నగాయములకు జాంబవతి తనీసుద్దుతోఁ దుడిచి తన తండ్రిగారినాఁటి లేపములలో నడుగుననున్న మిగిలిన కొంచెము మందులను దెచ్చి రాచుచు, బహుప్రసంగములు చేయుచుఁ దాను నవ్వుచు నాతని నవ్వించుచు నీవు నన్నుఁ బసిపిల్లవలెఁ జూచితివి. నాతో యుద్ధమాడలేవు. నాకత్తియొడ్డాణమువలె నటు నిటు తిరుగును, గనుక నీకీ చిన్ని గాయములయినవి. నీ కత్తి పట్టాకత్తి. అది వంగదు! అని యభినందించుచు క్షమాపణలు చెప్పుచు బుజ్జగించుచు, ప్రసంగము చేయుచు వళ్లు రాచుచుఁ దన శరీరము నతని శరీరమునకు మిక్కిలి దగ్గఱగా వచ్చినట్లు నిలుచుండుచు నీపరిచర్యా సమయమునందుఁ దన పయ్యెదజాఱి యతని బుజముపైనను మొగముపైనను బడుచుండగా దానినిఁ దీసి సర్దికొనునపుడు వానిభుజ ముఖస్పర్శలు బుద్ధిపూర్వకముగాఁ జేసినట్లు చేయుచుఁ జెప్పరానంత

విలక్షణమయిన ప్రేమను ప్రదర్శించెను. ప్రతి లక్షణము శృంగారమునందుఁ బర్యవసించుచున్నట్లే విజయసింహునకు భాసించెను. ఈపరిచర్యా సమయములోఁ గొంతసేపామె తల్లియు నామె ముత్తవతల్లియు దగ్గరలేకుండుటయు దటస్థించెను. ఆసమయములో నితఁడు యాదృచ్ఛికముగా నన్నట్లు తానామె యూరుదేశము నంసదేశముల చేతిదండలయందు నడుమునందుఁ దాకెను. ఆమె యీతాకుటను మన్నించుటయే కాక దానికి నవ్వినట్లుకూడఁ గనిపించెను.

ప్రసంగా పతితమయి యేగదిలో జాంజవతి తనకీ పరిచర్య చేసినదో యాగదిలో జాంబవతి యొక్క తెయు నిదురించుననియు నాగదికున్న ద్వారమున కెదురుగాఁ బడమటింటిలో ముత్తవతల్లి నిద్రించుననియు నాద్వారబంధమెప్పుడు తెరచియే యుండుననియు దీపము వెలుగుచునే యుండుననియు, అది యింటికి దక్షిణపువైపు గది. ఆ గదికున్న గవాక్షము మలయానిలాభిలాషనలన నిచ్చలు తెరచియే యుండుననియు నామెతల్లి యీగదికి వాయవ్యమూలనున్న కొంచెపు దూరపుగదిలో నిద్రించుననియు నతఁడు తెలిసికొనెను.

ఆమె తన స్పర్శలను సహించినపుడు నతఁడు తన వ్రేళ్ల నామె వ్రేళ్లతో నొకసారి కలిపెను. ఆమె నవ్వుచు సడలింపించి కొనెను.

చివరకు బయలుదేరి వెడలిపోవుచుండగా జాంబవతి కోటదాటి పొలములలోఁ గొంతదవ్వు తన్నుఁ బంపించుటకు వచ్చెను. విజయసింహుఁడు సాహసముచేసి యిట్లనెను.

"నేనెప్పుడయిన నర్ధరాత్రముసందు వచ్చి నీగదియొక్క దక్షిణదిశా గవాక్షమునందు నిలిచియుందు ననుకొనుము. నన్ను గుర్తుపట్టఁగలవా? దొంగననుకొందువా? యనెను. "ఆమె దొంగవే కదా, దొంగవే యనుకొందును" అని నవ్వెను.

తరువాత మాటాడుటకు వీలులేకపోయెను. ఆమె మరలిపోయెను. ఒకనాఁడా దొంగ వచ్చెను. జాంబవతి భయపడలేదు. తలుపు తెరచెను. అతఁడామెను బలవంతముగా నింటికిఁ గొంతదవ్వు తీసికొనిపోయెను. ఆమె చాలసేపటికి మరలఁ దానువచ్చి తనగదిలోఁ బండుకొనెను. ఆనాటి నిశాశేషమామె యెన్నఁడు ననుభవించని భయమనుభవించినది. ఎన్నఁడు నెరుగని సుఖమునసుభవించినది. ఆ మిగిలినరాత్రి యామె నరకమునకు స్వర్గమునకు నడుమనున్న యొకసన్నని తెరువు వెంటఁ బోవుచున్నట్లుండెను. నడచుటకా తెరువు చాలదు. కొంతసేపీ స్వర్గములోఁ బోవుచుండును. మఱికొంతసేపానరకములోఁ బోవుచుండును. తానేమి చేసెనో యెందుకు చేసెనో తనకేమియు దెలియదు. విజయసింహుఁడు రాగ దలుపు తెరచువరకు దనకుఁ దెలియును. ఏదోయొక మధుర వాంఛ తన హృదయముమీఁదఁ దాండవించెను. తలుపు తెరచిన తరువాతఁ దనమీఁదఁ దనకు నధికారము లేకపోయెను. ఆవాంఛ బదులు భయమొక్కఁడు తన హృదయమును సమాక్రమించెను. అతనితోఁ గలసి యున్నంతసేపు మనసులోఁ బ్రధానముగా నుండెను. లోపలనున్న యామధురభావము వెనుకనున్న చంద్రుని వెలుఁగు ముందున్న నల్లని మబ్బును గ్రుమ్మినట్లే గ్రుమ్ముచుండెను. మబ్బచ్చటనున్న

దన్నమాట నిజమే కాని వెన్నెల ప్రభావమే యెక్కువ యయ్యెను. ఆ మబ్బునకు వెన్నెలను దిరస్కరించు బలము లేకపోయెను.

ఆమెకా నిశాసమయమునందు నిద్రలేదు. ఈ రహస్యము ముత్తవకుఁ దెలియలేదు. తల్లికిఁ దెలియదు.

ఇట్టి రాత్రులొక యేడాదిలోఁ గనీసము పాతిక ముప్పది యైనను గడచెను. ఇంత రహస్యమయిన విషయము లోకమునందెట్లు తెలిసెనో? ఏడాది గడువకముందు తెలిసెను. చాలమంది చెప్పికొనఁ జొచ్చిరి. జాంబవతి తల్లికిఁ దెలిసెను. ముత్తవకుఁ దెలిసెను. నిరంకుశునకుఁ దెలిసెను. కోటలోఁ దెలిసెను. కాని యెవ్వరు నోటితోననరు. జాంబవతి యాగదిలో నిద్రించుటలేదు. నిరంకుశుని గదిలో నిద్రించుట యారంభించెను. విజయసింహుని ప్రయాణము లెప్పుడెప్పుడో తెలిసికొనుటకు నిరంకుశుఁడు నిత్యమును ప్రయత్నములు చేయుచునే యుండెను. నిరంకుశుఁడు తొట్టుపట్టును వదలివచ్చుటకు నేమియువీలుపడని దినములెప్పుడెప్పుడో విజయసింహుఁడు తెలిసికొనుచునేయుండెను. విజయసింహుని రహస్యచారులు తొట్టుపట్టునఁగలరు. నిరంకుశుని యింటిలో నున్న సేవకులలోఁ గొందఱు విజయసింహునికి ననుకూలపడెడివారు. రాజకుమారుఁడని యొక గౌరవము. ధనమిచ్చుచున్నాఁడని యొక యాశ. జాంబవతియందు వారికిఁ గల గౌరవమునకు జాంబవతికి నెవఁడో యల్పుడు భర్తకాక రాజకుమారుఁడు భర్తయగుట వారికభిమానమయిన యంశము. కొన్నాళ్ళిట్లు సాగును. తరువాత విజయసింహుఁడు జాంబ

వతిని వివాహమాడును. ఇద్దఱు ముగ్గురు భార్యలు గల రాజకుమారులు పెక్కుర్దుకలరు. ఇది సేవకుల యుద్దేశ్యము. దక్షిణపు గదివదలి జాంబవతి తన యన్నగారి గదిలో బండు కొనుట యీ వ్యవహారమునకేమియు నభ్యంతరము కలుగ లేదు. నిరంకుశునకుఁ దనయింటిలోని పరిచారకుల యంగీ కృతియు సహాయమును లేకుండనిట్లు జరుగదని తెలియును. వా రెవరో తెలిసికొనుటయెట్లు? అప్పటికిని గొందఱి దండించెను. కొందఱి బెదరించెను. వారు మాకుఁ దెలియదందురు. శిక్షను సహింతురు. ఒకరిద్దఱిని వెళలగొట్టెను. తరువాత నిరంకుశుని కే తెలిసెను. ఇది తనంతట తానల్లరి చేసికొనుట యని. చెల్లె లితో మాటాడుట మానివేసెను. అతఁడు వచ్చి యింటిలో నున్నప్పుడు నామెయు నోదిగియే యుండును. నిరంకుశునకొక యూహతోఁచెను. అతఁడు రాజకుమారుఁడు కనుక సర్వత్ర జనులకుఁ దనయందుఁగంటె నతనియందు గౌరవముండును. అద్దాన నతని రహస్యాచరణము తాను బట్టుకొనఁలేడు. శ్రీ ముఖుడెట్లును యువరాజు. నతనిద్వారా నితనినడకను గుప్తుప ట్టుట సాధ్యముకాదు. నాగార్జునుడున్నాఁడు. నాగార్జును నితోఁ దానెక్కువ చెలిమిచేసి తాను ప్రవర్తించుచున్నది. యీ రహస్యము దెలిసికొనుటకుఁ గాదన్నట్లు గుప్తపఱచి యతని ద్వారా తెలిపికొనవలయును. తనకుఁ గూడఁ జెప్పని కొన్ని ఖడ్గవిద్యా రహస్యములు తన తండ్రి నాగార్జుననకును జాంబవతికిని జెప్పెనని నిరంకుశునకుఁ దెలియును. మున్నెన్ని యోసార్లు జాంబవతి నడుగవలయు ననుకొనెను. అది, తన యన్నగారితనమునకు యోగ్యమయిన పనిగాదు. నాగార్జు

నుఁడు తనకంటెఁ జిన్నవాడయినను విద్య తనతండ్రిది గనుక దా నతనివద్ద నేర్చికొనుటలోఁ దప్పులేదు. విజయసింహుని సాధించుటకుఁ దనకావిద్య యక్కఱలేదు. తాను గంగువద్ద నేర్చిన రెండు మాయావిద్యల బలమున విజయసింహుని నెప్పుడు సంహరించిన నప్పుడే సంహరింపఁగల్గును. కాని విజయసింహుని రహస్యములు తెలిసికొనుటకు నాగార్జునుని స్నేహ మొకమిష. ఇట్లు నిర్ణయించికొని యతఁడు నాగార్జును నితో జెలిమి నారంభించెను. ఈచెలిమి యైదారుమాసములు సాగెను. నాగార్జునునిలో నిరంకుశుఁడు కొన్ని విపరీత లక్షణ ములనుజూచెను. నిరంకుశుని కవియర్థము కాలేదు. ఒకొక్క ప్పుడు నాగార్జునుఁడు మిక్కిలి యుత్సాహముగా నుండును. ఒకప్పుడు దిగులుపడియుండును. ఆ కారణము లితనికిఁదెలి యవు. అది పరాభవసంవత్సరము. వర్షర్తువు వెళ్ళిపోయినది. వర్షఋతువునందు నాల్గయిదుసార్లు విజయసింహుఁడు తన యింటికి వెళ్ళినట్లు తెలిసెను. విజయసింహుని నేర్పేమో! కొన్ని దినములు నిరంకుశుఁడు తాను తోట్రుపట్టునుండి కద లుటకే వీలులేనట్లు నిర్మించుచుండెను. ఆ నాఁడు నాగార్జు నుఁడు మిక్కిలి దుఃఖితుఁడై యుండెను. నిరంకుశుఁడెంతయో యడిగెను. చివరకు నాగార్జునుడిట్లనెను. "ఓయి! మన దేశ ములో నొకమేధావి యొకమహాఖడ్గవిద్యానిపుణుఁడు రాజ్య ములన్నియు తల్లక్రిందులుసేయు ప్రతిభాశాలి యొకఁడు మన రాజుగారి కొలువులో నుద్యోగమునకు వచ్చెను. అతనికి నాకును జాలస్నేహము. అతని కుద్యోగమీయలేదు సరిగదా యతఁడు పరరాజు యొక్క రహస్యాచరుఁడనియు, దుష్టుఁడ

నియుఁ, గొండలు ప్రచారము సాగించిరి. అతనినొక సేనానాయకుఁడుగానో మంత్రిగానో నియమించినచో మనరాజును సర్వభారత చక్రవర్తిగా జేయఁగలవాఁడతఁడు. సిరిరా మోకాలొడ్డుటయన్నది యిట్లే యుండును. అతనిని బంధించుటకు రాజాజ్ఞయైనది. అతనిని వీరా బంధించువారు. అతఁడు నీళ్ళలో మునిగి చేపవలెయోజనము నీదఁగలఁడు. అగ్నిలో విహరించఁగలఁడు. ఉన్నట్లుండి భల్లూకమువలెఁ గనిపించఁగలఁడు. దేవతలను దాను చెప్పినట్లు వినిపింపఁగలఁడు. అతఁడు వీరి కందలేదు. మఱల నతనిఁ గలసికొనుట కష్టముకదాయని నే నింత దుఃఖపడుచున్నాను. నాకుఁ గోపమువచ్చినది. నీ పని నేను చేసిపెట్టెదను.

## ౧౩

శ్రీముఖున కొక కుమారుఁడు. ఆయనకుఁ బదియేండ్లు వచ్చినవి. నాగార్జుననకుఁ కుమార్తె. ఆమె కాఱవయేడు.

విజయసింహునకుఁ బిల్లలు లేరు.

నాగార్జునుని కుమార్తెపేరు సుభద్ర. సుభద్ర మిక్కిలి చక్కనిపిల్ల. ఆమె యెప్పుడును పెదతండ్రుల యిండ్లలోనే యుండును. తెల్లవాఱకమున్నె భామపోయి సుభద్రను

మేల్కొలుపులుపాడి, బతిమాలి బామాలి తనయింటికిఁ దెచ్చును. ఆమె కెప్పుడును గొండమీఁది కోతియే కావలయును. ఆ కొండమీఁది కోతి దిగిరావలసినదే. దిగిరాక పోయినచో భామ విజయసింహుని బ్రదుకనీయదు. కాళింది శ్రీముఖుని బ్రదుకనీయదు. అంతదాక నెందులకు, రోమపాదుఁడే యాకోతి దిగిరానిచోఁ గొండనే క్రిందినుండి ఛేదించుచుఁ బైవఱకుఁ గొండను నేలమట్టము చేయును. ఆ కోతి దిగిరానక్కఱలేదు. కొండయే నేల మట్టమగుసరికి గోతి చేతి కందును. శ్రీముఖుని కుమారుఁడు గూడ నెంతో గారాబముగాఁ బెంచఁబడినాఁడు. కాని సుభద్ర గారాబమునకు దానికిని బోలికలేదు. ఆయన కయిదేండ్లు రాకముందే యక్షరాభ్యాసము చేసిరి. ఇంకఁ జదువేచదువు. ఆచదువొక విధమే మిటి? ఇటు శస్త్రవిద్య, అటు శాస్త్రవిద్యలు. ఎప్పుడును గాళిందివద్ద నుండఁడు. ఆయనయే తానుబోయి వినయశర్మ యింటిలోఁ గూర్చుండును. వినయశర్మ చెప్పెడు పురాణములు వినును. కథలు చెప్పుమని జాహ్నవియొక్క ప్రాణములు తీయును. అట్టి కొడుకుతో గాళిందికి ముద్దు మురిపెములు తీరలేదు. ప్రొద్దుననే భామతీసికొనిపోయి స్నానము చేయించి జడయల్లి కొత్తదుస్తులు కట్టును. భామయటు మల్లునో లేదో సుభద్ర తలచీకిరిబాకిరి చేసికొనును. కట్టిన దుస్తులనిండ నింత బాడిచేసికొనును. ఆ రాజసౌధములో బాడి యెచ్చట దొరకునని ప్రశ్న ఏదోఒకమూలనింత రాగిడి మట్టి ప్రోవుచేసి ముద్దగా నుంచఁబడును. ఆ ముద్ద యచట నుండి తీరవలయును. లేనిచో నీమె యేడ్చును. ఎందుకయ్యా

యీ పట్టియనఁగా సుభద్ర దానితో బండిచక్రములు చేయవలయును. బొమ్మలు చేయవలయును. ఇంతలోఁ గాళింది కబురంపును. ఆమె సుభద్రకు నీ సర్వాలంకారములు చేయవలయును. అక్కడనుంచి నాయనమ్మగారి యింటికిఁ బోవలయును. కొంతసేపు సోమపామని యొడిలోఁ గూర్చుండవలయును. ఆయన దుస్తులును బాడికావలయును. ఒక్కొక్కప్పుడచ్చటనే భోజనముచేయును. ఒక్కొక్కప్పుడు నీల కబురంపును కబురంపినందువలన బ్రయోజనములేదు. ఒక్కొక్కనాఁడు సుభద్ర ప్రొద్దుక్రుంకి నీలవద్దకు వెళ్ళినచో వెళ్ళినట్లు లేనిచో నాయనమ్మగారి వద్దనో యిద్దఱు పెదతల్లులలో నెవరివద్దనో యుండును. నాగార్జునునకు సుభద్ర యెచ్చటనున్న నొక్కటియే. అసలు సుభద్రను గుఱించి పట్టించుకోఁడు. కాని పరాభవనామ సంవత్సర కార్తీకమాసము నుండి తనకూతురు విషయము పట్టించుకొను చున్నాఁడు. ఆమెకోసము విజయసింహునింటికిఁ బోవును. శ్రీముఖుని యింటికిఁబోవును. సుభద్ర యిచటనున్నదా యని యడుగును. లేదందురు. పోఁబోవుదు, కూర్చుండుమందురు. ఇట్లు శ్రీముఖ విజయసింహుల గృహములలోఁ బలుసార్లు కూర్చుండుటయు నాగిపోవుటయు భోజనములు కూడ నచ్చటనే చేయుటయు నన్నగార్లతో నెదో యెదో దీర్ఘ దీర్ఘ ప్రసంగములు చేయుటయు నాల్గయిదు నెలలలో మిక్కిలి వృద్ధిపొందెను. నాగార్జునుఁడు మంచిమాటకారి. చమత్కారముగా మాటాడగలఁడు, కొన్ని యద్భుతమయిన కథలు చెప్పగలఁడు. నవ్వించఁగలడు. మరియు బహువిద్యలను గూర్చి యగాధముగా

మాటాడఁగలఁడు. ఆయనకెట్లు తెలియునో మ్లేచ్ఛులయాచారములు, వారికథలు, వారి విశ్వాసములు, వారి విద్యలు, వారి దేశములు, వారి చరిత్రలు సమృద్ధిగాఁ దెలియును. వానిని గూర్చి శ్రీముఖుఁడెంతయు గోరికతో నడుగును. శ్రీముఖుఁడు భవిష్యత్తులో రాజు కాఁబోవుచున్నాఁడు గనుకఁ దనకీ విజ్ఞానమంతయుఁ దెలిసికొనవలయునని కోరికయున్నది. గోదావరీ తపతీ నదుల మధ్య నాటవికులుగా మాఱిపోయిన మ్లేచ్ఛజాతులు కలవు. వారు నాల్గయిదు వందల యేండ్లనుండి విదర్భమీదికిఁ గాని యాంధ్రముల మీదికిఁగాని వచ్చుచుండుటలేదు. వారితాకిడి నిషధ చేది దేశములమీఁద నున్నది. కథాప్రసంగముల యందు నాల్గయిదు వందల యేండ్లకుఁ బూర్వము వారితాకిడి యాంధ్రముల మీదనుండి లేదని వినబడుచుండును. వారు నాల్గువందల యేండ్లటు నాల్గువందల యేండ్లిటు వారి దండయాత్రలు నెఱపుచుందురని యొక సంప్రదాయముకలదు అందుచేత శ్రీముఖుఁడు తన రాజ్యకాలములో నది ప్రారంభింప వచ్చునని యనుకొనుచుండెను. అద్దాన నాగార్జునుని నుండి యాకథలు వినుటయందు మిక్కిలి యిష్టము కలవాఁడుగా నుండెను.

ఈ ప్రసంగములలో శ్రీముఖునకుఁదన రెండవతమ్మునిమీఁద మిక్కిలి గౌరవము కలిగెను. విజయసింహుని శీలమును గూర్చి కొన్నికింవదంతులు కలవు. గాని నాగార్జునుని శీలము గుఱించి రేఖామాత్రమయిన యపవాదు లేదు. నాగార్జునుఁడు ఖడ్గవిద్యా రహస్యవేత్త యనికూడ నందఱకుఁ దెలియును.

యీ మట్టియనఁగా సుభద్ర దానితో బండిచక్రములు చేయవలయును. బొమ్మలు చేయవలయును. ఇంతలోఁ గాళింది కబురంపును. ఆమె సుభద్రకు నీ సర్వాలంకారములు చేయవలయును. అక్కడనుంచి నాయనమ్మగారి యింటికిఁ బోవలయును. కొంతసేపు రోమపాదుని యొడిలోఁ గూర్చుండవలయును. ఆయన దుస్తులును బాడికావలయును. ఒక్కొక్కప్పుడచ్చటనే భోజనముచేయును. ఒక్కొక్కప్పుడు నీల కబురంపును కబురంపినందువలన ప్రయోజనములేదు. ఒక్కొక్కనాఁడు సుభద్ర ప్రొద్దుక్రుంకి నీలవద్దకు వెళ్ళినచో వెళ్ళినట్లు లేనిచో నాయనమ్మగారి వద్దనో యిద్దఱు పెదతల్లులలో నెవరివద్దనో యుండును. నాగార్జునునకు సుభద్ర యెచ్చట నున్న నొక్కటియే. అసలు సుభద్రను గుఱించి పట్టించుకోఁడు. కాని పరాభవనామ సంవత్సర కార్తీకమాసము నుండి తనకూతురు విషయము పట్టించుకొను చున్నాడు. ఆమెకోసము విజయసింహునింటికిఁ బోవును. శ్రీముఖుని యింటికిఁబోవును. సుభద్ర యిచటనున్నదా యని యడుగును. లేదందురు. పోఁబోవుదు, కూర్చుండుమందురు. ఇట్లు శ్రీముఖ విజయసింహుల గృహములలోఁ బలుసార్లు కూర్చుండుటయు నాగిపోవుటయు భోజనములు కూడ నచ్చటనే చేయుటయు వన్నగార్లతో నేదో యేదో దీర్ఘ దీర్ఘ ప్రసంగములు చేయుటయు నాల్గయిదు నెలలలో మిక్కిలి వృద్ధిపొందెను. నాగార్జునుఁడు మంచిమాటకారి. చమత్కారముగా మాటాడ గలఁడు, కొన్ని యద్భుతమయిన కథలు చెప్పగలఁడు. నవ్వింపఁగలడు. మరియు బహువిద్యలను గూర్చి యగాధముగా

మాటాడఁగలఁడు. ఆయనకెట్లు తెలియునో మ్లేచ్ఛులయాచారములు, వారికథలు, వారి విశ్వాసములు, వారి విద్యలు, వారి దేశములు, వారి చరిత్రలు సమృద్ధిగాఁ దెలియును. వానిని గూర్చి శ్రీముఖుఁడెంతయు గోరికతోఁ నడుగును. శ్రీముఖుఁడు భవిష్యత్తులో రాజు కాఁబోవుచున్నాఁడు గనుకఁ దనకీ విజ్ఞానమంతయుఁ దెలిసికొనవలయునని కోరికయున్నది. గోదావరీ తపతీ నదుల మధ్య నాటవికులుగా మాఱిపోయిన మ్లేచ్ఛజాతులు కలవు. వారు నాల్గయిదు వందల యేండ్లనుండి విదర్భమీఁదికిఁ గాని యాంధ్రముల మీఁదికిఁగాని వచ్చుచుండుటలేదు. వారితాఁకిడి నిషధ చేది దేశములమీఁద నున్నది. కథాప్రసంగముల యందు నాల్గయిదు వందల యేండ్లకుఁ బూర్వము వారితాఁకిడి యాంధ్రముల మీఁదనుండి లేదని వినబడుచుండును. వారు నాల్గువందల యేండ్లటు నాల్గువందల యేండ్లిటు వారి దండయాత్రలు నెఱపుచుందురని యొక సంప్రదాయముకలదు అందుచేత శ్రీముఖుఁడు తన రాజ్యకాలములో నది ప్రారంభింప వచ్చునని యనుకొనుచుండెను. అద్దాన నాగార్జునుని నుండి యాకథలు వినుటయందు మిక్కిలి యిష్టము కలవాఁడుగా నుండెను.

ఈ ప్రసంగములలో శ్రీముఖునకుఁదన రెండవతమ్ముని మీఁద మిక్కిలి గౌరవము కలిగెను. విజయసింహుని శీలమును గూర్చి కొన్నికింవదంతులు కలవు. గాని నాగార్జునుని శీలము గుఱించి రేఖామాత్రమయిన యపవాదు లేదు. నాగార్జునుఁడు ఖడ్గవిద్యా రహస్యవేత్త యనికూడ నందఱకుఁ దెలియును.

నాగార్జునుఁడు ప్రసంగించుచున్నప్పుడు పరమభారతీయుఁడు సాంప్రదాయమునందు వేదశాస్త్రపురాణాది విషయ పరిజ్ఞానమునందు నాగార్జునుని పాండిత్య మగాధమైనదిగాఁ గనిపించెను. అతనికి శ్రౌతము బాగుగాఁ దెలియును. అనేక క్రతువులు చేయుటలోఁ గల రహస్యములు నాగార్జునున కెన్ని తెలియునో వానినిఁ గూర్చి దీర్ఘోపన్యాసములు చేయును. నాగార్జునుని కిదియంతయు జయద్రథుఁడు నేర్పిన విద్య. జయద్రథుఁడితనితో నాయా క్రతువుల యొక్క యాచరణక్రమములు చెప్పి వానియన్నింటియందు దోషములు చూపించెడివాఁడు. నాగార్జునుని విశ్వాసము జయద్రథుఁడు చూపించిన దోషములయందు శ్రీసుఖునితోఁ జెప్పెడిది తత్కార్యాచరణ విధానము. ఎప్పుడయిన విజయసింహుని ప్రస్తావన వచ్చినచో నాగార్జునుఁడు తూష్ణీంభావము వహించెడివాఁడు. నిరంకుశుని చెల్లెలు తమ యందఱకు గురుపుత్రిక. సోదరివంటిది. వారికిని దమకు సంబంధములు లేవు. నిరంకుశుని తండ్రి యందిది ద్రోహము. బంధుత్వము చాల దూరమయినను దమకు దమకు వరుసకాదు. నిరంకుశుఁడు రాజ్యాధికారులలో నొకఁడు. అతనికిది యిష్టమో కాదో అతనికిఁ గోపమువచ్చునట్లు ప్రవర్తించుట న్యాయముకాదు. జాంబవతినతఁడు పెండ్లి చేసికొనినచో నెవ్వరికి నభ్యంతరములేదు. భామయుండఁగ విజయసింహుఁ డింకొక భార్యనుచేసికోఁడు. భామకుసంతానము లేదు. లేకపోయినను విజయసింహుఁడు మరల వివాహముచేసికొనఁడు. అట్టి సందర్భములో జాంబవతీ శీలము పాడ్వఱచుట న్యాయము కాదు. ఈ మాటలన్నియు నొక్కసారి యనినవి

కావు. కొన్ని నెలలమీఁద నెప్పుడో యెప్పుడో వీనిలోని యొక్కొక్కమాట వచ్చెను. మఱియొకప్పుడు శ్రీముఖుఁడు జాంబవతి విజయసింహుల సంబంధ మున్నట్లే తాను విశ్వసించననెను. నాగార్జునుఁడు తనకును విశ్వాసము లేదనెను. శ్రీముఖుఁడు నాగార్జునుని వంక నిశ్చలముగా జూచెను. నాగార్జునుఁడు నవ్వెను.

ఇంక నాగార్జునుఁడు విజయసింహునింటికి గూడ బోవుచుండును. అచ్చటఁగూడ నెక్కువసేపుండును. ఆ యుండుట యెక్కువ సాయంకాలముల యందు విజయసింహుని ఖడ్గాభ్యాసకాలములయందు. క్రమక్రమముగా నన్నదమ్ములిద్దఱు కత్తులు పుచ్చికొని యభ్యాసముచేయుట లోనికిదిగినది. విజయసింహునకుఁ గ్రమముగా ఖడ్గవిద్యలో జాంబవతి చూపించిన లాఘవములు మెలఁపులు నాగార్జునునియందు గనిపించినవి. ఓహో! ఇదియొక చిత్రమయిన విద్య. ప్రయోగమునందుఁ గంటె సిద్ధాంతములందెక్కువ రహస్యములు గల విద్య. గురువువద్ద నభ్యసించినచోఁ బ్రయోగబాహుళ్యము గల విద్యయే వచ్చును. సిద్ధాంతమునందలి కొన్ని రహస్యములు తెలియును. వానికిఁ బ్రయోగప్రాచుర్యము లేదు. అది చెప్పుటకును వీలులేదు. విన్నదానినిబట్టి యొక యోజగా నొక యేసగాఁ గత్తులను మెలచుటలో ఝుళిపించుటలో సారించుటలో గొన్ని విశేషములు భాసించుచుండెను. అవి జాంబవతికిఁ దెలియును. నాగార్జునునకుఁ దెలియును. విజయసింహునకు జాంబవతితో నిశాపరిచయమే కాని దివాపరిచయము లేదు. నాగార్జునునితో దివాపరిచయమేర్పడెను. నాగార్జు

నుఁడు పలుసార్లు జాంబవతీ ప్రస్తావనచేయుచు వచ్చెను. గురువు జాంబవతికిని దనకును గలిపి యీ రహస్యములు చెప్పెనని యొకసారి వీనినిఁ బ్రయోగించుటలో స్త్రీలకున్న చాకచక్యము పురుషులకుండదనియు జాంబవతి వీనినిఁ జాల నేర్పుతోఁ బ్రయోగించునని యొకసారి జాంబవతినిఁ దానెప్పుడో చూచెను మరలఁ జూడనేలేదని యొకసారి ఇట్లు ఎడవ దడప జాంబవతీ ప్రస్తావనయు గురుభార్యా ప్రస్తావనయు నా యింటిలోని వృద్ధాంగనా ప్రస్తావనయు నిరంకుశుని గూర్చి ప్రస్తావనయు జేయుచుండెను. ఈ ప్రసంగములలో నెప్పుడును విజయసింహునితో జాంబవతి సంబంధమున్నదన్న మాట దనకుఁ దెలిసినట్లు గాని, యనుమానమున్నట్లు గాని, నాగార్జునుడుఁ విజయసింహునకుఁబొడఁ గట్టనీయలేదు. విజయసింహుఁడే యొకటి రెండుసార్లు తమ సంబంధమునుగూర్చి నాగార్జునునకుఁ దెలియునో తెలియదో కనుగొనుటకుఁ గొన్ని మాట లనెను. దానికి నాగార్జునుఁడు మూఢునివలె సమాధానములు చెప్పెను. విజయసింహునకు విశ్వాసము కలిగెను. నాగార్జునుఁడు నీలయందు బద్ధానురాగుఁడని, నీలకుదాసుడని, యేరికోరి నీలను బెండ్లాడెనని, నీలవంకఁ దప్ప మరియొక స్త్రీ వంక కన్నెత్తి చూడడని, సర్వజనులకు విదితమయిన విషయమే. నాగార్జునుని గురించి యొక్కటియే యనుమానము. ఆ యనుమానము తనకుఁ జంద్రశేఖరవర్మ కలిపించినది. నాగార్జునుఁడు కొన్ని గాఢమేఘపరిచ్ఛన్న నిశాసమయము లందు క్షుద్రవిద్యలు ప్రదర్శించు మ్లేచ్ఛవాటికూటములకుఁ బోయి యెదో నేర్చికొనివచ్చునన్నది. దానికి నతని శీలమున

కేమి సంబంధము? నాగార్జునుఁడు సహజముగా నెవరి జోక్య మును బట్టించుకొనువాఁడు కాఁడు. అతని నీలయేమో అతని దైనందినచర్యయేమో విజయసింహునకు నాగార్జునునియందు గాటమయిన ప్రశ్రయము గలిగెను. ఒకనాఁడేదో ప్రస్తావ నలో ఖడ్గవిద్యాభ్యాసమున నడిమభాగమునఁ గొంచెము సేపు విశ్రమించుచుండఁగా నాగార్జునుఁడిట్లనెను. 'అన్నగారూ! మీవిద్య రణరంగముల కుపయోగపడెడిది. ఏనుగుల తొండ ములు నఱకుటకు గుఱ్ఱముల ముంగాళ్లు నఱకుటకు సతను త్రాణములయిన శత్రువీరుల కంఠములు మధ్యములు బాహు వులు నఱకుటకు నుపయోగించెడి విద్య. నాకును జాంబవతి కిని దెలిసినవిద్య యొడలికిఁ బూసికొనినగంధము మేనుగీసి కొనిపోకుండ గత్తిసాములో జేడులుతీసెడి పరమసుకుమార విద్య. ఈ రెండువిద్యలొక్కచోట నుండవు. ఈ సుకుమార విద్య నేర్చినవాఁడు మీ కఠోరవిద్య నేర్చికొనలేఁడు. ఈమీ కఠోరవిద్య నేర్చికొనినవాఁడీసుకుమారవిద్య నేర్చికొనవ చ్చును. ఈ కఠోరసుకుమార విద్యలు రెండును జతకూడి నచో నెంతయో బాగుండును.' అనెను. విజయసింహుఁడు మనమిద్దఱము కలసియున్నచో నీ రెండువిద్యలు జతకూడి నట్లే గదా యనెను.

నాగా- 'అట్లు కాదయ్యా! ఆ విద్యనేర్చిన స్త్రీతో నీకుఁ బరిచయము కలుగ వలయును. ఆమె నీకు భార్య కావ లయును. భామాదేవిగారి కీవిద్య వచ్చినచో నదియొక విలక్ష ణముగానుండును. ఆమెకీవిద్య నెవరు నేర్పుదురు? జాంబవతి చేత నేర్పింపరాదా? ఐనను గురువుగాను మన్నించిన తరు

వాత జాంబవతి యీవిద్యను మఱచిపోయియేయుండును. నిరంకుశుఁ డప్పుడప్పుడు నావద్దకు వచ్చుచుండును. జాంబవతి యొక్క ప్రస్తావనయే చేయఁడు అనెను. విజయసింహుఁడు మాటతూలి యిట్లనెను. జాంబవతి యిక్కడికి వచ్చుట యెట్లు? భామ కీవిద్య నేర్పుట యెట్లు? భామ సుకుమార విద్యలు నేర్చినది కాని కత్తిసాము తెలియఁగదు' అనెను.

తరువాతఁ గ్రమ క్రమముగా జాంబవతీ ప్రస్తావన పెటిగెను. అమె సౌందర్య ప్రస్తావన సాగెను. కొంచెము కొంచెముగా విజయసింహుఁడు నాగార్జునునితోఁ దన కామెయందు గల యభిలాషను వెలిబుచ్చెను. పరాభవ సంవత్సరము పూర్తి యయ్యెను. ప్లవంగ సంవత్సర మారంభించెను. వసంతర్తువు గడచుచుండెను.

ఒకనాఁడు కోటలోని గున్నమామిడిపైఁ గోకిల కూసెను. సాయంకాలముల మలయానిలము వీచుచుండెను. భామవచ్చిన యెన్నో యేండ్లకు భామను బుట్టినింటివారు తీసికొనిపోయిరి. ఆమెను బుట్టినింటివారు తీసికొనిపోవుటకు రోమపాద మహారాజుగారి యనుజ్ఞ యెంతో కష్టముమీఁద గలిగెను. నెల దినములనుండి భామ యూరిలోలేదు. నిరంకుశుఁడు తన కోటలో నెక్కువ కట్టుదిట్టముచేసెను. ప్రాత పరిచారకుల నందఱిని తీసివేసెను. క్రొత్తవారిని బెట్టెను. విజయసింహుఁ డేమార్గముచేతను దనకోటలోనికి వచ్చుటకు వీలు లేకుండ నష్టదిగ్బంధనము చేసెనా యన్నట్లుండెను. తమ శస్త్రవిద్యారంగభూమికి దక్షిణముగానున్న మల్లెపూదోటపై

నుండి పరిమళ లహరీతరంగములు మాటిమాటికి వచ్చి తాకు చుండెను. విజయసింహుఁడు సొమ్మసిలిపోయెను. వావిడిచి మనసుపట్టువదలి గుండెగూడుచెదరి నాగార్జునునితో నిట్లనెను. 'ఓయీ' నీవు పరమసత్పురుషుఁడవు. నీవైకవ్రతుఁడవు. నేనట్లుకాదు. నేను మనతండ్రి కడుపునఁ బుట్టఁదగినవాఁడను గాను. ఇన్నాళ్లు దాచితిని. నీతో నొకరహస్యము చెప్పెదను ఎవ్వరితోడను జెప్పనని ప్రమాణము చేసినచో చెప్పెదననెను.' నాగార్జునుఁడు దేనిమీఁదఁ బ్రమాణము చేయమందువనెను. వేదశాస్త్రములమీఁదఁ బ్రమాణము చేయుమని విజయసింహుఁడనెను. మ్లేచ్ఛభావ నిమగ్నచిత్తుఁడైన నాగార్జునునకు వేదశాస్త్రములు ప్రమాణములు కావు. వానిమీఁద బ్రమాణము చేసెను. ఒకటి తమ్ముఁడు, రెండేక పత్నీవ్రతుడు, మూఁడు బహువిద్యావేత్త, నాల్గు తనకు ఖడ్గవిద్యారహస్యము లెన్నో చెప్పినవాఁడు, ఐదు తనముద్దువంతయు జూఱగొన్న సుభద్రకుఁ దండ్రి, ఆఱు తాను తనతండ్రి కడుపునఁ చెడబుట్టితి ననుకొనుచుండగా నట్టి దోషములేకుండఁ బ్రవర్తించుచుఁ దన తండ్రి కడుపునఁ బుట్టినవాఁడు. ఏఁడు తానెక్కువ మర్యాద నెఱపుటకు యువరాజుకాఁడు.

ఇన్నికారణములచేత భామతనవద్దలేకుండుటచేత జాంబవతి దర్శనమయి కొన్ని నెలలగుటచేత నామెగర్భనమగుట మిక్కిలి దుస్తరముగా గనిపించుటచేతఁ బులస్కోకిలారావము చెవులలో గింగురెత్తించుటచేత మందమారుతములు తన మేనియందుఁ దేళ్ళలు బ్రాకించుటచేత మాఘ్యసుమమాదక పరిమళ తరంగములు ఘ్రాణేంద్రియమునందుఁ జొరబడి

కాళహస్తీశ్వరస్వామి భక్తులయిన సర్పానేకపముల మాత్సర్య సమయమునందు సర్పము దంతావళ నాసారంధ్రముల నుండి యెగఁబ్రాకి కుంభస్థలమునఁ బీటపెట్టికొని కూర్చున్నట్లు తన్ను బాధించుటచేతఁదాను బేలవోయి నాగార్జునునితోఁ దన యొక్కయు జాంబవతి యొక్కయు శృంగారకథ యంతయుఁ జెప్పివేసెను. నాగార్జునుఁడు మిక్కిలి సానుభూతితో వినెను. ఎంతో సంతోషించినట్లు నటించెను. విజయసింహుఁడు తాను జేసిన పని దోషభూయిష్ఠమనుచుండఁ నాగార్జునుఁడు దానినిఁ గాదని సమర్థించుచుండెను. 'అన్నా నాకుఁ దెలియును. జాంబవతిచేత నీ విద్య వదినెగారికిఁ జెప్పించుమంటిని. చెప్పించ నక్కఱలేదు. జాంబవతితో నీకీసంబంధము కలదేని రెండు చోట్ల విడివిడిగానుండు నీ విద్యలు సమావేశమయి యొక్క చోట నున్నట్లే. ఆమెతో నెప్పుడైనఁ గత్తియుద్ధము చేసితివా. తొలిసారి మీ పరిచయమట్లే కలిగినదని చెప్పితివి కదా. అన్నా! జాంబవతి యెంత యదృష్టవంతురాలయ్యా! నీ వంటి భర్తదొరకుట యామె భాగ్య విశేషము. ఆమె సౌందర్యమునకు నీ మహాశౌర్యమునకు సరిపోయినది. పరమేశ్వరుడట్లన్నియు నాలోచించి సమకూర్చెను. మీ యిరువురి సమాగమమునకు నా యాత్మయెంతో సంతోషించుచున్నది! యని తన యానందమంతయు మొగములో భాసింపఁజేసెను.

తరువాత వారిద్దరెప్పుడు గలిసికొనినను జాంబవతి ప్రస్తావన తప్పకుండ వచ్చుచుండెను. నాగార్జునుఁడు జాంబవతిని వివాహమాడుమని యతనితోఁ జెప్పెను. అతఁడట్లు పొసగదని యనును. తాను బోయి మహారాజుతో మహారా

జ్ఞతో జెప్పి యొప్పింతుననును. పూర్వమున లేఁగాదు. ఇప్పుడు తనకు యువరాజుగారితో నధికపరిచయము కలదు వారిచేతఁ గూడ నొప్పించగల ననును. దేనికిని విజయసింహుఁడంగీకరింపఁడు.

ఒకనాఁడు నాగార్జునుఁడిట్లనెను. ఏమయ్యా! మీరిద్ద రొకరినొకరు ప్రేమించుచుండిరా యేమి. పరస్పరము సంబంధముగల వారాయెను. వివాహమునకు వెనుదీయుదు వేల' యని బలవంతముచేసి యడుగఁగా విజయసింహుఁ డిట్లనెను. ఓయీ! నేనామెను బెండ్లియాడఁదలచి కొనలేను. ఆమెతోఁ జెప్పితిని. ఆమె యంగీకరించినది. భామయుండఁగా నేనింకొక స్త్రీని వివాహమాడను. భామచేతఁగూడ నంగీకరింపఁ జేయగలనని నాకు విశ్వాసమున్నది. కాని నేనట్లు చేయను. భామకిదివఱకే ద్రోహము చేసితిని. ఆమె మనస్సులో నీ సంగతి యొక యనుమానముగా నున్నది. ఆ యనుమానము దూరమై యెచ్చటనో యున్నది దానిని నేను బెడబెడగా ద్రోయుచున్నాను ఓయీ! భామయనఁగా నొక దేవతాస్త్రీ. మనకోటకు వచ్చిన యందఱును దేవతలే. భామలో నొక వైలక్షణ్యమున్నది. దానికేమి. అన్నదమ్ములలో నిట్టివి చెప్పుకోదగినవి కావు. కాని నాగా! నీవు నాకు సోదరుఁడవుగాఁ గనిపించుటలేదోయి, పరమాప్తుఁడయిన యొక స్నేహితునిగా గనిపించుచున్నావు. భామ మనస్సున కాకష్టము నేను గలిగించుట కిష్టములేదు. జాంబవతియు దీనికనుకూలురాలు. ఆమెతో నిదంతయుఁ జెప్పితిని. ఆమెకు మేమిరువురము వివాహమాడుట పొసగదని తెలియును. ఆమె నన్నే భర్తగా నారా

ధించును. నిరంకుశుండు బలవంతము చేసినను దాను వివాహ మాడదు. నేను వివాహమాడవలయునన్న పట్టుదలయు నా మెకు లేదు. ఆమె యొక విచిత్రమైన స్త్రీ సృష్టి. ఆమెలో స్త్రీ త్వమున్నది. స్త్రీత్వములేదు. నేనున్నయప్పుడు మదవరో ధము వలన నామెయందుఁ బురుష వాంఛ యుత్పన్నమగును. తక్కినప్పుడా వాంఛ యామెయందు లేదు. అస్మత్ప్రేమ సమావేశమునందు నామెకు లోకసహజమయిన శృంగార హేలాభావనయేగాని శరీరగతవాంఛలేదు. తచ్ఛరీరగత వాంఛా నిర్వహణము జాంబవతియందు నన్ననుసరించుట మాత్రమే. ఆమెకు నేనే భర్తను. లోకసహజమయిన వివాహమాడనక్క ఱలేదు. ఆమెకు నన్ను మాటిమాటికిఁ గలసికొనవలయునని యుండదు. నేనెచ్చటనున్నను మనసులో నన్ను భావించు చుండును. నేనామె వియోగము ననుభవించుచుంటిని. ఆమె నా వియోగము ననుభవించదు. నేనామెను గలిసికొన్నప్పుడు శృంగారరస లోకములయందు భామ నాయందెంత యనుకూల వతియో యామెయు నంతయనుకూలవతి” యని యుస్సుర నెను. దిగులుపడెను. ఖిన్నుఁడయ్యెను. సింహమువంటి విజయ సింహుఁడు పిల్లి యయ్యెను. అతనిని జూచిఁ నాగార్జునుఁడు మిక్కిలి జాలిపడినట్లు నటించెను. యొక యుత్సాహము తెచ్చి కొని యిట్లనెను. “నిరంకుశుని దుష్టత్వము వలన మీ సమా గమము కలుగుటలేదు. నిరంకుశుఁడు నావద్దకు వచ్చుచుం డును. నేనతని కనుగప్పి మీ యిద్దఱికి సంయోగము ఘటింపఁజేసెదను. మీ రిద్దఱును గలిసికొనుటకు నే ననుకూలత యేర్పఱచనచో నన్నుమాఱుపేరఁ బిలువుము. ఇది ప్రతిజ్ఞ.

మీ సంబంధము మానుషాతీతమైనది. దైవమునుగూడ నతిక్రమించినది. జాంబవతి వంటి యువతి సృష్టిలోనుండదు. నీవు చెప్పఁగా నేను వినిన దానినిబట్టి యా యేకాగ్రత యా నిర్మమత యా స్త్రీసృష్టి లక్షణము ననుసరించుట యా యోగినివలె నుండుట యివి యద్భుతమయిన విషయములు. ఏ స్త్రీయు నిటులుండదు. యామె యొక యాశ్చర్యమైన స్త్రీ సృష్టి. ఆమెను నిన్ను సమావేశపరచినచో నా మనసులో నేవిచిత్రమైన భావావేశము కలదో యా భావావేశమునకుఁ దృప్తి కలుగదు' అని పదిపండ్రెండు సారులు జెప్పి విజయసింహు నూఱార్చి వెడలిపోయెను.

తరువాత నొకనాఁడు శ్రీముఖునితో బ్రసంగించుచుండగాఁ జాంబవతి విజయసింహుల సంబంధము చాల నిశ్చితమయిన విషయమని తాను జెప్పుట కిష్టములేనివానివలెఁ జెప్ప వలసినచో దానిని ఋజువు పఱచఁగలనని గూడఁ జెప్పెను. ఏ నాఁడు విజయసింహుఁడు జాంబవతీ దర్శనమునకు వెళ్ళునో యేవేళకు వెళ్లునో తాను జెప్పఁగలననియు, వలసినచో శ్రీ ముఖుఁడు తానంతట తానేపోయి స్వంతకన్నులంతోఁ జూచి దృఢపఱచికొనవచ్చుననియుఁ జెప్పెను. అంతియే కాక విజయసింహుఁడు చెప్పిన మాటలన్నియుఁ జెప్పి తాను జాంబవతిని పెండ్లియాడుమని చెప్పెననియు నతఁడంగీకరించ లేదనియు నిది చాలనధర్మమయిన విషయమనియు నొక్కియునొక్కకుండఁ దనకుఁ బట్టనట్లు తనకున్న యామర్యాదయంతయు నది యధర్మమగుటలో మాత్రమే యున్నట్లు నటించెను. శ్రీముఖున కధర్మమనినచో సుంతయు నిష్టములేదు. ఆయనకుఁ గోప

మువచ్చెను. తన తండ్రికడుపున బుట్టెఁ వాఁడిట్లు చేయుట యతనికేమియు సంగీకారముగా లేదు. తాను దన కన్నులతోఁ జూచినగాని తాను నమ్మఁడు. శ్రీముఖుఁడిట్లుం డెను.

నాగార్జునుఁడు నిరంకుశునితో నీ సంగతి నెమ్మది నెమ్మదిగా గదపి యతనిని గొంతమువ్వి కొంతతెచ్చగొట్టి పలు విధములుగా నతనినిఁ గ్రిందుమీఁదఁ బెట్టెను. చివఱకు నిరం కుశు డేమియు జేయలేని స్థితియందుం డెను. అదియట్లుజరిగినచో నిట్లుజరుగును. ఇట్లు జరిగినచో నట్లుజరుగును. కాలికివదలించు కొన్నచో ప్రేలికి, ప్రేలికిఁదీసినచోఁ గాలికివేసి, వేయివిధము లుగా నిరంకుశు నాడించెను. ఆ నిరంకుశుఁడు నాగార్జునుని తెలివికి నివ్వెఱపోయెను. నాగార్జునుఁడు వామనుఁడు. అందఱు రాజకుమారులును శరీరవ్యాయామము చేసినవారే. అందు చేత దృఢశరీరుఁడయ్యును నాకార విశేషముచేత వామనుఁడు. వామనుఁడయ్యును నొకానొకఁడు కండపుష్టిచేత నింతలొమ్ము నింతలావు దండలును, నెలుఁగుబంటివలెఁ బెరుగును. నాగా ర్జునుఁడట్లు పెరుగలేదు. అతఁడు చిన్నప్పటినుండి యొడలు పెరుగకుండ నొడలుగట్టిపడు వ్యాయామము చేసెను. వామ నుఁడే గాక బక్కపలుచని వాఁడని కూడఁ జెప్పవలయును. అతని మొగములో గాంభీర్యమే గనిపించదు. ఆతనిఁ జూచినచో నెవ్వరికిని గొప్పరాజవంశీయుఁడనిగాని ప్రతిభాశాలియనిగాని తోచదు. బాగుగాఁ బరిచితులగు వారికి నిరాదరణము చేయ దగినవాఁడని తెలియును. కాని నిరంకుశునికితఃపూర్వము నాగా ర్జునుడింత తెలివి గలవాఁడని తెలియదు. నిరంకుశునకేమి,

మఱియెవ్వరికిని దెలియదు. అతఃపూర్వము నాగార్జునునకే తెలియును. తనవద్ద నంత తెలివి యున్నదని యనుకొనలేదు. జయద్రథుని సంయోగముచేత నతనిలోని తెలివియంతయు బయటికి వచ్చెను. జయద్రథుఁడు తొలుత నాగార్జునుఁడు తాను చెప్పినట్లు విను ననుకొనెను. తాను జూపించిన యింద్రజాలమునకు నాగార్జునుఁడు వశుఁడు కాలేదు. తాను ప్రదర్శించిన ఖడ్గవిద్యా ప్రదర్శనమునకు నాగార్జునుఁడు నివ్వెఱపోలేదు. తరువాత జయద్రథుఁడు తెలిసికొనెను. నాగార్జునుఁడు సహజముగా విపరీతబుద్ధి. అతనికి భారతీయ ధర్మమునందు విశ్వాసములే దవిశ్వాసము లేదు. మ్లేచ్ఛభావములలం దాదరములే దనాదరములేదు. ఆ యర్ధరాత్రమున జయద్రథుఁడు నాగార్జునునకు ముసలిదానిని యక్షిణిగాఁ జూపిన తరువాత నగ్నిగ్రామములో నున్న యింటికి వచ్చిన తరువాత నాగార్జునుఁడు జయద్రథునిట్లడిగెను. 'ఏమయ్యా! ఆ గుహలో వెనుక నింకొక గూఢమున్నదా? ఆ ముసలిదాని నందులోనికి బంపించితి'వన, జయద్రథుఁడు తెల్లబోయెను. నాగార్జునుని మీఁదఁ దన ప్రయోగములన్నియు వ్యర్థమయ్యెను. ఒక్కటియే మిగిలినది. నాగార్జునునకు నీల రాణి కావలయు నన్న కోరిక. ఇంక జయద్రథుఁడు దానిమీఁదనే తనయాశ పెట్టికొనెను. జయద్రథుఁ డేదయినఁ జెప్పఁబోయినచో నాగార్జునుఁడు నిరాదరముగా నవ్వెను. మఱియు నొత్తిడిచేసినచో నాకుఁ దెలియునులే యనును.

ఇట్లుండికూడ నాగార్జునునకు జయద్రథుడన్నచో నెక్కువ స్నిగ్ధభావము కలదు. తనకతఁడొక్కఁడే స్నేహితు

డఁనుకొనుచుండును. ఆ సంగతి జయద్రథునకును దెలియును. ఒకవేళ నాగార్జునుఁడు రాజయినచో నతని క్రింద జయద్రథునకేమియు నధికారముండదు. తన్నాతఁడు లోఁచ్చుబఱు పఁడు. పెఱయాస లేదు.

చివఱకు నిరంకుశు డెట్లయ్యెననఁగా నాగార్జునుడెంత చెప్పిన యంతయయ్యెను. ఈ మాత్రముతో నాగార్జునుని యధికారము స్పష్టము కాదు. ఈనాఁడు నా యన్న విజయసింహుఁడు రాత్రిపూట పోయి మీ చెల్లెలిని జాంబవతిని గలిసికొనును. మీ సేవకులడ్డుపడఁ గూడదు. నీవు వారితోఁ జెప్పుము. అని నాగార్జునుఁడు శాసించినచో నిరంకుశుఁడట్లే చేయును. నాగార్జునుఁ డనెనుగదా 'నీకు విజయసింహుని మీఁద మాత్సర్యమున్నది. పగయున్నది. నేను జెప్పినట్లు చేసినచో నీవు పగసాధింపఁగలవు. వేఱొకమార్గమున నీకు సాధ్యముకాదు. ఇంకొకరీతిగాఁ జేసితివా నీ భార్య విధవరాలగును. నీ పిల్లలకుఁ దిండి లేకుండఁ బోవును. నీ యుద్యోగము పోవును. నీకోట రాజుయొక్క యాస్తిలోఁ జేరును. నీ తల్లియు చెల్లియు నడిగికొంచుఁ బోవుదురు' అని చెప్పి చూపెను. నిరంకుశుఁడు నిజమే యనెను. ఆ నాఁడు మొదలు విజయసింహుఁడు మరలఁ దన యిష్టమువచ్చినప్పుడెల్ల జాంబవతిని బోయి కలసికొను చుండెను. పూర్వము తానచటికి వెళ్ళిన రాత్రులందు నిరంకుశుఁడచటికి రాకుండఁ గట్టుదిట్టములు చేయవలసియుండెను, యిప్పుడదియేమియు లేదు. విజయసింహునికి యథేచ్ఛముగా నుండెను. నాగార్జునుఁడు నిరంకుశునితోఁ జెప్పియంగీకరింపఁజేసె ననికొనెను. విజయ

సింహుని కిప్పుడు నాగార్జునుఁడన్నచోఁ బరమదైవము. మహా వివేకి అఘటనఘటనా సమర్థుఁడు. ఏ పనియైన నాగార్జునుఁడు చెప్పవలయును. విజయసింహుఁడు చేయవలయును.

ఒకనాఁడు తమ శృంగార లీలలను విజయసింహుఁడు నాగార్జునునితోఁ జెప్పుచుండగాఁ బ్రతిదిన ముత్సాహముఁగా వినెడి నాగార్జునుఁడు మొగము దించికొని కూర్చుండెను. విజయసింహుని కర్థముకాలేదు. విజయసింహుఁడెంతయో బతిమాలి యడిగెను. చివఱకు నాగార్జునుఁ డిటులనెను. 'ఓయీ స్త్రీలను నమ్మవచ్చునో రాదో నాకుఁ దెలియదు. జాంబవతిని నివొక్కఁడవే ప్రేమించుచున్నానని నీవనుకొన వచ్చును. ఆమెను ప్రేమించెడి మఱియొకరు కలరు. ఆయనను జాంబవతి నిన్ను ప్రేమించుచున్నట్లు ప్రేమించుచున్నదో లేదో తెలియదు. ఆయనకు నామెకు సంబంధమున్నదో లేదో నాకుఁ దెలియదు. ఇంకొక పురుషుఁడామెను ప్రేమించుచుండె నని యర్ధరాత్రములందు వారి మేడలకుఁ బోవుచున్నాడని నాకుఁ దెలియును. యామె యంగీకరించుటలేదని కూడఁ దెలి యును. కాని యాయన ప్రయత్నమాయన మానలేదు.' అని చెప్పెను. విజయసింహునకు నఖశిఖాపర్యంతము మహాగ్ని జ్వాలలు రేగెను. వాఁడెవఁడో చెప్పుమని విజయసింహుఁడెం తయో బలవంతము చేసెను. నాగార్జునుఁడు తాను జెప్పరా దనెను. విజయసింహుఁడు వాఁడెవఁడా యని పాతికపేర్లు చదివెను. 'ఆ పేర్లలో నెవ్వఁడుకాఁడే' మఱియెవ్వఁడు? నాగార్జునుఁడు చివఱకిట్లనెను. 'నేను జెప్పరాదు. నీవే చూచికొన వచ్చును. ఆయన యేరాత్రి యీ కోటకు వెళ్లునో యది

యానాటి రాత్రియనియు నావేళకాయన యచ్చటనుండు నని యు నీకుఁ జెప్పెదను. నీవే నీకనులతో జూడవచ్చును. అనెను. విజయసింహుఁడు 'కనులతోఁ జూచెదనో కత్తికెఱచే సెదనో చూతువుగాని' యనెను.

నాగా- 'అదియేమయ్యా! అందఱిని గత్తితో నఱకఁ గలమా? ఆరాత్రిపూట నీ వచ్చట సర్వభారతసామ్రాజ్యాధిపతి యైన జనమేజయ మహారాజును జూతువనుకొనుము. కత్తితో నఱకుదువా?'

విజయ- "నిస్సందేహముగా నఱకుదును" కాని జనమే జయుఁడెట్లు వచ్చును?

నాగా- "ఎట్లు వచ్చునేమి! నీవు వినలేదా? నాయన గారు వానప్రస్థాశ్రమమునకుఁ బోవుచున్నారు. ఆ పోవుటకుఁ బూర్వము యువరాజుగారికి రాజుగాఁ బట్టాభిషేకము చేయు దురు. ఆ పట్టాభిషేకము నాటికి జనమేజయ మహారాజుగారిని రమ్మని వార్తపెట్టినారు".

విజయ- 'జనమేజయునకా సేతుశీతాచలము సర్వ రాజులును సామంతులే. ప్రతి సామంత భూపాలుఁడును తన కుమారునకుఁ బట్టాభిషేకము చేయునపుడు చక్రవర్తి వచ్చుచుండునా?'

నాగా- 'రాఁడు. కాని చక్రవర్తి యీ ప్రాంతములకు వచ్చుచున్నాఁడు. అందుచేత నాయనగారు పిలిచెను. వారు వత్తుమని యంగీకరించినారు.'

విజయ- 'నీ కెట్లు తెలియును?'

నాగా- ఎట్లు తెలియుననఁగా మనకోటలోని విశ్వశర్మ యున్నాఁడే యాయన పేరు కిహినారుఁడు. నీవెఱుఁగుదువా? నీ వెఱుఁగవు. నీకు లోకములోఁ బట్టినవి మూఁడే విషయములు. కత్తివిద్య, భామాదేవి, జాంబవతి. ఆ కిహినారుఁడు గొప్పశిల్పి. ఏ దానశాసనమైనను దక్షిణాపథమునందు వాని చేతనే వ్రాయింతురు. ఆ దానశాసనము నాయన వ్రాయుచున్నాఁడు. తుంగభద్రా నదియొడ్డుననున్న మునులు శీతారామాలయమును నిర్మించుచున్నారట. ఈ ప్లవంగనామ సంవత్సర కార్తీకమావాస్య సోమవారమునాఁడు జనమేజయ మహారాజు తదాలయ దర్శనార్థము వచ్చి యచ్చటి మునులకు నచ్చటి క్షేత్రమును వ్రాసియిచ్చుచున్నాఁడు. ఆరోజున సూర్యగ్రహణ మున్నది. ఆ క్షేత్రమును మునులకు మహారాజు దానమిచ్చుచున్నాఁడు. ఈ దానశాసనమును కిహినారుఁడు చెక్కుచున్నాఁడు. నేనది చూచితిని. అచట నా దానము చేసి యవటినుండి చక్రవర్తి మన రాజధానికివచ్చును. మార్గశిరశుద్ధ దశమి ప్రాంతములయందు శ్రీముఖుఁడు మహారాజగును. ఆ మఱునాఁడే మహారాజు వానప్రస్థాశ్రమమునకేగును. జనమేజయ మహారాజెట్లును వచ్చుచున్నాఁడు గావున మార్గశిరశుద్ధ దశమినాడిచట నుండును కదా. నవమి నాఁడు రాత్రి తాను జాంబవతిని జూచుటకుఁబోవచ్చును. నీ వాయనను పట్టకుదువా?"

విజయసింహున కేమిసమాధానము చెప్పవలయునో తోచలేదు. కాని యిట్లనెను. ఓయి! మార్గాంతరమునఁ జక్ర

వర్తి నిరంకుశుని కోటలో నా రాత్రి నిలువవచ్చును. అంత మాత్రముచేత నాయన జాంబవతిని ప్రేమించునా?"

నాగా- ప్రేమించునా! బలేమాటయన్నావే' ప్రేమించుట కాదు. రాజులు రత్నగ్రాహులు కాదయ్యా! అంతసౌందర్యవతిని జూచియూఱకుండునా? వెంటనే హస్తినకుఁ దరలించికొని పోవును."

విజయ - "ఆమె నా భార్యకదా?"

నాగా - "నీవామె మెడలో బుస్తె కట్టలేదుగదా?"

విజయ - "నేఁది పట్టి యూహాగానము."

నాగా - "కాదొకవేళ నిజమయినచో"

విజయ - జనమేజయ మహారాజు కాదు. వానితాత యభిమన్యుఁడు, వాని మామ శ్రీకృష్ణుఁడు; ఆ శ్రీకృష్ణుడువచ్చినను వానిని నా కత్తికెఱచేసెదను."

నాగా - "ఆఁ. నీవిప్పుడట్లందువే కాని యాయనను జూచువఱకు నీకుఁ గాళ్ళును చేతులును జల్లబడును"

విజయ - నాగా! వినయశర్మగారు చెప్పుచున్న భారతము పురాణము వింటివా? ఆ మహాకావ్యము వ్యాసమహర్షి వ్రాసెను. అందులో నచట నచట వినయశర్మగారు వేనిచే తనో వ్రాయించికొనివచ్చి యా భాగమును జదువుచుండును. భీమార్జునుల సంగతి నీవు వినలేదు. అందులో నర్జునుఁడు ప్రతిజ్ఞచేసినచో నది మహాపాపమయినను సరే,పాపమునకుఁ నిష్కృతి యింకొకరీతిగాఁ జేసికొనవచ్చును. ఆప్రతిజ్ఞ నిర్వహించితీఱును. నే నట్టివాఁడను."

నాగా - నవ్వుచు - "నీవేమి ప్రతిజ్ఞ చేసితివి."

విజయ - "ఇదివఱకు జేయలేదు. ఇప్పుడు చేయుచున్నాను. జాంబవతి నాకుఁ బ్రాణప్రియ. ఆమెను నా నుండి యెవఁ డపహరింపఁబూనునో వాఁడు భగవంతుఁ డయినను సరే, తండ్రియైనను సరే, తోబుట్టువైన సరే, సామ్రాజ్యాధిపతియైన సరే, వాని శిరస్సును జాంబవతి గడపముందు నఱికెదను. ఇది గొప్ప ప్రతిజ్ఞ. యని విజయసింహుఁడు తన కత్తి దూసి ముక్కునకెదురుగా శిరస్సుపైని పాపటవలెఁ బట్టికొని మోకరించి ప్రతిజ్ఞచేసి, యా కత్తిని నాగార్జునుని ముందుంచెను. నాగార్జునుఁడు తీవ్రమయిన దృష్టులతో వెడలిపోయెను.

ఆ ప్లవంగనామ సంవత్సరమునఁ గార్తీకమాస శుక్లాష్టమి వచ్చెను. అదివఱకే జనమేజయ మహారాజు తుంగభద్రాతీరమునకు వచ్చి యచ్చటి మునులకు దానశాసనము వ్రాయించి యిచ్చె. తన తాతగారి మేనమామయైన భగవంతుడైన శ్రీకృష్ణుఁడే శ్రీరామచంద్రుడుగా భావించి శ్రీరామచంద్రుని సేవించి ధాన్యకటకమునకు వచ్చుచున్నాఁడన్న వార్తలు వచ్చుచుండెను. దశమినాఁడు పట్టాభిషేకము. ఏకాదశినాఁడు చక్రవర్తి హస్తినకుఁ బ్రయాణమగును. రోమపాదుఁడు వనములకుఁ బ్రయాణమగును. పట్టాభిషేకోత్సవములన్నియు వారు వెళ్ళిన తరువాతనే జరుగును. అష్టమినాటి ప్రొద్దున నాగార్జునుఁడు శ్రీముఖుని వద్దకుఁ బోయెను. నవమి పవలంతయు శ్రీముఖుఁడు స్నానములు నియమములు నగ్నిహోత్రములు హోమములుగా నుండవలయును. శ్రీముఖుని

యందుఁ గనిపించదగిన యుత్సాహము కనిపించుటలేదు. అతఁడు సహజముగా వినయవంతుఁడగుటచేత లోనియుత్సాహము నడచికొనుచుండెను. నాగార్జును డిట్లనెను. అన్న గారూ! ఎల్లుండి నుండి తమరు రాజ్యమునకు వత్తురు. శేషం తయు మీరు నియమములలో నుందురు. చినన్నగారి గూర్చియు జాంబవతిని గూర్చి మీకు నిశ్చయముకాలేదు. ఆ నిశ్చయము మీకుఁ గావలయునన్నచో నీనాటిరాత్రియే మంచి యవకాశము. ఉత్సవములారంభించిన తరువాతఁ జిన్నన్నగారు మరలఁ బది పదేను దినములు జాంబవతినిజూడఁ బోవుటకు వీలుండదని, నేఁడు రాత్రిపోవుటకే నిర్ణయించిరి. రాత్రి జాము ప్రొద్దుపోయిన తరువాత వారు గుఱ్ఱమునెక్కి సరిగా నడిరాత్రికి నిరంకుశుని కోట జేరుదురు. మీరప్పుడు చూడవచ్చును. మీరుకొంత సేపాగిపోయి తలుపుతట్టినచో జాంబవతీ విజయసింహులను నిస్సంశయముగా జూడఁగలరు. పోయి కత్తిపిడితోఁ దలుపు తట్టుఁడు. వారెట్టి స్థితిలోఁదలుపు తీయకతప్పదో నాకుఁ దెలియదు. ఇది నేనన్నగారిమీఁది ద్వేషముతోఁ జెప్పుటలేదు. తమకిన్యాయమందఱికిఁ దెలి యును. తమరు రాజ్యమునకు వచ్చిన తరువాత నిట్టి యన్యా యములు రాజ్యములో జరుగుట నా కిష్టములేదు. ఆయన జాంబవతిని పెండ్లియాడ నెనును. అది న్యాయముకాదుకదా! మీరు వారినట్లు చూచినపుడు మీరు కోపపడి నీవీమెను పెండ్లియాడక తప్పదని నిరంకుశుని సమాధానపరచి పెండ్లి చేయించుఁడు. అది యీ నాఁడే జరుగవలయును.'' అని చెప్పి వెడలిపోయెను.

మరల విజయసింహుని వద్దకుఁ బోయి యాయన యెవ్వరో నీకీనాటి రాత్రి తెలియును. నీవు జాంబవతి గది లోనికిఁ బోరాదు ఆద్వారబంధమునకు దగ్గఱగా దాగి యుం డుటకు వీలుగా నేదయిన ప్రదేశమున్నదా?

విజయ – 'ఉన్నది. ఆగోడకుఁ బ్రక్కఁగా రంగభూమి కలదు. ముంగిటికి రంగభూమి కనిపించకుండ వట్టిగోడ కొంత దవ్వు పొడిగింపఁబడి కట్టఁబడినది. దాని వెనుక దాగి యుండ వచ్చును.'

నాగా – "దాగియుండుము. ఎవరోవచ్చి తలుపు తట్టుదురు. వారెవరో నీకే తెలియును." అని వెడలిపోయెను.

ఆనాఁడు నిరంకుశునకు నాగార్జునుఁడు వార్త పెట్టెను. నిరంకుశుఁడు నిరుత్సాహముతో వచ్చెను. నాగార్జునుఁడు నవ్వి యిట్లనెను. "ఓయీ! ఇంకెన్నాళ్లు నాదగ్గఱకు మొగము వ్రేలవేసికొని వచ్చెదవు? ఆదినములైపోయినవి. అతఁడు నాకన్నగారన్న మమకారము కోసివేసికొన్నాను.' 'జాంబ వతిని నీవు పెండ్లాడుము. నేనందఱిచేత నొప్పింతును. నిరం కుశునిచేతఁ గూడ నంగీకరింపఁ జేయుదునని యెంతయో చెప్పితిని.' అతడు వివాహమాడఁడట, ఆమెతో జారత్వము చేయుచుండునట, అది పవిత్రమయిన ప్రేమగా లోక మను కొనవలయునట, ఇంతకంటె మ్లేచ్ఛభావ మేమియుండును. అగ్నిసాక్షిగాఁ బెండ్లియాడుట వైదికము. ఇది మ్లేచ్ఛము. ఇన్నాళ్లు నీతో నెందుకుఁ జెప్పలేదనఁగా నిదివఱకతనిని నీవు

పోయి సంహరించినచో నీనెత్తికిఁ జుట్టుకొనెడిది. నేడట్లు జరుగదు. ఈనాఁడచ్చటికొక మహాపురుషుఁడు వచ్చును. ఆ పురుషుని విజయసింహుఁడు సంహరించును. నీవు వెంటనే విజయసింహుని సంహరించుము. ఆయన నితఁడు సంహరించినాడు గాన గోపముపట్టలేక నేనితనిని సంహరించితినని చెప్పుము. అప్పుడు నీమీఁద నభియోగములేదు. ఏలయనఁగా విజయసింహుఁ డీరాత్రి యెవరిని సంహరించునో నీవు చూచిన నీకే తెలియఁగలదు.” అని నిరంకుశుని దిట్టముచేసి పంపించెను.

అచ్చట శ్రీముఖుఁడు తానెంతయో విచారించెను. తానానాఁడు పోవలయునా? వలదా? పోయినచోఁ దనమాట విజయసింహుఁ డాదరింపఁడేమో? అతనికిఁ దానన్నచో గౌరవము కలదు. గాని తాను తనంటె నధిక శౌర్యవంతుఁడనని యహంకారముకూడఁ గలదు. తాను రాజయినచో నతఁడు సేనానాయకుఁడగును. రాజ్యదృష్ట్యా యివి యధికార నామములు గాని సోదరులగుటచేత సమానాధికారములుగానే గనిపించును. తన తండ్రికి జెప్పకుండఁ దానీపని చేయరాదు. అని శ్రీముఖుఁడుపోయి రోమపాదునితో నీసంగతియంతయు బూసగ్రుచ్చినట్లు చెప్పెను. రోమపాదుఁడు తాను విజయసింహుని బిలిపించి మందలింతు ననెను. శ్రీముఖుఁడనెను గదా; యతఁడు నిరాకరించును. నేనెఱుగనునను. మనమేమి చేయవలయును? కావున దొంగను దొంగతనము చేయుచున్నప్పుడే పట్టుకొనవలయును. కనుక నేనెవరినో పంపించి ఋజువు చేయుదునులే యని శ్రీముఖునిఁ బంపించివేసెను.

తన మువ్వురు కొడుకులంతో ధర్మపరులనుకొనుచున్న రోమపాదున కీవార్త హఠాత్తుగా నిరుత్సాహము కలిగించెను. విజయసింహుఁడు పెండ్లియాడినచో నాడనిమ్ము. ఇది జారత్వమనిపించుకొనును. జారత్వ మధర్మవిషయము. ఈసిద్ధాంతమేమిటి? ఇది యెచ్చటనయిన నున్నదా? తన భార్యయైన మనస్సునకు గష్టము కలుగునని యొక యుత్తమకుల సంజాతయైన యువతినిఁ దాను వశపఱచికొని యామెను బెండ్లియాడఁడా? ఎల్లుండినుంచి శ్రీముఖుఁడు రాజు కాఁబోవుచున్నాఁడు. నాదారిని నేను వానప్రస్థాశ్రమమునకుఁ బోవుచున్నాను. శ్రీముఖుఁడు మహాధర్మబుద్ధి. తమ్ముఁడన్నచో నెంతయో ప్రేమ కలవాఁడు. అతఁడితని నేమియుఁ జేయఁడు. రాజుగారి తమ్ముఁడే యిట్లు చేయుచున్నాఁడు మనకేమియని ప్రజలలో నొక దుస్సాహసము బయలుదేరును. ఇల్లు చక్కఁబెట్టికొనలేడూఱుచక్కఁబెట్టునా? శ్రీముఖుఁడెంతయో మనస్సులోఁ గష్టపడుచున్నాడు. ఎల్లుండి పట్టాభిషిక్తుఁడు కాఁబోవుచు నీనాటి రాత్రి యతఁడు పోయి యీ రహస్యమును గనుగొనుటకుఁ బ్రయత్నము చేయవలయునా? ఈ పనిమీఁద మరెవరినైనఁ బంపించినచో నేమగును? విజయసింహుఁడు లెక్కచేయఁడు. ఎవర్తైనను జూచివచ్చినను దానది యబద్ధమనును. పోయి ఘర్షణ పడినచో విజయసింహుఁడు మహాబలశాలి, సాహసి, కోపి. అందులో నిది స్త్రీ విషయము. వానిని సంహరించినను సంహరించవచ్చును. వెళ్ళినచో శ్రీముఖుఁడు వెళ్లవలయును. లేనిచోఁ దాను వెళ్లవలయును. శ్రీముఖునికంటెఁ దాను వెళ్లుటయే మంచిది. ఇద్దఱిని గూర్చుండఁబెట్టి తను పొసగించి

చెప్పవచ్చును. నిరంకుశుని తల్లితో మాటాడవచ్చును. ఎన్ని విధములఁ జూచినను దాను వెళ్లుటయే మంచిది. తానెల్లుండి వఱకు రాజు. ఎట్లు వెళ్లుట? తన వయసులో నప్పుడప్పుడు మాఱువేసమున రాజధానియందుఁ దిరుగుచుండెడివాఁడు. తనకు వందయేండ్లు దాటిన తరువాత నట్లెప్పుడును జేయలేదు. ఆ నాడు చేయుదమనుకొనెను. తనయంగరక్షకభటునితోఁ జెప్పవలయును. చంద్రశేఖరవర్మతోఁ చెప్పెను. చంద్రశేఖరవర్మ దీర్ఘముగ నాలోచించెను. రాజు చెప్పినదంతయు సమంజసముగా నున్నది. ఆ రాత్రి రాజువెంట చంద్రశేఖరవర్మ వెళ్ళుటకు నిర్ణయించెను. వర్మకేదో మనసులోనేదో యనుమానము జయద్రథుఁడు తమ రాజ్యమును వదలిపోయి రెండేండ్లయినది. అతని సంగతి తాను జూచికొన్నాఁడు. జయద్రథుఁ డిప్పుడెచ్చటనున్నాఁడో జయద్రథునికే తెలియదు. అతఁడెచ్చటనున్నాఁడో చంద్రశేఖరవర్మకుఁ దెలియును. ఆ జయద్రథుని పన్నాగమేమియు సాగకుండఁ జంద్రశేఖరవర్మ వానినిఁ గడచిన యాఱునెలల నుండి వాని మాటలు సాగనిచోట నుంచినాఁడు. ఇందులో నతనిదేమియు లేదేమో ఉన్నచో నతఁడా పూర్వమే వేసిన పదకము కాలాంతరమునందు ఫలింపఁబోవుచున్నదేమో. తన యూహ నిరాధారమేమో?

రోమపాదుఁడు వర్మతో, వర్మయు నతని వెంటవచ్చు నిద్దఱుభటులును జాలదూరమునందుండవలయుననియు, దాను బోయి వారిని బిలిచినప్పుడు వారు రావలయుననియు, లేని

చో తాను తండ్రివలెఁ గాక భూపతివలె నధికారము చేయఁగా వచ్చునని యనికొని బిగియునేమో? సామముచేతఁ గార్యము సాధింపఁబడవచ్చుననియు విజయసింహు డంగీకరింపనిచో నపుడు వర్మను భటులనుఁ బిలిచి వారిచేత నీయాథార్థ్యము నిరూపింపఁజేయ వచ్చుననియు నెంచి యట్లు కట్టుదిట్టము చేసెను.

ఆ నాఁడు జాము ప్రొద్దుపోయెను. రోమపాదుఁడు కోటలోని దొడ్డిగుమ్మమునుండి రహస్యముగా బశ్చిమాభిముఖుఁడయి బయలుదేరెను. తాను దానుగాఁగాక యువరాజేమో యన్నట్లు దూరస్థ జనులకు భ్రాంతికలుగునట్లుగా వేసము వేసికొనెను. తాను వృద్ధుఁడైయుండి యిట్లు పోవుట తగదనుకొనెను. ఆకృతివిశేషముచేత రోమపాదునకును శ్రీముఖునకును భేథములేదు. రోమపాదుఁడు వృద్ధుఁడు. శ్రీముఖుఁడు యువకుఁడు. ఇంతే. రోమపాదుఁ డర్ధక్రోశము దూరముపోయెనో లేదో యాకాశమునందు మబ్బులుపట్టెను. క్రమక్రమముగా నంధకారమగుచుండెను. మెఱుపులు మెరయుచుండెను. ఉఱుములుఱుము చుండెను. వెనుకకు మరలవలయునా? వలదా? కాదని రోమపాదుఁడు వర్మతోఁ దక్కిన యిద్దఱు భటులతో ముందునకుఁ దూగియపోయెను.

# ౧౪

రోమపాదుఁడు తన గుఱ్ఱముమీఁద నంగరక్షకులతో బయలుదేరిన సమయమున కొకగడియ గడియన్నర కాలములోఁ గోటనుండి మఱికొందఱు గూడ బయలుదేరిరి.

ఒకఁడు నాగార్జునుని సేవకుఁడు. అతఁడనాదినుండియు జయద్రథుని బంటు. వానిని గుఱ్ఱముమీఁద నాగార్జునుఁడు పంపెను. నిరంకుశుని కోటకుఁబోయి యచట జరిగిన దంతయు జూచి వెంటనే వాయువేగ, మనో వేగములమీఁద వచ్చి తనకుఁ జెప్పవలయును. అతఁడు వేదాద్రినుండి సముద్ర తీరమువరకు వ్యాపించియున్న శిలామయమహారాజ మార్గము వెంటఁబోఁడు. కృష్ణానది యొడ్డుననుండి పోవును. ఆ కృష్ణా నదియొడ్డుననున్న మార్గముసూక్ష్మముగా శిలఘట్టితమయి యున్నను, నదికాలిబాట. నడుమ నడుమ బాటయేయుండదు. ఆ బాటమీఁద గుఱ్ఱముమీఁదఁ బోవుట యశ్వారోహణ విద్యాపరమదక్షుఁడయి యుండవలయును. వాఁడు వట్టి యీ విద్యకలవాఁడే కాదు. కొన్ని క్షుద్రవిద్యలు కూడఁ గల వాఁడు. వానికాభయములేదు. వాఁడు బయలుదేరి వెడలెను.

రెండవ బయలుదేరినవారు మువ్వురు. అది రథము. రథచోదకుఁడు, శ్రీముఖుఁడు, వినయశర్మ. చంద్రశేఖరవర్మ రాజు తనతో నీ ప్రయాణముమీఁద వెళ్ళుచున్నానని చెప్పిన

వెంటనే తాను పోయి వినయశర్మతో నీ సంగతి చెప్పెను. వినయశర్మ యా వేళను గుఱించి చూచెను. వేళ మిక్కిలి దుష్టముగానుండెను. రోమపాదునకు మహాపద కలుగునట్లుండెను. అంతియకాదు, మరియు నెవో వాకొనరాని యాపదలను సూచించుచుండెను. ఆయన వెంటనే శ్రీముఖుని వద్దకుఁబోయి యీ సంగతి చెప్పెను. 'రాజు వెనుకపీటిని శ్రీముఖుఁడు పోవుదమనెను. వినశర్మ 'రథముమీాఁద బోవలయును. అక్కడ నేపరిస్థితి యెట్లుండునో యనెను. శ్రీముఖుఁడు వినయశర్మను గూడ రమ్మనెను. శ్రీముఖుఁడు తన రథమునుగట్టించెను. తన సారథిని నియమించెను. ఇందులోని చిత్రమేమనఁగా యువరాజుసారథి, యువరాజును, యువరాజు బండియుఁ గోటలో నుండిపోవుచున్నను నీ సంగతి యెవరికిని దెలియదు. ఇదియంతయుఁ గోటలో నాలుగురు మందికి మాత్రమే తెలిసిన రహస్యము. రోమపాదుఁడును దదంగరక్షకులును శ్రీముఖుఁడును సారథియును. ఇంత రహస్యముగా నీ వ్యవహారము జరిగెను.

అచ్చటికి శ్రీముఖుఁడును వినయశర్మయుఁ జేరి నిరంకుశుని కోటను సమీాపించువేళకు బెద్దగా గురియుచున్నవర్షము కురియలేదు. మబ్బులు తారాడుచుండెను గాని యుత్తరదిశ యందుఁ దెలిమబ్బులెక్కువయి వెన్నెలచేతఁ బ్రతిఫలించి యా వెన్నెలయు నస్తమింపఁబోవుచున్న చంద్రునినుండి వినిర్గమించిన దగుటచేత నెట్టినై దూరదేశమంత విస్పష్టముగా లేదు. శ్రీముఖునకు వినయశర్మకు నిరంకుశుని భవనము ముందర నైదారుగురు మూగినట్లుండిరి. శ్రీముఖుఁడు

రథముదిగి సారథి నచట నుండుమని చెప్పి తాను విజయ శర్మయు: బెద్దపెద్ద యంగలతోఁ బోయిరి. పోయిచూచినది పరమ విషాదమయిన దృశ్యము. రెండు దీపములు లోనుండి తీసికొని రాఁబడినవి. రోమపాదుఁడు కత్తిచేత గుండెలోఁబొడువఁబడి క్రిందఁబడియుండెను. ఆయన మరణించెననియే యనుకొనవలయును. విజయసింహుని మెడమీఁదఁ దీవ్రమయిన ఘాతము తగిలియుండెను. అతఁడు క్రిందబడిపోయెను. అతఁడు బ్రదుకునని యాశలేదు. కాని పూర్తిగా స్మృతిపోలేదు. నిరంకుశుఁడు ప్రక్క నిలుచుండియుండెను. అతని చేతిలోఁ గత్తిలేదు. ఇరువైపులఁ జంద్రశేఖరవర్మ యొక్క భటులు ఖడ్గపాణులై నిలిచియుండిరి. చంద్రశేఖరవర్మ పరమ విషణ్ణముఖుఁడై చూచుచుండెను. నిరంకుశుని తల్లియు నామె పినతల్లియు ద్వారబంధమునందు నిలుచుండి యేడ్చుచుండిరి.

శ్రీముఖునిఁ జూచినంతనే చంద్రశేఖరవర్మ మోకరించి నమస్కరించి 'మహారాజా' యని పాదములమీఁదఁబడి యేడ్చెను. శ్రీముఖున కేమియుఁ దోచలేదు. తండ్రిశవమును జూచుచుండెను. పెదతమ్మునిఁ బరమదుస్థితిచూచెను. ఆయన మనస్సులో మెఱపువలె నొక భావముతోచెను. తాను వచ్చినచోఁ దాను దన తండ్రివలె నీరీతిగానై యుండెడివాఁడు. తక్కిన దంతయు విస్పష్టముగానే యున్నది. తన తండ్రియని తెలియక జాంబవతి కొఱకు మరెవ్వరో వచ్చిరని విజయసింహుఁడు తండ్రిని జంపెను. ఆ విజయసింహుని నిరంకుశుడు

ఖడ్గముతో నఱకెను. ఇంతలోఁ జంద్రశేఖరవర్మ భటులు వచ్చి నిరంకుశుని నిరాయుధునిఁ జేసిరి. ఏమి జరిగినదని చంద్రశేఖరవర్మ నడుగనక్కఱలేదు. ఈ పెద్దధ్వనికి లోనుండి స్త్రీలువచ్చిరి. వారిభీభత్సముచూచి నివ్వెఱపోయిరి. దుఃఖించుచుండిరి. శ్రీముఖునకచ్చట జాంబవతి కనిపించలేదు. ఆమెయేమయినది? శ్రీముఖుఁడు గురుభార్యను జూచి 'మీకుమార్తె యేమైనది? ఆమె యేమయినదో చూడవలయును' అనెను. ఆమె లోనికిఁ బోయెను. లోనుండి పెద్దపెట్టున యేడ్పు వినిపించెను. శ్రీముఖుఁడు వినయశర్మతో నిట్లనెను. 'గురూ! జాంబవతి గత్తితోఁ బొడిచికొని చనిపోయియుండును. తమరును జంద్రశేఖరవర్మయు లోనికి బోయిచూచి రండు'అని పంపించెను. వారు తిరిగివచ్చి 'యట్లే' యనిరి. శ్రీముఖుఁడు నిరంకుశుని వంకఁ దీక్ష్ణముగాఁ జూచెను. ప్రక్కనున్న భటులనుఁ దొలఁగుఁడని చెప్పెను. అతని ఖడ్గమతని కిప్పించెను. తాను తన ఖడ్గము చేతిలోఁ బుచ్చుకొనెను. ఇట్లనెను. 'ఓయీ నిరంకుశుఁడా? మనము ముప్వురమును సహాధ్యాయులము. నా తండ్రియు నా తమ్ముఁడును నీ కతమునఁ జచ్చిరి. నీవు విజయసింహునంత ఖడ్గవేత్తవు. నేను మీయంతటి వాఁడనుగాకపోవచ్చును. నాతోఁ గత్తియుద్ధమాడుము. నన్నుఁ గూడ సంహరింపుము. నీకిది యంతయు నాగార్జునుఁడు నేర్పిన విద్య యనుకొందును. నాకిప్పుడు తెలియుచున్నది. రథములో వచ్చుచున్నప్పుడు వినయశర్మగారు నాకుఁ గొంతగొంత తెలియఁజేసిరి. నాగార్జునుఁడు రాజగును.

నీవు సేనానాయకుఁడవు కమ్ము. నాతో గత్తియుద్ధమాడి నన్ను సంహరించుము. రమ్మ'ని పిలిచెను. నిరంకుశుఁడు తన చేతిలోనికత్తి దూరముగాఁ బాఱవేసి శ్రీముఖుని పాదములపై బడి యేడ్వనారంభించెను. శ్రీముఖుఁడు తన పాదముల పట్టువదలించుకొని రెండడుగులు వెనుకకు వేసెను. నిరంకుశుఁడేడ్చుచు నాటి ప్రొద్దున నాగార్జునుఁడు చెప్పిన దంతయుఁ జెప్పెను. 'మహారాజా! నాకుఁ జాలయేండ్లనుండి విజయసింహునిమీఁద మాత్సర్యము కలదు. జాంబవతి నన్యాయము జేయుచున్నాఁడని కోపము కలదు. అతనినిసంహరించ వలయునని నాకులేదు. గాయపరచవలయుననియే నాయుద్దేశ్యము. నాకుఁ దెలియకుండఁగనే మోపయిన దెబ్బతగిలినది. ఆ చనిపోయినది మహారాజని నేననుకొనలేదు. మీరే యనికొంటిని. దానితో నాకుఁ గోపమెక్కువైనది. నాగార్జునుఁడు నాతోఁ జెప్పినాఁడు. విజయసింహుని నీవు వధింపుము. విజయసింహుఁ డెవరిని వధించునో నీకే తెలియును. అందుకు విజయసింహుని వధించితినని చేప్పుము. నీ యందు దోషముండదని యాతఁడు చెప్పెను. కాని దూరమునుండి మహారాజును జూచి నేనును మీరేయనుకొంటిని. నాకుఁ గోపము వచ్చినది. చంద్రశేఖరవర్మ భటులు వచ్చిన వెంటనే నేను వారికి స్వాధీనమయిపోయితిని. వధింపఁబడిన మీరనుకొన్న తండ్రిగారిని జూచినంతనే నా పైప్రాణములు పైనఁబోయినవి. నేను నా దోషమును గప్పిపుచ్చుటలేదు. నేను విజయసింహునిమీద నా మాత్సర్యమును చెల్లించికొనుటకే చేసితినిగాని మిమ్ము విజయసింహుఁడు వధించెనని ప్రతి

క్రియగా జేయలేము. ఇంక మీయిష్టము. నన్నుఁ గొఱత వేయించుఁడు. శిరశ్ఛేదము చేయించుఁడు. ఇంక మీరే మహా రాజులు" అని నిరంకుశుఁడు నేలపై బడి యేడ్వనారంభించెను.

శ్రీముఖుఁడు నిరంకుశునిఁ గత్తితోఁ దట్టి 'లేచి నిలుచుండు'మనెను. నిరంకుశుఁడు లేచినిలుచుండెను. శ్రీముఖుఁడిట్లనెను. 'నీవు నాకు గురుపుత్త్రుఁడవు. నీ తల్లి నాకు గురుభార్య. నీకు దొఱ్ఱుపట్టు నధికారమిచ్చినచో నాయనగారితోఁ జెప్పి యిప్పించినది నేను. మీ యింటిలో నేఁడు మహాపదగానున్నది. నేను నా తండ్రిని నా సోదరుని రథముమీఁదఁ దీసికొనిపోవుచున్నాను. రథముమీఁదఁ వచ్చినది మేము మువ్వురము. నాయనగారితో వచ్చినది మువ్వురు. మే మార్గురము, నా తండ్రిని నా తమ్ముని నేను రథముమీఁద దీసికొని పోవుచున్నాను. నీ యింటిలో నీవు నీతల్లియు నీముత్తవయు మిగిలి యున్నారు. నీ పరిచారకు లున్నారు. ఈ రాత్రి నీయింటిలో నేమియు జరుగలేదు. ఈ రహస్యము మన పదిమందినిదాటి మఱియొకచోటికి బోయినచో మీ యందఱను వధింపించెదను. ఇది మహా రహస్యము. నీ చెల్లెలికిఁ బెద్దజబ్బుచేసినదని చెప్పుము. రెండుమూన్నాళ్ళయిన తరువాత జనిపోయినదని జెప్పుము. నీ యిల్లు నీవు తీర్చికొనుము. తరువాత నా వద్దకు రమ్ము. నిజమయిన పౌరునివలె రాజ భక్తునివలె నా వద్దకు వచ్చితివా సరే. నీకథ కృతులయొక్క పరిషత్తు విధించిన శిక్ష విధింతును. లేనిచో దొంగవలె దేశమునుండి నిన్ను నీవు నిష్కాసితుని, జేసికొంటివా చేసికొమ్ము. అని

తండ్రియు నన్నగారియు శరీరములు రథముమీఁదఁ జేర్పించి సారథినిఁ దోలుమని వినయశర్మయుఁ జంద్రశేఖరవర్మయుఁ దానును దక్కిన యిద్దఱు భటులును బయలుదేరి కోటమార్గ మును బట్టిరి. బలవంతముచేసి శ్రీముఖుఁడు వినయశర్మను రథముమీఁద నెక్కించెను. శరీరములు జాగ్రత్తగాఁ జూచు చుండవలయునని జెప్పెను. భటుల నిద్దఱిని ముందుఁ బరుగె త్తింపించెను. మార్గమున నెవ్వరు లేకుండఁజూడుఁడని చెప్పెను. తానును జంద్రశేఖరవర్మయు రథమునకు రెండువైపులఁబరు గెత్తుచుండిరి. రథము కొంత వేగముతో సాగుచుండెను.

అక్కడ నాగార్జునుని వద్దకు భటుఁడు మేఘమలల మీఁద వచ్చెను. మేఘములమీఁద వెళ్లెను. ఇచ్చట జరిగిన సర్వమును దెలిసికొనెను. ఇదియంతయు నాగార్జునునితోఁ జెప్పెను. రథము దుర్గమును జేరుటకు మరిరెండు రెండు న్నర గడియలు పట్టవచ్చును. నాగార్జునుఁడు తాను వేసిన పన్నకమంతయుఁ జెడిపోయినదని తెలిసికొనెను. తన లెక్క ప్రకారము తన యన్నలిద్దఱును జనిపోవలయును. ఇప్పుడుతండ్రి యు రెండవ అన్నయుఁ జనిపోయిరి. శ్రీముఖుని మాటలను బట్టి తన రహస్యమంతయు వినయశర్మకుఁ దెలియునని తెలి సెను. ఈ వినయశర్మ వట్టి పౌరాణికుఁడుగాఁడని జయద్ర థుఁడు చెప్పనే చెప్పెను. తన రహస్యమంతయు నిరంకు శుఁడు రాజుతోఁ జెప్పనే చెప్పివేసెను. తనకిప్పుడు రెండే మార్గములున్నవి. ఇచ్చటనేయుండిపోయి రాజు విధించు శిక్ష ననుభవించుటయా? దేశమును వదలిపెట్టి తానే పారిపోవు టయా? కాని శ్రీముఖుఁడిదియంతయు రహస్యముగా నుంచ

వలయునని చెప్పినాఁడుగదా! అతని తాత్పర్యమేమి? అతఁడేమి చేయును? జాంబవతి వ్యాధిగ్రస్తురాలయి చనిపోయెనని వదంతి పుట్టించవలయునని నిరంకుశునికాజ్ఞ యిచ్చెను. తండ్రి విషయములో విజయసింహుని విషయములోఁ దానెట్లు చేయునా? తండ్రి విషయములోఁ జేయవచ్చును. విజయసింహుని విషయములో నెట్లు చేయును? తాను శ్రీముఖునిఁ జిన్నప్పటినుండి యెఱుఁగును. ఈయన యింతటివాఁడా? జయద్రథుఁడు శ్రీముఖుని సరిగా నర్థముచేసికొనలేదు. అతఁడెదో యుత్సాహవంతుడనియూ నొకవిలక్షణమైన యానందము ననుభవించుటకుఁ బ్రతీక్షించుచున్నాఁడనియు దానికొరకు శరీర త్యాగమయిన జేయనున్నాడనియు జెప్పెను. నేనతడొక యున్మాది యనుకొన్నాను. ఇంతటిగంభీరుఁడయినచో నతఁడే రాజుగా నుండ దగినవాఁడు. అతని ముందు నేనెంత? నీల యొక్క నీతి యెంత? అతఁడే రాజుగా నుండదగిన వాఁడు. జయద్రథుఁడు తేనెపూసిన కత్తి. గోముఖ వ్యాఘ్రము. వాఁడు నాలోని భార్యాగతమయిన వాంఛను రేకెత్తించెను. నేనేల పారిపోవలయును? నిరంకుశుఁడు పాఱిపోలేదే. అంతకంటెఁ బిఱికివాఁడనా? నిరంకుశుఁడొక పనిని చేసినచో బాగుండెడిది. శ్రీముఖునితో యుద్ధముచేసి యతనిని సంహరించినచో నేననుకొన్న పదకము దానియంతట నది ఫలించెడిది. తరువాత నిరంకుశుఁడు నన్ను సంహరించి రాజ్యము కైవశము జేసికొనెడివాఁడేమో? వానికి నన్ను సంహరించుట సాధ్యమా. అతఁడు గంగునద్ద బగళా కాలంజరీ విద్యలు నేర్చెను. విజయసింహునిమీఁదఁ

గాలంజరిని బ్రయోగించెను. అందుచేత విజయసింహుఁడా వేళకుఁ దాను దన కత్తిగూడ నొడ్డుకొనలేక యుండును. లేదా శత్రు వెంత హఠాత్తుగామీఁదిఁకుఱికినను ఖడ్గవిద్యావేత్తయైన వాఁడు, సందులో విజయసింహుని వంటివాఁడు కొంచెము దెబ్బతినునేమో గాని వెంటనే శత్రువు నెదరించును. శత్రువుతో యుద్ధము చేయును. అట్టిదేమియు లేకుండ విజయసింహుడు పడిపోయెననఁగా నితఁడు కాలంజరిని బ్రయోగించి యుండును. ఈ కాలంజరీవిద్యాసంహారణశీలమయిన విద్య నాకుఁ దెలియునే. జయద్రధుడు నాకుఁ జెప్పనే? నాకు జ్ఞాపకము వచ్చుచున్నదే. విజయసింహుఁడింక బ్రాణములతో నున్నాఁడా? బండి కుదుపులతో నతని బ్రాణములు పోలేదుగదా! కాలంజరీవిద్యలోనిది సర్పవిషము. నేను దానికిఁ బ్రతివిఘాతము చేయగలుగుదును. కోటకు వచ్చు వేళకు విజయసింహునికిఁ బ్రాణము మిగిలియున్నచో నేనతనిని బ్రదికించఁగలను. అది పట్టి ఘాతముగా మిగిలిపోవును. నెమ్మదిగా గాయము కుదురవచ్చును. ఆవిద్యా మహత్త్వమెంత సేపుండును తెల్లవాఱువఱకుండును. తెల్లవాఱువఱకు విజయసింహుఁడు చనిపోవును. ఈలోపుగా జనిపోఁడు. తండ్రి చనిపోయినది చాలును. రాజ్యము నాకెల్లునురాదు. నీలకన్న శ్రీముఖుఁడే రాజ్యమేలగల మహాశక్తిమంతుఁడు. విజయసింహుడు చనిపోరాదు. నే నేమైననేమి? విజయసింహుని బ్రతికింతును. జాంబవతి చనిపోయినది. మాకోటకు బట్టిన దుర్యోగము వదలిపోయినది. నీల మొగమున బసుపును భామ మొగమున విభూతియు నొక్కచోటనే యుండరాదు. నాబుద్ధి

యేమి పెద్దత్రోవ ద్రొక్కినది. ఈపాటికి రథము కోటలోనికి వచ్చియుండును. రహస్యముగా వచ్చియుండును. చక్రధ్వనులు లేకుండవచ్చును. నేను వెంటనే పోవలయును. నేను వెంటనే స్నానముచేసి తడిగుడ్డలు కట్టికొని, కొన్ని సర్వౌషధికలు తీసికొని-యీ సర్వౌషధికలు నేను భద్రముచేసియే యుంచితిని. వెళ్ళవలయును. వారు నామాట విశ్వసింతురా? నేను పారిపోలేమగదా? నన్ను విశ్వసింతురు. విజయసింహుఁడు వెంటనే మరణించుటకు నేను ప్రయత్నించుచున్నానని వారనుకొందురేమో? నాల్గుతలల పాము ముగ్గు వేయవలయును. దానిలో విజయసింహునిఁ బండుకొనఁ బెట్టవలయును. వారంగీకరింపవచ్చును. శ్రీముఖునికిది చెప్పెదను. అట్టి క్షుద్ర విద్యాప్రయోగము కానిచో విజయసింహుని సంహరించుట కెవరికి సాధ్యమని నచ్చఁజెప్పెదను. అంతటి వివేకవంతుఁడు, నంతటి యాలోచనా దక్షుఁడు, నంతటి గంభీరుఁడు శ్రీముఖుఁడు నా మాటను విశ్వసించును. వినయశర్మ పరమవైదిక మార్గగామి. ఆయనకీ తుచ్ఛవిద్య లుండునని తెలియునో? తెలియదో?

అంతటితో నాగార్జునుని యూహ కదలుట మానివేసెను. పోయి వెంటనే స్నానము చేసెను. తలమైనఁ దుడిచికొనకుండ దడిగుడ్డలతో సర్వౌషధికల బరణి వెదకి దానినిఁ జేతఁబుచ్చికొని ముగ్గును బసుపును కుంకుమయు బొగ్గుపొడియు దానదివఱకే యీ విద్యలు నేర్చినప్పటినుండియు రహస్యముగా దాచి యుంచినవి, తీసికొని కోటవద్ద దొడ్డిగుమ్మము వద్దకుఁ బోయెను. అప్పుడే వేగుచుక్క పొడుచుచుండెను.

ఇంక నైదాఱు గడియలరాత్రి మిగిలియున్నది. ఇతఁడు రథములు ప్రవేశించు కోటద్వారమువద్దకుఁ జేరుటయు రథము వచ్చుటయు నొక్కసారి జరిగెను. శ్రీముఖుఁడు నాగార్జునుని గుర్తుపట్టెను. శ్రీముఖునకుఁ బట్టరానంత కోపము వచ్చెను. దానితోఁబాటు నివ్వెఱకలిగెను. అతఁడు కోటనుండి యీ పాటికిఁ బరారియైయుండు ననుకొనెను. వెంటనే కత్తిదూసి నాగార్జునుని ఖండింతమనుకొనెను. అతనికి రాజదండనము చేయవలయును గాని దాను ఖండించరాదు. నిరంకుశుని యందే యౌదార్యరేఖ చూపించెనే, సగర్భుఁడితనియందేల చూపించరాదు. ఈ వేషమేమి? ఈతడిగుడ్డ లేమి? ఈ తల విఱియఁబోసి కొనుటయేమి? చేతులలోని యాద్రవ్యము లేమి?

బండి లోనికి వచ్చినంతనే నాగార్జునుఁడు బండిలోని కెక్కఁబోయెను. చంద్రశేఖర వర్మాదులు శ్రీముఖునివంకఁ జూచిరి. శ్రీముఖుఁడేమియు మాటాడలేదు. వారుసూఱకుండిరి. నాగార్జునుఁడు తండ్రి శవమును జూచెను. తండ్రి పాదములు పట్టికొని కన్నులకద్దికొనెను. విజయసింహుని వంకఁ జూచెను. విజయసింహునికి స్మృతిలేదు. నాడి చూచెను. ఎచ్చటనో యాడుచున్నట్లుండెను. శరీరమునందు శైత్యము క్రమ్ముచుండెను. నాభిదేశమును బరికించెను. వాయు వాడుచున్నది. తాను బండి దిగెను. గుఱ్ఱపుశాల విశాలమయినది. అచటనొకచోట విడిగా కొంతస్థలమున్నది. నాగార్జునుఁడు శ్రీముఖునితో మాటాడలేదు. వినయశర్మవంకఁ జూడలేదు. చంద్రశేఖరవర్మను గుర్తుపట్టినట్లులేదు. తక్కిన యిద్దరు భటులతో నిట్లనెను. విజయసింహుఁడు జీవించియున్నాఁడు.

సూర్యోదయమగు వేళకుఁగాని చనిపోఁడు. నేను జెప్పినట్లు జేసినచోఁ జనిపోవుటయే యుండదు. మీకు నేను జెప్పెడి దగ్ధముకాదు. ఆ మహారాజునకును నా వినయశర్మగారికిని నీ గూఢచారదళాధిపతికిని దెలిసికొనఁ బ్రయత్నించినచోఁ దెలియును. ఎంత యేమఱుపాటుగా వచ్చినను విజయసింహుని నింతగాఢముగాఁ గత్తిదెబ్బ కొట్టదగినవాఁడెవఁడు? దీని వెనుక రహస్యమున్నది. ఇదియొక మ్లేచ్ఛవిద్య. నిరంకుశుఁడు దాని నుపాసించెను. ఆ ప్రయోగమాయన మీఁదఁ జేసెను. విజయసింహునకుఁ గత్తియాడలేదు. గాయము మోపయి నది తగిలినది. ఆమ్లేచ్ఛవిద్యాప్రతివిఘాతుకమైన విద్య నే నెరుగుదును. ఆ విద్యాబలము సూర్యోదయము వఱకుండును. సూర్యోదయవేళకు దద్విద్యాప్రతి విఘాతముచేయనిచో నీయన నిస్సందేహముగా మరణించును. ఆ విద్యా ప్రతిక్రియ గాయముకూడ నింత మోపయినదిగఁ గనిపించదు. కొలఁది దినములలో గాయము నెమ్మదించును. తొందఱగా నొక దివిటీ తెప్పించుఁడు. నేనీయశ్వశాలలో నొక ముగ్గువేసెదను. విజయసింహుని దీసికొనివచ్చి యీ ముగ్గులోఁ బండఁ బెట్టుఁడు. తెల్లవారువఱకు మఱియెవ్వరిని రానీయకుఁడు. తండ్రినేమిచేయునో? యీ గాయపడిన తమ్మునేమి చేసికొనునో! శ్రీముఖ మహారాజు నిష్టము అన్నాడు. అశ్వశాలలోనికి వెళ్ళినాఁడు. ఏదో ముగ్గువేసినాఁడు. ఆ భటులలోని యొకఁడు పరమరహస్యముగా దివిటీతెచ్చినాఁడు. విజయసింహు నా ముగ్గులోఁ బండఁబెట్టినాఁడు. ఆ ముగ్గునచ్చటివారందరు చూచిరి. నాల్గుదిక్కులయందు నాల్గుతలలపాము పడగ

లతో వేయఁబడియున్నది. ఈ నాల్గుసర్పముల యొక్క పుచ్ఛములు ముగ్గు నడిభాగమున యందుఁ బెనవేసికొని యున్నవి. ఒక పాము పసుపుతో నొకపాము కుంకుమతో నొక పాము బొగ్గుపొడితో నొక పాము ముగ్గుతో వేయఁబడియుండెను. ఆ నాల్గింటి పుచ్ఛములు ముగ్గు నడిమి భాగమునఁ బెనవేసికొని నాల్గురంగుల తాటియాకుతో జడర యల్లినట్లుండెను.

నాగార్జునుఁడు తన పాదములు విజయసింహుని శిరస్సునైపునకుఁబెట్టి తల విజయసింహుని పాదములపైపుఁబెట్టి తాను విజయసింహుని పాదములఁ గౌగిలించికొని పండుకొని యెదో మంత్రమును జపించుచుండెను. అచటనిలుచున్న యా ర్గురకు నిదియంతయు నొక యాశ్చర్యముగా నుండెను. బండిలో రాజు శవమున్నది.

గడియసేపయిన తరువాత శ్రీముఖుఁడవతలికి వచ్చెను. సరే అదియేమిజరుగునో చూడవచ్చును. తన తండ్రి శవమును రాజు యొక్క పడకగదిలోఁ బెట్టించెను. కోటలో నెవ్వరును నిద్రమేల్కొన్నట్లు లేదు. తన తల్లికీవార్త చెప్పుట యెట్లో తెలియలేదు. చంద్రశేఖరవర్మ వచ్చుటఁ గాపుంచెను. ఏ పరిచారికులును రాజు గదిలోనికిఁబోరాదు. కట్టుదిట్టము చేసెను. తెల్లవాఱిన తరువాత విజయసింహుని స్థితి యేమగునో తెలిసికొనిన తరువాత విజయసింహుఁడు బ్రదికియున్నను జనిపోయినను దన గదిలో నతని శరీరము నుంచవలయునని తీర్మానించికొని యచట వినయశర్మను నియ

మించెను. తాను నిద్దరు భటులు నాగార్జునుడు జపము చేయు స్థలమునకు వచ్చి నిలుచుండిరి. సారధితో రథము నూడదీయుమనెను. గుఱ్ఱాలను గట్టివేయుమనెను. తెల్లవారు వఱకు రథము ప్రయాణముచేసిన చిన్నెలు రథము మీాద లేకుండ జేయుమనెను. సారధిపోయి తనయింటిలో నిదురించుచున్నట్లే నటించవలయును.

ఒకొ్కకప్పుడు కోటలో గొన్ని రహస్య సమాచారములు జరుగుచుండును. అప్పుడు కోటలో నొక విధమయిన ఘంటాధ్వానము చేయుదురు. ఆ ఘంటాధ్వానము చేయబడినంతనే కోటలోని జనులందరు తమ యిండ్లలో దామే యుండవలయును. బైటికి రాగూడదు. మరల గొంత సేపటికి ఘంటాధ్వానము జరుగును. అప్పుడు రావలయును. అంతఃపుర స్త్రీలొకొ్కక్కప్పుడు కోటలో నలుమూలల నేదియో పనిమీాద దిరుగుట జరుగును. పట్టమహిషియు నామె పరిచారికలును వీధులఁ వెంటఁ జాటులేకుండఁ దిరుగుచుందురు. అపుడీ ఘంటాధ్వానము జరుగును. ఒకొ్కకపుడు మిత్రులయిన పరరాజులు తమయంతఃపుర స్త్రీలతో వత్తురు. ఆ యంతఃపుర స్త్రీలు కోటలోనికి వచ్చినప్పుడిట్టి ఘంటాధ్వానము చేయుదురు. మరియొకప్పుడు కూడఁ చేయుదురు. కృత యుగమైన తరువాతఁ త్రేతాయుగమునాటికే దక్షిణాపథమంతయు సూర్యచంద్రవంశపు రాజులసంతానమాక్రమించిరి. వైదికమతాను యాయులతోఁ బాటు మ్లేచ్ఛులును దేశమునందుడుచును వచ్చిరి. ఆ మ్లేచ్ఛులనఁగా నెవరు? వైదికమతమునుండి చెడిపోయినవారే. మరియు దేశమునుండి నిష్క్ర

సితులయిన వారు. వారరణ్యములలో స్థావరములేర్పఱచి
కొని యుండిరి. వేలు లక్షలు సంవత్సరములు జరుగునప్పటికి
వారాటవికులై పోయిరి. ఈ మ్లేచ్ఛులు తామాటవికుల యా
చారములు మతములు దేవతలు వారి నాచరించుచువచ్చిరి.
ఒక్కొక్కచోట వారు వీరు కలిసియుందురు. ఒక్కొకచోట
విడివిడిగా నుందురు. కోట్ల సంవత్సరముల మీఁద నిదియిట్లు
జరుగునని యెవరుఁ చెప్పగలరు? పేరునకు నాల్గువర్ణములు
గాని శూద్రులలోఁ గొన్ని వందలు వేలు వర్ణములు వెల
సెను. ఈ యవర వర్ణములవారు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు,
రాముఁడు, కృష్ణుఁడు, శివుఁడు, కుమారస్వామి, నంది
మొదలయిన సర్వదేవతలయందు నమ్మకము గలవారే. వారి
నారాధించెడివారే! కాని చెడిపోయి మ్లేచ్ఛులై యాటవికు
లయినవా రుపాసించు దేవతలను గూడ వీరుపాసించుట
కలదు. ఆ మ్లేచ్ఛులలోననే చాలమంది వారు మ్లేచ్ఛులయి
యుండి వైదిక దేవతల నుపాసించుట కలదు, ఈ పండుగలు
వారును జేయుట కలదు. మ్లేచ్ఛులపండుగ లవర వర్ణములవారు
చేయుటయుగలదు. ఇట్లీ యా శేతుసీతాచలమయిన దేశ
ములో నూఱు నూటయేబదికోట్ల సంవత్సరములలో నిది
యిట్లు జరిగినదని జెప్పుటకు వీలులేదు. కొందఱుత్తమ కుల
స్థులు కూడ మ్లేచ్ఛ దేవతల నారాధించుట కలదు. కొన్ని
మ్లేచ్ఛ దేవతలే వైదిక దేవతలుగా వ్యాఖ్యానించుటగలదు.
ఈ భారతదేశమనాదిగాఁ గొంతమేఱ పంచకోలగపాయము.
కాని యొక రహస్యమున్నది. ఉత్తమవర్ణములలోఁ జాలవఱకు
వైదికమతము స్వచ్ఛముగా మహాప్రవాహముగా సృష్ట్యాది

నుండి నేటివఱకు ప్రవహించుచునేయున్నది, ఈ మ్లేచ్ఛదేవతలుత్తమ వర్ణములలోని కొందరు స్త్రీలచే నుపాసింపఁబడుదురు. వానియందుఁ బురుషులు నిరాదరము వహింతురు; వహించుటయే కాదు, ఆ దేవతోత్సవములకుఁ గావలసిన సదుపాయములను జేసిపెట్టుచునే యుందురు. అట్టి యుత్సవములలో నప్పుడప్పు డంతఃపురస్త్రీలు గ్రామమువెంటఁబోవు చుందురు ఆ సమయములందుఁ గూడ ఘంటానాదము జరుగుటయుఁ గోటలోని జనములు వెలికిరాకుండుటయు జరుగు చుండును.

శ్రీముఖుఁడు తానేపోయి యీ ఘంటానాదమును జేసెను. కారణమెట్టిదో యెవరికిని దెలియదు. ఈ రీతిగా నిర్ణయించి శ్రీముఖుఁడు సూర్యోదయము కొఱకుఁ బ్రతీక్షించుచుండెను.

సూర్యోదయము కాఁబోవుచున్నది. తూరుపుఁ బారిజాతపుఁబూలు చల్లినట్లు, తెల్లగన్నేరుపూలు వికసించినట్లు, సితపుండరీకములు పరచఁబడినట్లు, తెలిముద్ద మందారములు విశీర్ణములయినట్లు, తెల్లావుల మందలు విహరించినట్లు, సితవాలుకా ప్రదేశములు ప్రాతర్వాయువులకుఁ జిన్నచిన్న మొల్లుగా నలంకరింపఁబడినట్లు, తెలిమబ్బులాకాశములో గలసిపోయినట్లు, సూర్యునిరథము వచ్చుచుండఁగా దెల్లనిధూళిముందుఁ దూకినట్లు, సనూరుని ముంజేతివజ్రకంకణకాంతులు ప్రాగ్దిశను గుత్తగొన్నట్లు, సితకల్హారవనములు ముకుళించికొనబోవుచున్నట్లు, మార్తాండ దేవుఁడరుదేరఁ బోవుచున్నాఁడని ప్రాగ్దిశాదేవి తన యింటికి వెల్లవేసినట్లు, ఏనుగుఱ్ఱాల నిక్కపా

డిచికొన్న చెవులకడిమి సితమయూరీ పింఛనేత్రముల యలంకారములకు నిజముగా గన్నులు వచ్చి తమ పయనింపఁబోవు పురోదేశమును బరామర్శించుచున్నట్లు, శరత్కాలమంతయు నొక్క కెరటముగా వచ్చి పూర్వదిక్కున బడఁబోసికొన్నట్లు, ప్రొద్దుక్రుంకిన తరువాత నశీమింటఁ గనిపింపఁబోవు చంద్రుఁడును వెన్నెలయు మేమిప్పటినుండి వెన్నెల లారంభింతుమన్నట్లు, కాలసర్పములు తొలగిపోయి యవి తొలఁగిపోయిన మేర వానిప్రాకినమేర తెల్లని చాళ్ళుగా దున్నుకొని యున్నట్లు, తోఁకనున్న ప్రాణము తలకువచ్చినట్లు, సితసర్వసూక్ష్మాస్థికలు వెదఁజల్లినట్లు, రంగురంగుల ముగ్గులు చెదరిపోయి యొకబూదిరంగుగాఁ బ్రదేశమంతయు మాఱినట్లు, జగత్తునకు మరలఁ బ్రాణమువచ్చుచున్నట్లు, కనులలోనున్న కాలుష్యమును విఱిచికొని యొక మహాపురుషుఁడు ప్రసన్న దృక్కులఁబ్రసరింపజేసినట్లు, ఎవనిదో కచ్చరమయిన గుండె నిశాంధకారమును విరియించికొని యంధకార పంకపరికమెండించికొని దివాసితికాంతులు వెల్లివిరియింపించికొన్నట్లు, కాలమన్న పురుషుఁడు మరలఁ బ్రదుకఁబోవుచున్నాఁడాయన్నట్లు ప్రాగ్దిశ వన్నెలు వన్నెలుగా భాసించెను.

నాగార్జునుఁడు లేచెను. అతనితోఁబాటు విజయసింహుఁడును లేచి కూర్చుండి తన మెడమీఁదఁ జేయివేసికొనెను. చేయి తడిసినట్లుండెను. చూచికొనెను. చేయినెత్తురయ్యెను. అంతకు గొంచెము పూర్వమయినచో నెత్తురు విస్పష్టముగా గనిపించెడిదే. త్రోసికొనివచ్చుచున్న సూర్యుండుదయించక ముందు వెలారియున్న దోరవాఱియున్న దివ్వెటీ

వెలుతురులో వెలతెలఁబోయి యా దొరవెల్గులలోఁ గలసి పోయెను. ఆ వెలుగులకు విస్పష్టత లేదు. నాగార్జునుఁడు లేచి నిలుచుండెను. విజయసింహుఁడతనివంకఁ దేఱిపాఱఁజూచెను. నాగార్జునుఁడని గుర్తుపట్టెను. ఇది యేమి వేసమనుకొనెను. నాగార్జునుఁడు పోయి శ్రీముఖునితో నిట్లనెను. "ఇప్పుడు మీరే మహారాజులు. విజయసింహునిఁ దీసికొని పోయి మీరేమి రహస్యము పాలింపఁదలంచికొన్నారో దానినిఁ గాలించికొండు. నే నెచ్చటికిఁ బోను. నా మేడ లోననే నేనుందును. రాజాజ్ఞ యెప్పుడైనచో నప్పుడు నేను వచ్చి సర్వవృత్తాంతమును నివేదించికొందును. మీరు వెంటనే విజయసింహుని దీసికొని పొండు. మీరు వెంటనే రమ్మన్నచో నేను వత్తును. కాని యీ వేసముతో నేను నలుగురికిని గనిపించరాదు. మీ యాజ్ఞ"

శ్రీముఖుఁడు 'రేపు ప్రొద్దున జనమేజయ మహారాజు గారు మన పురమేతెంతురు. మీరువచ్చి సాయంకాలము నందు మాతో మీరు మనవిచేసికొనదగినది మనవిచేసికొన వచ్చును. మీరు వెళ్ళను వచ్చును. మీరు రాజధానినుండి యెచ్చటికైన వెళ్ళదలఁచినచో మరలఁదిరిగి రానిచ్చగించనిచో మిమ్మెవ్వరు నడ్డుపెట్టరు. ఉండఁదలఁచినచో సాయంకాలమున సూర్యాస్తమయ మింకరెండుగడియలకు జరుగు నన‌ఁగా మా వద్దకురావచ్చును' అనెను. అంతట శ్రీముఖుఁడు విజయసింహు నా యిద్దఱి భటులచేతఁ బట్టించికొని తన గదిలోనికిఁ దీసికొనిపోయెను. నాగార్జునునకు శ్రీముఖుఁడన్న మాటలలోని సర్వార్థము తెలిసెను. ఆయన తనకన్న

గారుకాఁడు. తాను తమ్ముఁడుగాఁడు. ఆయన మహారాజు, తాను దోషియైన సేవకుఁడు. ఇంతకుమున్ను సోదరుఁడన్న భావమునకు మాత్రము గౌరవమిచ్చుచుండెను. నాగార్జునుఁడు తన మేడకు వెడలిపోయెను. శ్రీముఖుఁడు విజయసింహునిఁ దనగదిలో మంచముమీఁదఁ బరుండబెట్టి రాజవైద్యుని వెంటనే పిలిపించెను. ఆయన వచ్చిజూచెను. వైద్యుఁడు గాయము బలమైనదేగాని ప్రాణాపాయములేదనెను. విజయసింహుఁడు మాటాడుచునేయుండెను. రాజవైద్యునకే హేతువుచేత విజయసింహుని కీగాయముతగిలెనో తెలియుదు. శ్రీముఖుఁడా గాయమెట్లు కలిగెనని యడిగెను. రాజవైద్యుఁడు చాలసేపు విచారించి యిట్లనెను. "ఈయన స్మృతితప్పిపడిపోయి యుండవలయును. అప్పుడెదోయొక విచిత్రమైన సర్పమువీరి మెడయంతయు గొఱికి యుండవలయును. అట్టి సర్పములు మహారణ్యములలో నుండును. కొండ దేశములలో నుండును. దానికి నాల్గు శిరస్సులుండవలయును. ఎందుకనఁగా నాల్గు నాల్గు గాట్లుగాఁ గనిపించుచున్నది. ఆ సర్పము చాలసేపు కొఱికినట్లుండెను. పాములు కాటువేయును. వెడలిపోవును. ఆ సర్పమిదియేదో తాను భక్షించుపదార్థమని యనుకొని యుండవలయును. లోనినరములను గూడఁ గొఱికినది. నరములు తెగిపోవలసినదే. మఱికొంతసేపు రాజకుమారుని రక్షించినవారు కనిపించక పోయినచో నరములు కూడఁ గొఱికివేసెడిది. ఎందుచేతనో యా సర్పముయొక్క కోఱలయొక్క వాడితగ్గిపోయినది. ఆ సర్పము తన కోఱలతో దాళ్ళను గొఱికినట్లున్నది. ఆ కోఱలు వాడితగ్గిపోయినది. ఇది యంతయు నా యూహ.

నేనెదో తెలిసికొన్న విషయము మన సమీపారణ్యములలోఁ గూడఁ నట్టి సర్పములులేవు. ఇట్టి సర్పములు చాల తఱచుగా నుండును. అవి దరద బర్బర శకాది దేశములందుండును. నా నడివయస్సులో నెప్పుడో చూచితిని అనెను. శ్రీముఖుఁడు 'ఇది నెమ్మదించునా' యని యడిగెను. వైద్యుఁడు "యువ రాజా! నిస్సందేహముగా నెమ్మదించును. వైద్యుడఁను నేను గనుక నెమ్మదించును. అయ్యా! నేను నలుబఁదియేండ్లు సర్వ భారతదేశము సంచరించి వైద్యమునేర్చినవాఁడను. నాకీ దేశ ములోని వ్యాధులు తెలియును, నీ దేశములోనివి తెలియవని లేదు. భారతదేశమునకు వాయవ్యదిశనున్న సర్వమ్లేచ్ఛ దేశ ములలోఁ గూడ నేను దిరిగి యచటి జంతువులు వాని కాట్లు వానికిఁ దగిన చికిత్సలు నేను నేర్చికొంటిని. యువరాజా! మఱియొకమాట. ఇది పాముకాటు కాకపోవచ్చును. ఎవఁడో యీయనమీఁద తుచ్ఛ సర్పప్రయోగమును జేసియుండ వచ్చును. అప్పుడుకూడ గాయమిట్లేయుండును. నేను పామే కఱచినదని యేల చెప్పితిననఁగా నట్టి ప్రయోగమయినచో రాజకుమారుఁడీపాటికి జీవించియుండఁడు. ఆ ప్రయోగమును రాత్రి రెండుజాములకుఁ జేయుదురు. తెల్లవాఱు వఱకాపురు షుఁడు మరణించును. రాజకుమారుఁడు జీవించియున్నాఁడు. అందుచేతనిది సర్పదంశమే కాని తుచ్ఛప్రయోగముకాదని యనుకొనుచుంటిని. దీనిని నెమ్మదింపఁ జేయుటకుఁ బది దిన ములకంటె నెక్కువ యవసరములేదు. నేనిప్పుడే నా యింటికిఁ బోయి పదినిమేషములలో మందులు తీసికొని వత్తును." అని వైద్యుఁడు వెడలిపోయెను.

జాము ప్రొద్దెక్కినది. మరల ఘంటాధ్వానములు సాగినవి. కోటలో యథేచ్ఛముగా జనుల రాకపోకలు జరుగు చున్నవి. కోటలో నొక చాటింపైనది. మహారాజుగారు రాజ్యపాలనమంతయు యువరాజుగారికి నప్పజెప్పిరి. రేపు యువరాజుగారికి రాజ్యాభిషేకము జరుగును. సర్వాధికారుల యొక్క మహాసభ వెంటనే జరుగును. సర్వ ప్రజలును రావ చ్చును' అని.

మహాసభ జరుగుచున్నది. మంత్రులు సేనానాయకులు సేనాపతులు రాజోద్యోగులు నందఱును వచ్చిరి. విజయసింహుడును నాగార్జునుడును మాత్రమే రాలేదు. ఆ సభలో శ్రీముఖుడిట్లు చెప్పెను. "మహామంత్రులారా! సేనానాయకులారా! మహోద్యోగులారా! కడచిన రాత్రి యొక వింత జరిగినది. నాయనగారు మహా యోగి. మీలో గొందఱకది తెలియును. ఈ రెన్నాళ్ళయిన తరువాత మీరు యోగము నందు ప్రవేశించుడని కాని నాయనగారు కడచినరాత్రి రెండుజాముల వేళకే యోగమునందు ప్రవేశించిరి. సమాధి గతులైరి. ప్రబోధించినను ప్రబోధింపబడుటలేదు. ఆ రహస్యము నాతో బూర్వమొకటి రెండుసార్లు చెప్పిరి. నేనట్లు చేయవలదని యెన్నిసార్లో ప్రార్థించితిని. వారికి నా మీద దయలేదు. రాత్రి సమాధియందు ప్రవేశించిరి. దానికిఱువది గడియల ప్రమాణము. అదియొకసిద్ధి. నేటిరాత్రి రెండు జాములకు వారి కపాలము విభిన్నమయి జీవుడు వినిర్గమించును. మా పట్టాభిషేకము రేపు జరుగదు. కర్మలైపోయిన

తరువాత జరుగును. కాని తండ్రిగారి యాజ్ఞవలన మేము కడ చినరాత్రి పండ్రెండు గంటలనుండియే రాజ్యాధికారము వహించితిమి యనెను. సభలో జయధ్వానములు చెలరేగెను.

౧౫

ఆ ప్లవంగనామ సంవత్సర కార్తికిక శుద్ధ నవమినాటి రాత్రి రెండుజాములకు వినయశర్మయుఁ జంద్రశేఖరవర్మయు నిద్దఱు సేనాపతులును మరిద్దఱు మంత్రులును నాలుగేనుఁగులతో వంద గుఱ్ఱాలతో నాల్గయిదు వందల పదాతి సైన్యముతో బయలుదేరి విదర్భ రాజధానియైన కుండిన నగరమునుండి ధాన్యకటకమునకు వచ్చుచున్న జనమేజయమహారాజు నెదుర్కొనుటకు వెళ్ళిరి. దశమినాఁడు తెల్లవాఱువేళకు ధాన్యకటకమునకు దక్షిణదిశయందుఁ బది క్రోశముల దూరమునందు జనమేజయమహారాజ సైన్యమును గలసికొనిరి. చక్రవర్తి వెంట లక్షమంది యున్నారు. రథములు, ఏనుగ్గుఁలు, గుఱ్ఱములు, పదాతులు, వారకాంతలు, బహువిశోద్యోగులు, చక్రవర్తి సైన్యము నేలయీనినట్లుండెను. వినయశర్మాదులెదురుకొని తమ్ముఁ దామెఱింగించుకొనిరి. చక్రవర్తి సైన్యమాగెను. చక్రవర్తి యాంధ్రమంత్రి సేనాపతి వినయశర్మ చంద్రశేఖర వర్మలకు దర్శనమిచ్చెను. చక్రవర్తితో వినయశర్మ యిట్లనెను. 'మహారాజా! ఆంధ్రదేశపు రాజయిన రోమపాదుఁడు నేటిరాత్రి రెండవ యామమునఁ బరమపదిం

చెను. ఆయన మూన్నాళ్లుగా సమాధిగతుఁడై యుండెను. రాత్రి రెండు జాములకుఁ గపాలము విభిన్నమయి బ్రహ్మైక్యమును బొందెను. ఆయన మహాయోగి. తమరు దయచేయు వఱకుఁ బ్రతీక్షించి యుండవలయునని యువరాజయిన శ్రీముఖుఁడు మిక్కిలి వినయముతోఁ బ్రార్థించెను. కాని యీ మహాయోగి లోకమునకుఁ జెందినవాడు కాడు. ప్రాణము పోయినంతనే తెల్లవాఱకముందే దహనాది క్రియలు జరుగవలయునని యాయన శాసించెను. ఈపాటికి దహనాదిక్రియలయిపోయి యుండును. లేనిచో శ్రీముఖుఁడు కూడ వచ్చెడివాడే. తమరికి మున్నువార్త పంపించినట్లు నేటిపగలు రెండు జాములకు బట్టాభిషేకము జరుగదు. కాని తమరి రాకకయి ప్రతీక్షించుచున్నాడు. తాను రాలేనందుకు వినయ వినమిత శిరస్కుఁడై నాముఖమున క్షమాపణ లర్థించుచున్నాడు. తమరి సైన్యము తమరు విడిదిచేయుటకు గృష్ణానది యొడ్డునను రెండుక్రోశములమేర యరక్రోశము వెడల్పున శిబిరములిదివఱకే నిర్మింపబడి యున్నవి. చక్రవర్తులయిన తమరు దిగుటకు నివసించుటకు వేయి తులముల సువర్ణమును వెచ్చించి పెద్దరాజ భవనము నిర్మించబడి యున్నది. ఆ భవనములోఁ బుణ్యాహకర్మలన్నియు జరిగింపబడి తమరిని బ్రతీక్షించుచుండిరి. ఈకర్మలైనన్నినాళ్లు తమరు ధాన్యకటకమునందుండి తరువాత శ్రీముఖునికిఁ బట్టాభిషేకముచేసి హస్తినకు మఱలి పోవలయునని శ్రీముఖుని యభ్యర్థన యని మనవిచేసెను. జనమేజయుఁడు విచారించి యిట్లనెను. బ్రాహ్మణోత్తమా! నేనిపుడు ధాన్యకటకమునకు వచ్చుట యెందులకు? అట్లు

సిద్ధిపొందిన రోమపాదుని శరీరమునుగూడఁ జూచుటకు వీలు లేదాయెను. కర్మలు జరిగినన్నాళ్ళు మేమిచ్చట నుండుటకు వీలులేదు. మాకు హస్తినలో మిక్కిలి పనియున్నది. కాశ్మీరములో మాసోదరుఁడు తద్రాజ్యాధిపతిగా నున్నాఁడు. తమకు దెలిసిన విషయమేకదా! మానాయనగారు శ్రీ పరీక్షిన్మహారాజుగారు కాశ్మీరమును జయించి, వారి జీవితకాలములోఁ గాశ్మీరమును హస్తినాపురమునుండియే పాలించిరి. వారు విప్రశాపవశమున సర్పదష్టులయి తాము మరణింతుమని తెలిసికొన్నప్పుడు హస్తినాపుర సామ్రాజ్యమును జ్యేష్ఠ పుత్రుడనయిన నాకిచ్చి ద్వితీయపుత్రుఁడును నా తరువాతి సోదరుఁడునయిన కరణదేవునకు గాశ్మీరరాజ్యమిచ్చిరి. కాశ్మీరము మ్లేచ్ఛదేశములకుఁ జాల సమీప దేశము. ఆ దేశమున కెప్పుడును మ్లేచ్ఛరాజుల యొత్తిడి కల్గుచునే యుండును. మేము తుంగభద్రాతీరమున నుండగాఁ మా సోదరుఁడు మాకు వార్తపంపెను. మేము వెంటనే కాశ్మీరమునకుఁ బోవుటయో కొంత సైన్యమునక్కడికి బంపుటయో చేయవలయును! తుంగభద్రా తీరమునుండి యక్కడనుండి యట్లే హస్తినకు బోదలచికొంటిమి. కాని వృద్ధులయి యోగీశ్వరులైన రోమపాదుల దర్శనము చేసినట్లుండును. మా తాతమ్మగారయిన రుక్మిణీదేవిగారు జన్మస్థానమును దర్శించినట్లుండును. మాకు సామంతుఁడు కాబోవు శ్రీముఖుని పట్టాభిషేకము చూచినట్లుండునని బయలుచేరి వచ్చితిమి. మేము మరల నీ ప్రాంతములకు మరియొక యేడాదికి వత్తుము. శ్రీము

ఖునితో జెప్పుడు. మేము ధాన్యకటకమునకు రాము. ఈనా డిచ్చటనే శిబిరములు వేయించి ప్రొద్దువాటాటిన తరువాత హస్తినకు మరలిపోవుదుము అనెను.

చక్రవర్తి కెదురుపోయిన యాంధ్ర సైన్యము చక్రవర్తి సైన్యము బయలుదేరి హస్తినాముఖముగా వెళ్ళిన తరువాత దిరిగి ధాన్యకటకమునకు వచ్చెను. ధాన్యకటకమునకు జేరువేళకు నేకాదశి వచ్చెను. చక్రవర్తి సైన్యము వచ్చునని యొక నెలనాళ్ళు ధాన్యకటకమున నుండునని యానెలనాళ్ళు నుత్సాహముగా వినోదముగాఁ జక్రవర్తి లక్షణము లెట్లుండునో యాత్తరాహులయిన వారి యలవాట్లెట్టివో వారి వేష భాషలెట్టివో వారి వినోదములెట్టివో చూడవలయునని యెదురు చూచుచు నువ్విళ్ళూరుచున్న ధాన్యకటక ప్రజలకు నిరుత్సాహము రెట్టింపయ్యెను. రోమపాద మహారాజు బ్రహ్మకపాలభేదము చేసికొని సిద్ధిపొందెనన్న వార్త చేత నొక్క ధాన్యకటక మహానగరమేకాక గోదావరి యొడ్డువరకు నున్న సర్వాంధ్రదేశము మహానందభరిత మయినది. అన్ని నోళ్ళయందు రోమపాదుని ధర్మపాలనము నాయనయొక్క యోగాభినివేశము వేద వేదాంగ విద్యా పారంగతత్వము ప్రశంసింప నారంభింపబడినవి. ఈ వార్తతో దేశమునందు వైదిక సంప్రదాయాభిమాన మెక్కువమైనది. వైదిక మార్గాభిరుచి మిక్కుటమయినది. సనాతన ధర్మము సర్వోత్కృష్టమైనదన్న భావము ప్రబలినది. బ్రాహ్మణ గృహముల యందగ్ని హోత్రములు పరమప్రీతితో హవిస్సులు స్వీకరించినని.

కర్మదినములు గడచిపోయెను. ధాన్యకటకము నందనేకోత్సవములు జరిగినవి. ఆంధ్రదేశమునందలి యనేక స్థలముల నుండి లక్షమంది బ్రాహ్మణులు, వేదపండితులు, శాస్త్రపండితులు వచ్చిరి. భూరిసంభావనలను దీసికొనిపోయిరి. రాజధాని రాజధానియంతయు నుత్సవములతో నానంద తరంగములు విరిసినవి. ఎన్నియుత్సవములు జరిగినను ప్రతివాని నోట నొక్కటియే మాట. విజయసింహ నాగార్జునులు కనిపించరేమి? దానికి హేతువనేక విధములుగాఁ జెప్పికొనఁబడినది. రోమపాదుఁడు సిద్ధి పొందిన విషయము రోమపాదుని గురువయిన యొక మహాయోగి బదరికాశ్రమమున నున్నాఁడట. యాయనతోఁ జెప్పుటకు విజయసింహునిఁ బంపించినారట. తపతీగోదావరీమధ్య భాగములనున్న మ్లేచ్ఛజాతులు సామాన్యముగా నొక రాజు చనిపోయి మఱియొక రాజు రాజ్యమునకు వచ్చునడిమికాలమున నాదేశముమీఁదికి దండెత్తుదురు. రోమపాద మహారాజు సిద్ధి పొందునన్న విషయము ముందే తెలియును గనుక కొంతసైన్యము నిచ్చి నాగార్జునుని మ్లేచ్ఛజాతుల నడుమలో నుంచుటకు నాగార్జునునిఁ బంపించినారట. ఈ రెండు వార్తలు మాత్రము ప్రబలముగా నుండెను.

కర్మలు వానితోఁబాటు నుత్సవములు పూర్తియైన తరువాత నెలనాళ్ళకు గాని ధాన్యకటకము మఱల శాంతి పొందలేదు. కర్మలైన వెంటనే శ్రీముఖుని పట్టాభిషేకము జరుగును. మరల రెండు మూఁడు మాసములు వచ్చిన సర్వజనులు ధాన్యకటకమునందే యుండవలయుననుకొనిరి. కాని

పట్టాభిషేకము కీలకనామ సంవత్సర మఘ మాధవ మాసముల నాటికిఁ గాని జరుగవని ప్రకటింపఁబడినది. ఈ లోపుగా రాజెవరన్నది ప్రశ్న. శ్రీముఖుఁడే రాజు. రాజ్యమాయనయే పాలించుచుండును. అది సాంప్రదాయముకాదు. వెంటనే పట్టాభిషేకము జరిగి తీరవలయును. కాని శ్రీముఖుఁ డంగీకరించలేదు. శ్రీరామచంద్రుని పాదుకలు భరతుఁడు నంది గ్రామమునఁబెట్టి శ్రీరామచంద్రుని పేర రాజ్యము చేసినట్లు రోమపాదుని ఖడ్గము సింహాసనమునందుఁ బెట్టి శ్రీముఖుఁడు తాను రాజ్యము చేయుదునని చెప్పెను. ఈ నాల్గయిదు నెలలట్లే చేయుదుననెను. ప్రకృతి జనులును విద్వాంసులును గాదనలేకపోయిరి. శ్రీముఖుఁడు చెప్పినమాట సంప్రదాయ బద్ధముగానున్నది?

అట్లు రాజ్యము జరుగుచున్నది.

మార్గశిరము వెళ్ళిపోయినది. పుష్యమాసము వచ్చినది. విజయసింహుఁడు పూర్తిగా నారోగ్యము బొందెను. శ్రీముఖుఁడును విజయసింహుఁడును గూర్చుండిరి. పలుసార్లు నాగార్జునునిఁ బిలిచి జరిగిన సర్వవర్తమానములు తెలిసికొనుచుందురు. నాగార్జునుఁడు రాజుగారిమేడకు నర్ధరాత్రములందు వచ్చును. అర్ధరాత్రములందు వెడలిపోవును. నిరంకుశుని యధికారము నందున్న తోఁటపట్టునకు వేఱొకయధికారి నియమింపఁ బడెను. నిరంకుశుడు తన కోటనుండి బయటికి వచ్చుటకు నాజ్ఞలేదు. నాగార్జునుఁడు వినయశర్మ చంద్రశేఖరవర్మ వీరితో జయద్రధుని సర్వగూఢచార రహస్యము రెండు నెలలలో గరతలామలకములయ్యెను.

ఒకనాటి రాత్రి యగ్నిగ్రామమునకుఁ బరశురామ ప్రీతి జరిగెను. ఆ యూ రెందుకు ముట్టుకొనినదో యెవరికిని దెలియదు. ఆ గ్రామములో నొక జీవియు బ్రదికి బైటఁబడ్డట్లు లేదు. ధాన్యకటకములోనున్న కొన్ని యిండ్లు కూడ నగ్నిదగ్ధములయినవి. కొందఱు పురుషులేమయినారో తెలియదు. దీనితోఁబాటు సర్వాంధ్ర దేశము నందును మహాపట్టణముల యందుఁ గొందఱు పురుషులయొక్క నిర్బంధము జరిగెను. గోదావరీతీరము నందలి కొన్ని పల్లెటూళ్లు నాశనము చేయఁ బడెను. ఇట్లు జరుగుటకుఁ గారణమెవ్వరికిని దెలియదు. ఇది కొందఱు రాజాగ్రహమనుకొందురు. కొందఱు దైవప్రాతికూల్యమనుకొనిరి. గోదావరీనదిమీఁద గృష్ణానదిమీఁదఁ బ్రయాణము చేయు కొన్ని నావలు వాని యజమానులంతరించి పోవుటచేత నవి రాజకీయములుగాఁ జేయఁబడినవి. ఆ నావలమీఁద యధికారమును గేవును దీసికొనుటయు ధాన్యకటకము నుండి ప్రత్యక్షముగా నియోగింపఁబడిన రాజాధికారుల చేతులలో నుండెను.

ఇట్లుండఁగా నొకనాఁడు ధాన్యకటకములో బదరికాశ్రమము నుండి విజయసింహుఁడు తిరిగి వచ్చుచున్నాఁడన్న వార్త రాజసభలో నొకవార్తాహరుఁడు తెచ్చి చెప్పెను. ఆ సాయంకాలమున శ్రీముఖుఁడు తన సర్వసైన్యముతో సర్వప్రకృతి జనముతో రెండు క్రోశముల దూరమెదురు పోయి యా వచ్చుచున్న విజయసింహునకు స్వాగతము నెఱపి యాయనను రాజధానికిఁ దీసికొని వచ్చెను. కోటయంతయు విజయసింహు నెగఁబడిచూచెను. విజయసింహుని

మీఁదఁ గుడివైపున నేదో పెద్దగాయమై మానినట్లుండెను. శ్రీముఖుఁడందులు వినుచుండఁగాఁ దనతమ్మునితో నీగాయ మెప్పుడైనదని యెంతో యాదుర్దాగా నడిగెను. విజయసింహుఁడు తాను బదరికారణ్యములలోఁ బోవుచుండఁగా నొక పులి వెనుకనుండి తన మీఁద దూకెననియు దానినిఁ దాను సంహరించితిననియు నొక యోషధీపరిజ్ఞాతయైన యాటవికుఁడు దానిని బదునేను దినములలో నయముచేసెననియుఁ బదునేను దినములకుఁ బూర్వమే దానిచ్చటికి వచ్చెడివాఁడనని యుఁ దన ప్రయాణవేగమున కాగలేక మార్గమునఁ దాను నిలిచిన యేబఁది గుఱ్ఱములు శ్రమచేత మరణించెననియుఁ గథలు కథలుగాఁ జెప్పెను. అవియన్నియుఁ బ్రజలలో వ్యాపించెను.

మఱి పదిదినములకు నాగార్జునుఁడు మ్లేచ్ఛజాతుల నడచి సైన్యముతోఁ దిరిగివచ్చుచున్నాఁడని వార్త వచ్చెను. ఆ సైన్యములో సగానికి సగము బందీలయిన మ్లేచ్ఛులు వారి చుట్టును గోదావరీ మహారణ్యప్రాంతములయందున్న రాజసేన. ఈ సర్వసేనయు గోదావరీ పాపికొండల వద్ద బయలుదేరి ధాన్యకటకాభిముఖముగా వచ్చెను. ధాన్యకటకములో మహోత్సాహము చెలరేగెను.

ఇదియంతయుఁ జంద్రశేఖరవర్మ యొక్క ప్రతిభాసమున్మేషము.

తరువాతఁ బది దినముల కొకనాఁటి యుదయమునఁ గోటలోని విశాలమయిన రహస్య మందిరమునందు శ్రీముఖుఁడు రాజాసనమునఁ గూర్చుండెను. విజయసింహుడన్న

గారి ప్రక్కఁ, గొంచెమెత్తు తక్కువ పీటమీదఁ గూర్చుం డెను. చంద్రశేఖరవర్మయు వినయశర్మయు రాజునకుఁ గుడి నైపునఁ సముచితాసనము లందాసీనులయి యుండిరి. రాజున కెదురుగా నాగార్జునుఁడును, నిరంకుశుఁడును, నిలుచుండి యుండిరి. వారి కిష్టమయినచో వారు కూర్చుండవచ్చును. వారు కూర్చుండలేదు. నిలచియేయుండిరి. రాజు ప్రాఙ్ముఖముగా నాసీనుఁడయి యుండెను. ఈశాన్యదిశయందొక వ్యక్తి నిలిచియుండెను. అతఁడు మిక్కిలి చిక్కియుండెను. మీసములు గడ్డములు పెరిగియుండెను. శిరోజము లట్టలుకట్టి యుండెను. హస్తములు శృంఖలాబద్ధములై యుండెను. అతనిని నిదానించి చూచినచో నతఁడు జయద్రథుఁడని దెలియును.

అంతఁ జంద్రశేఖరవర్మ లేచి యిట్లు చెప్పనారంభించెను. 'మహారాజా! ఈయన జయద్రథుఁడు. ఈయన తండ్రి పేరు జయద్రథుఁడు. అతని కుమారుని పేరు జయద్రథుఁడే. ఇతని తల్లిపేరు దుస్సల. దుర్యోధనమహారాజు చెల్లెలి పేరు దుస్సల కదా, ఆమె భర్తపేరు జయద్రథుఁడు. భారత మహాకావ్యమునందు జయద్రథుఁడు సైంధవుఁడను పేరుతో వ్యవహరింపఁ బడుచుండును. ఆ సైంధవునకు మేనల్లుఁడు కలఁడు. అతని పేరు కనకసింహుఁడు. ఆ కనకసింహుఁడు తన తండ్రియింటిలోఁ జాల గారాబు బిడ్డ. అతఁడు సింధుదేశపు రాజధానిలో విశృంఖలముగా దిరుగుచుండెడివాఁడు. అతఁడన్నచో సైంధవునకు మిక్కిలి ప్రేమ. సైంధవుఁడు సింధుదేశపురాజు. అతని విశృంఖలమైన ప్రవర్తనకు రాజధా

నిలో నడ్డు లేకుండెడిది. అతఁడు మ్లేచ్ఛులతోడి సావాసము మ్లేచ్ఛ దేవతారాధనము మ్లేచ్ఛాచారము నవలంభించుట మ్లేచ్ఛ సిద్ధాంతములయందు విశ్వాసము మొదలయిన లక్షణములు కలవాఁడుగా నుండెడివాఁడు. ఇంతయుండి వైదిక మతమునుఁ బరిత్యజించలేదు. వర్ణముచేత క్షత్రియుఁడు, విశ్వాసముచేత మ్లేచ్ఛుఁడు. అతనికి సైంధవునిమీఁద గల యనురాగముచేతఁ గానిచో మ్లేచ్ఛులచేత సింధుదేశము మీఁద దండెత్తింపించెడివాఁడు. రామఠులు మ్లేచ్ఛులు. రామఠసింధుదేశమునకు దగ్గఱి దేశము. రెండు రాజ్యములకుఁ బొలిమేర కలసియేయున్నది, అతని కొక కూతురు కలదు. ఆమెకుఁదన మేనమామ భార్యపేరుపెట్టెను. అందుచేత నామె పేరును దుస్సలయే. సైంధవుఁడు పరమపతివ్రతయయిన ద్రౌపదీదేవినిఁదనబావమఱఁదులభార్యయనియైనవిచారించక వావివరుసలుపరిగణించకవారరణ్యావాసముచేయుచున్నప్పుడు వారును పర్ణశాలయందు లేకుండఁ జూచి యామెను బలాత్కరింపఁబోవుటయుఁ దరువాత భీమసేనుఁడు వచ్చి వానిని బరాభవించి పంపించుటయు, దత్ప్రతిక్రియగా నతఁడు శివునారాధించుటయు శివునియొక్క దయావిశేషమున నర్జునుఁడు కాని తక్కిన నలుగురు పాండవులను ద్రోణుఁడు పన్నిన పద్మవ్యూహభేదన సమయమునందు సైంధవు డడ్డుకొనుటయు, భీమ నకులసహదేవులు పద్మవ్యూహములోనికి ప్రవేశింపవీలులేనందున నభిమన్యుఁడు సంహరింపఁబడుటయు నందుచేతఁ గుపితుఁడైన పార్థుఁడు మఱునాఁడు సూర్యుఁడస్తమింపకమున్న వానిని సంహరింతునని ప్రతినచేయుటయు గధారూపమున జగద్వ్యాది

తములయిన విషయములే. వానినే భగవంతుడైన వ్యాసుఁడు భారతమహాకావ్యమున గుంఫించెను. అంతటితోఁ గథపూర్తి కాలేదు. ద్రోణాదుల పరాక్రమము వలన మఱునాఁడు సైంధవ వధ యర్జునునకుఁ బచ్చివెలగకాయయైనది. అపుడు శ్రీ కృష్ణుఁడు సూర్యునకుఁ దన చక్రమడ్డుపెట్టి సూర్యాస్తమయమైనదన్న భ్రాంతి కల్పించి, సైంధవుఁడు తలయెత్తి చూడఁగా నర్జునుఁడు వాని శిరస్సు ఖండించెను. అది నేలఁబడినచో నర్జునుని శిరస్సు సహస్రధావయ్యలగును. భగవంతుడైన శ్రీ కృష్ణుఁడు పార్థుని ప్రబోధించి పాశుపతాస్త్రము చేత నా శిరస్సును మీాట నాడింపించుచు సైంధవుని తండ్రి యూవేళకుఁ దానెదో యొక నదీతీరమున సంధ్యార్ఘ్యాంబువులు వదలు వేళ వానిచేతిలో వేయించెను. ఇది వాని ప్రేలుపెట్టి వాని కన్నెపొడిచినట్లయ్యెను. ఆ సైంధవుని తండ్రి తన కొడుకు తల యెవనిచేతిమీఁదుగా నేలపడునో, వాని తల వేయివ్రక్కలగునని కొడుకునకు వరమిచ్చుటయో; యిదియెవనినో శపించుటయో, తన మృత్యువును దాను నిర్ణయించుకొనుటయో గా నొకవాక్యమనెను. దాని వెనుక నా సైంధవుని తండ్రి తపోబలమున్నది. ఇది జరిగిన విషయము. ఈ వార్త యందఱకుఁ దెలిసెను. సింధుదేశములో నిదియొక విపరీతమయిన, దుష్టమైన, నీచమైన, కృత్రిమమైన శ్రీకృష్ణదేవుని దుర్మేధనుండి వికసించిన యర్జునుని యసమర్థతకుదాహరణప్రాయమయిన విషయముగా భాసించెను. మఱియు సింధురాజు కుటుంబములో నింతకంటె ఘోరమయిన దుర్వార్త సృష్టిలో జరుగదన్న విశ్వాసమేర్పడెను. ద్రౌపది

కట్టుపుట్టము లొలుచుటగూడ నింత యన్యాయమైన విషయముగా వారికిఁ దోఁచలేదు. సైంధవుఁడు చనిపోయెను. దుర్యోధనాదులే సంహరింపఁబడిరి. ఈ పగ తీర్చెడివాఁడెవఁడు? ఎవనిమీఁదఁ దీర్చవలయును? సైంధవుని కొక్క కుమారుఁడున్నాఁడు. వాఁడు నిసుగు. అర్జునుఁడు తరువాత ధర్మరాజాశ్వమేధ సమయమున దిగ్విజయము చేయుటకుఁ బోయినప్పుడు ధృతరాష్ట్రుని కూతురయిన దుస్సల తన చిన్న కొడుకును దెచ్చి యర్జునుని పాదములమీఁద నుంచి ప్రాణదానము కోరినది. సైంధవుని భార్యకుఁ గాని యాయన కుమారునికిఁ గాని యీ పగ పట్టలేదు. సైంధవుని కుమారుఁడు పెద్దవాఁడయ్యెను. ఆయనయే సింధుదేశమును బాలించెను. సైంధవుని మనుమఁడిప్పుడు పాలించుచుండెను. ఈ పగ తీర్చవలయునని పట్టినదెవరికి? కనకసింహునకు. ఆ కనకసింహుఁడు తన కూతురయిన దుస్సలకీ విరోధము యొక్క నిష్కృతి యామె జీవితపరమార్థముగా నిర్ణయించెను. ఆ కనకసింహుడొక పరమ రాక్షసుఁడు. ఈ నిర్ణయ మెట్లుచేసెననఁగా నది యర్జునునిమీఁది పగకాదు, కృష్ణదేవునిమీఁది పగకాదు, అది వైదిక ధర్మముమీఁది పగ. దీనికిఁ గారణమతఁడు మ్లేచ్ఛభావ పరిపూర్ణుఁడై యుండుటయే. మ్లేచ్ఛుల సంఘాచారములయందతనికున్న పరమానురాగమే. అతనికి వైదిక ధర్మమన్నచో సుంతయుఁ బడదు. అతనికంటె హిరణ్యాక్ష హిరణ్యకశిపులును, రావణకుంభకర్ణులును, శిశుపాలదంతవక్త్రులును మేలు. ఏలయనఁగా వారు శివభక్తులు. ఈ కనకసింహుని దైవతమెవరు? శక దరద బర్బర యవన కిరాత

హూణ పారసీక దేశములలో నుండి వైదికమార్గమునకు వ్యతిరేకులయి యిచ్చటి సుక్షత్రియులచేత వెడలనడువఁబడి ఆళ్ళను రప్పలను గొన్నిలోయలలోని పిశాచములను నొకానొక ప్రదేశము నందలి ప్రకృతి సహజమయిన విపరీత లక్షణములచేత నాకాశమునందుఁ దేజోమయమైనది తేజోమయము కానిదియైన యొక శక్తి భాసించుచుండఁగా దానినొక దేవతగా నుపాసించుచుండి, వైదికములయిన ఋగ్వేద దేవతలను దిరస్కరించుచు నారాధించెడి యొకవిచిత్ర జాతి యొక్క మానుషశక్తుల కతీతమయిన యెదో శక్తిగా భాసించెడి యసంస్కృతీమయిన, యపూతమైన, యవహ్నికమైన, యిదమిత్థమని చెప్పరాని దెదోయది వీరి దైవతము. ఆ దైవతము కొండలోయలలో మాటుమాటుపలుకును. తీవ్రమయిన యెండలలోనడచివచ్చినపుడుకనులుబైరులు క్రమ్మిమంటలుగా గనిపించును. ఎవో మాటలు వినిపించును. వారి దైవమనఁగా నది ఆ దైవమును భారతదేశములోని చాతుర్వర్ణ్యము వారుపాసించవలయును. అది వారి యున్మాదము. ఇది యెచ్చటనయిననున్నదా? తాముచెడిపోయిదూరముగాఁబోయిరి. పోయినవాఁడు దేనినుండి చెడిపోయెనో దానినిఁ గూడఁ జెఱుపవలయుననియా? ఆ కనకసింహుఁడు తన కూతురయిన దుస్సలనుఁ గలిగించిన విశ్వాసమిది. సైంధవుఁ డెందుకుఁ జనిపోయెననఁగా శ్రీకృష్ణుని హేతువుచేత. కృష్ణుఁడు లేనిచో నర్జునుఁడే చచ్చెడివాఁడు. కృష్ణుఁడు భగవంతుఁడను చున్నారుగదా. ఆ భగవంతుఁడెవరికి? వైదికమతానుయాయులకు. కనుక వైదికమతమును నాశనము చేయవలయును. వైదిక

మతమును నాశనము చేయుటయెట్లు? తన్మతసంరక్షకులయిన రాజులను నశింపఁజేయుట. ఆ రాజ్యములను దామాక్రమించుట, కాని కనకసింహుఁడును వాని గురువులును మూర్ఖులు కారు. సృష్ట్యారంభము జరిగిన తరువాత కృతయుగము కొన్నిలక్షల సంవత్సరములు గతించిన నాటినుండి తమ మ్లేచ్ఛజాతులు సృష్టియందున్నవని. వారు మాటిమాటికి భారతదేశము నందలి చిన్నరాజ్యములమీఁదఁ దమకెప్పుడు వీలయినచో నప్పుడు దాఁడి చేయుచుండిరని. తాత్కాలికముగాఁ దాము గెలిచినను సమర్థుఁడయిన యే మహాచక్రవర్తియో యే శకకర్తయోవచ్చి తమ్ము మఱల భారతదేశముయొక్క యావయవ్యములకుఁ దోలునని యు వారికిఁ దెలిసిన విషయమే. కాని కనకసింహుఁడు చేసిన క్రొత్త విషయమేమనఁగా దన కూతురైన దుస్సలయు నామె సంతానమును వైదికమతమును వదలిపెట్టరు. లోనుండి యామతమున కెంత యపకారమును జేయవలయునో యంతయుఁ జేయుదురు. వైదిక ధర్మస్రవంతి తన స్వచ్ఛవాస్త రంగములతోఁబోవు చుండఁగా నెంటనే యీ మురుగుకాలువ కూడఁ బ్రక్కనే పోవుచుండును. కనకసింహుని కూతురయిన యీ దుస్సల యొక్క భర్త పేరు రామకుఁడు. అచ్చటినుంచి యొక సాంప్రదాయ మేర్పడెను. ఆ రామకునకు దుస్సలకు నొక కొడుకు పుట్టెను. వాని పేరు జయద్రథుఁడు. వాడు వివాహమాడెను. ఆ వివాహమాడిన స్త్రీపేరు దుస్సలగా మార్తురు. ఆ దుస్సలకుఁ గొడుకు పుట్టును. వానిపేరు జయద్రథుఁడు. వాని భార్య పేరు దుస్సల. భారత యుద్ధము జరిగి యీ

నాటికి నూటయిరువది యైదేండ్లయినది. భారతయుద్ధము నాటికి బాలురుగానున్న వారిప్పటికి బ్రదికియున్నారు. కాని యీ దుస్సలా జయద్రథుల తరములు మూడీ నాటికి గడచినవి. ఈ జయద్రథుఁడు మూఁడవ తరము వాఁడు నాల్గవ తరము జయద్రథుఁడు, వీని కొడుకున్నాఁడు. ఇతని భార్య దుస్సలయున్నది. ఆమె పుండ్రదేశములోని యొక క్షత్రియ వంశీయుని కుమార్తె. నేనా నాల్గవతరమును గ్రహించుటకుఁ బ్రయత్నము చేసితిని. అది సులభమైన పని గాదు. పుండ్ర దేశాధిపతి యనుమతితోఁ జేయవలయును. పుండ్రదేశాధిపతి యల్లుఁడయిన మహారాజుగారికే నేను జేసిన యీ ప్రయత్నము యొక్క వైఫల్యము తెలియును. అప్పటికే వారు తప్పించుకొనిరి. తపతీనదిని దాటి చేది నిషధదేశముల నతిక్రమించి వింధ్యారణ్యములలోఁ బ్రవేశించిరి. అచ్చట మ్లేచ్ఛలయిన యాటవికుల మీఁదికి మన యాంధ్ర సైన్యములు పోవుట యెట్లు?

ఈ మ్లేచ్ఛులలో మన విద్యలన్నియు నున్నవి. వీరెవ్వారు? మననుండి తెగద్రెంచికొని పోయినవారేకదా. వీరికి త్రిమూర్తులు పనికిరారు. రామకృష్ణులు పనికిరారు. అగ్నిప్రణవాక్షి పురుషాద్యుపాసనములు పనికిరావు. వర్ణాశ్రమాచార భేదము పనికిరాదు. వైదిక ధర్మమునందు సర్వవిద్యలు వేదకర్మల కంగములు. మ్లేచ్ఛులయం దేవిద్యలకావిద్యలే. ఆరీతిగా వారు పారలౌకికమునకు జెడిపోయిరి. వారిలో జ్యోతిషమున్నది. సంగీత సాహిత్యములు కలవు. వైదిక ధర్మమునందు సంగీతము వేదాంగమయిన విద్య. మ్లేచ్ఛులలోఁ గొం

డలలో గుమ్మటములవంటి గుడ్డలు కట్టుకొని సంకేత రమ్యమైన హస్తాద్యభినయమునకు దూరమైన వెట్టిగంతులు వేయుచుఁ బాడదగినది. భారతదేశమునందలి విద్యలకు మ్లేచ్ఛ విద్యలకిదియే భేదము. ఇచటి విద్యలన్నియు సంకేతితములై పార లౌకిక సంపత్తిమార్గస్థ బహుభావములకు స్ఫోరకమయి యుండును. అచ్చటి విద్యలు మహారణ్యములందు జెట్లుమొలిచినట్లు. వారిలో గొప్ప జ్యోతిష్కులుకలరు. ఖగోళ శాస్త్రజ్ఞులు కలరు. రాజనీతివేత్తలు కలరు. బుద్ధిమంతులును గలరు. ఆ సర్వ మ్లేచ్ఛదేశములకు రామకదేశము గురుస్థానమైనది. దానికిని సింధుదేశమునకు ననాదియైన సంబంధము. వైదిక ధర్మప్రపంచకమున సాహిత్య ప్రపంచకమున నథర్వవేద మెట్టిదో తాదృశమైన బహు తుచ్ఛమంత్ర సంప్రదాయము వారియందు గలదు. ఆవిద్యలలో నొకటి కాలంజరి. గంగావిద్యను నిరంకుశునకు నేర్పెను. నిరంకుశుఁడు విజయసింహుని మీఁద బ్రయోగించెను. ఆవిద్యలకొక దోషమున్నది. ద్వాత్రింశద్దంతములు సరిగా లేనివాని కావిద్యలు పనిచేయవు. ప్రభువులకెందుకుఁ బనిచేయవో నేను చెప్పరాదు. కాని వినయశర్మగారి యాదేశానుసారము చెప్పుచున్నాను. ఇది జయద్రథుడు వినవలయునని వినయశర్మగారి యభిప్రాయము. అతడు విన్నందువలన బ్రయోజనములేదని వినయశర్మగారికి విన్నవించితిని. వారు జయద్రథుని జీవుని సంస్కారములో నీ విషయముకూడ నుండవలయునని యభిప్రాయపడిరి. ఆ సద్బ్రాహ్మణునకు జయద్రథుని జీవునిమీఁద దయయట్టిది. వైదిక మంత్రములకు నధిదేవత లుందురు. అవి తపోమయములయిన

యక్షరములు. తన్మంత్రద్రష్టలయిన వారి తపస్సు తన్మంత్ర ముగా రూపొందును. అనగా వారి తపస్సునుండి యొక దేవత యావిర్భవించును. ఆమంత్ర మాదేవతయొక్క యక్షరరూపము. ఈమంత్రములన్నియు దపోజనితములైనవి. బాహిరము లయిన విపరీతములయిన వికృతి జన్యములయిన పంచభూతములయొక్క సంయోగమునుండి కలిగిన యల్పశక్తులుకావు. ఉచ్చారణాదక్షత వేదమంత్రములకు జెప్పబడినది. అది క్రతు సమయములందు సాఫల్యము కలది. తక్కిన మహామంత్రముల విషయములలో నామంత్రములకు గల పటిష్ఠత యుచ్చారణ సంబంధికాదు. ధ్యానసంబంధి. ఈ మ్లేచ్ఛులయొక్క మంత్రములుచ్చారణ మాత్రజనిత శక్తిమంతములు. దంతములూడి పోయిన వానికవి పనిచేయవు. అందుచేత గంగునకు రాజాజ్ఞ ప్రకారము ముందటి దంతములు రెండును దీసివేయబడినవి. మఱి మ్లేచ్ఛులలోని కార్తాంతికులు రామకదేశమునందలి వారు. సర్వదా తమ మ్లేచ్ఛప్రభావ మెప్పుడే దేశము మీఁద వ్యాపించుటకు వీలుండునో యేరాజ్యమునకు బలములేదో యేదేశభాగమునకు గురుబలముతక్కువో విచారించి మ్లేచ్ఛ రాజులకు జెప్పుచుందురు. నాయా వేళలయందు, దత్తద్దేశ భాగములమీఁద దండెత్తు చుందురు. ఆక్రమించుచుందురు. ఈ యాంధ్రదేశమిప్పుడు మ్లేచ్ఛరాజులచేత సమాక్రమింపబడుటకు యోగ్యమయిన కాలముగ వారు నిరూపించిరి. ఈ నూటపాతిక యేండ్లనుండి యీ జయద్రథులు మ్లేచ్ఛ రాజులకొక యాయుధమువంటివారు. నాల్గువందల యేండ్ల నుండి యీ యాంధ్రదేశము మీఁద మ్లేచ్ఛజాతుల ప్రభా

వము లేదు. ప్రతి నాల్గువందల యేండ్లకు నాల్గు వందలు లేకపోయినచో మూఁడు వందలు కావచ్చును. మఱి యొకప్పుడింకొక యేబఁది పెరుగవచ్చును. సర్వ దేశ శములు మ్లేచ్ఛభావప్రసరణమున కనుకూలములయి యుండును. ఇది కాలముయొక్క పద్ధతి. దైవాసురసంపద్విభాగ విషయమునకు సంబంధించినది. కాలమునందే యొకొకప్పుడు దైవాంశ యొకొకప్పు డశురాంశ యుండును. అది దేశములకు గూడ సంబంధించి యుండునని మ్లేచ్ఛకార్తాంతికుల సిద్ధాంతము. ఇప్పుడాంధ్రదేశమునకు మంచిదినములు కావు. కావని తెలియుచున్నది కదా. ఆ రాముఁ లీ జయద్రధుని నాంధ్రదేశమునకుఁ బంపించిరి.

ఈజయద్రధులకు నిరువదియేండ్లు రాకముందు సర్వ భారతిమ్లేచ్ఛ విద్యలందు నిష్ణాతృత్వము కలుగునట్లు బోధించు గురువు లున్నారు. ఈయన మూఁడవ జయద్రధుఁడని మనవి చేసితిని గదా! వెనుకటి యిద్దఱు జయద్రధులును నొకఁడు కాశ్మీరరాజ్యముకూలఁ ద్రోయవలయునని ప్రయత్నించి చనిపోయెను. అప్పుడే జనమేజయమహారాజు కాశ్మీరమును దండెత్తి పోయి దాని జయించి తమ పాలనమునందుంచికొని మన జనమేజయ మహారాజునకుఁ దమ్ముఁడయిన హరదేవునందు సమర్పించిరి. రెండవ జయద్రధుఁడు వంగదేశమునం దంతరించెను. మూఁడవ యీయన యీయన. ఈ జయద్రథుఁ డిచ్చటికి వచ్చెను. మహారాజుగారి ప్రకృతియు, విజయసింహుని ప్రకృతియు, నాగార్జునుని ప్రకృతియు, సంపూర్ణముగఁ దెలిసికొనెను. ఇట్లు తెలిసికొనుట వారికి వెన్న

త్రోఁబెట్టిన విద్య. మీ యన్నదమ్ము లిరువురిలో దమరును విజయసింహుఁడును వైదిక ధర్మాభిమానులు. నాగార్జునుఁడు గాఢమయిన వైదికధర్మాభిమానము లేనివాఁడు. మీ సోదరులిద్దఱును దొలగినచో నాగార్జునుఁడు రాజగును. నాగార్జునుఁడు రాజయినచో మ్లేచ్ఛరాజ్య మయినట్లే. తొలుత నితని ప్రయత్నము తనయం దేమియు దోషము కనిపించకుండ మహారాజుగారి మరణము ఘటింపవలయునని ఆ మహాజలపాతము వెంటఁ దమరిని దూకించెను, ఈ సేవకుఁడు తమ్ము రక్షించికొనెను. అదివఱకితని మీఁద నా కనుమానము లేదు. ఆ తీవ్రాతపములలో నేనితనిని గుర్తుపట్టలేనను కున్నాఁడు. ఆ యెండలలోఁ గనిపించుటకుఁ గనులకుఁబెట్టికొను నంజనము నాకుఁ దెలియును. అదివేఱే కథ. ఆ రీతిగా మిమ్మే మియుఁ జేయలేకపోయెను. అచటినుండి వేఱొగు స్తంత్రమారంభించెను. ఎన్నికుతంత్రములు పన్నెనో యన్నియు మహారాజు గారికి నిరంకుశుని వలన విజయసింహుని వలన నాగార్జునుని వలనఁ దెలిసియే యున్నవి. ఆతఁడు తరువాత నేమి చేసెడివాఁడో నాకుఁ దెలియదు. కాని శంబరదీవిలోఁ దాను దన తల్లియు రెండేండ్లుంటిమని చెప్పినమాటలోని యా యాథార్థ్యము కాళిందిదేవిగారి మాటవలన నేను ఋజువు చేసుకొనుటయు జరిగినది. అదివఱకే యితఁడు నాగార్జునుని ప్రబోధించి విజయసింహుని చేత మహారాజు గారిని, నిరంకుశుని చేత విజయసింహుని సంహరింపించి తాను గృతకృత్యుఁడ నగుదుననుకొన్నాఁడు; కాని దైవమన్యథా దలఁచినది. తమరివివేకమే తమరిని రక్షించినది, తమరే

వెళ్ళినచో సోదరభావముచేత విజయసింహుని జిక్కఁబఱు పలేము తాత్పర్యముతో మీఁరు వెళ్ళలేము. నాయనగారు వెళ్ళిరి. తక్కిన దంతయు మహారాజు గారికి విదితమయిన విషయమే. ఈజయద్రథుఁడు తెలిసికొనుటకు నేనింకొక్క విష యము మాత్రము చెప్పవలయును. కృష్ణయవతలనున్న మహా రణ్యములోని పర్వత గుహలో దనువెలయించిన యక్షిణి యన్నట్లు నాగార్జునుని భ్రమింపజేసి నాయాటవిక వృద్ధు రాలు వయసు ముసలితనము కాదు సరికదా స్త్రీయుఁగూడఁ గాదు. అతఁడు విదర్భదేశము యొక్కయు నాంధ్రదేశము యొక్కయు నొక పల్లెటూరిలో నున్న యొక హాస్యగాఁడు. అతఁడు చండప్రచండుఁడు. అతనికేఁబది యేండ్లుండును. అతఁడు చూచుచుఁ జూచుచుండఁగనే చప్పిదవడలుచేసి లొట్టకన్నులు పెట్టి తన శరీరమంతయుఁ బరమవృద్ధుని శరీ రమువలెఁ జేసి డొక్కలు దించికొనిపోయి బుజము బొమికలు తొలగిపోయినట్లు పెట్టి చేతివ్రేళ్లు కొంకరులు పోవునట్లు పెట్టును. వానిని నేను వృద్ధురాలయిన యాటవికస్త్రీగా జయ ద్రథుని మోసగించి నిరూపించితిని. ఈ హాస్యగానిని తను వాతఁ ప్రభుదర్శనమునకుఁ దీసికొనివత్తును. నేనింతయుఁ జేసి పొరపాటు పడితిని. జయద్రథుని నేనాఱునెలల క్రింద బంధి తుని జేసి యీ దోషము దీనితోఁ దొలఁగిపోయినదని తలఁ చితిని. దీనికిఁ దోడింకొక కారణము వచ్చినది. నీలాదేవి జన్నమ్మగారి ప్రభావ ముద్రితురాలయినది. జన్నమ్మగారి ప్రభావము నీలాదేవిమీఁదఁ బడుటకు మహారాణిహేతువై

నది. నాగార్జునుఁడు నీరైక వ్రతుఁడు. అందుచేత నాగార్జునుఁడు మాఱిపోవునని కొంటిని. ఇది కథ."

అని కూర్చుండెను. అంతట వినయశర్మ జయద్రథునితో నీవే మందువని యడిగెను. జయద్రథుఁడిట్లనెను- "నేనే మందును. మీరందఱు మీరే, నేను కాదన్నచో నిరంతు శుఁడను నాగార్జునుఁడు నే నందురు. కనిపించుచునే యున్నదికదా. కాని సైంధవుడు ద్రౌపదిని వాంఛించుటలోఁ దప్పేమి? అది స్త్రీ పురుష సహజమయిన కామము. మీరు వావి వరుస లందురు. శిశుపాలుని కీయవలసియుండిన రుక్మిణిని కృష్ణుఁడు పెండ్లాడినపుడు మీకు వావివరుసలు లేవు. ఆరుక్మిణి మీ పొరుగు రాజ్యమయిన విదర్భరాజుల యింటియాఁడుబిడ్డ. నేనేమియు ననునది లేదు. జెప్పినాఁడు గదా. నా కొడుకు మీ చేతి కందలేదు. ఈ విరోధము ప్రళయాంతమును మీకుఁ దప్పదు. ఇది కనకపింగళుని యాజ్ఞ. మీ చంద్రశేఖరవర్మ నా కొడుకు చిక్కలేదని దుఃఖించుచున్నాడు. నా కొడుకు జిక్కనను నేను దుఃఖించను. ఏలయనఁగా నాకీ రహస్యము తెలియును. మీకే తెలియదు. ఆప్రళయము మీరు మ్లేచ్ఛభావ తాడితులగుచునే యుందురు. కొన్నాళ్ళు మీరు గెలుతురు. కొన్నాళ్లు మేము గెల్తుము. దీనికి మూర్ఖులయిన మీరు సంతోషించవలయును. యీ సృష్ట్యాది నుండి మే మొకప్పుడు రాక్షసులము, ఒకప్పుడు దస్యులము, ఒకప్పుడు మ్లేచ్ఛులము, ఒకప్పుడు యవనులము, ఒకప్పుడు హూణులము. మాబాధ మీకెప్పుడు తొలగినది. లెక్కవేసి చూసికొనుఁడు.

మేము రాజ్యము చేసిన దెక్కువకాలము. మీఁది తక్కువ కాలము. నేను జెప్పిన దింతే.”

చంద్రశేఖరవర్మను జయద్రథునిఁ దీసికొని పొమ్మని మహారాజు కనుసన్న జేసెను.

తరువాత నెలనాళ్ళలో నిట్లెల్లజరిగెను. నాగార్జునుఁడు సుభద్రను విజయసింహుని కప్పజెప్పి, తానును నీలయు రోమ పాదుని బదులు వానప్రస్థాశ్రమమును జేరిరి. విజయసింహుఁడు మహాసేనానియయ్యెను. నిరంకుసుఁ డతని క్రింది సేనాని యయ్యెను. అన్నగార్లు వారించినను నాగార్జునుఁ డడవికి వెడలిపోయెను.

శ్రీముఖుని పట్టాభిషేకమయిన తరువాత నొకనాఁడు శ్రీముఖుఁడు వినయశర్మతో నిట్లనెను. ‘స్వామీ! జనమేజయ మహారాజు నిజముగా నా తండ్రి సిద్ధిపొందెనని యనుకొనెనా, యని. వినయశర్మ యిట్లు చెప్పెను. ‘రాజా నేను జనమేజయ మహారాజునకుఁ బరమ మిత్రమును. నీకుఁ దెలియును. ఆయనతో మిమ్ముఁ గూర్చి చెప్పితిని. మీ ప్రతిభ కాయన విస్మితుఁడయినాఁడు. రాజ్యమున కింకభయము లేదని వెడలి పోయినాఁడు”

## ౧౮

అది వింధ్యారణ్యములలో నొక ప్రదేశము. మహా కాంతార మధ్యమున రెండుకొండల మధ్య నొక పెద్దవాగు ప్రవహించుచున్నది. ఆ వాగునకుఁ దూర్పుదెసనున్న పర్వత సాను ప్రదేశమునందుఁ గొన్ని గుడిసెలు కలవు. అక్కడికిఁ బోయిచూచెడివారే లేరు. చూచినచో నవి దూరానికి గుడిసెలవలెఁ గనిపించునే గాని లోనికిఁ బోయినచో మంచి విశాలముగా నుండును. నేల పరిశుభ్రముగా నున్నది. యుద్ధ వీరులు నివసించు ప్రదేశములుగాఁ గనిపించును. డాళ్లు కత్తులు పులిచర్మములు జింకచర్మములు నడవిలో దొరకు ననేకములయిన యాహారపదార్థములు సారపప్పు విప్పపువ్వు ప్రశస్తమైన తేనెతోనిండిన కుండలు నూచబియ్యము జాతి యుప్పు బహువిధములయిన పదార్థములు గలవు. సుఖముగా నిద్రించుటకు భోజనము చేయుటకు విహరించుటకుఁ దగినంత ప్రదేశము కలదు. ఎంత వానలు కురిసినను నీటిబొట్టు ప్రదేశమునందు నిలువదు. ఆ వాగు ప్రవహించుచున్నప్పుడు తత్ప్రదేశ మనభిగమ్యము. ప్రవహించనప్పుడా వాగే మార్గము. పైనఁ బదిక్రోశముల మేర నొక పెద్ద గ్రామము కలదు. దిగువ నేఁడెనిమిది క్రోశముల మేర మఱియొక గ్రామము కలదు. అచ్చటివా రిచ్చటికి నిచ్చటి వారచ్చటికిఁ బోవుచుందురు. వచ్చుచుందురు. ఈ రాకపోకలు వాగు ప్రవహించునప్పుడు నిబద్ధములగును. ఆ వాగయినను నిండుగా

వచ్చినచో నాల్గయిదు దినములు మాత్రము రాకపోకలకు యోగ్యముగా నుండదు. తక్కిన దినములలో సన్నని ప్రవాహముగా నుండును. యిసుక నేలయే యెక్కువయుండును. ఈరెండు కొండల నడుమ నున్న యీ ఝరీప్రదేశము మహావృక్షములచేతఁ గప్పఁబడి సర్వదా సూర్యకిరణ ప్రసారము జరుగకుండ నుండును. అది యడవి మెకములకు నీరు దప్పిదీర్చికొనుటకు నెండలకుఁ దాళలేకవచ్చి విశ్రమించుటకు ననువయిన ప్రదేశము. ఆ యూరినుండి యీ యూరికిఁ బోవు పథికులు పెద్దపులి మొదలయిన మెకములు తత్ప్రదేశమున లేకుండుటఁ జూచి యీవాగు నుత్తరింతురు. అవి యున్నచో ఝరీప్రవాహమున్నప్పుడు వెనుక కెళ్లు మరలిపోదురో, యడవిమృగము లున్నప్పుడు నట్లె మరలిపోదురు. ఆ వాగునకు నుత్తరమున నున్న కొండవడుపులో నున్న యీ గుడిసెల వద్దకా మార్గ మీవాగులోనుండి కొండలెక్కిపోవలయునన్నట్లు కనిపించును. మార్గమేమియు లేదు. కాని నిజానికది మార్గమే కాదు. అచ్చటికి మార్గము వేరేయున్నది. ఆ మార్గమును మార్గముకాదు. ఆ కొండలకు మఱియు నుత్తరముగాఁ బది యోజనముల మేరఁ బర్వతప్రదేశమే తప్ప మఱియేమియు లేదు. ఆ వెనుకనున్న సమప్రదేశము జనుల నివసించు పట్టు కొండలమీఁదనుండి సూటిగాఁ జూచినచోఁ బదియోజనము లుండును. కాని యచ్చటికిఁ బోదలచినవారు రహస్యమార్గము తెలిసినచో నది మార్గమని వారి బుద్ధికిఁ దోచినచో నది యిఱువది యోజనముల దవ్వు. అచ్చటికిఁ బది దినముల కొకసారి యిఱువది దినముల కొకసారి యెక్కు-

కెప్పుడు మాసమున్నర గూడ గడువ వచ్చును, జనము వచ్చుచుందురు పోవుచుందురు.

ఆ నాల్గు కుటీరములలో నొక దానియందొక యువతి కూర్చుండి యున్నది. ఆమె దగ్గఱఁ బదియేండ్ల బాలుఁడు కూర్చుండి యున్నాఁడు. వేషముచేతఁ గాని ముఖలక్షణముల చేతఁగాని వా రాటవికులు గారు. సింధుదేశరాజస్త్రీ యోగ్య వేషము నామె ధరించియుండెను. ఆ పిల్లవాఁడును రాజకుమారయోగ్యవేషమునే ధరించియుండెను. ఆగుడిసె ముంగిట నొక యాటవికుఁడు గూర్చుండియుండెను ఆ రాజవంశ స్త్రీ దేనికోసమో ప్రతీక్షించు చుండెను. ఆ ప్రతీక్ష యొకనాటిది కాదు. కొన్ని సంవత్సరముల నుండి చేసెడి ప్రతీక్ష ప్రతీక్షా భావములోఁ గూడ భేదమున్నది. అద్యతన భవిష్యత్తులో ఫలితముఘట్టునన్న ప్రతీక్షస్వరూపము వేఱు. అనద్యతన భవిష్యద్గత ఫలప్రతీక్షా స్వరూపము వేఱు. ఆమె నేత్రములలోని ప్రతీక్షా ఫలితము వెంటనే జరుగవలసినదిగాఁ గనిపించుచున్నది. ముంగిటనున్న యాటవికుఁడు మాటిమాటికిఁ దన కుడివైపునకుఁ జూచుచుండును. ఆ కుడివైపునఁ బదిబాఱలు పోయినంతనే కొండమలుపు తిరుగును. ఆ మలుపు తిరిగినది త్రోవ. ఆ మలుపు పది బాఱలున్నది. ఇట్టి మలుపులు పది యోజనముల పర్వతప్రదేశము మేఱ వందలు కలవు. కనుక నెవ్వఁడో వచ్చునని దారివంకఁ బాఱచూచి తెలిసికొనునది లేదు. నాల్గయిదు మలుపులు తిరిగివెళ్ళి చూచిననుఁ బ్రయోజనములేదు. మఱియు నీ ప్రతీక్ష యా యాటవికుని యందున్న లక్షణము వేఱు ఆ క్షత్రియ స్త్రీ యందున్న లక్ష

ణము వేఱు. ఆటవికులు ప్రతీక్షింతురు. అది ప్రతీక్షయే కాదు. దానియందుఁ బ్రతీక్షాతీవ్రతాస్పర్శ యుండదు. ఒక పని జరుగవలయును. అది జరుగువఱకు నీ వచ్చటఁ గూర్చుండుమని యొక యాటవికునితో జెప్పుము. వాఁడు కూర్చుండును. అంతకన్న వాఁడేమియుఁ జేయఁడు. అదివాని కుటుంబ విషయమయినను గావచ్చును. వాఁ డుద్వేగముపొందఁడు. మడమలు విరుగఁద్రొక్కికొనఁడు. వాఁడొక యోగివంటివాఁడు. యోగికినిఁ బరమపశువునకును మొండివానికిని వ్యవహారదశయందు భేదములేదు. భేదము జ్ఞానవిషయమునందే. ఆ క్షత్రియ స్త్రీ ప్రతీక్షా స్వరూపము వేరు. ఆమె క్షణక్షణము గుమ్మము వంకఁ జూచుచుండెను. వాకిటలోనికి వచ్చి యా యాటవికుని వంకఁ జూచును. వాఁడొక శిలాప్రతిమ. మఱల లోనికిఁ బోవును. వానినిఁ బోయి చూచిరమ్మని చెప్పుటకును వీలు లేదు. వాఁడు వినిపించికోఁడు. వాఁడచ్చట నెందుకుండెననఁగా నది యే యాపదయు రానిచోటు. ఒకవేళ నే యాపదయైన వచ్చినచో వారిని రక్షించుటకు. వారిని రక్షించుట యనఁగా వాఁడు తన ప్రాణము నక్కడ బలియిచ్చియైనను రక్షించును. ఇది ప్రాణము, ఇది పోవచ్చును, పోయినచో మనము చనిపోదుము. చనిపోయినచో దూరపుగూడెములో భార్యాపుత్రులున్నారు, వారేమగుదురో యన్న భావమే వానికి లేదు. ఆటవికుల కుండదు. అట్లుండకపోవుటకుఁ గారణములు రెండు. మొదటిది వారి స్వభావము. రెండవది వాఁడు తన భార్యాపుత్రులనుఁ బోషించెడి వాఁడు కాడు. అందరు నడవిమీఁద బ్రదికెడివారే. వీఁడు తెచ్చునది లేదు, పోషిం

చునది లేదు, వారు పోషింపఁబడునదిలేదు. ఈ లెక్కలో వీఁడు భర్తకాడు, అది భార్యకాదు. కాని వాఁడు భర్త. ఆమె భార్య. ఈ భార్యాభర్తృ విషయము మగవాని సంపాదనమీఁద నాడదాని పోషింపఁపడుట మీఁద లేదు. అదివేఱే సృష్టిగత రహస్య విషయము. ఆ రహస్యమిది యని యీాట విషులకు నపండితులకు నవైదికులకుఁ దెలియదు. వైదికధర్మ రహస్య వేత్తలకుఁ దెలియును. వారే యీ నామముల నేర్ప అచినది. వేదధర్మముచఁగా సృష్టియు లోకమును నవిచ్చిన్న సాంప్రదాయానుగుణ సంతానావ్యవచ్ఛిత్తియు, దీని రహస్యము క్రోడీకరింపఁబడిన విషయము. అర్ధజగ్ధతృణవత్పశు తుల్యులకు దాని పాటింపుండదు. వారు తెలిసీ తెలియని వారు. తెలియని దానినిఁ బరిగణించరు. తెలిసిన సగమునకు విలువ యెక్కువ కట్టుదురు. ఆటవిడు లచ్చముగాఁ దెలియని వారు. తెలిసికొన వలయునని యిచ్ఛగూడలేనివారు. మనకుఁ దెలియదు కనుక మనకుఁ దెలియనిది లేనేలేదని వాదించఁగల విప్లవబుద్ధి లేనివారు. అందుచే వారు భార్యాభర్తలే అతిచరించరు. వాఁడు తన ప్రాణముడు బలియిచ్చును. తన భార్యాపుత్రులెట్లు బ్రదుకుదురన్న దిగులు వానికి లేదు. వారు బ్రదుకుదురు. బ్రదికించెదు నడవి కలదు. ఈ సృష్టిలో మానవులు పొందు సగము బాధలోఁ దమ తరువాతఁ దమ బిడ్డలేమగుదురు? వారెట్లు బ్రదుకుదురన్న బాధయే యెక్కువది. అట్టి బాధ జనసామాన్యమున కధికముగా లేకుండఁ జేయునదియే చక్కని సంఘవ్యవస్థ. ఆ వ్యవస్థను బాలించుటయే రాజ్యపాలన.

ఆ క్షత్రియస్త్రీ ప్రతీక్షా పాలనము యొక్క స్వరూపము వేఱు. ఆమెయు నొక విధముగా నాటవికురాలే. ఆటవికులనఁగా భూతభవిష్యత్కాలములను గూర్చి తక్కువ యోజించువారు. తత్కాలము నందలి కార్యమునందు వారు నిమగ్నులైనట్లు భవిష్యద్విషయములయందు నిష్కారణప్రతీక్షోద్వేగాదులను బొందరు. ఆమెయు నట్టిదే. ఆమె తన భర్తను వివాహము చేసికొనినపుడే యొక తీవ్రనియమమునందుఁ బ్రబోధింపఁబడి మనస్సును గట్టిచేసికొని వివాహము చేసికొన్నది. కొడుకు కలిగినాఁడు. వానికిప్పుడు పదేండ్లు దాటినవి. పదేండ్ల వయసునాటికే యతఁడింత యొమ్ముగను మంచి దండలును బలిష్ఠమయిన దేహపుష్టి గలవాఁడు. ఖడ్గవిద్యలో నిపుణత తేఱినవాఁడు. భారతీయ ధర్మములు తెలిసినవాఁడు. మ్లేచ్ఛభావములం దభిమానము కలవాఁడు. వింటిబద్ద పుచ్చికొని లక్ష్యమును సులభముగా భేదించఁగలవాఁడు. కాని యతనిలో స్వతంత్రమైన యూహాయింతవఱకు నుద్బోధము కాలేదు. పసితనమెంత తీవ్రమయిన నియమములతోఁ బెంచఁబడినను నెన్నికట్టు దిట్టములలోఁ బెరిగినను వానియందు బాల్యలక్షణమైన క్రీడాబుద్ధిపోలేదు. తక్కిన బాలురయందు వలె నది విజృంభణమంది యుండలేదు, కాని యున్నది. ఈ పూట యతఁడు తల్లివద్ద నుండెడివాఁడు కాదు. ఎప్పుడు నుండఁడు. అడవులలోఁ దిరుగుచునే యుండును. అతఁడేమయి పోవునన్న భయము తల్లికిఁ గూడ లేదు. వాని నడవిమృగము లేమియుఁ జేయలేవు. ఎప్పుడును విల్లంబులతో గత్తితో సంచరించు చుండును. సమీపమందున్న మృగమును ఖడ్గముతో

సంహరింపఁగలఁడు. ఆకస్మికముగాఁ దన మీఁదికి దూఁకిన మృగలాఘవము కంటె నధిక లాఘవముతో వెనుకకు లఘించి ప్రక్కకుఁ దిరిగి దాని మెడ నఱుకఁ గలఁడు. దూరస్థములయిన మృగములను బాణములతో సంహరించఁగలఁడు. అంతియే కాదు, అతనికిఁ దగినన్ని యాటవికుల మంత్రములు తెలి యును. ఆ మంత్రములతోఁ బులినోరు కట్టివేయవచ్చును. పాములు తన మీఁదికి రాకుండఁ దొలఁగిపోవునట్లు చేయ వచ్చును. తాను వేధించఁదలచికొన్న లక్ష్యము చలింపకుండఁ జేయవచ్చును.

అట్టి కుఱ్ఱవాఁ డీయుదయమునం దిలు వెడలిపోలేదు. తల్లి యనుజ్ఞ లేదు. తల్లియతనితో నీవీ యుదయమున నీ వెచ్చటికిఁ బోరాదు. నీతోఁ జెప్పితినిగదా. నీ తండ్రిని దూరరాజ్యము లందెవరో సంహరించిరి. అతనిని బంధించిరి. అతనినిఁ గొఱత వేసిరి. పట్టణబహిః ప్రదేశములందుఁ గొఱత వేసిరి. కొఱత మీఁదనున్న యాతని శిరస్సును జాల రహస్య ముగా ఖండించి దాని నెంతో జాగ్రత్తగాఁ దీసికొని వచ్చు టకు మహా ప్రయత్నములు చేయవలసి వచ్చినది. ఆ దేశము నందు మన యందభిమానము కలవారి చేతి యేతి సంహరిం చిరి. అందుచేత నిది గడ్డైన పనియైనది. వేయివిధముల జనుల కనులఁ గప్పి యబద్ధములాడియు శిరస్సు నొక పెట్టెలోఁబెట్టి దాని నా దేశమునుండి తరలించి తీసికొని రావలయును. అప్పుడే యేడాది గడచినది. ఆ దేశమునుండి యీతలికి వచ్చుటకే యేడాది పట్టెను. ఆ పెట్టెను గొనిపోవుచ్చుటనో రహః ప్రదేశమునందు దాచవలసివచ్చెను. తీర్థయాత్రికులు

పోవుచుండగాఁ యాత్రికులకుఁ దెలియకుండ వారి మూటలలో నిదియొక మూటగాఁ బెట్టి తరలించవలసి వచ్చెను. ఏ నిము సమునందు రాజభటులు దానినిఁ బరీక్షింతురో వారి పరీక్ష కగ్గము కాకుండ వేయికన్నులతోఁ గాపాడవలసివచ్చెను. ఎట్లయిన నేమి యా యాపద గడచెను. శిరస్సా దేశమునుండి వెలికివచ్చెను. మిగిలిన ప్రయాణము సులభమే. ఈ పూట నా పేటిక యిచటికిఁ జేరునని నాకు మున్నాళ్ళక్రింద వార్త వచ్చినది. మీతండ్రి యేమహాకార్యమునందునియమవంతుఁడై యీ మహాకార్యాచరణమునందు మృతినందెనో యీ మహా నియమమును నా యావేశమును నా కార్యదీక్ష నీ యం దీనాటినుండి నెలకొనవలయును. నీ కనేక విషయములు తెలి యును. భారతీయుల పురాణకథలన్నియుఁ దెలియును. మన యాచారములు దేవతలు మంత్రములు చాలఁ దెలియును. ఖడ్గధనుర్విద్యలయందు నీ నేర్పు తక్కువది కాదు. పది యేండ్లు దాటులోన నింతటివిద్యా దక్షత లోకములో నెవ్వారి కిని గలుగదు. నీకది కలుగఁజేయఁ బడినది. ఏతన్నియమ పాలనము కొఱకే నీవిట్లు శిక్షింపఁ బడితివి. ఈ నాఁటినుండి నీవు నీ చిన్న తనమును విడిచిపెట్టవలయును. నఱుకఁబడి యేడాదిపైన నయి యొక పేటికలో నుంచఁబడి యా పేటి కలోని కెంతవఱకు ప్రసరించునో యంతవఱకైన గాలి యెండ వానల కగ్గమై నీ తండ్రి శిరస్సెట్టి యవస్థలో నున్నదో తెలి యదు. దానిని జూచినగాని తెలియదు. పెట్టె తెఱచినంతనే పట్టరానిచెడ్డ కంపు పుట్టవచ్చును. కాని యది నా భర్త గారి శిరస్సు. నీ తండ్రి శిరస్సు. నీవా శిరస్సును జూచి

తద్దర్శనము వలన నీ తండ్రికి గలిగిన యాపద నూహించి నీవు బ్రదికియున్నన్నినాళ్ళు నీ శత్రువులమీాఁదఁ బగతీర్చు కొనవలయును. జీవితమంతయు దానికి ధారపోయవలయును. ఆ శిరస్సు మీాదఁ జేతులుంచి ప్రమాణము చేయవలయును. ఆ శిరస్సు వచ్చును. నీ జేతఁబ్రమాణము చేయింతును. నేటి సాయంకాలముననో రేపుదయముననో మన మిచ్చటినుండి బయలుదేరి పోవుదుము. నీకింక నెనిమిది తొమ్మిదేండ్లు వచ్చు వఱకు మనము రామఠదేశమం దుందుము. అప్పుడు నీకు వివాహము జరుగును. ఏతత్సర్వనియమ పాలనమున కంగీకరిం చిన యొక రాచకూతును నీకు వివాహము చేయుదురు. ఆమె యందు బుత్రసంతానము కలుగువఱకు నీవేమహానియమ పాలనమునకు జన్మించితివో యా మహానియమపాలన కార్యా చరణము నీ యందుండదు. నీకుఁ బుత్రసంతానము కలిగిన తరువాత నీవే దేశమున కేగవలసియుండునో యెచ్చట నేమి చేయవలసియుండునో చెప్పిచేయించెడివారు రామఠ దేశ మునందున్నారు. ఇచ్చటనే కూర్చుండుము. ప్రొద్దు నడి నెత్తికి వచ్చులోపలనే యా పేటిక వచ్చును. ఏ నిముసము నందుఁబడిన నా నిముసముననే రావచ్చును. అని చెప్పియత ని నక్కడఁగూర్చుండఁ బెట్టెను. లిప్తలు నిమేషములు పావు గడియ లరగడియలు గడియలు గడచుచుండెను. పగటిరెం డవ జామున సగము గడచిన తరువాతఁ బేటిక వచ్చెను. తెచ్చినవాఁడు గుమ్మమున కెదురుగ నిలుచుండి పేటిక తల మీాఁద నుండి దింపి గుమ్మములో వంగి యా పేటిక నామె ముందుంచి యతడు వెడలిపోయెను. ఆ పేటిక యచట

నున్నది. తల్లికొడుకులు దాని కెదురుగాఁ గూర్చుండిరి. ఎంత నియమమయినను నెంత తీవ్రవ్రతమయినను వందల యేండ్లనుండి వచ్చునొక పరమ కఠోరమైన యాచారమెంతటి దయినను విషయమంతయు సంపూర్ణముగా నిదివఱకే లక్ష సార్లు పర్యాలోచింపఁ బడి నిశ్చయింపబడినను జన్మ మెత్తిన తరువాత శరీరమున్న తరువాతఁ దత్కా లోచితావేగము మానవహృదయ సహజమైన దుఃఖము కలుగకుండఁ బోదు. ఆమె కన్నులందు నీరు రావ చ్చెను. ఆమె వానిని రానీయలేదు ఆమె గుండె కొట్టు కొనఁబోయెను. ఆమె నిశ్చలముగా నుండెను. ఆమె ముక్కుల వెంట దీర్ఘనిశ్వాసము రాఁబోయెను. ఆమె దానిని నియమించెను. కంఠములో సముద్భవింపఁబోవు గాద్గదికమును బరిహరించెను. వణకఁ బోవుచున్న చేతులను ముష్టిబిగించి చేయి జాడించి వణుకు మాన్పెను. పేటికను దెఱచెను. లోనుండి యొకవిలక్షణమైన దుర్వాసన వెలికి వచ్చి కుటీరము నంతయు గ్రమ్మెను. లోని శిరస్సు పచ్చిగాలేదు. ఎండి పోలేదు. ఎక్కువ యెండిపోయినదనియే చెప్పవలయును. ఆ శిరస్సును వెలికి దీసి, బుట్ట వెనుకకుఁ ద్రోసి మొగము కొడు కున కెదురుగాఁ బెట్టెను. ఆ పిల్లవాఁడు దానివంకఁ జూచెను. అతఁడు కడచిన రెండేండ్లుగాఁ దాను గ్రీడార్థము నఱికిన క్రోతుల తలలు, జింకల తలలు, సివంగుల తలలు నడవిలోఁ బడియుండి వానినిఁ దరువాతఁ దరువాత నతఁడు కాంతా రమునఁ దిరుగుచుఁ జూచుట కలదు. తండ్రి తల జూచి యతని కేమియు ననిపించలేదు. అది తండ్రితల యని తన తల్లి

చెప్పుటయేగుర్తు. తన మూఁడేండ్లవయస్సున నొకనాఁడు తండ్రిని జూచెను. ఐదవయేటఁ దండ్రినిఁజూచెను. తన యేడవయేట దన తండ్రివచ్చెను. జూతువుగాని యని యతని తల్లి పది దినములు చెప్పెనుగాని యా తండ్రిరాలేదు. అతనికి దండ్రి గుర్తులేదు. తండ్రియందుఁ బ్రేమలేదు. లేదనఁగా నొక లీలగానున్నది. ఆ లీలయొక్క లక్షణమెట్టిదనఁగా సర్వ మానవులును దమకుఁ దెలియకుండఁ దమకొక తండ్రియున్నాఁ డని యనుకొందురు. ఆ తండ్రివలననే తామీలోకమునకు వచ్చితిమనుకొందురు. ఈ భావము మానవునకు సహజమో పదిమందిలోఁ బెరుగుటచేత వారిని వీరినిఁజూచి తా మట్టి యూహ కలిగించుకొందురో తెలియదు. లేదా మాటి మాటికిఁ దల్లి చెప్పుటచేతఁ గలుగవచ్చును. ఈ పైకారణము లన్నియు లేకపోయినను దాను స్వయంభువనని యెవ్వఁడు ననుకొనఁడు. అనుకొనుట సృష్టిలక్షణము కాదు. కొందఱు తాము స్వయంభువుల మనుకొనవచ్చును. ఆ యనుకొనుట యహంకారలక్షణము. ఆ శబ్దమునకది వాచ్యార్థము కాదు. తదితరమైన యర్థము. వాచ్యార్థములో నెవఁడును దాను స్వయంభువననుకొనఁడు. తనకుఁ దండ్రియుండవలయును. ఆ తండ్రియన్న భావము కొంత ప్రేమతోఁ గలసియుండును. ఆ ప్రేమయెట్టిదనఁగా దాను బుట్టిపెరుగుట తన కిష్టమయిన విషయము. దానికెవ్వఁడో హేతువయినవాఁడున్నాఁడు కదా! వానియందీ యిష్టము సహజముగాఁ బ్రసరించును. ఆ ఆ యిష్టము పేరే ప్రేమ. తాదృశ్యమైన ప్రేమ వానికిఁ దండ్రియన్న భావమునందుఁ గలదు. ఆ భావమునకు నీ కని

పించుచున్న నూతిలోఁ దొంబది పాళ్లెండిపోయించిన శుష్కించిన మొగము మొగముగాఁ లేని యీలాలకఱచికొని పోయిన కృత్త శిరస్సునకు సబంధము. అదియేమి చమత్కారము! వానికా శిరస్సుచూచినంత నేకన్నుల వెంట నీరువచ్చెను. పొంగి దుఃఖమురాఁబోయెను. ఈ దుఃఖమెందుకు వచ్చెను? అతఁడెవ్వనినో తండ్రి యనుకొను చుండెను. వానిఁ జూడవల యునన్న ప్రతీక్ష వానియెడఁదలో నిత్యముగా నుండెను. సరక్తమాంసము సజీవమయిన యా పురుషుని దర్శనము చేయుటకు వానిగుండెనోని ప్రతీక్షకోరుచున్నది. ఆ దర్శన మట్టిది కాక లోకమునందు దృశ్యమానమగుచున్న సామాన్య మృత్యువుకంటెఁ దానడవులలో ఖండించిన మృగముల యొక్క మృత్యువువంటి మృత్యువుపొంది శరీర విరహిత మయి యా ప్రతీక్షభావము యొక్క ఫలితమును తొంబది పాళ్లు నశించి పదిపాళ్లు వికృతముగా గనిపించెను. ఆ దు:ఖము తండ్రి కోసము కాదు. తన ప్రతీక్షా ఫలించ లేదన్న దుఃఖము. జీవలక్షణములు చిత్రములుగా నుండును.

ఆమె శూన్యహృదయురాలై కూర్చున్నట్లుండెను. ఏమి చేయవలయునో తెలియలేదు. తనయత్తగా రేమయినదో తెలియదు. భర్తను బంధించిరి. కొఱత వేసిరి. అత్తగారేమ యినది? ఆమెను బంధించలేదు. ఆమెకొక యూహ తోచినది. తత్పూర్వుఁడైన జయద్రథుఁడు మరణించినంతఁ దదువాతి జయద్రథుఁ డానియమము చేకొనును. తత్పూర్వు రాలయిన దుస్సల చెప్పకుండ గతించిపోవును గాబోలు. తన తండ్రి

తన్నివిచిత్రమయిన తీవ్రవ్రత ధారామధ్య బిందువుగాఁ జేసెను. కఠోరమ్ములయిన ప్రమాణములు జరిగెను. తాను జేయవలసినది చేయకతప్పదు. అచ్చటఁ గూర్చున్న కొడుకు నకుఁ దాను తల్లికానట్లు తనెదో పిశాచమనినట్లు తన భర్త యొక్క ఖండితమయిన శిరస్సు బహు ప్రయత్నముమీఁద నెంతో కష్టముమీఁద దాను దెప్పించికొని దానిమీఁదఁ బడి యేడ్చుటకు వీలులేదు. తనగుండె బాదుకొనుటకు వీలులేదు. చితిపేర్చి దానితో సహగమనము చేయుటకు వీలులేదు. కర్మలు లేవు. పరలోకములు లేవు. దైవము లేదు. ఆచనిపో యిన జీవునియొక్క పరలోకమెట్టిదో తెలియదు. అచ్చమయిన యింత కఠోరమైన యింతవికృతమయిన యనిశ్చిత ఫలమ యిన వ్యర్థమయిన జీవుఁడు వాంఛించు సుఖమునకు వ్యతిరేక మయిన వట్టి యిహలౌకికమయిన యీ వ్రతమేమిటి? ఈ నియమ పాలనమేమి? ఆమె కేమియు నర్థము కాలేదు. కాని కొడుకువెంటనే యుండవలయును.

ఆమె మాటాడకుండఁ గొడుకు కుడిచేయితీసి తండ్రి తలమీఁద బెట్టించెను. అతనిచేత నీట్లనిపించెను. 'ఈ శిరస్సు నాతండ్రిది. ఖండితమయిన నాతండ్రి శిరస్సుమీఁద జేయి యుంచి ప్రమాణము చేయుచున్నాను. ఈ ప్రమాణమునకు నేను తొలఁగిపోయినచో నేను బ్రదికియుండఁగనే నాశరీరము క్రిములచేతఁ దినఁబడుగాక! కాక గృధ్రముల కాహారమగుఁ గాక! నిద్రలో సర్పదష్టుఁడనై నిద్రలోననే మరణింతునుగాక! ఇది కనకసింహునియాజ్ఞ. ఆయనకూతురయిన మస్సలయాదే శము. ఇది సైంధవుఁడయిన జయద్రథుని గృష్ణుడు మాయో

ప్రాయమున వధించినందులకుఁ గృష్ణునిమీఁద దీర్చికొనెడు పగ. ఈ పగను నేను నిర్వహింతును. ఈపగ నావలె మూర్తి కట్టినది. రామఠదేశ కార్తాంతికుల యాజ్ఞ నేను సర్వథా పాలింతును. మ్లేచ్ఛరాజ్యముల భావపరంపరలకు నాశరీరము నాయాత్మను నేనమ్మివేసితిని. నేను నేనుకాను. నాశరీరముమీఁద నాకధికారములేదు. సుఖమునకు దుఃఖమునకు నాకు సంబంధములేదు. నేను వివాహమాడుదును. ఆవివాహమీ వ్రతపాలనమునకై యాడుదును. నాకు సంతానము కలుగును. అది ఈవ్రతపాలనమునకై యేర్పడినసంతానము కానినా సంతానముకాదు. ఆభార్యయు నాపుత్రుఁడును గనకసింహుని పగకోసమయిన భార్యాపుత్రులు. నాకోసమయినవారు కారు. అంతట దుస్సుల కొంతమన్నుదీసి యాకృత్తకంఠప్రదేశమందలి గడ్డకట్టిన నెత్తురుమీఁదరాచి దానిని జయద్రథుని గుండెమీఁద స్వస్తికాకారమున గీసెను. ఇద్దఱును గుడిసెనుండి వెలికివచ్చిరి. వారింక గుడిసెలోనికిఁ బోరాదు. పెట్టెతెచ్చినవాఁడును బూర్వము కాపలాయున్నవాఁడును లోనికిఁబోయి వారికున్న కొద్ది పరికరములను దెచ్చిరి. రామఠదేశాభిముఖముగా వారు పోయిరి.

రెండవ నవల 'నాస్తిక ధూమము'



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B115 |
| పుస్తకం పేరు | భగవంతునిమీదిపగ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 365 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1to4 |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | PRATHYUSHA |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |